# శ్రీ లలితా
# సహస్ర నామవివరణము

**(SCIENTIFIC AND SPIRITUAL SPLENDOUR OF SRI LALITHA SAHASRAM)**

(ద్వితీయ భాగము)


వివరణ కర్త

**డా॥ జి. ఎల్. ఎన్. శాస్త్రి,** M.Sc., M.Phil., Ph.D.

(రిటైర్డ్) రీడర్ & భౌతిక శాస్త్ర విభాగాధ్యక్షులు

టి. జె. పి. యస్. కళాశాల, గుంటూరు.






జగద్గురు పీఠము - గుంటూరు శాఖ

(The World Teacher Trust - Guntur Branch)

GUNTUR - 522 002.

Phone : 233995

# శ్రీ లలితా సహస్ర నామ వివరణము

## (ద్వితీయ భాగము)

ప్రథమ ముద్రణ : అక్టోబర్ 1997

ద్వితీయ ముద్రణ : సెప్టెంబర్ 2001 (అచ్చు తప్పులు సవరించబడినవి)



ప్రాప్తి స్థానములు :

1. ది వరల్డ్ టీచర్ ట్రస్ట్
   H/o డా॥జి.ఎల్.ఎన్.శాస్త్రి
   5-10-4, 2/9 బ్రాడీపేట, గుంటూరు -2
   ఫోన్ : 233995

2. ది వరల్డ్ టీచర్ ట్రస్ట్
   45-40-36/1
   అక్కయ్యపాలెం
   విశాఖపట్టణం - 530 016.

| వెల : | సాధారణ ప్రతి : రూ. **80-00** |
|---|---|
| | గ్రంథాలయ ప్రతి రూ.**100-00** |

ముఖచిత్రం : లాం వర్ధన్‌రావు, విద్యాఆర్ట్స్, నగరంపాలెం, గుంటూరు

ముద్రణ : **విజయసాయి ఆఫ్‌సెట్ ప్రాసెస్ అండ్ ప్రింటింగ్,**
గుంటూరు. ఫోన్ : 242345

# విషయసూచిక

# ప్రత్యేక కృతజ్ఞతలు

## (ద్వితీయ ముద్రణ)

శ్రీ లలితా సహస్రనామ వివరణ నాలుగు భాగాల పుస్తకాలకు స్వదేశ విదేశాల్లోని తెలుగువారినుండి అనూహ్యామైన స్పందనవచ్చి అతి తక్కువ కాలంలోనే ముద్రించిన పుస్తకాలన్నీ దాదాపు అయిపోయాయి. ప్రస్తుతం ద్వితీయభాగ ద్వితీయ ముద్రణ ముందుగా, అత్యవసరమైంది. ఈ సందర్భంలో -

**'శ్రీ పోలిశెట్టి సోమసుందరం - శ్రీమతి నాగరత్నమ్మ'**

పుణ్యదంపతి జ్ఞాపకార్థం వారి కనిష్ఠ పుత్రుడు

**పోలిశెట్టి శ్రీహరి ప్రసాదరావు గారు**

ఈ పుస్తక ముద్రణకు కొంత ద్రవ్యసహాయం చేశారు. వారికి నా తరఫున, మా జగద్గురుపీఠం గుంటూరుశాఖ తరఫున హృదయపూర్వక కృతజ్ఞతాభివందనాలను తెల్పుకుంటున్నాను.

శ్రీ లలితాపరమేశ్వరియొక్క అనుగ్రహం పరిపూర్ణంగా ఉండి - వారు, వారి కుటుంబసభ్యులు - ఆయురారోగ్యైశ్వర్యాలతో వర్ధిల్లాలని - అమ్మవారిని ప్రార్థిస్తున్నాను.

గుంటూరు
27.11.2001

ఇట్లు,
**జి.ఎల్.ఎన్. శాస్త్రి**

# ముందుమాట

ఇది – 'శ్రీలలితాసహస్రనామ వివరణ' కు సంబంధించిన ద్వితీయ భాగం. మొదటి నామం అయిన 'శ్రీమాతా' నుండి 200వ నామం అయిన 'సర్వమంగళా' నామం వరకూ ఉన్న రెండు వందల నామాలకు సంబంధించిన 'ఆత్మజ్ఞాన – శాస్త్రజ్ఞాన' సమన్వయాత్మకమైన వివరణ – ప్రథమ భాగంగా 1997 జూన్ 29వ తేదీన గుంటూరులోనే ఆవిష్కరింపబడింది.

## ప్రశంసా పూర్వక ప్రోత్సాహము

ప్రథమ భాగంలోని నామాల వివరణకు పాఠక సోదర, సోదరీమణులు; పెద్దలు; పండితులు; శ్రీ విద్యోపాసకులు మొదలైన వారందరి నుండి వచ్చిన స్పందన – అనూహ్యము, అపూర్వము. 1983లో మొట్టమొదటగా నేను వ్రాసిన 'గాయత్రి' అనే చిన్న పుస్తకాన్ని చూసి మాస్టరు గారు(Master E.K)వాత్సల్య పూరిత మైన అభిమానాన్ని, అనుగ్రహాన్ని వర్షింపచేశారు. 1986లో వ్రాసిన 'తైత్తిరీయోపనిషత్తు', 1995లో వ్రాసిన 'అక్షర గణపతి – కుండలినీపతి', 1997లో వ్రాసిన ఈ 'శ్రీలలితా సహస్ర నామ వివరణ' పుస్తకాలు కూడా చూచి ఉంటే ఆనందంతో కౌగిలించుకునే వారనిపించింది. (ఎందుకంటే – ఆ మూడు పుస్తకాలు అలాంటివి). 1997 ఆగష్టులో హైదరాబాదులో జరిగిన గురుపూజలకు వెళ్ళినపుడు – ఈ లలితానామ వివరణ ప్రథమభాగాన్ని చదివిన ఒక పెద్దమనిషి ద్వారా ఇలాంటి ఆనంద పారవశ్యం నేను చూడకలిగాను. మాస్టరు గారే వారి ద్వారా అలా నన్ను ఆనందింప చేసారని భావించుకున్నాను. ప్రథమభాగం చదివిన వారందరూ 'ద్వితీయభాగం' ఎప్పుడు వస్తుందని అడిగినవారే ! ఈ అందరి ప్రశంసా పూర్వక ప్రోత్సాహంతో అతి స్వల్పకాలంలోనే ఈ ద్వితీయ భాగం ఆవిష్కరణకు సిద్ధం చేయడం జరిగింది.

## సార్థక గ్రంథ విభజన

1997 వసంత విషువద్దినము (Vernal Equinox) అయిన మార్చి 21వ తేదీ నుండి ప్రారంభమయిన ఈ 'శ్రీలలితా సహస్ర నామ వివరణ యజ్ఞం మళ్ళీ రాబోయే సంవత్సరం (1998) వసంత విషువద్దినము ( మార్చి 21) వరకు ఉండే ఒక సంవత్సర

కాల యజ్ఞంగా కొనసాగి, చతుర్వేద సమన్వయంగా ఈ యజ్ఞఫలం చతుర్భాగాలుగా ప్రభవిల్లాలని సత్సంకల్పం కల్గింది. ఇందుకు తగిన కృషి నిర్విరామంగా జరుగుతోంది కూడా ! 250 నామాలకు ఒక భాగం చొప్పున నాలుగు భాగాలుగా ఈ వివరణను విభజించడం ఒక విధమైన పద్ధతి. కాని, ప్రతి భాగము ఒక విశిష్టమైన నామంతో ప్రారంభింపబడి మళ్ళీ ఒక విశిష్టమైన నామంతో అంతం అయేట్లుగా ఉంటే బాగుంటుందని నా ఉద్దేశ్యం. అందుకే ఈ నా ఉద్దేశ్యానికి తగినట్లుగా ప్రథమభాగాన్ని 'శ్రీమాతా' అనే నామంతో ప్రారంభించి 'సర్వమంగళా' అనే నామంతో వివరణ ముగించాను. ఇలా చెయ్యడం వలన గ్రంథానికి ఒక కట్టు దిట్టమైన సంకలనంతో ప్రత్యేకత చేకూరుతుంది. ఆద్యంతాలలోని ఈ రెండు నామాల మధ్య పుస్తకానికి 1. జన్మ సంస్కారము 2. సౌభాగ్య సౌందర్యము చేకూరుతుందని నా భావన.

ఈ ద్వితీయ భాగంలో – 'సద్గతిప్రదా' అనే 201 వ నామంతో ప్రారంభించి, 'యశస్వినీ' అనే 474వ నామంతో వివరణ ముగించాను. ఉత్తములకు, ఉత్తమ మార్గములకు, ఉత్తమ ప్రవర్తనకు, ఉత్తమ ప్రవర్తకులకు వచ్చే ప్రతిఫలం – 'యశస్సు' అని నిగూఢంగా ఈ ద్వితీయ భాగ ఆద్యంత నామాలు స్ఫురింప జేస్తాయి. ఇక రాబోయే తృతీయభాగం 'విశుద్ధిచక్రనిలయా' అనే 475వ నామంతో ప్రారంభమవుతుంది. ఈనామ ప్రారంభం – పవిత్రతను, నామ పారాయణ ప్రతి ఫలసిద్ధిని, స్పష్టమైన వాక్సంపత్తిని కలుగచేస్తుందని నా ఆకాంక్ష. అయితే – మరి ఈ తృతీయ భాగం ఏ నామంతో ముగుస్తుందో ఇప్పుడే నేను చెప్పను. ఆ సమయాన్ని బట్టి, ఆ సందర్భాన్ని బట్టి, ఆనాడు అది నిర్ణయింపబడాల్సిందే!

## ద్వితీయభాగంలోని అద్వితీయ విషయాలు

ఈ ద్వితీయ భాగంలోని నామాలలో సాధకులకు చాలా ఉపయోగకరమైన విషయాలు వివరింపబడినాయి. అమ్మవారి 'మహ' నీయమైన శక్తులు, గుణాలు, లక్షణాలతో పాటు, – జీవుని జాగ్రత్, స్వప్న, సుషుప్తి, తుర్యావస్థలు; అమ్మవారి సృష్టి, స్థితి, లయ తిరోధాన, అనుగ్రహ పంచకృత్యాలు; వాటిని నిర్వహించే అమ్మవారి అంశ దేవతలు; వర్ణాశ్రమాలు; పురుషార్థాలు; చతుష్షష్టి కళలు; చతుష్షష్టి ఉపచారాలు; అష్టసిద్ధులు; పంచకోశాలు; క్షేత్రక్షేత్రజ్ఞ జ్ఞానము; ధ్యాన, ధ్యాతృ, ధ్యేయ విషయాలు;

కాల యజ్ఞంగా కొనసాగి, చతుర్వేద సమన్వయంగా ఈ యజ్ఞఫలం చతుర్భాగాలుగా ప్రభవిల్లాలని సత్సంకల్పం కల్గింది. ఇందుకు తగిన కృషి నిర్విరామంగా జరుగుతోంది కూడా ! 250 నామాలకు ఒక భాగం చొప్పున నాలుగు భాగాలుగా ఈ వివరణను విభజించడం ఒక విధమైన పద్ధతి. కాని, ప్రతి భాగము ఒక విశిష్టమైన నామంతో ప్రారంభింపబడి మళ్ళీ ఒక విశిష్టమైన నామంతో అంతం అయేట్లుగా ఉంటే బాగుంటుందని నా ఉద్దేశ్యం. అందుకే ఈ నా ఉద్దేశ్యానికి తగినట్లుగా ప్రథమభాగాన్ని 'శ్రీమాతా' అనే నామంతో ప్రారంభించి 'సర్వమంగళా' అనే నామంతో వివరణ ముగించాను. ఇలా చెయ్యడం వలన గ్రంథానికి ఒక కట్టు దిట్టమైన సంకలనంతో ప్రత్యేకత చేకూరుతుంది. ఆద్యంతాలలోని ఈ రెండు నామాల మధ్య పుస్తకానికి 1. జన్మ సంస్కారము 2. సౌభాగ్య సౌందర్యము చేకూరుతుందని నా భావన.

ఈ ద్వితీయ భాగంలో – 'సద్గతిప్రదా' అనే 201 వ నామంతో ప్రారంభించి, 'యశస్వినీ' అనే 474వ నామంతో వివరణ ముగించాను. ఉత్తములకు, ఉత్తమ మార్గములకు, ఉత్తమ ప్రవర్తనకు, ఉత్తమ ప్రవర్తకులకు వచ్చే ప్రతిఫలం – 'యశస్సు' అని నిగూఢంగా ఈ ద్వితీయ భాగ ఆద్యంత నామాలు స్ఫురింప జేస్తాయి. ఇక రాబోయే తృతీయభాగం 'విశుద్ధిచక్రనిలయా' అనే475వ నామంతో ప్రారంభమవుతుంది. ఈనామ ప్రారంభం – పవిత్రతను, నామ పారాయణ ప్రతి ఫలసిద్ధిని, స్పష్టమైన వాక్సంపత్తిని కలుగచేస్తుందని నా ఆకాంక్ష. అయితే – మరి ఈ తృతీయ భాగం ఏ నామంతో ముగుస్తుందో ఇప్పుడే నేను చెప్పను. ఆ సమయాన్ని బట్టి, ఆ సందర్భాన్ని బట్టి, ఆనాడు అది నిర్ణయింపబడాల్సిందే!

## ద్వితీయభాగంలోని అద్వితీయ విషయాలు

ఈ ద్వితీయ భాగంలోని నామాలలో సాధకులకు చాలా ఉపయోగకరమైన విషయాలు వివరింపబడినాయి. అమ్మవారి 'మహ' నీయమైన శక్తులు, గుణాలు, లక్షణాలతో పాటు, – జీవుని జాగ్రత్, స్వప్న, సుషుప్తి, తుర్యావస్థలు; అమ్మవారి సృష్టి, స్థితి, లయ తిరోధాన, అనుగ్రహ పంచకృత్యాలు; వాటిని నిర్వహించే అమ్మవారి అంశ దేవతలు; వర్ణాశ్రమాలు; పురుషార్థాలు; చతుష్షష్టి కళలు; చతుష్షష్టి ఉపచారాలు; అష్టసిద్ధులు; పంచకోశాలు; క్షేత్రక్షేత్రజ్ఞ జ్ఞానము; ధ్యాన, ధ్యాతృ, ధ్యేయ విషయాలు;

# కృతజ్ఞతలు

జగజ్జననిని తెలుసుకోమని జన్మనిచ్చిన జననీ జనకులకు, ఆ జగజ్జననిని కలుసుకోమని ఆమె వేష విలాస వివరాలను ఇచ్చిన గురుదేవులు శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణమాచార్యులవారికి, కలుసుకున్నప్పటి అనుభూతి వివరాలను అందరికీ వివరించమని ప్రోత్సహించి, ఆశీర్వదించిన శ్రీశ్రీశ్రీ విశ్వయోగి విశ్వంజీ గారికి, తదితర పెద్దలకు – సభక్తి ప్రణామములు.

''ప్రథమ భాగం చదివి ఆనందించిన మేము – మిగిలిన భాగాలు ఎప్పుడు వస్తాయా అని ఎదురు చూస్తూ ఉంటాము కాబట్టి, త్వరత్వరగా వాటిని ప్రచురించండి'' – అని సూచిస్తూ, ఆశిస్తూ, అభినందించిన యోగసాధక పాఠకులందరికీ కృతజ్ఞతా పూర్వక ధన్యవాదములు.

డా. గుండవరపు లక్ష్మీనారాయణ గారు ఈ మధ్యనే ఒకసారి – 'మీ లలితా సహస్ర నామ వివరణ ప్రథమభాగం శ్రీ పి. దత్తప్రసాద్ వద్ద ఉంటే చూడడం తటస్థించింది. ఆయన్ని అడిగి ఆ పుస్తకాన్ని తీసుకున్నాను. ఆ పుస్తకం నన్ను ఆ మూలాగ్రం ఏక బిగిని చదివింప చేసింది, అంటే – ఆ వివరణ నాకు అంత బాగా నచ్చింది' అని ఫోన్ ద్వారా తెలియ పరచారు. 'అలా పుస్తకాన్ని పూర్తిగా చదివే వారికే ద్వితీయ భాగాన్నిచ్చి అభిప్రాయం వ్రాయించాలి' అని, ఆయనకే ఈ ద్వితీయభాగాన్నిచ్చాను. అతి స్వల్పకాలంలో, ఆరోగ్యం అంత సరిగా లేకపోయినా, ద్వితీయ భాగంలోని నామ వివరణ పూర్తిగా చదివి తమ అభిప్రాయాన్ని వ్రాశారు. వృత్తి పరమైన – స్పష్టరీతిలో, అతి రమ్యంగా, హృద్యంగా – 'సద్గతి ప్రద – యశస్విని' అన్న శీర్షికతో తమ అమూల్య అభిప్రాయాన్ని అందజేసిన డాక్టర్ గుండవరపు లక్ష్మీనారాయణ (డా. జి.ఎల్.ఎన్) గారికి నా కృతజ్ఞతా పూర్వక ధన్యవాదములు. (అంటే – ఒక విధంగా నాకు నేనే చెప్పుకునే కృతజ్ఞతలు ఇవి అవుతాయేమో!)

ఒక సత్కార్యం జరగడానికి ఎంతో మంది సహృదయుల యొక్క సామూహిక కృషి, సహాయ సహకారాదులు ఉంటాయి. అలాగే ఈ గ్రంథ ప్రచురణ వెనుక కూడా అలాంటి కృషి, సహకారాలు ఉన్నాయి.

ప్రథమ భాగానికి శ్రీ కొండా శివరామకృష్ణమూర్తి గారు ఇచ్చిన విరాళ భాగంతోనే

ఈ ద్వితీయ భాగము యొక్క టైటిల్ పేజీ ముద్రణ (అట్టహాసం) గూడా జరిగింది. గురుదేవులు శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణ మాచార్యుల వారి అనుగ్రహాన్ని పొంది, వారి శిష్యులద్వారా జరిగే సత్కార్యాలకు యథాశక్తి ఆర్థిక సహాయాన్నందించడానికి, రిటైర్ అయిన తరువాత తనకు వచ్చినP.F. గ్రాట్యుటీ సొమ్మును వారు ఇలా సద్వినియోగాన్ని చేసుకుంటున్నారు. 'అందరూ మాస్టరు గారి అనుగ్రహాన్ని పొంది, ఆనందమయంగా జీవితం గడపాలి' – అనే అభిలాషగల శ్రీ శివరామకృష్ణమూర్తిగారికి, వారి కుటుంబ సభ్యులకు హృదయపూర్వక కృతజ్ఞతలు.

మా గురుదేవులైన శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణమాచార్యుల వారన్నా, వారిచే స్థాపింపబడిన అంతర్జాతీయ వైజ్ఞానిక వైద్య సేవా సంస్థ అయిన మా జగద్గురు పీఠం అన్నా, మా సంస్థ నిర్వహించే కార్యక్రమాలన్నా – అత్యంత ఆదరాభిమానములు గల 'విద్వాన్' శ్రీ గోగినేని కనకయ్య గారు – వారి వ్యాపార సంస్థ అయిన జయలక్ష్మి టుబాకో కంపెనీ (లిమిటెడ్) తరఫున భారీగా విరాళాన్నందించి, ఈ ద్వితీయ భాగ ముద్రణకు సహకరించారు. ప్రతి ఏడూ మేము నిర్వహించే కార్య క్రమాలలో పాల్గొంటూ, ప్రోత్సహిస్తూ, ఆర్థికంగా ఆదుకుంటూ – మాకు పెద్ద అండగా నిలిచే శ్రీ కనకయ్య గారికి, వారి కుటుంబ సభ్యులకు, వారి సంస్థలోని వారికి మా హృదయ పూర్వక కృతజ్ఞతాభివందనములు.

మా జగద్గురు పీఠం గుంటూరు శాఖ వారు నిర్వహించే ప్రధాన కార్యక్రమాలకు తమ విశాల గృహ ప్రాంగణాన్ని సానుకూల పరుస్తూ, శ్రీ లలితా దేవీ పూజలలో అత్యంత శ్రద్ధాభక్తులతో పాల్గొంటూ, పూజామహోత్సవాల నిర్వహణ నుండి, ఈ పుస్తక ముద్రణా యజ్ఞం దాకా కూడా అత్యంత ఆదరభావంతో సహకరిస్తూ, ప్రోత్సహిస్తూ ఆదుకుంటున్న – 'శ్రీ దేశిరాజు పార్థసారధి – శ్రీలక్ష్మి' దంపతికి, వారి కుటుంబ బంధుమిత్ర సభ్యులకు, 'శ్రీ కె. వెంకుబాబు – లక్ష్మీకాంతం' దంపతికి, బెల్లంపల్లి వాస్తవ్యులు శ్రీ ఎన్ శ్యామసుందర్, వారి జ్యేష్ఠపుత్రుడు సుభాష్‌చంద్రలకు; ఒంగోలు వాస్తవ్యులు సి.హెచ్. వెంకటేశ్వరరావుకు; గుంటూరు టి.జె.పి.యస్. కళాశాలలో ఆంధ్రోపన్యాసకురాలు అయిన డాక్టర్ (శ్రీమతి) పి. నాగమణికి, చిన ఓగిరాల వాస్తవ్యురాలు శ్రీమతి ఓగిరాల దుర్గామహాలక్ష్మికి; రావుల పాలెం ప్రభుత్వ కళాశాలలో ఉపన్యాసకురాలైన జి.ఎ. నాగమణికి; గుంటూరు వాస్తవ్యుడైన ఎమ్.వి.రమణకు; వినుకొండ వాస్తవ్యులు శ్రీ

భట్టిప్రోలు శ్రీనివాసరావుకు; విశాఖ వాస్తవ్యురాలైన శ్రీమతి ఎన్. సీతాదేవికి; పూజా కార్యక్రమాలలో పాల్గొనే తదితర సోదర సోదరీమణులకు, ఈ ద్వితీయ భాగ ముద్రణకు పూర్వ మూల్యాలను ఇచ్చిన వారికి, వాటిని స్వీకరించి మాకు అందజేసిన వారికి – మా కృతజ్ఞతా పూర్వక ధన్యవాదములు.

ఈ ద్వితీయ భాగ ముద్రణ యజ్ఞంలో నాతోపాటు అహర్నిశలూ అత్యంత ఉత్సాహంతో పాల్గొంటూ, నాకు అన్ని విధాలా సహకరిస్తున్న సూరపరాజు హనుమాన్ ప్రసాద్‌కు, నేను వ్రాసే నామ వివరణకు అత్యంత సుందరమైన అక్షరాలతో శుద్ధ ప్రతిని ఎప్పటికప్పుడు తయారుచేస్తూ, ప్రూఫులు దిద్దుతూ 'సహధర్మచారిణి' అన్న పదాన్ని సార్థకం చేస్తున్న నా శ్రీమతి – విష్ణుప్రియ (మీనాక్షి)కు నా ఆశీః పూర్వకాభినందనలు.

ప్రథమభాగముద్రణ లాగానే ఈ ద్వితీయభాగ ముద్రణ కూడా తన స్వంత పనిలా బాధ్యతపడి D.T.P. & Off-setలో పుస్తకాన్ని అతి సుందరంగా ముద్రించి సకాలంలో ఇచ్చిన ఓంకార్ గ్రాఫిక్స్ అధినేత చిరంజీవి కె. రాముకు ఆశీఃపూర్వక శుభాభినందనలు. 'అనవద్యాంగి' అయిన అమ్మవారిని అత్యంత సుందరంగా చిత్రించిన చిరంజీవి వర్ధన్‌రావుకు ఆశీఃపూర్వకాభినందనలు.

ఈ పుస్తక రచనకు ముందు చూచిన కొన్ని గ్రంథాలు.

1) శ్రీ లలితా రహస్య నామ సహస్ర గూఢార్థ దీపిక
(గ్రంథకర్త – శ్రీ రాచకొండ వెంకట కోటేశ్వరరావు
ప్రకాశకులు – శ్రీ రాచకొండ దుర్గాప్రసాద్ 4/13 బ్రాడీపేట, గుంటూరు)
(అనుబంధంలోని విషయాలన్నీ దాదాపు వీరి గ్రంథం నుండే స్వీకరించబడ్డాయి)

2) 'శ్రీ లలితా సహస్ర నామావళి' (ప్రకాశకులు : స్వధర్మ స్వారాజ్య సంఘం బ్రాడ్వే, మద్రాసు) ఆయా పుస్తకాల గ్రంథకర్తలకు, ప్రకాశకులకు నా హృదయ పూర్వక కృతజ్ఞతలు.

ఈ విధంగా ఈ గ్రంథ ప్రచురణ యజ్ఞానికి ప్రత్యక్షంగాను, పరోక్షంగాను సహకరించిన వారందరికీ నాకృతజ్ఞతా పూర్వక శుభాభివందనాలు. వీరందరూ అమ్మవారి అరుణారుణ చరణ కమల వికాస ప్రకాశంలో శుద్ధాంతరంగులై, పిల్లల చదువుల, వివాహాల బాధ్యతలు సకాలంలో నిర్వర్తిస్తూ, పవిత్ర జీవన మాధుర్యాన్ని ఆస్వాదిస్తూ, సంపూర్ణ ఆయురారోగ్యైశ్వర్యాలతో అనంతమైన ఆనందాన్ని అనుభవించాలని – హృదయ పూర్వకంగా శ్రీలలితా మాతృమూర్తిని ప్రార్థిస్తున్నాను.

2-10-97

**జి.ఎల్.ఎన్.శాస్త్రి**

ఓమ్

# సద్గతి ప్రద - యశస్విని

డాక్టర్. గుండవరపు లక్ష్మీనారాయణ
M.A.Ph.D.
శివశక్తి కాంప్లెక్స్,
8/1 అరండల్‌పేట, గుంటూరు - 2
1-10-97

సద్గతిప్రద - స్వప్రకాశ - శివమూర్తి
సర్వయంత్రాత్మిక - వరద - చారుహాస
తాపసారాధ్య - సుముఖి - విధాత్రి - మాత
కామ్య - విజయ - యశస్విని - కాచుమనల.

ఈ గ్రంథము డాక్టర్ జి.ఎల్.ఎన్.శాస్త్రి గారి ''శ్రీ లలితా సహస్ర నామ వివరణము'' అను బహుముఖ శాస్త్ర పాండిత్య ప్రదర్శక భాష్యము నందలి ద్వితీయ భాగము.

ఈ ద్వితీయ భాగము – 'సద్గతిప్రదా' అను 201వ నామముతో ప్రారంభమై, 'యశస్వినీ' అను 474వ నామముతో పరిసమాప్తమగుచున్నది. అందువలననే నేను – 'సద్గతిప్రద' అను నామముతో నమస్కారము ప్రారంభించి, వారు ఈ రెండవ భాగమున వివరించిన నామములనే స్మరించి, వారు వివరించిన గ్రంథాంత నామమైన 'యశస్విని' తో నమస్కార పద్యమును పరి సమాప్తము చేసి, మనలను – అనగా వివరణ కర్తను, పఠించు మనలను రక్షించును గాక అని – 'వందారు జన వత్సల' యైన 'పరమేశ్వరి' ని ప్రార్థించితిని.

శ్రీ లలితా సహస్ర నామముల రహస్యములను వివరించు వ్యాఖ్యానములు సంస్కృత భాషలో ఎన్నియెూ యున్నవి. శ్రీ భాస్కర రాయల వారి 'సౌభాగ్య భాస్కరము', శ్రీ కల్యాణానంద భారతీ స్వామి వారి 'కళ్యాణ శ్రీకళ' – ప్రసిద్ధములు. తెనుగు వ్యాఖ్యానములతోకూడ ఎన్నియెూ వచ్చినవి. వచ్చుచున్నవి కూడ. 'మరల ఈ వివరణ మెందులకు ?' – అని సామాన్య పాఠకునకు మెదడులో మొదటగా మెదలెడి

కదలిక. ఈ సందేహమునకు ఒకటే సమాధానము. ''ముఖే ముఖే సరస్వతీ'' అంతే కాదు. శ్రీ లలితా సహస్ర నామ రహస్యములను సంపూర్ణముగా మానవ శుష్కమస్తిష్క శక్తితో తెలిసికొనవలెననెడి కోరిక - సముద్ర తరంగములను లెక్కించవలెననెడి కోరిక వంటిది. మానవ ప్రయత్న సాధ్యము కాదు. అట్లని ప్రయత్నింప కుండుట సాధకునకు మంచి లక్షణము కాదు. తప్పక ప్రయత్నింపవలెను. ''భక్తివశ్యా, భక్తిమత్ కల్పలతిక'' యైన ఆ ''శివశక్తి'' అనుగ్రహము సాధకునిపై ఎంత ప్రసరించిన అంత అర్థమగును.

శ్రీ విద్యా ప్రచార యాగ దృఢవ్రతులైన - శ్రీ జి.ఎల్.ఎన్. శాస్త్రి గారు - ''ఇదే చివరకు చెప్పే విషయం, ఇంకా చెప్పవలసింది ఏమీ మిగలలేదు, అనే భరత వాక్యం వుండదని నా అభిప్రాయం. ముందు ముందు మరికొన్ని విశేషాలతో, క్రొత్త క్రొత్త వివరాలతో వ్యాఖ్యానాలు గూడా రావచ్చును. నేనే కొంత కాలం ఆగి వ్రాసినా, క్రొత్త భావాలు రావచ్చును. వచ్చాయి కూడా'' - అన్న ప్రథమ భాగమునందలి ''ముందుమాట'' లోని మాటలు - వారి అర్ష గ్రంథమథన జనిత సంస్కార పుష్టిని, సత్యాన్వేషణ దృష్టిని దశదిశల ప్రచారము చేయు యశః కాంతా దూతికల చాటు డప్పులు. ఇన్ని మాటలెందులకు ? అసలు శ్రీ లలితాంబిక ''అభ్యాసాతి శయ జ్ఞాత'' కదా!

భౌతిక శాస్త్ర శాఖాధ్యక్షులైన శ్రీ శాస్త్రిగారు - ఈ లలితా సహస్ర నామ వివరణమును ''నేను చేసిన ప్రత్యేక ప్రయత్నం'' అని ప్రథమ భాగములోని ''ముందుమాట''లో తెలిపినారు. 'ఆ ప్రత్యేక ప్రయత్నమేమి ? ఈ అసామాన్య కార్య నిర్వహణమునకు వారి చెంత కల సాధన సామగ్రి ఎంత ?' అను ప్రశ్న - పాఠకుని మనస్సులో ప్రవేశించును. ఆ శంకాశల్యమును పీకి వైచుటకు శాస్త్రిగారి చెంత కల సామగ్రి ఇది -

శాస్త్రి గారిది వృత్తి పరముగా భౌతిక శాస్త్ర రంగము. ఇది లౌకికమైన జీవనోపాధికి సంబంధించిన అంశము. ప్రవృత్తి పరముగా వీరిది ఆర్ష విజ్ఞాన రంగము. ఇది పారలౌకిక మైన జ్ఞానోపాధికి సంబంధించిన అంశము. ఆ జ్ఞానతృష్ణ తోడనే - కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్యులు గారి చెంత చేరిరి. వారి శిష్యులై - వేద, ఇతిహాస, జ్యోతిష, కావ్య, క్రతు విద్య, యోగ, హోమియో, వాస్తు మొదలగు వానిని అధ్యయనము చేసి, బహుశ్రుతులైరి. ఆ సంస్కారముతో సాధన అధికము చేసి, అనేక గ్రంథములు

వ్రాసిరి. ఆ గ్రంథములను భక్త లోకము కనులకు అద్దుకొన్నది, అద్దుకొనుచున్నది. ఆ గ్రంథములు పునర్ముద్రణములు పొందుచున్నవి. వీరి బహు శాస్త్ర విషయ పరిజ్ఞానమును తెలిసికొనుటకు వివిధ ప్రాంతముల వారు – వీరిని ఉపన్యాసములకు ఆహ్వానించుచున్నారు. శ్రద్ధగా వినుచున్నారు. లలితా సహస్ర నామ రహస్యములను వీరు వివరింపగా, గ్రంథరూపముగా వెలువరింపుమని లోకమే కోరినది. లోకమే లలితా సహస్ర నామముల వివరణమునకు వీరు సమర్థులని కతపత్రము(Certificate) ఇచ్చినది. ద్వితీయ భాగ ముద్రణము పూర్తి కాక మునుపే, ప్రథమ భాగ ప్రతులు అయి పోవచ్చు చున్నవి. శ్రీ జి.ఎల్.ఎన్. శాస్త్రి గారు 'శ్రీ లలితా సహస్ర నామములకు వివరణము వ్రాయుటకు సర్వ విధముల సమర్థులనుటకు ఇది చాలదా ?

ఇంతవరకు చెప్పినది – 'ఒక మిత్రుని భోజనమునకు ఇంటికి ఆహ్వానించి, భోజనము వడ్డింపకుండ, భోజన పదార్థముల వైశిష్ట్యములను, భోజనము సిద్ధము చేసిన వంట వాని ప్రావీణ్యమును గూర్చి ప్రసంగించినట్లున్నది' – అని భావింపవలదు.

జగత్ప్రసిద్ధమైన లలితా సహస్ర నామ మాహాత్మ్యమును గూర్చి నా వంటి అల్పజ్ఞుడు చెప్పనవసరము లేదు. చెప్పవలసినది వివరణ కర్తయైన శ్రీ జి.ఎల్.ఎన్. శాస్త్రి గారి శక్తి సామర్థ్యములను గూర్చి. అందువలన శ్రీ శాస్త్రి గారిని గూర్చి క్రొత్త వారికి కొంత తెలిపితిని. చెప్పిన ప్రతి విషయము సత్యము. కర్తపై గౌరవము కలిగినపుడు కదా, అతని కార్యముపై గౌరవము కలుగునది.

## శాస్త్రిగారి వివరణ విధానము

### 1. నామము యొక్క సంఖ్యను వ్రాయుట

ఇది ప్రతి వ్యాఖ్యానములో దర్శన మిచ్చు సామాన్యాంశమే ! సంఖ్య తెలిసిన సులభముగా నామమును వెదకవచ్చును. నామమును వెదకుటకు ఈ సంఖ్య ఉపయోగింపదు. ఈ సంఖ్య కూడ కొన్ని వ్యాఖ్యానములలో మధ్యలో భేదించుచున్నది. చివరి సంఖ్య మాత్రము సరిపుచ్చుచున్నారు. కొన్ని నామములను విడదీయుటలో చేసిన పొరపాటుల వలన ఈ భేదము వచ్చినది. శాస్త్రి గారు తెలిపిన సంఖ్యలు ప్రామాణికములు.

## 2. నామములో ఎన్ని అక్షరములు కలవో తెలుపుట

ఈ అంశము పూర్వ వ్యాఖ్యానములలో కన్పడదు. దీనివలన భక్తుడు నామమందలి - అక్షరములను పొరపాటున వదలి చదువు ప్రమాదము - తప్పును. అక్షరములు సరిగా పలుకనిచో దురర్థము వచ్చును కదా! కనుక ఇది ఉపయోగించు అంశము.

## 3. శ్లోకములో వచ్చు నామమునకు, "నమః" అని చేర్చి ప్రత్యేకముగా పఠించునపుడు - మార్పు చెందిన నామ రూపమును - తెలుపుట.

పూర్వ వ్యాఖ్యలందు నామార్థ వివరణము చేయు చోట, 'నమః' చేర్చి నమస్కరించు కొనుటకు - మార్పు చేయవలసిన నామ రూపముండదు. విడిగా, ప్రత్యేకముగా "నమః" చేర్చిన సహస్ర నామములు ఒక చోటనే యుండును.

శాస్త్రి గారు క్రొత్తగా ప్రవేశ పెట్టిన ఈ విధానము వలన - నామార్థ విశేషములను తెలిసికొనిన భక్తునికి - ఆనందముతో వెంటనే సరియైన నామ రూపముతో నమస్కరించు కొను సదవకాశము - కలుగును. తరువాత ఒకేసారి సహస్ర నామములు జపించు కొను భక్తునకు ఇది 'రిహార్సల్' వలె ఉపయోగించును.

## 4. నామము నందలి ప్రతి పదమునకు మొదట అభిధార్థమును, అనగా - నిఘంటువులోని అర్థమును తెలిపి, తరువాత విశేషార్థములను వివరించుట.

ఈ అంశము పూర్వ వ్యాఖ్యలన్నిటి యందు కలదు. కాని కొన్ని వ్యాఖ్యలు ప్రతి పదమునకు అర్థము వ్రాయక, నామము మొత్తమునకు కలిపి తాత్పర్యార్థములను తెలిపినవి. ప్రతి పదమునకు అర్థము లేనిచో - పండితుడుకాని పాఠకునకు - నామార్థమును గూర్చి స్పష్టమైన అవగాహన కలుగక పోవచ్చును.

## 5. శాస్త్ర జ్ఞాన సమన్వయ దృష్టి

ఈ అంశము పూర్వ వ్యాఖ్యలందు మచ్చుకైనను కన్పడదు. శాస్త్రి గారు భౌతిక శాస్త్రోపన్యాసకులు, వాస్తు, జ్యోతిష శాస్త్రములందు మంచి పండితులు. సామాన్యముగా

వ్యాఖ్యాతలకు జ్యోతిషము నందు, ప్రవేశముండవచ్చునేమో కాని, భౌతిక శాస్త్రమునందు ప్రవేశ ముండుట కష్టము. జ్యోతిషమునందు పూర్వ వ్యాఖ్యాతలకు ప్రవేశమున్నను, శాస్త్రి గారి వలె భూగోళ, ఖగోళ సంబంధములైన ఆధునిక శాస్త్ర పరిజ్ఞానముండుట అసంభవాంశము. వ్యక్తి గతమైన ఈ లక్షణములు ఈ వ్యాఖ్యకు ప్రత్యేకత సంతరించి పెట్టినవి.

విశేషార్థముల వివరణములందు, పూర్వ వ్యాఖ్యలందు తెలుపబడిన అంశములు ఉండుట మాత్రమే గాక, అనేకానేకములైన క్రొత్త వెలుగులు ఈ వ్యాఖ్య ప్రసరింప జేసినది. వేద, మంత్ర, తంత్ర, యంత్ర, భౌతిక, భౌగోళిక, ఖగోళ, జ్యోతిష, రేఖాగణిత, ఉచ్చారణ, అక్షర గోత్ర .... మొదలగు అనేకాంశముల కాంతులు కన్పడును. పారిభాషిక పదముల అర్థముల స్పష్టతకై ఆంగ్ల పారిభాషిక పదములను తెలుపుట మరియొక విశేషము.

ఈ అంశమున శ్రీ జి.ఎల్.ఎన్. శాస్త్రి గారి సకల శాస్త్ర సంస్కారము నాట్యము చేసినది. బహు ముఖ శాస్త్ర పాండిత్య వీరము విజృంభించినది. ఆత్మజ్ఞాన శాస్త్ర జ్ఞాన సమన్వయములు ఆశ్చర్యజలధిలో ముంచి వేసినవి. శాస్త్రిగారు చెప్పుకొనిన "ప్రత్యేక ప్రయత్నము" ఇదియే!

'ఆత్మజ్ఞాన' సంబంధములైన విషయములకు – శాస్త్ర జ్ఞాన దృష్టితో సమన్వయము చేసి, ఆత్మ జ్ఞాన విషయములకు ప్రామాణికతను పెంచిన ఖ్యాతి శ్రీ జి.ఎల్.ఎన్.శాస్త్రి గారిదే!' – అని అంగీకరింప జేయగల శక్తి కలది ఈ అంశము.

## 6. భారతీయేతర విజ్ఞాన సమన్వయము

పంచ భూతముల వలె – విజ్ఞానము గూడా – ప్రపంచమందలి ప్రతి మానవునకు భగవంతుడు ప్రత్యక్షముగా పంచిన ప్రసాదము.

వివరణముల ప్రామాణికతకై – భారతీయ విజ్ఞాన గ్రంథముల నుండి ప్రమాణములను గ్రహించుటయే గాక – ఆంగ్ల గ్రంథముల నుండి కూడ గ్రహించిరి. అనగా – భారతీయ విజ్ఞానముతోపాటు, విశ్వమానవ విజ్ఞానమును గూడ గ్రహించి, సమన్వయము చేసిరన్నమాట!

ఇది వీరు – వివిధ జాతీయ, అంతర్జాతీయ వైజ్ఞానిక సదస్సులలో పాల్గొని

తెలిసికొనిన అంశముల ప్రతిఫలము. వీరు వివిధ వైజ్ఞానిక పత్రికలలో ప్రచురించిన నూతన పరిశోధనా విషయ వ్యాసముల ప్రతిబింబము.

భారతీయేతర విజ్ఞానము కూడ తెలుగు భక్తులకు అంద చేసిన ఘనత కలది ఈ వ్యాఖ్య.

## 7. చివరలో నామమునకు తెలిపిన వివిధార్థ విశేషములను, మరల సంఖ్యలు వేసి సారాంశముగా వ్రాయుట.

తెలిసికొనిన అంశములన్నింటిని పాఠకుడు ఒక్కసారి సింహావలోకనము చేసికొనుటకు ఉపయోగించెడి అంశము ఇది.

శాస్త్రిగారు అధ్యాపకులు. పాఠము చెప్పిన తరువాత సారాంశము చివరలో చెప్పుట ఉత్తముడైన ఉపాధ్యాయుని లక్షణము కదా! అందువలన ఆ అధ్యాపకుని అనుభవము ఇక్కడ చేరి, ప్రతి నామ వ్యాఖ్య ఒక చక్కని పాఠమై, పాఠకునకు విషయము కరతలామలకమైనది.

## 8. నామ ఫల సూచన

ప్రతి నామమును జపించిన తరువాత, ఆ నామ జపము వలన కలుగు సత్ఫలములను తెలుపుట జరిగినది.

సహస్ర నామములను పఠించుకొనుచున్నను, భక్తుడైన పాఠకుడు తాను వాంఛించు ఫలము కొఱకై – ఆ నామమును ప్రత్యేకముగా మరల జపించుకొని, ఆ సత్ఫలమును పొంది ఆనందింప గలడు.

బాధలేని, వాంఛలేని మానవుడు – లౌకిక ప్రపంచములో గోచరింపడు కదా! కనుక లోక వ్యవహారములలో సంచరించు ప్రతి భక్తునకు ఇది చాల ఉపయోగకరమైన వివరణము.

ఇన్ని విశేషములతో కూడినది శ్రీ జి.ఎల్.ఎన్. శాస్త్రిగారి 'శ్రీలలితా సహస్ర నామ వివరణము'.

'ఇన్ని విశేషములున్నవని వ్రాయుచూ, ఒక్క నామము చెంత గల విశేషములనైనను చెప్ప లేదు కదా! – అను సందేహము కలుగు వారికి – ఇదే సమాధానము. వారు వ్రాసిన విషయములనే అన్నింటిని ఇక్కడ మరల తిరిగి వ్రాయవలయును. పుస్తకము మీ చెంత కలదు కదా, నేను వ్రాసినది నిజమో కాదో మీరే చదివి నిర్ణయించుకొనుడు.

అయినను – కొన్ని నామములను పాఠక సౌలభ్యమునకై సూచించుచున్నాను. ఈ నామముల వివరణము చూచినచో – మీరే అన్ని నామముల వివరణము వదలక చదివెదరని నా విశ్వాసము.

సద్గతిప్రదా (201) – సర్వమంత్రస్వరూపిణీ (204) – మహాతంత్రా (226) – చక్రరాజనికేతనా (245) పార్వతీ (246) – పరమానందా (252) – సర్వావస్థా వివర్జితా (263) – భగమాలినీ (277) – వర్ణాశ్రమ విధాయినీ (286) – సకలాగమ సందోహ శుక్తి సంపుట మౌక్తికా (290) – పురుషార్థప్రదా (291) – పరా (366) – వైఖరీరూపా (371) – మూలప్రకృతిః (397) – వ్యాపినీ (400) – భక్తహార్దతమో భేద భానుమద్భాను సంతతిః (404) – శివపరా (410) – సంధ్యా (422) – కుమారగణ నాథాంబా (442) – స్వస్తిమతీ (448) – హంసినీ (456) – వజ్రేశ్వరీ (468) – సిద్ధేశ్వరీ (471)

ఇట్లు ఎన్ని నామములు వ్రాసెదను ? పాఠకులకు – 'అన్ని నామముల విశేషములను చదవి తరింపుడ' ని నా ప్రార్థన.

ప్రథమభాగ గ్రంథ ప్రారంభము నందలి 'ముందుమాట' – శ్రీ జి.ఎల్.ఎన్. శాస్త్రిగారి 'శ్రీ లలితా సహస్ర నామ వివరణము'' యొక్క జాతక చక్రము నందలి బలములను తెలుపు ''బిందువుల మూట''.

ప్రథమ భాగమునందలి ''పీఠిక'' – శ్రీ శాస్త్రిగారి బహు శాస్త్రాధికార సంస్కారమును – బట్టబయలు చేసిన ''రహస్య నిధుల పేటిక''.

గ్రంథాంతములందలి అనుబంధములు – ధీమాన్యులకు మాత్రమే తెలియు గూఢ విషయములను – సామాన్యులకు కూడ రూఢ విషయములుగా చేయు – ''సంకల్ప నిబంధములు''.

శాస్త్రి గారి ''శ్రీ లలితా సహస్ర నామ వివరణము'' నాలుగు భాగములుగా – ''చతుర్బాహు సమన్వితా'' గా భక్తలోకములకు ప్రత్యక్షమగునేమో !

శ్రీ జి.ఎల్.ఎన్. శాస్త్రి గారి '' శ్రీ లలితా సహస్ర నామ వివరణము'' పాఠకులకు ''సద్గతిప్రద'', శాస్త్రిగారికి ''యశస్విని''.

ఇది డాక్టర్ జి.ఎల్.ఎన్.శాస్త్రి గారి వ్యాఖ్యకు – డాక్టర్ జి.ఎల్.ఎన్. పఠించి, పొందిన ఆనందానుభూతి యొక్క ''స్తుతిమతి''.

# చిద్రూప చింతన

తే. గీ. 'క' నులకింపగు రూపమ్ము కలిగి యుండి (మహాలావణ్యశేవధిః)

'ఏ' మి వంకలు లేనట్టి లేమ ఆమె (అనవద్యాంగీ)

'ఈ' వి చింతామణీ సౌధ గృహిణియైన (చింతామణి గృహాంతస్థా)

'ల' క్షణాహ్లాద వర్తనలబ్ధి యున్న (సాధ్వీ)

'హ్రీం' అనంగను గళమెత్తు హృదయ శక్తి (హ్రీంకారీ)

'హ' రిణ నయనమ్ములను గల్గు తరుణి ఆమె (మృగాక్షీ)

'స' కల శక్తుల మూలమౌ శక్తి ఆమె (సర్వశక్తిమయీ)

'క' డిమితోటల వసియించు కన్నతల్లి (కదంబవనవాసినీ)

'హ' రివిధీంద్రుల అర్చనలందు తల్లి (హరి బ్రహ్మేంద్ర సేవితా)

'ల' యకరియు కూడ అయినట్టి లలన ఆమె (లయకరీ)

'హ్రీం' అనంగ వాగింధన మ్మిచ్చుశక్తి (హ్రీంకారీ)

'స' చ్చిదానందరూపిణి స్వప్రకాశ (సచ్చిదానంద రూపిణీ, స్వప్రకాశా)

'క' ళలు మాలగా నున్నట్టి కల్పవల్లి (కళామాలా)

'ల' లిత లలితార్థ భావ సంకలితమూర్తి (లలితాంబికా)

'హ్రీం' అనంగను గళశక్తినిచ్చుతల్లి (హ్రీంకారీ)

'శ్రీం' అనంగను సిరులిచ్చు శ్రీల తల్లి (శ్రీమాతా)

శా. 'ఓం' కారేశ్వర శంకర ప్రణవ నాదోద్యానసంశోభితా!

'ఐం' కారేశ్వర దివ్యమూర్తి! స్ఫుటవాగర్థాను సంస్థాపితా!

'హ్రీం' కారేశ్వరి! 'వాగ్విలాసగళమున్' హృద్యాతి హృద్యమ్ముగా

'శ్రీం' కారేశ్వరి! నాకు నిమ్ము కృపతో చిద్రూపచింతామణీ!

జి.ఎల్.ఎన్. శాస్త్రి

# అంకితము

సీ. శ్రీ విద్యబోధించు చిచ్ఛక్తి భక్తుండు
సూర్యస్తుతిని జెప్పు ఆర్యమూర్తి
శివసూక్తముల జెప్పు శివభక్త చిత్తుండు
శ్రీ గణేశుని గొల్చు యోగమూర్తి
విష్ణు సాహస్రక వివరణాత్మక కర్త
కృష్ణచరిత, క్రీస్తు గేయ – కర్త
భాగవత జ్యోతిషాగమ సూక్త గీ
తా బాలశిక్ష – సూత్రాల కర్త
గీ. పూర్వ పశ్చిమ సంస్కృతీ పుష్పములకు
యోగ సంస్కార పరిమళ భోగమిచ్చి
అన్వయించిన ఎక్కిరాలాన్వయులగు
కృష్ణమాచార్య గురువు కంకితము నిత్తు

భక్తినిండిన యెదతోడ ప్రణతిజేసి
పరవశించిన మదితోడ ప్రణుతి జేసి
దివ్యలలితాంబికా నామ దీప్తి కిరణ
భాష్యమైన ద్వితీయ విభాగ సుమము.

జి.ఎల్.ఎన్. శాస్త్రి

# అంకితము



గురుదేవులు

శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణమాచార్య

పాదార వింద ములకు

అంజలిఘటిస్తూ

- జి. ఎల్. ఎన్. శాస్త్రి

శ్రీ గణేశాయ నమః

శ్రీ మత్త్రిపుర సుందర్యై నమః

# 201. సద్గతి ప్రదా

ఇది అమ్మవారి 201వ నామం. ఇది 5 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు 'సద్గతిప్రదాయై నమః' అని చెప్పాలి.

సత్ = మంచి, గతి = మార్గమును, ప్రదా = ఇచ్చునది. 'సత్' – అనే పదానికి – ఉండటం, మంచి, శుభమైన, మంచివారు, సరియైన, నిజమైన, అవసరమైన, నిలకడ లేదా స్థిరమైన, ఉన్నతమైన, గౌరవప్రదమైన, జ్ఞానవంతమైన మొదలైన అర్థాలు ఎన్నో ఉన్నాయి. అలాగే –

'గతి' అనే పదానికి – గమనము, మార్గము, పద్ధతి, అవకాశము, కర్మఫలము, స్థితి, ప్రవేశము, నడవడిక లేదా ప్రవర్తన మొదలైన అర్థాలు ఉన్నాయి.

పైన తెలిపిన అర్థాలను బట్టి 'సద్గతిప్రదా' అనే ఈ నామానికి – చాలా అర్థాలు చెప్పవచ్చును. ఏది జరిగితే మనకు 'నచ్చడం' కాకుండా మనకు 'మంచిదో' దాన్ని 'శుభము' అంటారు. అలాంటి 'శుభమైన మార్గాన్ని (అమ్మవారు మనకు) ఇచ్చునది' అని, 'మంచిని ఇచ్చునది' అని, 'మంచివారు అవలంబించిన మార్గాన్ని లేదా పద్ధతిని లేదా ప్రవర్తనను ఇచ్చునది' అనీ, కొన్ని అర్థాలు చెప్పుకోవచ్చును.

'కార్యం' నుండి 'కారణం' వైపుకు మన దృష్టి దారితీస్తే, సత్యాన్వేషణ, తత్త్వాన్వేషణ సరిగా జరిగి, సాధన ఫలవంతమై, లక్ష్యాన్ని సానుకూలంగా పొందడం జరుగుతుంది. కార్యం ఎప్పుడూ స్థూలమే, కారణం – సూక్ష్మము. పంచభూతాల్లో అన్నిటి కన్నా స్థూలమైంది 'పృథివి' (భూమి), అన్నిటి కన్నా సూక్ష్మమైంది 'ఆకాశం'. 'స్థూలమైన (పదార్థమయమైన) కార్యం నుండి సూక్ష్మతమమైన కారణం వైపుకు దారితీసే దృక్పథాన్ని ఇచ్చునది' అని ఇంకో అర్థం.

పంచభూతాల్లో పృథివి, ఆపస్సు, తేజస్సు, వాయువులకు 'లక్షణా' లుంటాయి గాని, 'తాను' అనే 'ప్రజ్ఞ' ఉండదు. ఆకాశానికి మాత్రం ఈ ప్రజ్ఞ ఉంటుంది. అందుకే

మన జీవన వ్యాపార నిర్వహణకు మూలకారణం - మన హృదయ దహరాకాశంలోని ప్రజ్ఞ యొక్క స్పందన గాని ఇతరములేవీ కావు. ఆ స్పందన ఆగిపోతే మిగిలేది ఆక్రందనే!

ఆకాశం కదిలితే - గాలి, కదలకపోతే ఆకాశమే! ఆ గాలి తర్వాత అగ్ని, జలం, పృథివి ఇలా స్థూల స్థితుల క్రమంలో సృష్టి జరుగుతుంది. ఇటువంటి 'ఆకాశము నందలి ప్రజ్ఞ యందు, అంటే, మనలను మనయందు - అనగా, 'తాను' అను ప్రజ్ఞ యందు ఉంచునది' అని ఇంకో అర్థం. ధ్యానంలో ధ్యేయమైన ఈ చివరి స్థితిని 'ఉన్నతస్థితి' లేదా ఉత్తమ స్థితి' అంటారు. ఈ మార్గాన్నే ''ఊర్ధ్వమార్గం'' అంటారు. ఈ ఊర్ధ్వమార్గాన్నే 'ఉన్నత' లేదా 'ఉత్తమ' మార్గం అంటారు. ఈ ఉన్నత, ఉత్తమ మార్గాన్నే 'సద్గతి' అంటారు. ఈ సద్గతిని ఇచ్చునది - అని ఇంకో అర్థం.

'సత్' కు సంబంధించినదే 'సత్యం' కాబట్టి - సత్యలోకాన్ని అంటే - బ్రహ్మలోకాన్ని, 'బ్రహ్మ పదాన్ని ఇచ్చునది' అని ఇంకో అర్థం.

ఇహ లోకాలకు సంబంధించిన - ఆయురారోగ్య, ఐశ్వర్య, యోగక్షేమ భోగాదులను (ఇవి సాపేక్షకము లైనవి(Relative) అంటే - వేరొక దానితో పోల్చుటకు అవకాశము వుండేవి) ఇచ్చునది. మరియు ఇవి కాక వేరొక దానితో పోల్చుటకు అవకాశము లేని ''నిరపేక్షకము లైన(Absolute) పరలోక సంబంధమైన మోక్షానందాన్ని గూడా ప్రసాదించునది'' అని ఇంకో అర్థం. (ఈ రెంటినీ అమ్మవారు ప్రసాదిస్తుంది)

వేదాంత పరిభాషలో గతులను మూడురకాలుగా చెబుతారు. అవి 1. పరామార్గము 2. అర్చిర్మార్గము 3. ధూమమార్గము. తురీయాతీతమైన మోక్షమార్గాన్ని - 'పరామార్గం' అంటారు. భక్తులు, ఉపాసకులు పోవు మార్గాన్ని - 'అర్చిర్మార్గం' అంటారు. ఇష్టాపూర్తాది కర్మలను ఆచరించి పొందే మార్గాన్ని 'ధూమ మార్గం' అంటారు. - ఈ మూడు రకాల మార్గాలను ఇచ్చునది' అని ఇంకొక అర్థం. 'వాస యోగ్యమైన ఉత్తమ లోకము నందు, ఉత్తమ జన్మను, ఉత్తమ సంస్కారమును ఇచ్చునది' అని వేరొక అర్థం. కుండలినీ యోగసాధనలో కుండలినీ శక్తిని సుషుమ్నా మార్గం ద్వారా 'ఊర్ధ్వగతి' ని పట్టించి సాధకునికి ముక్తి ఇచ్చునది' అని మరో అర్థం.

మొత్తం మీద ఈ నామానికి ఈక్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1) సంసార చక్రంలో బుద్ధి ఇరుక్కోకుండా అనుసరించగల శుభమైన, సరియైన, అవసరమైన, ఉన్నతమైన, ఉత్తమమైన మార్గమును ఇచ్చునది.

2) మంచివారు అనుసరించు మార్గమును, లేదా పద్ధతిని, నడవడికను, లేదా ప్రవర్తనను ఇచ్చునది.

3) బ్రహ్మలోక ప్రాప్తిని ఇచ్చునది.

4) సాపేక్షకమైన, ధూమ, అర్చిర్ మార్గాలను, నిరపేక్షకమైన పరామార్గమును ఇచ్చునది.

5) ఇహ లోక సంబంధమైన, పరలోక సంబంధమైన సుస్థితులను ఇచ్చునది.

6) 'తాను' అను ప్రజ్ఞలో ఉండు స్థితిని ఇచ్చునది.

7) స్థూలము నుండి సూక్ష్మమునకు మళ్ళించు దృష్టి మార్గమును ఇచ్చునది.

8) కుండలినీ శక్తిని సుషుమ్నా మార్గములో ఊర్ధ్వగతిని పట్టించి సాధకునికి ముక్తిని ఇచ్చునది.

9) అర్థము చేసుకొనుటలో సరియైన దృక్పథాన్ని ఇచ్చునది.

దుస్థితిలో వున్నవారు కాని, నడవడిక, ప్రవర్తన సరిగా లేని వారు కాని, కాళ్ళకు దెబ్బలు, బెణుకుల వలన నడకసరిగా లేని వారు గాని – ఈ నామాన్ని 'సద్గతిప్రదాయైనమః' అని సంపుటి చేసి జపిస్తే త్వరలోనే వారికి పరిష్కారం లభించి, సత్ఫలితాన్ని పొందుతారు.

## 202. సర్వేశ్వరీ

ఇది అమ్మవారి 202వ నామం. నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సర్వేశ్వర్యైనమః' అని చెప్పాలి.

సర్వ = జగత్తులేదా విశ్వమునకంతకు, ఈశ్వరీ = 'ప్రభ్వి' లేదా ప్రధానాధికారిణి.

నామ రూపాత్మకమైన సమస్త ప్రపంచాన్ని సృజించి, పోషించి, శాసించి, చివరకు తనయందే లయించుకొనునది కాబట్టి అమ్మవారు సర్వమునకు ఈశ్వరి అవుతుంది. (యేన జాతాని, జీవన్తి, యత్ప్రయన్త్యభి సంవిశంతీతి, – తైత్తిరీయం) సృష్టి, స్థితి, లయ, కారకులైన బ్రహ్మ, విష్ణు, పరమేశ్వరులకు గూడా పై అధికారిణిగా ఉండు పరబ్రహ్మ స్వరూపిణిగాబట్టి అమ్మవారే సర్వేశ్వరి.

''సమస్త విశ్వమునకు 'ప్రభ్వి' లేదా అధికారిణి' అని ఈ నామానికి అర్థం.

## 203. సర్వమయీ

ఇది అమ్మవారి 203వ నామం. నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సర్వమయ్యై నమః' అని చెప్పాలి.

సర్వ = సర్వము నందు అనగా విశ్వమంతటా, మయీ = నిండి ఉన్నది.

'ఈశావాస్యమిదం సర్వం' అని ఈశావాస్యోపనిషత్తు చెబుతుంది. అంటే – అంతటా ఈశుడే లేదా ఈశ్వరుడే నిండి వున్నాడు. 'సర్వము నందు ఈశ్వరుడు నిండి ఉన్నాడు' లేదా 'సర్వము నందు ఈశ్వరి నిండి ఉన్నది'. ఈ రెండు వాక్యాలకు తేడా ఏమిటి ? 'తేడా లేకుండా ఉండటమే' – అని సమాధానం చెప్పుకోవాల్సి వుంటుంది. 'మనలో కుడిచెయ్యి ఎవ్వరిది'? 'ఎడమ చెయ్యి ఎవరిది' ? అని ప్రశ్నలు వేసుకుంటే అవి రెండు వేరు వేరు వ్యక్తులవి కావు. ఒకే వ్యక్తికి సంబంధించినవి – అని తెలుస్తుంది కదా!

ఈశ్వరి కలవాడు ఈశ్వరుడు. ఈశ్వరిలో నిండినవాడు ఈశ్వరుడు. అంతా ఆవిడే అయితే మరి ఆయన ఉన్నట్లా ? లేనట్లా ? ఇలా అనేది, అలా అంటుంటే వినేది ఎవరు ? వారెవరి తాలూకు వారో తెలిసి చెప్పగలిగితే అసలు విషయం తెలుస్తుంది. అసలు విషయం తెలిస్తే ఆ ప్రశ్నకు అర్థం లేదని తెలుస్తుంది. ఒకళ్ళలో ఒకళ్ళు ఉండగలగడం – వాళ్ళకే చేతనైంది అని తెలుసుకోవాలి.

'తత్సృష్ట్వా, తదేవాను ప్రావిశత్ – తైత్తిరీయం'. మనుష్యులు తాము సృష్టిచేసిన వస్తువుల్లో అను ప్రవేశం చెయ్యలేరు. గడియారాన్ని తయారుచేసి, ఆ గడియారం

అంతటిలో మనం ఉండలేం కదా! కాని భగవంతుని సృష్టి అలాంటిది కాదు. 'ఈ ప్రపంచంలో అన్నీ సృష్టించి అలా సృష్టించిన అన్నిటిలోను అను ప్రవేశం చేసి తానే నిండి వుంటాడు'. అనిపై ఉపనిషద్వాక్యానికి అర్థం.

మనం మన గృహాలకు 'యజమానులం' (Owners) అవవచ్చునేమో గాని, 'ఈశులం' (Lords) కాలేము. గృహం తాలుకు కిటికీలు, ద్వార బంధాలు, గోడలు అన్నిటి నిండా మనమే నిండి వుండగలిగితే – అప్పుడు మనం గృహానికి 'ఈశులం' అవుతాము. (పంచదార చిలుకకు పంచదార ఈశుడు అవుతుంది. మంచుగడ్డకు $H_2O$ ఈశుడు అవుతుంది అలా అన్నమాట!')

ప్రస్తుత నామం అయిన 'సర్వమయీ' అనే నామాన్ని గూడా అలాగే అర్థం చేసుకోవాలి. అమ్మవారే సర్వమూ అయినపుడు సర్వము నందు అమ్మవారు కాక ఇంకేముంటుంది? అంటే అమ్మవారే ప్రపంచమంతటికీ 'ఉపాదాన కారణం అన్నమాట! 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అన్న వాక్యానికి గూడా ఇదే అర్థం.

'సర్వము నందు నిండి వున్నది' అని ఈ నామానికి అర్థం.

## 204. సర్వమంత్రస్వరూపిణీ

ఇది అమ్మవారి యొక్క 204వ నామం. ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సర్వమంత్ర స్వరూపిణ్యై నమః' అని చెప్పాలి.

సర్వ = అన్ని, మంత్ర = మంత్రములును, స్వరూపిణి = (తన) స్వరూపముగా గలది.

'మన నాత్ త్రాయతే ఇతి మంత్రః' అని మంత్ర పదానికి నిర్వచనం. మననము చేసిన కొలదీ రక్షించే దాన్ని మంత్రం అంటారని దీని అర్థం. 'నిరంతర శ్రవణ, స్మరణ, మననాల వలన ఉపాసకుని రక్షిస్తూ చివరకు ఉపాస్యదేవతా స్వరూపంగా మార్చగలిగే వర్ణ సంపుటాన్ని' (అక్షరాల కూర్పును) 'మంత్రం' అనవచ్చును. షడామ్నాయ మంత్రాలు రశ్మిమాలా మంత్రాలు, అష్టోత్తర, శతనామ సహస్ర నామాది మంత్రాలన్నిటి స్వరూపం అమ్మవారే!

సాధారణంగా వేదాలలో వుండే వాక్యాలను మంత్రాలంటారు. ఇవి 'ఋక్కులు', 'సామలు', 'యజుస్సులు' – అని మూడు విధాలుగా వుంటాయి. ఈ మూడు విధాల మంత్రాలు అమ్మవారి స్వరూపాలే ! వాస్తవానికి వేద వాక్యాలే మంత్రాలు కానక్కరలేదు. మంత్రాలలాగే ప్రభావం చూపే మామూలు అక్షరాలు, మాటలను గూడా 'మంత్రాలు' అనవచ్చును. (మీ మాటలు మంత్రంబులు, మీ మెట్టిన యెడ ప్రయాగ – మనుచరిత్ర)

మామూలు మాటలైనా, వేదమంత్రాలైనా మామూలు అక్షరాలతో రూపొందింపబడినవే కాని మంత్రాలకు, బీజాక్షరాలకు వేరే అక్షరాలుండవు. అన్ని రకాల అక్షరాలకు మూలమైన అక్షరాలను 'మాతృకావర్ణాలు' అంటారు. ఇవి సంస్కృతములో 32 వుంటాయి. అమ్మవారు 'మాతృకావర్ణరూపిణి'. (ఈ మాతృకావర్ణాల గురించి ప్రథమ భాగంలోని 25వ నామం అయిన 'శుద్ధ విద్యాంకురాకార ద్విజపంక్తిద్వయోజ్జ్వలా' అన్న నామం వద్దవిపులంగా వివరించబడింది.)

అన్ని మాటలు, అన్ని మంత్రాలు – అక్షరాలతోనే రూపొందింపబడాలి కాబట్టి, అన్ని అక్షరాలు మాతృకా వర్ణాలతోనే రూపొందింపబడతాయి కాబట్టి, ఆ మాతృకావర్ణాలు అమ్మవారి స్వరూపమే కాబట్టి – సర్వమంత్రాలు అమ్మవారి స్వరూపమే అవుతాయి. మనిషిలో ఎన్నో రకాల శక్తులున్నా – ఆ శక్తులన్నిటికీ సంబంధించిన మనిషి ఒక్కడే ! అంటే – మనిషి ఒక్కడే, శక్తులెన్నైనా వుండవచ్చును – అలాగే అమ్మవారు ఒక్కతే ! మంత్రాలు ఎన్నైనా వుండవచ్చును.

ఏ మంత్రమైనా అక్షరాలతోనే రూపొందింపబడుతుంది. ఒక్కొక్క అక్షరానికి ఒక్కొక్క ప్రత్యేకమైన ధ్వని, ఒక్కొక్క ప్రత్యేకమైన అర్థం వుంటాయి. ధ్వని – నాదాత్మకమైతే, అర్థం – జ్ఞానాత్మకం. అమ్మవారు 'నాదరూపిణీ' 'జ్ఞాన జ్ఞేయ స్వరూపిణీ' గూడా కాబట్టి – సర్వమంత్రాలు అమ్మవారి స్వరూపమే అవుతాయి.

సృష్టి ఇంకా ఏర్పడనప్పుడు 'అయ్యవారే' ఉంటారు. అయ్యవారు ఉచ్చరిస్తే అమ్మవారు అనే సృష్టి ఏర్పడుతుంది. ఉచ్చరించే ఆ అయ్యవారిని సూచించే అక్షరం 'అ'. ఉచ్చరింపబడేది అమ్మవారు. దీనిలో రెండు భాగాలుంటాయి. 1) ఉచ్చారణ 2) ఉచ్చరింపబడేది – అని రెండు ఉంటే గాని అమ్మవారు ఏర్పడదు. ఇలా ఏర్పడే అమ్మవారిని సూచించే

రెండు అక్షరాలే 'ఉ' 'మ'. ఈ రెండు అక్షరాల్లో 'ఉ' (ఉచ్ఛారణ) శక్తిని, 'మ' వైఖరీ ధ్వని ద్రవ్యాన్ని సూచిస్తాయి. అంటే (అక్షరాన్ని) ఉచ్చరించడానికి కావలసిన శక్తిని - 'ఉ' సూచిస్తే, ఉచ్చరించగా ఏర్పడే భౌతికమైన వైఖరీ ధ్వనిని - 'మ' సూచిస్తుంది. అయ్యవారికి సంబంధించిన 'అ' అక్షరం 'ప్రజ్ఞ'ను సూచిస్తుంది. అయ్యవారు, అమ్మవారు కలిస్తే సృష్టికి సంబంధించిన 'బీజం' ఏర్పడుతుంది. అంటే ఈ భావనను - అక్షర సంకేతపరంగా - 'అ' 'ఉ' 'మ'లు కలిస్తే 'ఓం' ఏర్పడుతుంది అనే విధంగా అర్థం చేసుకోవాలి. ఈ 'ఓం' కారమే నాదం, సృష్టికి - మూలబీజం.

నాదం వ్యక్తమవడానికి సహకరించేదే శ్వాస. ఈ శ్వాసలోని ఉచ్ఛ్వాసం - 'సో' తోను, నిశ్వాసం 'హం' తోను సూచింపబడతాయి. ఈ 'సోహం' లో స్ + ఓ + హ్ + ం అనే నాలుగు భాగాలున్నాయి. వీటిలో స్ + హ్‌లు హల్లులు. 'ఓ', 'ం' లు అచ్చులు (Vowels). అచ్చులు ప్రాణాన్ని, హల్లులు దేహాన్ని సూచిస్తాయి. కాబట్టి, ఈ శ్వాసలోని 'సోహం'లో ప్రాణప్రదమైనది ఓ + ం = 'ఓం' గా తెలుసుకోవాలి.

స్వరపేటికల మధ్య నుండి నాదం బయటకు భౌతికంగా వ్యక్తమవాలంటే వాటి మధ్య రాపిడి తప్పదు. ఈ రాపిడి వల్ల పుట్టేదే అగ్ని బీజమైన 'రేఫం'. దీన్నే 'ఋషభం' అని గూడా అంటారు. దీన్నే ఆంగ్లంలో 'Trill' అంటారు. ఈ రేఫం సహకారంలేకపోతే నిశ్వాసాత్మకమైన వాక్కు బయటకు వ్యక్తం కాదు.

అయ్యవారి నేపథ్యంలో - శక్తికి, ద్రవ్యానికి మధ్య హోమం జరిగితే బీజాక్షర వాఙ్మయం ఆవిర్భావం చెందుతుంది. ఈ హోమంలో శక్తి - ద్రవ్యం గాను, ద్రవ్యం శక్తిగాను, ఉభయ మార్గాలలో మారుతూ వుంటాయి. రక్తసారాలైన శుక్రశోణితాల మధ్య ఈ హోమం జరిగితే భౌతిక సృష్టి(సంతానం) జరుగుతుంది. అంటే పై లోకాల్లో అగ్ని ఎలాంటిదో క్రింది లోకాల్లో 'రక్తం' అలాంటిదని గుర్తుంచుకోవాలి. పై లోకాల నుండి 'అగ్ని'కి సంబంధించిన 'దుర్గాదేవి' ఆవిర్భవిస్తే, క్రింది లోకాల్లో 'రక్తా' నికి సంబంధించిన 'రక్తబీజుడు' పుడతాడని చెప్పడం ఇందుకే ! (శరీరంలోని అగ్ని (ఉష్ణం), రక్తం (Haemoglobin Content) ఈ రెండూ గూడా అగ్నితత్త్వగ్రహాలైన రవి, కుజుల చేతనే సూచింపబడతాయని జ్యోతిశ్శాస్త్రంలో చెబుతారు).

శ్రీ విద్యలో అక్షర సంతతికి గూడా గోత్రాలున్నాయి.

ఉదా: అ, హ, క, ఖ, గ, ఘ – ఇవి కర్దమగోత్రోద్భవాలు.
స, శ, చ, ఛ, జ, ఝ – ఇవి ఆనంద గోత్రోద్భవాలు.
త, థ, ద, ధ, న – ఇవి చిక్లీత గ్రోత్రోద్భవాలు.

శ్రీ సూక్త ఫలశ్రుతిలో – 'ఆనందః కర్దమశ్చైవ చిక్లీత ఇతివిశ్రుతాః' అన్న వాక్యాన్ని ఇక్కడ సమన్వయపరచు కోవచ్చును.

ఇంకా ట, ఠ, డ, ఢ, ణ – ఇవి భార్గవ గోత్రోద్భవాలు. ఈ భార్గవ గోత్రులకు వుండే పెంకితనం వాటి ఉచ్చారణ లోనే తెలుస్తుంది! (అందరికీ సాధారణంగా వదనంలో రెండు కళ్ళుంటే ఈ భార్గవ గోత్రానికి చెందిన 'భృగుమహర్షి' కి అరికాల్లో కూడా కన్ను వుంటుంది). వీటితో ఉచ్చరింపబడే అమ్మవారిని 'భార్గవీ' అంటారు. వీటిని ఉచ్చరిస్తుంటే పుట్టినవెలుగు తెల్లగా ఉంటుంది. ఆవెలుగునే 'భర్గః' అంటారు. గాయత్రి మంత్రంలోని 'భర్గః' ఇదే లక్షణం కల వెలుగు.

మాతృకా వర్ణాల వివిధ రకాల కూర్పులతో అక్షరాలేర్పడితే – ఆ అక్షరాల అనుబంధంతో బీజాక్షరా లేర్పడతాయి.

ఉదా: హ్ + స్ + ఓం – హ్స్రామ్ (హయగ్రీవ బీజాక్షరం)
స్ + హ్ + ఓం – స్హౌమ్ (వీరభద్ర బీజాక్షరం)
హ్ + ర్ + ఈం – హ్రీం (శక్తిబీజం)
హ్ + అ + ర్ + ఇ – హరి
హ్ + అ + ర్ + అ – హర
(క్ష + ఓం – క్షౌమ్ – (నారసింహబీజాక్షరం)

'క్షౌమ్' అని ఉచ్చరిస్తున్నపుడు – ఇదేదో చాలా వేడిగా నిప్పులు చెరుగు తున్నట్లుంటుంది. దీనికి లక్ష్మీ అమ్మవారి బీజమయిన 'మ' కారాన్ని కూర్పు చేస్తే 'క్ష్మ్రౌమ్' అయి, కాస్త చల్లబడుతుంది. అప్పుడు చక్కగా చూడటానికి వీలుగా ఉంటుంది. కాబట్టే, దీన్ని 'సుదర్శన' బీజంగా సంకేతిస్తారు.

ఈ మంత్ర వాఙ్మయములో శైవ, వైష్ణవ వైషమ్యం వుండదు. వీరిలో ఒకరిపై ఉండే పెచ్చు మీరిన దురభిమానం చచ్చుతనానికే మచ్చుతునక ఔతుంది తప్ప

హెచ్చుతనానికి దారితీయదు. ఉచ్చరింపబడగా వచ్చిన అమ్మవారిలోంచే అన్ని అక్షరాలు, పదాలు, వాక్యాలు, మంత్రాలు వస్తాయి కాబట్టి - 'అన్ని మంత్రములను తన స్వరూపముగా గలది' అనే అర్థం ఈ నామానికి చెల్లుతుంది.

## 205. సర్వయంత్రాత్మికా

ఇది అమ్మవారి 205వ నామం. ఇది 6 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కారం చేసేటప్పుడు 'సర్వయంత్రాత్మికాయై నమః' అని చెప్పాలి.

సర్వ = అన్ని, యంత్ర = (దేవతాశరీర) యంత్రములకు, ఆత్మికా = స్వరూపముగా గలది.

'యమించు వానిని' - 'యంతా' అనీ, 'నియమించు వానిని' - 'నియంతా' అనీ, 'యమింపబడిన దానిని' - 'యంత్రము' అనీ అంటారు. యంత్ర పదానికి వున్న ఈ అర్థాన్ని బట్టి - శరీరం, శరీరంలో పనిచేసే అన్ని భాగాలు గూడా బయట పనిచేసే పరికరాలు, పనిముట్లతో బాటు యంత్రాల క్రిందకే వస్తాయి. బయట మనం సాధారణంగా చూసే యంత్రాలన్నీ గూడా గతిశక్తి, లేదా స్థితి శక్తులమీద ఆధారపడి పనిచేస్తాయి. యాంత్రికశక్తి, ఉష్ణశక్తి, విద్యుచ్ఛక్తి, ఆవిరిశక్తి, ధ్వనిశక్తి, వికిరణ శక్తి మొదలైన శక్తులన్నీ గూడా ఈ రెండు రకాల శక్తులలో ఏదో ఒక దాని క్రిందకు వస్తాయి. అమ్మవారు పరాశక్తి, శక్తి స్వరూపిణి (Presiding Deity of Power) గాబట్టి - శక్తి మీద ఆధారపడి పనిచేసే యంత్రాలన్నిటికీ అమ్మవారు ఆత్మలాంటిదే అవుతుంది.

ఇక మానవ శరీర నిర్మాణాన్ని పరిశీలిస్తే ఎన్నో యంత్ర వ్యూహాలు ద్యోతకమౌతాయి. శ్వాసప్రక్రియకు ఒక ముక్కు, రెండు ఊపిరితిత్తుల కూర్పు - ఒక యంత్రం. రక్త ప్రసరణకు అవసరమయే కర్ణికలు, జఠరికలు, సిరలు, ధమనులతో కూడిన గుండెకాయ - ఒక యంత్రం. పంచేంద్రియాల ద్వారా గ్రహించిన విషయాలను ఆకళింపు చేసుకొని, అందుకు తగిన విధంగా స్పందించేందుకు అవసరమయే నాడీమండలంతో సంధానింప బడే వెన్నుపాము మెదడుల కూర్పు ఒక యంత్రం. అలాగే జీర్ణప్రక్రియకు, శోషణ ప్రక్రియకు, విసర్జన ప్రక్రియకు సంబంధించిన మూత్రపిండాల యంత్రాలు ఎన్నో

మానవ శరీరంలో ఇమిడి వున్నాయి. ఇవన్నీ పరాశక్తి అయిన అమ్మవారి స్వరూపం క్రిందకే వస్తాయి.

పైన చెప్పిన యంత్రాలలోని వివిధ అంశాల అమరికను యంత్రంగా అర్థం చేసుకున్నట్లే – ఈ విశ్వ నిర్వహణా కర్యాక్రమానికి అవసరమయే యంత్రాలు గూడా ఎన్నో వుంటాయని గ్రహించాలి. ఇటువంటి యంత్రాలలోని వ్యూహాన్ని, అమరికను సంక్షిప్తం చేసి రేఖలు, చాపాలు, వృత్తాలు, అర్ధవృత్తాలు, కోణాలు, త్రిభుజాలు, చతుర్భుజాలు మొదలైన వాటితో ఉండే రేఖాగణితాత్మక చిత్రాలతో రూపొందింపబడేవే – వాస్తవానికి ప్రస్తుత నామంలో చెప్పబడిన యంత్రాలు. విశ్వ నిర్వహణకు దోహదపడే సకల దేవతలను ఇటువంటి యంత్రాలతో సమన్వయ పరచి ఆరాధించడం గూడా సంప్రదాయకంగా వస్తున్న ఆచారం. గణపతి యంత్రం, లక్ష్మీయంత్రం, మత్స్యయంత్రం మొదలైనవి అన్నీ ఇలాంటివే! వీటిలో కొన్నింటిని చక్రాలని గూడా అంటారు. 'శ్రీచక్రం' అలాంటి కోవలోకే వస్తుంది. విగ్రహం – దేవతకు స్థూలరూపమైతే, తత్సంబంధమైన యంత్రం – సూక్ష్మరూపమవుతుంది. ఉపాసకుని మనస్సులోపైన చెప్పిన తత్సంబంధ దేవతా యంత్ర వ్యూహం – కారణ రూప మవుతుంది. యంత్రం – తత్సంబంధిత దేవతాశక్తిని నియంత్రణ చేసి తనలో ఇముడ్చుకుంటుంది కాబట్టి – ఈ యంత్రారాధనకూడా తత్సంబంధిత దేవతారాధనకు సమానమే అవుతుంది.

వృక్ష విన్యాసం బీజంలో ఎలా ఇమిడి వుంటుందో – అలాగే, మనం చూసే ఆకృతులన్నీ ప్రారంభంలో 'బిందువు' లోనే ఇమిడి వుంటాయి. (శుక్రకణంలో రాబోయే జీవి రూపం ఇమిడి ఉన్నట్లు) కాబట్టి అన్ని యంత్రాలకు మూలం బిందువే! ఈ బిందువును అధిష్ఠించి వుండేదే పరాశక్తి, 'బైందవాసనా' అయిన అమ్మవారు. అందుకే అన్ని యంత్రాలకు అమ్మవారు ఆత్మవంటిదని ఈ నామంలో 'సర్వయంత్రాత్మికా' అని చెప్పబడింది.

'అన్ని యంత్రములకు ఆత్మ స్వరూపముగా గలది' – అని ఈ నామానికి అర్థం.

# ౨౦౬. సర్వతంత్రరూపా

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సర్వతంత్ర రూపాయైనమః' అని చెప్పాలి.

సర్వ = అన్ని, తంత్ర = తంత్రములను, రూపా = (తన) రూపముగా గలది.

''తంతు'' అనే సంస్కృత పదానికి సంబంధించిన తెలుగు పదమే 'తంతువు', 'తంతువు' అంటే సూత్రము లేదా 'దారము' అని అర్థం. 'తంత్రము' అంటే 'విధి విధానము' అని అర్థం. అంటే – ఏవైనా యజ్ఞ, యాగ, శుభాశుభ సంస్కారములను నిర్వహించేటప్పుడు అవలంబించే విధానం(The process of performing any ritual or any auspicious or inauspicious sacrament) అన్నమాట! దీన్నే తెలుగులో 'తంతు' అని గూడా అంటారు. నిర్వహించేటప్పుడు చెప్పే మంత్రాలతో పాటు ఈ 'తంతు' కూడా తప్పకుండా తెలియాలి. (చాలామంది గృహస్థులకు మంత్రాలు తెలియక పోవచ్చుగాని 'తంతు' తెలుస్తుంది. అ ందుచేత మంత్ర జ్ఞానం అంతగా లేని పురోహితులు తంతు విషయంలో తృప్తి పరచి, గృహస్థులను ఆకట్టుకుంటారు.)

దేవతకు– విగ్రహం స్థూల రూపమైతే, తత్సంబంధమైన యంత్రం – సూక్ష్మరూప మవుతుంది. య ంత్ర వ్యూహం కారణ రూపమవుతుంది. యంత్రవ్యూహానికి అవసరమయే సూక్ష్మ మైన 'తంతు సంపుటి' ని లేదా 'సూత్రాల కూర్పు' ను తంత్రము అంటారు. యంత్ర వ్యూహతంతువులు 'నాడులు' లాంటివి అయితే – యంత్రం లోని గీతలు నరాల్లాంటివి అవుతాయి. అంటే వాగ్రూపంలో తంత్రం వుంటే, రేఖా రూపంలో యంత్రం వుంటుందన్నమాట! 'వామకేశ్వర తంత్రము', 'నిత్యోత్సవ తంత్రము', శైవ, వైష్ణవ, శాక్త తంత్రాలన్నీ ఈ పరిధిలోకే వస్తాయి. 'తన్యతే విస్తారయుతే జ్ఞానం ఇతి తంత్రః' అని 'తంత్ర' పదానికి వ్యుత్పత్తి చెబుతారు. 'జ్ఞానాన్ని విస్తరింప చేసే శాస్త్రాలే – తంత్ర గ్రంథా' లని దీని అర్థం. అంటే, ఇవి ఇంద్రియ మనోబుద్ధుల సంస్కార వికాసాభివృద్ధికి ఉపయోగపడే విజ్ఞాన శాస్త్రాలన్నమాట ! 'చిదగ్నికుండసంభూతా' అయిన అమ్మవారు 'జ్ఞానవిగ్రహా' "జ్ఞానజ్ఞేయ స్వరూపిణీ', కాబట్టి, జ్ఞాన సంబంధమైన తంత్ర గ్రంథాలన్నీ అమ్మవారి రూపానికి చెందినవే ఔతాయి. (అసలు – అమ్మవారికి 'స్వతంత్రా' అనే నామం

కూడా వుంది. ఆ నామ వివరణ వచ్చినప్పుడు సౌందర్యలహరిలో ఆదిశంకరులు తెల్పిన 'చతుష్షష్ట్యాతంత్రైః.... స్వతంత్రేతేతంత్రం ....'' అన్న 31వ శ్లోకంలోని విషయాలను గూడా జోడించి వివరించడం జరుగుతుంది.)

ఈ తంత్రాలు 1, సాత్త్విక, 2, రాజసిక, 3, తామసిక మని మూడు విధాలుగా వుంటాయని భగవద్గీతలో –

'యజంతే సాత్త్వికా దేవాన్ యక్ష రక్షాంసి రాజసాః

ప్రేతాన్ భూత గణాంశ్చాన్యే యజంతే తామసాజనాః'.

అన్న శ్లోకం (17-4)లో చెప్పబడుతుంది. సాత్త్వికులు వేదోక్త దేవతలను, రాజసులు యక్షరాక్షసాదులను, తామసికులు భూతప్రేత పిశాచాదులను పూజిస్తారని పై శ్లోకార్థం. (సాత్త్వికాలను 'తంత్రా' లనీ, రాజసికాలను 'యామళాల' నీ, తామసాలను 'డామరాల' నీ అంటారు.)

'అన్ని తంత్రాలను తన రూపంగా గలది' అని ఈ నామానికి అర్థం.

## 207. మనోన్మనీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మనోన్మన్యైనమః' అని చెప్పాలి.

మన = మననస్థితిలో, ఉత్ = మేల్కొంచిన, మనీ = మననము చేయబడునట్టి ఆమె.

ఈ నామంలో ఉత్ + మనీ = ఉన్మనీ అవుతుంది గాని, మనస్ + ఉన్మనీ = మనోన్మనీ కాదు. సంధి కుదరదు. కాబట్టి, 'మనోన్మనీ' లో ముందు వున్నది 'మనస్' పదం కాదు. అది మననమునకు సంబంధించిన పదం. ఈ 'మననము' అన్న పదానికి మూల ధాతువు 'మ్నా'. ఈ ధాతువు నుండి వచ్చిన పదమే 'ఆమ్నాయము'. ఒక్క మారుగా ఒక్క స్థితిలో దర్శన మివ్వడాన్ని 'ఆమ్నాయము' అంటారు. ఆంగ్లంలో దీనిని 'Revelation' అంటారు. ఈ పదానికే 'శ్రుతి' అని అర్థం. 'స్మృతి' అని వేరే పదం వుంది. దాన్ని ఆంగ్లంలో 'Recollection' అంటారు. స్మృతి అంటే అంతకు పూర్వమే ఉన్న విషయం తిరిగి జ్ఞప్తికి రావడం.

అభిప్రాయాలతో నిండి వున్న మనస్సు దుమ్ము పట్టిన అద్దం లాంటిది. దుమ్ము పట్టిన అద్దం ఎంత వరకు ఉపయోగమో అభిప్రాయాలతో నిండి వున్నమనస్సు గూడా అంత వరకే ఉపయోగం (వంటింట్లో పొగ చూరిన బల్బుని చూపించి 'ఎలక్ట్రిక్ బల్బు' అంటే ఇదే – అని, అంతకు పూర్వం దాన్ని గురించి తెలియని వానికి చూపిస్తే – వాడు ఎలక్ట్రిక్ బల్బు అంటే అలాగే వుంటుందని అనుకుంటాడు. నిజానికి బల్బు అలా పొగచూరి వుండదు కదా!) అలా కాకుండా – ''స్వచ్ఛంగా –' అంటే, ఏ విధమైన ఇతర అభిప్రాయాలు, ఇతర ఆలోచనలు లేదా వృత్తులు లేకుండా వున్న చిత్తం(Pure Mind)తో మననం చేస్తున్నపుడు – మననం చేయబడేది ఒక్కసారి మెలకువ వచ్చినట్లు దర్శనమిస్తే – అలా మేల్కాంచి దర్శన మయేది' అని ఈ నామానికి అర్థం. సర్వవృత్తుల నుండి మరల్పబడిన మనస్సు ఆత్మయందు లయ మొందునప్పటి స్థితి 'మనోన్మనీ' ఔతుంది. శ్రుతులు – అంటే, వేదాలు అన్నీ ఋషులకు ఇలా దర్శన మైనవే ! అందుకే వాటిలో పొరపాట్లు వుండవు. దీనిని బట్టి ఈ నామం అమ్మవారు 'శ్రుతి స్వరూపిణీ' అనే రహస్యార్థాన్ని కూడా సూచిస్తుంది. అమ్మవారి స్తోత్రాలను ఈ 'మనోన్మనీ' స్థితిలో చెయ్యాలి. అంటే, నామాలను మనస్సునకు అర్పించడం కాదు, మనస్సును నామాల యందు అర్పణ చేయాలి అని అర్థం.

రుద్ర సూక్తంలో ఈ 'మనోన్మన' ప్రసక్తివస్తుంది. ఎక్కడ అంటే – 'వామదేవాయ, నమోజ్యేష్ఠాయ ... మనోన్మనాయనమః' అని శివుని పంచముఖ ధ్యానం చేసేటప్పుడు వస్తుంది. భ్రూమధ్యం నుండి శిరస్సు ఉపరితలం మీదుగా ( నుదురు మీదుగా పైకి) మధ్య పాపిట త్రోవలో పోతూ వుంటే మాడు వస్తుంది. దీన్నే 'బ్రహ్మరంధ్రము' అంటారు. ఈ బ్రహ్మరంధ్రానికి క్రిందుగా వుండే స్థానాన్ని 'మనోన్మనీ' అంటారు. దీన్ని రుద్రుని యొక్క వక్త్రము – అంటే, నోరు అని గూడా అంటారు. ప్రాపంచిక మనస్సు లయమయే చోటు ఇదే ! అందుకే దీన్ని మనోలయస్థానం అంటారు. ఇది శివశక్త్యైక్య స్థితిని సూచించే ప్రదేశం.

'మనోన్మనీ' అనేది ఒక రకమైన ముద్రాలక్షణానికి, స్థితికి గూడా పేరు. ఈ స్థితిని గూర్చి –

'నిరస్త విషయా సంగం సన్నిరుద్ధం మనోహృది
యదాయాత్యున్మనీ భావం తదా తత్పర మాంపదమ్'.

అని చెబుతారు. సంకల్ప వికల్పములు లేని – అనగా, ఏ విధమైన విషయ వాసనలు అంటని మనస్సు, మూసీమూయని రెప్పల కన్నులతో, గాలి పీల్చీ పీల్చని శ్వాస ప్రక్రియలో ఉన్న యోగసాధకుని స్థితిని 'మనోన్మనీ' ముద్రాస్థితి అంటారు.

మొత్తం మీద ఈ నామానికి ఈ క్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1) మననస్థితి రాగా దాని నుండి మేల్కాంచిన – మననము చేయబడునట్టి ఆమె (The thought content of the thinker whose mind is still and perfectly pure)

2) శ్రుతి స్వరూపిణి.

3) మనోన్మనీ ముద్రారూపిణి.

## 208. మాహేశ్వరీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించే టప్పుడు 'మహేశ్వర్యైనమః' అని చెప్పాలి.

మాహేశ్వరీ = మహేశ్వర సంబంధమైనది.

'మహేశ్వరు' డంటే త్రిమూర్తులలోని వాడు కాదు. మహేశ్వరుని గూర్చి 'నారాయణీయమ్'లో

''యోవేదాదౌ స్వరః ప్రోక్తో వేదాంతేచ ప్రతిష్ఠితః
తస్య ప్రకృతి లీనస్య యః పరః స మహేశ్వరః''

అని చెప్పబడుతుంది. ''వేదానికి మొదట్లోను చివర్లోను కూడా పఠింపబడేది ప్రణవం. ఈ ప్రణవం ప్రకృతిలో లీనమవుతుంది. ఇట్టి ప్రణవాని కంటె పరుడు, అతీతుడు అయినవానిని 'మహేశ్వరుడు అంటారు'' – అని దీని అర్థం.

ప్రకృతి మాయ అయితే ఆ మాయను కలవానిని మహేశ్వరుడంటారు. (మాయాంతు ప్రకృతిం వింద్యా, మాయినంతు మహేశ్వరః)

ప్రతి జీవి హృదయంలో వున్నవాడు ఈశ్వరుడు (ఆత్మ – Soul) అయితే –

ఇటువంటి ఆత్మలు వెనుక వున్న నేపథ్యం(Back Ground) మహేశ్వరుడు (పరమాత్మ – Spirit) అని అర్థం చేసుకోవాలి. దీనిని బట్టి 'అంతటా నిండి వున్న వాడు మహేశ్వరుడు' అని అర్థం చెప్పుకోవలసి వుంటుంది. (ఈశా వాస్యమిదం సర్వం – ఈశావాస్యోపనిషత్తు)

పైన ప్రతి పాదింపబడిన మహేశ్వరుని సంబంధమైనది మాహేశ్వరి. అంటే 'సర్వాంతర్యామి' అన్నా 'సర్వాంతర్యామిని' అన్నా అర్థంలో భేదం రానివారే ఆ యిద్దరూ!

'మహేశ్వర సంబంధమైనది'. అని ఈ నామానికి అర్థం.

## ౨౦౯. మహాదేవీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మహాదేవ్యై నమః' అని చెప్పాలి.

మహా = మహిమాన్వితమైన, దేవీ = ఆధిపత్యము కలది. 'దివ్' అంటే వెలుగు అని స్థూలమైన అర్థం. ఈ ''దివ్'' అనే విశేషణంలో – క్రీడ, విజిగీష, స్వప్న, మోద, మద, కాంతి, క్రాంతి, గతి మొదలైన లక్షణాలన్నీ, కలిసి వుంటాయి. 'దివ్' అనే ధాతువు నుండి ఏర్పడినదే 'దేవ' అనే పదం. 'దివ్'కు ఉండే లక్షణాలన్నీ ఉన్న లోకమే 'దేవలోకం'.

'దివ్' అంటే – 'దివ్యక్తము' లేదా 'వ్యక్తము చేయు' (To throw or to cast) అనే అర్థం కూడా వుంది. ఆకాశం తన నుండి పృథి వ్యాపస్తేజోవాయువులను వ్యక్తం చేస్తుంది కాబట్టి 'దివ్' అంటే ఆకాశం అనే అర్థం కూడా వస్తుంది.

'దివ్' నుండి ఉత్పత్తి అయినవే దివి, దేవ, దైవ, దివ్యమొదలైన పదాలు. ఈ లక్షణాలన్నీ 'మహా' అంటే గొప్పగా చెల్లునది కాబట్టి అమ్మవారు 'మహాదేవి'. మహాదేవి అనే సమాసాన్ని విశేషణ పూర్వపద కర్మధారయ సమాసం లాగా కాకుండా షష్ఠీ తత్పురుష సమాసం లాగా చెప్పుకుంటే 'మహా' అంటే, 'గొప్పతనానికి – దేవి' అంటే 'ఆధిపత్యం వహించునది' – అని గూడా అర్థం చెప్పుకోవచ్చును. అంటే – ఎక్కడ ఏ విధమైన గొప్పతనం, వైభవం వున్నా అది అమ్మవారికి సంబంధించినది' అని అర్థం చేసుకోవాలి.

గండకీ నదీతీరంలో ఉన్న చక్రతీర్థ దేవత 'మహాదేవి' గా ప్రసిద్ధురాలు.

మొత్తంమీద ఈ నామానికి ఈక్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1) మహిమాన్వితమైన అధిపత్యము కలది.

2) అన్నిటిని తన నుండి గొప్పగా వ్యక్తము చేయునది.

3) గొప్పతనానికి ఆధిపత్యము వహించునది.

4) కొలతలకు కుదరని అనగా అప్రమేయ ప్రమాణముగల శరీరము, వైభవము కలది.

5) గండకీ నదీతీర 'చక్రతీర్థ' దేవత.

## 210. మహాలక్ష్మీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మహాలక్ష్మ్యైనమః' అని చెప్పాలి.

మహా = గొప్పవైన, లక్ష్మీ = లక్ష్మలు గలది.

మహా 'లక్ష్మలు' అంటే గొప్ప లేదా విశిష్టమైన చిహ్నాలు (గుర్తులు, లక్షణాలు) గలది అమ్మవారు. జీవ వస్తు జాలానికి సంబంధించిన వ్యక్త, అవ్యక్త, ఆకార, నామ, రూపాది లక్షణాలే సృష్టికి సంబంధించిన మహా చిహ్నాలు లేదా పెద్ద లక్ష్మలు. ఈ విశిష్ట లక్ష్మలు గల సృష్టికి రూపంగా బట్టి అమ్మవారు మహాలక్ష్మి.

పరమేశ్వరుని వామాంకమును (ఎడమతొడను) అధిష్టించి వుండే శ్యామల అనే సర్వ మనోహరాంగిని ఐన మాహేశ్వరినే 'మహాలక్ష్మి' అని గూడ అంటారు.

ధైర్య, ధాన్య, విద్యాది సకల శ్రీలకు మూలకారణ సమన్వయ శక్తికాబట్టి ఈమెను 'మహాలక్ష్మి' అంటారు.

కొల్హాపుర (కరవీరపురం) క్షేత్రాధిష్ఠాన దేవత పేరు గూడా మహాలక్ష్మియే!

మొత్తం మీద ఈ నామానికి ఈక్రింది అర్థాలు చెప్పుకోవచ్చు.

1) గొప్పవైన, విశిష్టమైన లక్ష్మలు కలది.

2) పరమేశ్వరుని వామాంకమును అధిష్టించిన దేవి.

3) సకల శ్రీల మూలకారణ సమన్వయ శక్తిస్వరూపిణి.

4) కొల్హాపుర క్షేత్రాధిష్ఠాన దేవత.

## 211. మృడప్రియా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు మృడప్రియాయై నమః' అని చెప్పాలి.

మృడ = శివుని, ప్రియా = ప్రియురాలు

మృత్యువుకు పైన ఎరుగున్నవాడు కాబట్టి శివుణ్ణి 'మృడుడు' అంటారు. వాస్తవానికి మార్తాండుడన్నా, మృడుడన్నా ఒకే అర్థం. సృష్టిలోని ద్రవ్యత్వము ఆకారత్వము అనంతంలోకి లీనమవుతుండగా తాను మాత్రం అతీతుడుగా సాక్షీభూతుడై వుండే వానిని 'మృడు' డంటారు. (మృతమైన అండములు - అంటే, లీనమై పోవు భౌతికత్వమునకు సాక్షీభూతునిగా వుండువాడు మార్తాండుడు. ప్రతి రోజూ భౌతికతకు సంబంధించిన పగలు - రాత్రిలోనికి లీనమగునపుడు సాక్షిగా వుండు వాడు సూర్యుడు, కాబట్టి సూర్యునికి 'మార్తాండుడు' అనే పేరు చెల్లుతుంది). ఈ విశిష్ట లక్షణం వున్న మృడునికి ప్రియురాలు, అంటే - ఇష్టమైనది అని ఈ నామానికి అర్థం. (ఈ విశిష్టలక్షణం వున్న శివుణ్ణి పరబ్రహ్మతో గూడా సంకేతిస్తారు).

'మృడునికి అంటే శివునికి ప్రియురాలు' అని ఈ నామానికి అర్థం.

## 212. మహారూపా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మహారూపాయైనమః' అని చెప్పాలి.

మహా = గొప్పదైన, లేదా మహిమాన్వితమైన, రూపా = రూపము గలది.

(ఈ మహారూపా నామం నుండి 'మహాయోగీశ్వరేశ్వరీ' అనే నామం దాకా వుండే నామాల చేత దుర్గాసప్తశతీ మాలా మహామంత్ర విశేషాలు చెప్పబడతాయి.)

'ఉన్మేషనిమిషోత్పన్న విపన్న భువనావళిః' అని అమ్మవారికి ఒక నామం ఈ లలితాస్తోత్రంలోనే వుంటుంది. అమ్మ కనురెప్పలు తెరిస్తే సకల భువనాలు సృష్టింపబడతాయి. కనురెప్పలు మూస్తే అవన్నీలయమై పోతాయి. ఈ విధమైన సృష్టి ప్రళయాలు రెండూ తన యందు చెల్లే రూపం కాబట్టి అమ్మవారిది 'మహారూపం' అవుతుంది. ఇతరులందరికీ ఒకే సమయంలో ఏదో ఒక రూపమే చెల్లుతుంది. విశిష్టరూపం గల ఈ అమ్మవారిని 'మహారూపా' అన్నారు.

'మహా' అంటే 'పరబ్రహ్మ' అని అర్థం – చెప్పుకుంటే – అమ్మవారు 'పరబ్రహ్మ స్వరూపిణి' అని గూడా అర్థం చెప్పుకోవచ్చును.

1) సృష్టి ప్రళయాలు రెండూ తనయందు చెల్లురూపము గలది.

2) పరబ్రహ్మ స్వరూపిణి – అని ఈ నామానికి అర్థాలు.

## 213. మహాపూజ్యా

నాలుగు అక్షరాల నామం. 'మహాపూజ్యాయై నమః' అని అమ్మవారికి నమస్కరించాలి.

మహా = గొప్పగా, పూజ్య = పూజింపబడునది.

మనలో దైవీ గుణాలను పూరింప చేసుకోవడం కోసం చేసేదే పూజ. ఒక పరిమితిలో గల దాన్ని ఆరాధిస్తే – అది మామూలు పూజ ఔతుంది. ఈ మొత్తాన్నే ఆరాధిస్తే అది 'మహాపూజ' ఔతుంది. అనుక్షణం మనం నిర్వర్తించే పనులన్నీ – ఈ మొత్తంలో వున్న వారితో సమన్వయ పరచుకుంటూ సహజీవనం చెయ్యడం కోసమే కాబట్టి – అలా చెయ్యడం సృష్టినిర్వహణకు సహకరించడమే కాబట్టి – అలా చేసిన పనులన్నీ ఈ సృష్టిమొత్తానికి అధిష్ఠాత్రి అయిన అమ్మవారికి పూజగానే చెల్లుతాయి. మనం ఏం చేసినా ఆవిడకు పూజ అవుతుంది కాని, మనకది పూజకాదు అని గ్రహించాలి. ఈ విధమైన పూజను అందుకొనిన జగజ్జనని 'మహాపూజ్యా' ఔతుంది. (ఈ మహాపూజను గురించే సౌందర్యలహరిలో ఆదిశంకరులు ''జపోజల్పః ... ముద్రావిరచనా...' అన్న శ్లోకంలో చెబుతారు.)

''బ్రహ్మోపేంద్ర మహేంద్రాది దేవసంస్తుతవైభవా'' అన్నది అమ్మవారి నామాల్లో ఒకటి. త్రిమూర్త్యాది మహనీయులచే పూజింపబడే అమ్మవారిని అందుకే 'మహాపూజ్యా' అని అన్నారు.

మొత్తం మీద ఈనామానికి ఈక్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1) మహనీయమైన పూజను అందుకొనునది.

2) మహనీయులచే పూజింపబడునది.

## 214. మహాపాతక నాశినీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మహాపాతక నాశిన్యై నమః' అని చెప్పాలి.

మహాపాతక = ఘోరమైన పాతకములను, నాశినీ = నాశనము చేయునది.

సాధారణంగా పాపాలంటే అందరికీ తెలుస్తుంది కానీ, పాతకాలంటే తెలియకపోవచ్చు.

మంచు గడ్డని ఎఱ్ఱని ద్రవంలో ముంచితే ఆ మంచుగడ్డ ఎఱ్ఱగా అవుతుంది గాని దానిని మళ్ళీ స్వచ్ఛమైన నీళ్ళలో ముంచితే ఆ ఎఱుపురంగు తేలికగానే పోయి మామూలు మంచు గడ్డ అయిపోతుంది. కాని, ఎఱ్ఱని నీళ్ళతోనే తయారయిన మంచుగడ్డను స్వచ్ఛమైన నీళ్ళలో ముంచినా ఆ ఎఱుపు దనం పోదు. ఈ రెండు రకాల ప్రక్రియలలో మొదటి దాని లాంటిది – 'పాపం'. రెండో దాని లాంటిది – 'పాతకం'.

మొదటి ప్రక్రియలో మంచు ఎఱ్ఱగా కనబడటానికి బాహ్యమైన ఎఱ్ఱని ద్రవం కారణం. అలాగే బాహ్యప్రేరణ వల్ల జరిగేదే పాపం. రెండవ ప్రక్రియలో అసలు మంచుగడ్డ దేనితో తయారవుతుందో ఆనీళ్ళే ఎఱ్ఱనివి. అంటే మంచుగడ్డ ఎఱ్ఱదనానికి దాని అంతర్లక్షణమే కారణం. అలాగే – దుస్స్వభావ, దుష్ప్రవర్తన, దురాలోచనలతో ముడిపడే తన వ్యక్తిత్వమే కారణంగా కలది పాతకమౌతుంది. అంటే ఇవి మన ప్రవర్తనతోనే కలసి వుంటాయన్న మాట! జన్మలతర బడి సమర్పణ భావము, సజ్జన సాంగత్యము సద్గోష్ఠి

మొదలైన వాటి వల్ల మాత్రమే ఎప్పటికో అప్పటికి గాని పాతక లక్షణం పోయి పరిష్కారం కావు. నిజాయితీ కల భక్తితో కూడా దీనిని పోగొట్టుకోవచ్చును.

పాతకాలపైన 'మహాపాతకా' లని ఉంటాయి. హత్యలు, బ్రహ్మహత్యలు, బలాత్కారాలు, అత్యాచారాలు చెయ్యడమే కాక – 'అవి ఎందుకు చెయ్యకూడదు, చేస్తే తప్పేమిటి ? అనే సందేహాలు, ఆలోచనలు రావడం – మహాపాతక బుద్ధిని సూచిస్తుంది. అమ్మవారిని ఆరాధిస్తే – ఇలాంటి మన దౌర్భాగ్య బుద్ధిని మార్చి సద్బుద్ధిని కలుగచేసి, చెడ్డ పనులు మనం చెయ్యకుండాను, మంచి పనులే చేసేలాగాను – చేసి మన పాతకాలను పోగొడుతుంది ! అంతే గాని మనం వరుస పెట్టి అడ్డమైన చెడ్డ పనులు హత్యలు, అత్యాచారాలుచేసి – అమ్మవారిని పూజిస్తే – ఆవిడ వాటినన్నిటిని సర్దుబాటు చేసి, మనలను రక్షిస్తుంది అని కాదు.

'ఘోరమైన పాతకాల నుండి మనలను విముక్తి చేయకలది' అని ఈ నామానికి అర్థం.

## 215. మహామాయా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మహామాయాయై నమః' అని చెప్పాలి.

మహా = మహిమాన్వితమైన, –లేదా సాధారణ ఊహకు అందని, మాయా = మాయా లక్షణం కలది.

భ్రాంతిలో పడవేసి, వివేకము పనిచేయనీకుండా చేసేది మాయాలక్షణం. మన మెఱుగున్న ఇంద్రజాల, మహేంద్ర జాలాలు, కనికట్టు మొదలైనవన్నీ ఎలాంటివో మాయ కూడా అలాంటిదే !

వాస్తవానికి ఏమీ లేకపోయినా కలలో నానా హైరానపడి పోవడం 'మాయ' అయితే – మెలకువ వచ్చిన తరువాత – 'కలలో చూసింది అవాస్తమని తెలుసుకోడం' ఆ మాయ తొలగడం ఔతుంది. అలాగే – మోక్షము వచ్చిన తరువాత అంతకు పూర్వం స్థితిని గూర్చి నిజమైన అర్థం తెలియడం – ఆ మహామాయ తొలగడం అవుతుంది, అంతవరకూ

మన మీద ప్రభావం చూపే ఈ విశిష్ట లక్షణాన్ని 'మహామాయ' అంటారు. ఈ లక్షణం గల అమ్మవారిని 'మహామాయా' అంటారు. ఈ మహామాయా ప్రభావం నుండి త్రిమూర్తులు గూడా తప్పించుకోలేరు. అందుకే భగవద్గీతలో 'మమమాయా దురత్యయా' అన్నాడు గీతాచార్యుడు. (సృష్టిస్థితిలయాత్మకమైన ఈ విశ్వ ప్రణాళికా నిర్వహణకు ఈ మాయా లక్షణం ఎంతో అవసరం అని విజ్ఞత ఉన్న వారికి తెలుస్తుంది.

'మహిమాన్వితమైన మాయాలక్షణం కలది' అని ఈ నామానికి అర్థం.

## 216. మహాసత్త్వా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మహాసత్త్వాయై నమః' అని నమస్కరించాలి.

మహా = మహిమాన్వితమైన, సత్త్వా = ఉనికి గలది.

''సత్'' అంటే ఉండడం. ఒక వస్తువుకో, ఒక వ్యక్తికో, ఒక ప్రదేశమునకో పరిమితము గాక, సమస్త విశ్వము నిండా నిండి ఉండగల లక్షణాన్ని 'మహాసత్త్వం' అనాలి. (The one Being in all beings) ఈ గొప్పలక్షణం ఒక్క అమ్మవారికే చెల్లుతుంది. ఈ లక్షణం కలవారే జగత్తును సృష్టించి, పోషించి, లయం చేసుకునే - నిర్విరామ జగద్వ్యాపార నిర్వహణను చేయగలరు. 'సత్త్వము' అంటే బలమనే అర్థంలో 'మహాబలసమన్వితురాలు' అని గూడా అర్థం చెప్పుకోవచ్చును.

'మహిమాన్వితమైన సత్త్వము గలది' అని ఈ నామానికి అర్థం.

## 217. మహాశక్తిః

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మహాశక్త్యై నమః' అని చెప్పాలి.

మహా = అనంతమైన, శక్తిః = శక్తి సామర్థ్యములు గలది.

'శక్తి' ఆహారం తీసుకుంటేవస్తుందనుకోడం అంత సత్యంకాదు. జబ్బుపడి లేచిన

వానికి వెంటనే ఆహారం పెడితే అదిశక్తి నివ్వక పోగా తేడా చేస్తుందనే విషయం ఈ సత్యాన్ని రూఢిపరుస్తుంది. పోనీ, శ్వాసవల్ల శక్తి వస్తుందా అంటే అదీ పొరపాటే! శక్తి వల్ల శ్వాస నడుస్తుంది కాని శ్వాస వల్ల శక్తి రాదు. మరైతే ఈ శక్తి ఎక్కడ నుండి వస్తుంది ? అంటే – శక్తి ఎక్కడ నుండీ రాదు – ఉంటుంది. నీరు ఎలా అయితే చక్రభ్రమణ మార్గంలో (Cyclic Process)లో ఉంటుందో (నీరు ఒక చోట పుట్టడం ఒక చోట లీనమవడం కేవలం భ్రాంతి అని తెలుసుకోవాలి. జలాశయాల్లో నీరు వేసవిలో సూర్యునిచే పైకి పీల్చబడి – వర్షాకాలంలో మబ్బుల ద్వారా మళ్ళీ క్రిందకు వర్షింపబడుతుంది. దీనికి మొదలెక్కడ? చివరెక్కడ ? అంటే ఏమి చెబుతాము? నీరు అలా వస్తూపోతున్నట్లు కనిపించడం వల్ల నీరు కూడా జనన మరణాల ప్రక్రియకు లోబడి ఉన్నట్లు మనకు అనిపిస్తుంది కాని, వాస్తవానికి అది నిజం కాదు.) అలాగే మహాశక్తి వుంటుంది. అవసరమైనపుడు తదనుగుణమైన ప్రయత్నం జరిగితే ఆ ప్రయత్నం మేరకు నేపథ్యంలో ఉన్న మహాశక్తి నుండి అది వ్యక్తమవుతుంది. ఈ 'మహాశక్తి'నే సిద్ధపురుషులైన మాస్టర్ C.V.V. గారు 'The influx of Plenty of Prana' అన్నారు. కాబట్టి అన్ని రకాల భౌతిక, మానసిక, ఆధ్యాత్మిక శక్తులన్నిటికీ మూలశక్తి ('యాదేవీ సర్వభూతేషు శక్తిరూపేణ శోభితా') అమ్మవారు.

'అనంతమైన శక్తి సామర్థ్యములు గలది' అని ఈ నామానికి అర్థం.

## 218. మహారతిః

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మహారత్యై నమః' అని చెప్పాలి.

మహా = గొప్ప, రతి = ఆసక్తి.

'రతి' అంటే ఆసక్తి. సాధారణంగా క్రమబద్ధమైన వాటి యందు 'రతి' కుదరదు కాని, అక్రమబద్ధమైన వాటియందు రతి ఏర్పడుతుంది. ఇద్దరు కలసినపుడు మూడోవాడి గురించి చెడ్డగా చెప్పుకోడానికి ఆసక్తి ఎక్కువ వుంటుంది. అంటే దీనికి కావలసిందల్లా రెండు పరికరాలు 1, నోరు 2, చెవి. అంటే – చెడు చెప్పగలిగే నోరు, దాన్ని వినగలిగే చెవి ప్రక్క ప్రక్కన చేరితే చాలన్నమాట! ఇది అభ్యాసవశం చేత దాని యందెలాగో అలా

పనిచేస్తుంది గూడా ! దొంగతనం మానినా అభ్యాసవశం చేత దొంగ - రాత్రి - అయిందంటే భార్య నగల్ని కూడా దొంగిలించడానికి ప్రయత్నించవచ్చు. (Habit is a force a practice that is hard to giveup).

ఒక్కొక్కప్పుడు ఈ 'రతి' - స్వార్థపూరితంగా భార్యాభర్తల మధ్య స్నేహితుల మధ్య, సహోదరుల మధ్య మాత్రమే 'ప్రేమ' అనే పేరుతో పరిమితమై వుంటుంది కూడా! ఇది సాధారణ స్థాయిలో, ప్రాపంచిక స్థాయిలో వుండే 'రతి లక్షణం'.

అమ్మవారికి ఉండేది 'మహారతి'. ఇక్కడ 'రతి' అంటే విశేషమైన విశిష్టమైన ఆసక్తి. తన సృష్టి మీద సృష్టిలోని సమస్త వస్తు జీవజాలం మీద వుండే విశేషమైన అనురాగాన్నే 'మహారతి' గా అర్థం చేసుకోవాలి. ఇద్దరి మధ్యే పరిమితమైన రతి - వ్యష్టిపరమైన రతి ఔతుంది. యావత్ప్రపంచపరమైన 'రతి' అయితే 'సమష్టిరతి' ఔతుంది. అట్టి మహిమాన్వితమైన రతి కలిగినదే అమ్మవారు. ఈ మహారతి ఉన్న సాధకులకు - సాధన అక్కడ జరుగుతున్నది నచ్చే స్థితి వస్తుంది. అంటే 'నప్పించుకోడం' కూడా కాదు, అంతా 'నచ్చడమే!' అంతకు ముందు వరకు తనకు నచ్చేది అక్కడ ఏమన్నా ఉందేమో అని చూడటం జరుగుతుంది. అమ్మవారికి మాత్రం ఎప్పుడూ ఈ ప్రపంచంలో జరుగుతూ వుండేదల్లా నచ్చుత్తుంది. ఎందుకంటే - ఈ సృష్టి ఆవిడ క్రీడ కాబట్టి! ఈ లక్షణమే మహారతి. దీన్నే యోగ సాధకులకు ఇస్తుంది అమ్మవారు.

రతీదేవి భర్త అయిన మన్మథుడు ఇతరులకు కనబడక పోయినా రతిదేవికి మాత్రం కనబడతాడు. ఇది రతీదేవి లక్షణం. అయ్యవారు అందరికీ సూటిగా ప్రత్యక్షంగా కనబడడు. అమ్మవారి ద్వారానే అది సాధ్యం. అంటే - ప్రకృతి మాత ద్వారానే ఇతరులకు తెలుస్తాడు. (మామూలుగా కూడా తల్లి ద్వారానే గదా తండ్రి తెలిసేది) దీన్నే ఆంగ్లంలో 'Through Proper Channel' అంటారు. అది శంకరులు కూడా సౌందర్యలహరిలో 'శివఃశక్త్యాయుక్తో....' అన్న ప్రథమ శ్లోకంలో ఈ విషయాన్ని నర్మ గర్భంగా చెప్పారు అంటే, 'తన ద్వారానే తన భర్త ఇతరులకు తెలియబడే విశిష్ట లక్షణం కల రతీదేవి' ఈ అమ్మవారన్నమాట ! కాబట్టి అమ్మవారు 'మహారతి' ఔతుంది. (తనకు మాత్రమే తన భర్త కనబడే లక్షణం కలది రతీదేవి).

మొత్తం మీద ఈ నామానికి ఈ క్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1) సృష్టి పరమగు విశిష్టమైన సమష్టి అనురాగము కలది.

2) మన్మథుని భార్య రతీదేవి లాంటిది కాకుండా తన ద్వారానే తన భర్త ఇతరులకు తెలియబడే విశిష్ట లక్షణం కల రతీదేవి.

3) ప్రపంచంలో జరిగేవన్నీ నచ్చే స్థితిని యోగ సాధకులకు ఇచ్చునది.

## 219. మహాభోగా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కారం చేసేటప్పుడు 'మహాభోగాయైనమః' అని చెప్పాలి.

మహా = గొప్ప, భోగా = భోగమునుపొందునది లేదా అనుభవించునది.

అనుభవింపబడే దాన్ని భోగం అంటారు. 'రతి' అంటే 'ఆసక్తి' లేదా 'కోరిక' ఉన్నపుడు సాధారణంగా భోగాన్ని అనుభవిస్తారు. అంటే కోరుకున్నది లభించినపుడు మాత్రమే ఈ భోగం వారికుంటుంది. ఇది 'రతి' వున్న వారి లక్షణం. కాని, ఇంతకు ముందు నామంలో చెప్పిన 'మహారతి' ఏర్పడిన సాధకులు రోజులో 24 గంటలూ భోగాన్ని అనుభవిస్తారు. 24 గంటలలో భోగం కానిది ఏదీ వారి కుండదు. ఏది లభ్యమైతే, ఏది తటస్థపడితే దాన్ని భోగంగానే ఆనందిస్తారు. అలా అని సరిపెట్టుకోడం కాదు. అంటే – ''ఓగు'' కూడా కాదు అంతా 'బాగే' వీరికి ! ఇటువంటి మహా భోగస్థితిలో ఉండే వారి యందు – 'అయ్యవారితో కలిసి వుండే స్థితి అమ్మవారి కుంటుంది'. అంటే వారి చిత్తం పూర్తిగా ఆత్మలో లీనమై వుంటుందన్నమాట! అందుకే అంత నిరంతరా నందానుభూతిలో వీరుంటారు.

'గృహశయ్యావస్త్రాది అష్టభోగాల్ని ఇచ్చునది' అనే అర్థం కాకుండా యోగసాధకులుపైన చెప్పిన అర్థాన్ని గ్రహించాలి. ఈ విషయం సౌందర్యలహరిలోని 'జపోజల్పః....' అనే 27వ శ్లోకంలోను, 'స్మరం యోనిం లక్ష్మీం ...' అనే 33వ శ్లోకంలోను, 'తవాజ్ఞాచక్రస్థం ...' అన్న 36 శ్లోకంలోను ఆది శంకరులు కొంత ప్రస్తావిస్తారు.

'భోగము' అంటే 'పాము' అనే అర్థం కూడా వుంది. 'మహాభోగం' అనడంలోనే

ఇది 'సాధారణ మైన పాము' కాకుండా కొంత 'విశేషలక్షణం' కల పాము అని స్ఫురణకు రావాలి. మనవెన్నును (Spine) కూడా 'వెన్నుపాము' అంటాము. ఈ వెన్ను పాములోనే సుషుమ్నా నాడి వుంటుంది. దాని ద్వారానే కుండలినీ శక్తి అనే అమ్మవారు ఊర్ధ్వగతిని పట్టి, షట్చక్రభేదనం చేసుకుంటూ, చివరకు సహస్రారం చేరి, అక్కడున్న శివునితో ఐక్యం చెంది యోగసాధకునికి ముక్తిని ప్రసాదిస్తుంది. ఇది వ్యష్టి కుండలినికి సంబంధించినది.

భూమిని మోస్తున్న 'ఆదిశేషువు'ను భూమి మీద వున్న వారిక సామూహిక లేదా సమష్టి కుండలినికి సంబంధించిన 'పెద్దపాము'గా సూచిస్తారు. ఈ పెద్ద పామునే 'మహాభోగము' అంటారు. (కృష్ణాజిల్లాలో కైకలూరు తాలూకా కలిదిండి గ్రామ సమీపంలో 'పాతాళ భోగేశ్వరస్వామి' అనే ప్రసిద్ధి చెందిన దేవాలయం కూడా వుంది. దేవాలయం ప్రక్కన వుండే చెరువు ఒడ్డున నిలబడి 'హర ! హరా ! అంటే – 'బుడబుడా' అంటూ బుడగలు చెరువులో వస్తాయి.) కాబట్టి, ఈ 'మహాభోగా' నామం అటువంటి సామూహిక కుండలినీ శక్తిని సూచిస్తుందని గూడా అనుకోవచ్చును.

మొత్తం మీద ఈ నామానికి ఈక్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1) చిత్తం పూర్తిగా ఆత్మలో లీనమై ఉన్న స్థితిలోని సాధకులకు నిరంతరానందానుభూతిని (మహాభోగాన్ని) సిద్ధింప చేయునది.

2) భూవాసుల సామూహిక లేదా సమష్టి కుండలినికి సంబంధించిన ఆదిశేషువుతో సమన్వయము కలిగినది.

## ౨౨౦. మహైశ్వర్యా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటపుడు, 'మహైశ్వర్యాయైనమః' అని చెప్పాలి.

మహా = విలువ కట్టలేని, ఐశ్వర్య = ఐశ్వర్యమును ఇచ్చునది.

'ఐశ్వర్యం' అనంగానే మనకు బంగారం, నోట్లకట్టలు, గుర్తుకు వస్తాయి. ప్రయాణ మధ్యంలో, ప్రమాదాల వలన అంతరాయం జరిగి, ఎటూ ఏమి లేని చోట దిగబడిపోతే ఈ బంగారం, నోట్ల కట్టలు ఎందుకూ పనికి రావని తెలుస్తుంది. ఇవి కాదు ఐశ్వర్యం

అంటే అని తెలుస్తుంది. ఆ సమయంలో అవసరమయే వాటి ముందు వీటి విలువ ఎంత తక్కువో బయట పడుతుంది. 'వీటి ఉపయోగం ద్వారా వేటిని మనం పొందాలని చూస్తామో - అది నిజమైన ఐశ్వర్యం'. ఆ స్థితి యందు మనస్సు నిరంతరంగా వుంటే 'మహైశ్వర్యం'లో వున్నట్లు. అదే మోక్షానందస్థితి కూడా!

స్థూల కార్యాన్ని (Effect) సూచించే దేహానికి, సూక్ష్మ కారణాన్ని (Cause) సూచించే ఆత్మకు, అంటే – పదార్థానికి (Matter) ఆత్మకు (Soul) దాంపత్యం కుదిరితే– మనలోని 'ఈశ్వరునికి – ఈశ్వరికి' దాంపత్యం కుదిరినట్లే ఔతుంది. ఆ స్థితిలో అమ్మవారు 'ఐశ్వర్యం' అవుతుంది. కుదరకపోతే 'మాయ' అవుతుంది – అంతే తేడా! ఈ ఐశ్వర్యమే 'ముక్తి' అనే మహైశ్వర్యం.

'దాస, భృత్యసుతాది అష్టైశ్వర్యాలన్నిటినీ ఇచ్చునది అనే అర్థం గాక సాధకులు పైన చెప్పిన అర్థాన్ని గ్రహించాలి.

మొత్తంమీద ఈ నామానికి ఈక్రింది అర్థాలు చెప్పవచ్చును.

1) వేటిని ఐశ్వర్యం అనుకున్నప్పటికీ – వాటి ద్వారా ఏ శాశ్వతానందాన్ని అనుభవించాలనుకుంటామో – అట్టి మహైశ్వర్యాన్ని ఇచ్చునది.

2) 'ముక్తి' అనే మహైశ్వర్యాన్ని ఇచ్చునది.

3) మహేశ్వరునితో సంబంధమును చేకూర్చునది.

## 221. మహావీర్యా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు 'మహావీర్యాయైనమః' అని చెప్పాలి.

మహా = అత్యంత శక్తివంతమైన, వీర్యా = వీర్యత్వము కలది. వీర్యం అనే పదానికి – వీరత్వముతో పాటు, శుక్రము, ప్రభావము, తేజస్సు, సామర్థ్యము అనే అర్థాలు కూడా సూచింపబడతాయి.

పరిమితమైన వాటికి సంబంధించిన కారణం వీర్యమైతే, విశ్వమహత్తు ఉత్పత్తికి సంబంధించిన కారణాన్ని 'మహావీర్యం' అనాలి.

చిన్న చిన్న విషయాలకై శక్తిని ప్రదర్శిస్తే – అది అల్పవీర్యానికి చిహ్నం. చిన్న చిన్న వాటిని పొందాలనుకునే కోరిక – మన దరిద్రంతో కూడి వున్న ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తులను సూచిస్తుంది. మన దరిద్రంతో కలసి వుండే – 1) ఇచ్ఛాశక్తి – శక్తిహీనమైన ఇచ్ఛేఔతుంది. 2) జ్ఞానం – శక్తిహీనమైన జ్ఞానమే ఔతుంది, 3) క్రియ – శక్తిహీనమైన క్రియేఔతుంది.

మన దరిద్రంతో కలసి వుండని ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తులు మాత్రమే 'మహావీర్యాన్ని' సూచిస్తాయి. ఈ లక్షణం గల అమ్మవారిని 'మహావీర్యా' అనే నామంతో పిలుస్తారు.

'వీర్యం' అంటే 'శుక్రం'. సప్తధాతువుల్లో శుక్రం చిట్టచివరిది. అత్యంత విలువైనది. దీని తర్వాత కూడా ధాతువులుంటాయి. కాని, అవి భౌతికమైనవి కావు. ఓజస్సు, సహస్సు, భ్రాజస్సు, తేజస్సు మొదలైనవి. సంధ్యావందనంలో 'ఓం ఓజోఽసి, సహోఽసి, భ్రాజోఽసి, దేవానాం ధామనామాసి, విశ్వమసి విశ్వాయుః, సర్వమసి సర్వాయుః, అభి భూః ఓం'' అనే మంత్రంలో వచ్చేవి ఇవే! వీటిలో చిట్టచివరిది ''ఓం''. యోగసాధనలో లక్ష్యాన్ని సాధించినపుడు వీర్యం అంటే శుక్రం పొందే అత్యంత సూక్ష్మ మైన ధాతువు 'ఓం' అన్నమాట! ఈ స్థితికి సాధకుని తీసుకువెళ్ళే అమ్మవారిని 'మహావీర్యా' అని చెప్పకోవచ్చును.

1) అత్యంత శక్తి సామర్థ్యాలు గల వీర్యత్వం గలది.

2) యోగసాధనలో సాధకుని యొక్క శుక్ర ధాతువును అత్యంత సూక్ష్మ ధాతువుల లక్ష్య మైన 'ఓం' గా మార్చునది.

అని ఈ నామానికి అర్థాలు చెప్పుకోవచ్చును.

## 222. మహాబలా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మహాబలాయైనమః'' అని చెప్పాలి.

మహా = అనంతమైన, బల = బలసంపన్నురాలు.

చిన్న చిన్న విషయాలకై శక్తిని ప్రదర్శిస్తే – అది అల్పవీర్యానికి చిహ్నం. చిన్న చిన్న వాటిని పొందాలనుకునే కోరిక – మన దరిద్రంతో కూడి వున్న ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తులను సూచిస్తుంది. మన దరిద్రంతో కలసి వుండే – 1) ఇచ్ఛాశక్తి – శక్తిహీనమైన ఇచ్ఛేఔతుంది. 2) జ్ఞానం – శక్తిహీనమైన జ్ఞానమే ఔతుంది, 3) క్రియ – శక్తిహీనమైన క్రియేఔతుంది.

మన దరిద్రంతో కలసి వుండని ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తులు మాత్రమే 'మహావీర్యాన్ని' సూచిస్తాయి. ఈ లక్షణం గల అమ్మవారిని 'మహావీర్యా' అనే నామంతో పిలుస్తారు.

'వీర్యం' అంటే 'శుక్రం'. సప్తధాతువుల్లో శుక్రం చిట్టచివరిది. అత్యంత విలువైనది. దీని తర్వాత కూడా ధాతువులుంటాయి. కాని, అవి భౌతికమైనవి కావు. ఓజస్సు, సహస్సు, భ్రాజస్సు, తేజస్సు మొదలైనవి. సంధ్యావందనంలో 'ఓం ఓజోఽసి, సహోఽసి, భ్రాజోఽసి, దేవానాం ధామనామాసి, విశ్వమసి విశ్వాయుః, సర్వమసి సర్వాయుః, అభి భూః ఓం'' అనే మంత్రంలో వచ్చేవి ఇవే! వీటిలో చిట్టచివరిది ''ఓం''. యోగసాధనలో లక్ష్యాన్ని సాధించినపుడు వీర్యం అంటే శుక్రం పొందే అత్యంత సూక్ష్మ మైన ధాతువు 'ఓం' అన్నమాట! ఈ స్థితికి సాధకుని తీసుకువెళ్ళే అమ్మవారిని 'మహావీర్యా' అని చెప్పకోవచ్చును.

1) అత్యంత శక్తి సామర్థ్యాలు గల వీర్యత్వం గలది.

2) యోగసాధనలో సాధకుని యొక్క శుక్ర ధాతువును అత్యంత సూక్ష్మ ధాతువుల లక్ష్య మైన 'ఓం' గా మార్చునది.

అని ఈ నామానికి అర్థాలు చెప్పుకోవచ్చును.

## 222. మహాబలా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మహాబలాయైనమః'' అని చెప్పాలి.

మహా = అనంతమైన, బల = బలసంపన్నురాలు.

నిర్ణయిస్తుంది. అంటే మనస్సు న్యాయవాది లాంటిదయితే, బుద్ధి న్యాయమూర్తి (జడ్జి) లాంటిదన్నమాట ! సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి లాంటిది అమ్మవారు. ఈ స్థాయిలోని బుద్ధిని మహా బుద్ధి అంటారు.

అన్ని రకాల శాస్త్రజ్ఞుల బుద్ధులలో పనిచేసేది, బుద్ధులను ప్రేరేపించేది అమ్మవారే కాబట్టి, అమ్మవారు 'మహాబుద్ధి' అవుతుంది. అంటే – 'దేన్ని తెలుసుకుంటే సర్వమూ తెలుస్తుందో దాన్ని మహాబుద్ధి' అంటారన్నమాట!

1. 'అందరి బుద్ధుల ప్రేరణశక్తి. (గాయత్రి)

2. 'అద్వితీయమైన బుద్ధిసంపద కలిగినది' అని ఈ నామానికి అర్థాలు చెప్పుకోవచ్చును.

## 224. మహాసిద్ధిః

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మహాసిద్ధ్యైనమః' అని చెప్పాలి.

మహాసిద్ధిః = అద్వితీయమైన సిద్ధికలది.

క్రియాశక్తి పరిపూర్ణం కానంతవరకు మహాసిద్ధిరాదు. మామూలు సిద్ధులు వస్తాయి. ఈ మామూలు సిద్ధులు ఎనిమిది వుంటాయి. అవి – అణిమా, మహిమా, లఘిమా, గరిమా, ప్రాప్తి, ప్రాకామ్య, ఈశిత్వ, వశిత్వ సిద్ధులు.

అసలంటూ ఒకటి వుంటే దాన్ని ఎన్ని రకాలుగా అయినా మార్పులు చెయ్యడం ఈ అణిమాది సిద్ధులకు సాధ్యమౌతుందేమో కాని 'అసలే' లేనపుడు అలా చెయ్యడం సాధ్యం కాదు. అంటే, వీటికి కొంత పరిమితత్వం ఉంటుంది. ఏమీలేనట్లుండే ఆకాశంలోంచి అన్నీ పుష్కలంగా ఉండే సమస్తాన్ని సృష్టించడం అమ్మవారి 'మహోత్కృష్టమైన సిద్ధి' గా చెప్పుకోవాలి. దాన్నే 'మహాసిద్ధి' అంటారు. ఈ మహాసిద్ధి కలిగిన అమ్మవారిని 'మహాసిద్ధిః' అంటారు.

చిత్తశుద్ధిలేకపోయినా సిద్ధులు చేకూరవచ్చునేమో గాని – మహాసిద్ధి మాత్రం

ఒకళ్లని ఒకళ్లు కొట్టుకునేటప్పుడు ప్రదర్శింపబడు అల్పబలం దగ్గర నుండి - సమస్త సృష్టిని ధ్వంసం చేద్దామని చూసే వారిని గూడా అంతం చేయుగల అనంతమైన చతురంగ బల సంపన్నత్వం దాకా బలాల్లో వివిధ స్థాయిలుంటాయి. ఈ చివరి స్థాయిలోని బలాన్ని 'మహాబల' స్థాయి అంటారు. ఈ మహాబల సంపన్నురాలైన అమ్మవారిని 'మహాబలా' అంటారు. అసలు బలం గల వారిలోని బలం అమ్మవారు అని తెలుసుకోవాలి.

ఈ నామాన్ని - 'మహా + అబలా' - అని విడదీస్తే 'స్త్రీలందరిలోను మహా మహిమాన్వితురాలు', అనే అర్థం గూడా చెప్పుకోవచ్చును.

బలం అంటే కేవలం భౌతిక బలంలోనే కాదు. బుద్ధిబలం, తపోబలం, అర్థబలం మొదలైన అన్నిటిలోను కూడా అమ్మవారిదే పైచేయి. సాధారణంగా ఎవరికైనా ఒకటో రెండో రకాల బలాల్లో ఆధిపత్యం ఉండచ్చు గాని అన్నిటిలోనూ సమగ్రంగా వుండదు. అలా ఉండటం అమ్మవారికే చెల్లుతుంది. అందుకని ఆవిడ 'మహాబలా' అన్న నామానికి అర్హురాలయింది.

1. అన్ని రకాల బలాలలోను అనంతమైన ఆధిపత్యం కలది'
2. స్త్రీలందరిలోను మహామహిమాన్వితురాలు.

అని ఈ నామానికి అర్థాలు చెప్పుకోవచ్చును.

## 223. మహాబుద్ధిః

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మహాబుద్ధ్యైనమః' అని చెప్పాలి.

మహా = అద్వితీయమైన, బుద్ధిః = బుద్ధి కలది.

ఉన్నదాన్ని పరిశీలించడానికి 'మనస్సు', క్రొత్తదనాన్ని సృష్టించగలగడానికి 'బుద్ధి' కావాలి. బుద్ధి నుండి – గ్రహణము, విచక్షణ, వివేకము తీస్తే మిగిలిన దాన్ని 'వితర్కము' అంటారు. ఈ 'వితర్క'మనే రాక్షసుడిని ఈ మహాబుద్ధి చేతనే అమ్మవారు చంపుతుంది. మనస్సు పంచ జ్ఞానేంద్రియముల ద్వారా వివరాలను సేకరిస్తే – బుద్ధి కర్తవ్యాన్ని

నిర్ణయిస్తుంది. అంటే మనస్సు న్యాయవాది లాంటిదయితే, బుద్ధి న్యాయమూర్తి ( జడ్జి) లాంటిదన్నమాట ! సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి లాంటిది అమ్మవారు. ఈ స్థాయిలోని బుద్ధిని మహా బుద్ధి అంటారు.

అన్ని రకాల శాస్త్రజ్ఞుల బుద్ధులలో పనిచేసేది, బుద్ధులను ప్రేరేపించేది అమ్మవారే కాబట్టి, అమ్మవారు ' మహాబుద్ధి' అవుతుంది. అంటే – 'దేన్ని తెలుసుకుంటే సర్వమూ తెలుస్తుందో దాన్ని మహాబుద్ధి' అంటారన్నమాట!

1. 'అందరి బుద్ధుల ప్రేరణశక్తి. (గాయత్రి)

2. 'అద్వితీయమైన బుద్ధిసంపద కలిగినది' అని ఈ నామానికి అర్థాలు చెప్పుకోవచ్చును.

## 224. మహాసిద్ధిః

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మహాసిద్ధ్యైనమః' అని చెప్పాలి.

మహాసిద్ధి = అద్వితీయమైన సిద్ధికలది.

క్రియాశక్తి పరిపూర్ణం కానంతవరకు మహాసిద్ధిరాదు. మామూలు సిద్ధులు వస్తాయి. ఈ మామూలు సిద్ధులు ఎనిమిది వుంటాయి. అవి – అణిమా, మహిమా, లఘిమా, గరిమా, ప్రాప్తి, ప్రాకామ్య, ఈశిత్వ, వశిత్వ సిద్ధులు.

అసలంటూ ఒకటి వుంటే దాన్ని ఎన్ని రకాలగా అయినా మార్పులు చెయ్యడం ఈ అణిమాది సిద్ధులకు సాధ్యమౌతుందేమో కాని 'అసలే' లేనపుడు అలా చెయ్యడం సాధ్యం కాదు. అంటే, వీటికి కొంత పరిమితత్వం ఉంటుంది. ఏమీలేనట్లుండే ఆకాశంలోంచి అన్నీ పుష్కలంగా ఉండే సమస్తాన్ని సృష్టించడం అమ్మవారి 'మహోత్కృష్టమైన సిద్ధి' గా చెప్పుకోవాలి. దాన్నే 'మహాసిద్ధి' అంటారు. ఈ మహాసిద్ధి కలిగిన అమ్మవారిని 'మహాసిద్ధిః' అంటారు.

చిత్తశుద్ధిలేకపోయినా సిద్ధులు చేకూరవచ్చునేమో గాని – మహాసిద్ధి మాత్రం

చేకూరదు. మానవుడు తాను తయారు చేసిన ఎంత పెద్ద యంత్రమైనా తాను ఉన్నదని దానికి తెలియదు. కాని, అమ్మవారు సృష్టించిన మనిషికి తాను వున్నట్లు తనకు తెలుస్తుంది. ఇలాంటి విశిష్టలక్షణం గల జీవుల్ని సృష్టించగలగటం కూడా ఒక మహాసిద్ధిగా చెప్పుకోవాలి.

'మహిమాన్వితమైన సిద్ధి కలిగినది' అని ఈ నామానికి అర్థం.

## 225. మహాయోగేశ్వరేశ్వరీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మహాయోగేశ్వరేశ్వర్యై నమః' అని చెప్పాలి.

మహా యోగేశ్వర = గొప్ప యోగేశ్వరులైన వారికి కూడ, ఈశ్వరీ = ప్రభ్వీ.

ఈ నామాన్ని 'మహాయోగీశ్వరేశ్వరీ' అని కూడా చెబుతారు. అప్పుడు, యోగులకు – ఆ యోగులలో గూడా శ్రేష్ఠులైన యోగీశ్వరులకు కూడా ఈశ్వరి – అమ్మవారు. అని అర్థం చెప్పుకోవాలి. అంతేకాదు, యోగానికి ప్రభువులైన శివకేశవాదులకు కూడా ఈశ్వరి – అమ్మవారే !

యోగం అంటే 'కలయిక' అని అర్థం. నదులు, గ్రహాలు, నక్షత్రాలు, సముద్రాలు, వృక్షాలు, జీవజాలం, ఎడారులు, పర్వతాలు మొదలైనవన్నీ గూడా కలసి వుండి ఒకే పేరుతో పిలువబడే ఈ విశ్వాన్ని ఒక 'మహాయోగం' అని అంటే – ఈ మహాయోగానికి ఈశ్వరుణ్ణి 'మహాయోగేశ్వరుడు' అనాలి. ఈ 'మహాయోగేశ్వరునికి ఈశ్వరి' ఈ అమ్మవారు. అని ఈ నామానికి మరో విశిష్టమైన అర్థాన్ని చెప్పుకోవచ్చును.

1) గొప్ప గొప్ప యోగులకు, యోగేశ్వరులకు, యోగీశ్వరులకు గూడా ఈశ్వరి.
2) విశ్వమనే మహాయోగానికి ప్రభువైన ఈశ్వరునికి ఈశ్వరి''.

అని ఈ నామానికి అర్థాలు చెప్పుకోవచ్చును.

## 226. మహాతంత్రా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మహాతంత్రాయైనమః' అని చెప్పాలి.

మహా = గొప్పదైన, తంత్రా = తంత్రస్వరూపిణి.

తంతు, తంత్రముల గురించి 206 నామంలో కొంత వివరింపబడింది. 'తంతువు' లంటే 'దారాలు'(Fibres)అనీ, 'తంత్రము' అంటే 'దారాలతో అల్లబడినది' అని సామాన్యార్థం. ప్రస్తుతం తంతువులంటే సమన్వయ సూత్రాలు. (Formula of Coordination)గా అర్థం చేసుకోవాలి. ''ఒక వైదిక కర్మకు సంబంధించిన ప్రక్రియకు గాని, ఒక విద్యకు సంబంధించిన వివరాలను గాని – విధి విధాన సూత్రాలతో సంకలనం చేస్తే'' – దాన్ని 'తంత్రము' అంటారు. ఈ నిర్వచనం ప్రకారం కల్ప సూత్రాలు, ఆగమ సూత్రాలు, ఆపస్తంభ, అశ్వలాయ నాది మహర్షులచే సంకలనము చేయబడిన గృహ్యసూత్రాలు, శ్రీ విద్యకు సంబంధించిన కులార్ణవ, జ్ఞానార్ణవ, నిత్యోత్సవాది తంత్రాలు అన్నీ ఈ కోవలోకే వస్తాయి. ఇన్ని రకాల తంత్రాలున్నా శ్రీ విద్యకు సంబంధించిన తంత్రము మహోత్కృష్టమైనది. దీనికి 'స్వతంత్ర తంత్ర' మనే పేరు కూడా ఉంది. జగద్వ్యూహానికి సంబంధించిన, సమన్వయ పరచి ఇచ్చిన – యంత్ర, మంత్ర, తంత్రాల సమగ్ర స్వరూపమే శ్రీ విద్యకు సంబంధించిన ఈ తంత్రము.

బిందువు, ప్రకృతీ పురుషులు, త్రిగుణాలు, అంతఃకరణచతుష్టయం, పంచభూతాలు, పంచతన్మాత్రలు, పంచజ్ఞానేంద్రియాలు, పంచకర్మేంద్రియాలు, సప్తధాతువులు, తిథి విద్యా (16) మనువిద్యా (14) చంద్రవిద్యా (15) చతుష్షష్టికళలు (64) మొదలైన వాటి హేతు బద్ధ వర్గీకరణంతో సమస్తదేవతా సమన్వయ స్వరూపంగా ఉండే 'జగత్తంత్రమే' ఈ 'శ్రీ తంత్రం' గాబట్టి దీన్ని 'మహాతంత్రం' అన్నారు. సృష్టిస్వరూపిణి అయిన అమ్మవారిని ఈ మహాతంత్రంతో సమన్వయ పరచి ఇచ్చారు కాబట్టి అమ్మవారు 'మహాతంత్రా' అనే నామంతో పిలువబడుతుంది.

వెన్నెముకలో వుండే 64 తంత్రాలు సిద్ధుల్లాగా వున్నా, వాళ్ళు అలా ఎంతసేపు వుండాలో ఎలా వుండాలో వాళ్లకు తెలీదు. స్వతంత్రత లేదు. 65వది అయిన స్వతంత్ర – తంత్రానికి మాత్రం తనకి తాను తెలుసు. నిర్ణయించగలశక్తి, మార్చగలశక్తి, ప్రయోగ ఉపసంహరణ శక్తి – ఇవన్నీ చేయగల స్వతంత్రత ఉంటుంది. అందుకే ఆదిశంకరులు అమ్మవారి నుద్దేశించి – 'స్వతంత్రం తే తంత్రం' – అన్నారు సౌందర్యలహరిలో. ఇట్టి

విశిష్టలక్షణాలు కలది కాబట్టి – అమ్మవారికి 'మహాతంత్రా' అనే నామం వచ్చింది. ఐహిక, ఆముష్మిక ప్రయోజనాలు రెండూ వుంటాయి ఈ తంత్రానికి.

'మహిమాన్వితమైన తంత్ర స్వరూపిణి' అని ఈ నామానికి అర్థం.

## 227. మహామంత్రా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మహామంత్రాయై నమః' అని చెప్పాలి.

మహా = గొప్పదైన, మంత్రా = మంత్రస్వరూపిణి.

'మంత్రము' అంటేనే 'మహిమగలమాట'. మరి 'మహామంత్రం' అంటే 'మరింత మహిమాన్వితమైన మాట' అని అర్థం చెప్పుకోవాల్సి వుంటుంది. ఈ 'మహా' అనే సంస్కృత పదం ఎన్నో రకాలుగా విరూపణ (Distort) చెందింది. ''మఘా'' అనేది ఒక రకమైన విరూపణ. ఈ రూపంతోటే ఒక నక్షత్రం పేరు వుంది. అదే 'మఘా నక్షత్రం'. ఈ 'మఘా' నక్షత్రాన్ని తెలుగులో 'మఖా' నక్షత్రం అని కూడా (తప్పుగా) పలుకుతారు. ఆంగ్లంలో దీన్ని "Maghas" అంటారు. 'Somerset Maghum' ఒక ప్రఖ్యాత ఆంగ్లకవి. Magic అనే ఆంగ్లపదానికి ఈ 'మహా' అనే సంస్కృత పదమే మూలం అయివుండాలి కూడా!

ప్రస్తుత లలితాసహస్ర నామాల్లోని 'మహేశ్వరీ' నామం నుండి 'మహాత్రిపురసుందరీ' వరకు మొత్తం 27 నామాలు ఉంటాయి. మణిద్వీపంలో వుండే అమ్మవారి ప్రత్యేక నామాలుగా వీటిని చెప్పుకోవచ్చును. రాశి చక్రంలోని ఒక్కొక్క నక్షత్రానికి ($13^0$ 20') ఈ 27 నామాల్లో ఒక్కొక్క నామం చొప్పున న్యాసం చేసుకుని జపించే లలితా ఆరాధకులు కూడా వుంటారు.

'ప్రణవ, గాయత్రీ మంత్రాది మహా మంత్రాలు తన స్వరూపముగా గలది' అని కూడా అర్థం చెప్పుకోవచ్చును.

ఒక గ్రామానికి సరిహద్దులెలా వుంటాయో మన శరీరానికి గూడా ముక్కు చివర, కళ్ళు చివర, చెవుల చివర మొదలైన చోట్ల 'సరిహద్దులు' లేదా 'పొలిమేరలు' వుంటాయి.

అన్నమయ (Physical), ప్రాణమయ(Vital), మనోమయ(Mental) , సూక్ష్మ (Astral) శరీరాల్లో ఈ సరిహద్దుల వద్ద దేవతా శక్తులు పని చేస్తాయి. 'పొలిమేర' ల్లో పనిచేసే ఈదేవతా శక్తులను జానపదులు 'గంగానమ్మ', 'పోలేరమ్మ', 'అంకాలమ్మ', 'నూకాలమ్మ' మొదలైన పేర్లతో పిలుస్తారు. వైదిక దేవతలు వీటికి మూలం. వీరినే 'దిగ్దేవతలు' మరియు అంగ, ప్రత్యంగ దేవతలని గూడా అంటారు. ఈ అంగ, ప్రత్యంగ దేవతలను ఆవాహన చేసేటప్పుడు గూడా వారి వారికి సంబంధించిన మంత్రాల ముందు 'మహా' చేర్చి ఉచ్చరించడం పరిపాటి. (ఇలాంటి మంత్రాలు ఉచ్చరించేటప్పుడు – మనకు అనిపించే భావానికి, ఆ మంత్ర పదము యొక్క అర్థానికి, సంబంధం వుండకపోవచ్చును గాని, మనకు – మంత్రానికి వుంటుంది. ఉదా: మార్దవము అన్నపుడు ఏదో 'కఠినత్వం' ఆపదంలో వున్నట్లు అనుకుంటాం కాని, దాని అర్థం 'మృదులత్వం' లేదా 'మెత్తని తన'మే అలా అన్నమాట!)

మొత్తంమీద ఈ నామానికి ఈక్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1) ప్రణవ, గాయత్ర్యాది మహామంత్రాలు తన స్వరూపముగా గలది.
2) అంగ, ప్రత్యంగ, దిగ్దేవతా మంత్రాలు తన స్వరూపముగా గలది.
3) 'మహిమ'కు, 'గొప్పతనానికి' చెప్పబడిన మంత్రస్వరూపిణి.

## 228. మహాయంత్రా

ఇది నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటపుడు 'మహాయంత్రాయైనమః' అని చెప్పాలి.

మహా = గొప్పదైన, యంత్రా = యంత్రస్వరూపిణి.

యమము (Discipline) చేయువాడు 'యంత'. నియమము చేయువాడు 'నియంత'. అనుసరించడానికి ఇచ్చే ప్రణాళిక ''తంత్రము'' అయితే – దాన్ని నడిపేదాన్ని 'యంత్రము' అంటారు. వ్యక్తమైన ప్రతిజీవికి ఇటువంటి 'యంత్రము' ఉంటుంది. అది 'సృష్టి' యంత్రం. ఈ సమస్త సృష్టి నిర్వహణకు అవసరమయే ఒకే ఒక యంత్రాన్ని 'మహాయంత్రం' అంటారు. ఇది 'సమష్టి యంత్రం' అవుతుంది. ఈ మహాయంత్రం గూడా జగద్ధాత్రి అయిన అమ్మవారే! అందుకని అమ్మవారిని 'మహాయంత్రా' అంటారు.

విశిష్ట లక్షణాలు కలది కాబట్టి – అమ్మవారికి 'మహాతంత్రా' అనే నామం వచ్చింది. ఐహిక, ఆముష్మిక ప్రయోజనాలు రెండూ వుంటాయి ఈ తంత్రానికి.

'మహిమాన్వితమైన తంత్ర స్వరూపిణి' అని ఈ నామానికి అర్థం.

## 227. మహామంత్రా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మహామంత్రాయై నమః' అని చెప్పాలి.

మహా = గొప్పదైన, మంత్రా = మంత్రస్వరూపిణి.

'మంత్రము' అంటేనే 'మహిమగలమాట'. మరి 'మహామంత్రం' అంటే 'మరింత మహిమాన్వితమైన మాట' అని అర్థం చెప్పుకోవాల్సి వుంటుంది. ఈ 'మహా' అనే సంస్కృత పదం ఎన్నో రకాలుగా విరూపణ (Distort) చెందింది. ''మఘా'' అనేది ఒక రకమైన విరూపణ. ఈ రూపంతోటే ఒక నక్షత్రం పేరు వుంది. అదే 'మఘా నక్షత్రం'. ఈ 'మఘా' నక్షత్రాన్ని తెలుగులో 'మఖా' నక్షత్రం అని కూడా (తప్పుగా) పలుకుతారు. ఆంగ్లంలో దీన్ని "Maghas" అంటారు. 'Somerset Maghum' ఒక ప్రఖ్యాత ఆంగ్లకవి. Magic అనే ఆంగ్లపదానికి ఈ 'మహా' అనే సంస్కృత పదమే మూలం అయివుండాలి కూడా!

ప్రస్తుత లలితాసహస్ర నామాల్లోని 'మహేశ్వరీ' నామం నుండి 'మహాత్రిపురసుందరీ' వరకు మొత్తం 27 నామాలు ఉంటాయి. మణిద్వీపంలో వుండే అమ్మవారి ప్రత్యేక నామాలుగా వీటిని చెప్పుకోవచ్చును. రాశి చక్రంలోని ఒక్కొక్క నక్షత్రానికి ($13^0$ 20') ఈ 27 నామాల్లో ఒక్కొక్క నామం చొప్పున న్యాసం చేసుకుని జపించే లలితా ఆరాధకులు కూడా వుంటారు.

'ప్రణవ, గాయత్రీ మంత్రాది మహా మంత్రాలు తన స్వరూపముగా గలది' అని కూడా అర్థం చెప్పుకోవచ్చును.

ఒక గ్రామానికి సరిహద్దులెలా వుంటాయో మన శరీరానికి గూడా ముక్కు చివర, కళ్ళ చివర, చెవుల చివర మొదలైన చోట్ల 'సరిహద్దులు' లేదా 'పొలిమేరలు' వుంటాయి.

అన్నమయ (Physical), ప్రాణమయ(Vital), మనోమయ(Mental) , సూక్ష్మ (Astral) శరీరాల్లో ఈ సరిహద్దుల వద్ద దేవతా శక్తులు పని చేస్తాయి. 'పొలిమేర' ల్లో పనిచేసే ఈదేవతా శక్తులను జానపదులు 'గంగానమ్మ', 'పోలేరమ్మ', 'అంకాలమ్మ', 'నూకాలమ్మ' మొదలైన పేర్లతో పిలుస్తారు. వైదిక దేవతలు వీటికి మూలం. వీరినే 'దిగ్దేవతలు' మరియు అంగ, ప్రత్యంగ దేవతలని గూడా అంటారు. ఈ అంగ, ప్రత్యంగ దేవతలను ఆవాహన చేసేటప్పుడు గూడా వారి వారికి సంబంధించిన మంత్రాల ముందు 'మహా' చేర్చి ఉచ్చరించడం పరిపాటి. ( ఇలాంటి మంత్రాలు ఉచ్చరించేటప్పుడు – మనకు అనిపించే భావానికి, ఆ మంత్ర పదము యొక్క అర్థానికి, సంబంధం వుండకపోవచ్చును గాని, మనకు – మంత్రానికి వుంటుంది. ఉదా. మార్దవము అన్నపుడు ఏదో 'కఠినత్వం' ఆపదంలో వున్నట్లు అనుకుంటాం కాని, దాని అర్థం 'మృదులత్వం' లేదా 'మెత్తని తన'మే అలా అన్నమాట! )

మొత్తంమీద ఈ నామానికి ఈక్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1) ప్రణవ, గాయత్ర్యాది మహామంత్రాలు తన స్వరూపముగా గలది.
2) అంగ, ప్రత్యంగ, దిగ్దేవతా మంత్రాలు తన స్వరూపముగా గలది.
3) 'మహిమ'కు, 'గొప్పతనానికి' చెప్పబడిన మంత్రస్వరూపిణి.

## 228. మహాయంత్రా

ఇది నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటపుడు 'మహాయంత్రాయైనమః' అని చెప్పాలి.

మహా = గొప్పదైన, యంత్రా = యంత్రస్వరూపిణి.

యమము (Discipline) చేయువాడు 'యంత'. నియమము చేయువాడు 'నియంత'. అనుసరించడానికి ఇచ్చే ప్రణాళిక ''తంత్రము'' అయితే – దాన్ని నడిపేదాన్ని 'యంత్రము' అంటారు. వ్యక్తమైన ప్రతిజీవికి ఇటువంటి 'యంత్రము' ఉంటుంది. అది 'సృష్టి' యంత్రం. ఈ సమస్త సృష్టి నిర్వహణకు అవసరమయే ఒకే ఒక యంత్రాన్ని 'మహాయంత్రం' అంటారు. ఇది 'సమష్టి యంత్రం' అవుతుంది. ఈ మహాయంత్రం గూడా జగద్ధాత్రి అయిన అమ్మవారే! అందుకని అమ్మవారిని 'మహాయంత్రా' అంటారు.

విశిష్టలక్షణాలు కలది కాబట్టి – అమ్మవారికి 'మహాతంత్రా' అనే నామం వచ్చింది. ఐహిక, ఆముష్మిక ప్రయోజనాలు రెండూ వుంటాయి ఈ తంత్రానికి.

'మహిమాన్వితమైన తంత్ర స్వరూపిణి' అని ఈ నామానికి అర్థం.

## 227. మహామంత్రా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మహామంత్రాయై నమః' అని చెప్పాలి.

మహా = గొప్పదైన, మంత్రా = మంత్రస్వరూపిణి.

'మంత్రము' అంటేనే 'మహిమగలమాట'. మరి 'మహామంత్రం' అంటే 'మరింత మహిమాన్వితమైన మాట' అని అర్థం చెప్పుకోవాల్సి వుంటుంది. ఈ 'మహా' అనే సంస్కృత పదం ఎన్నో రకాలుగా విరూపణ (Distort) చెందింది. ''మఘా'' అనేది ఒక రకమైన విరూపణ. ఈ రూపంతోటే ఒక నక్షత్రం పేరు వుంది. అదే 'మఘా నక్షత్రం'. ఈ 'మఘా' నక్షత్రాన్ని తెలుగులో 'మఖా' నక్షత్రం అని కూడా (తప్పుగా) పలుకుతారు. ఆంగ్లంలో దీన్ని "Maghas" అంటారు. 'Somerset Maghum' ఒక ప్రఖ్యాత ఆంగ్లకవి. Magic అనే ఆంగ్లపదానికి ఈ 'మహా' అనే సంస్కృత పదమే మూలం అయివుండాలి కూడా!

ప్రస్తుత లలితాసహస్ర నామాల్లోని 'మహేశ్వరీ' నామం నుండి 'మహాత్రిపురసుందరీ' వరకు మొత్తం 27 నామాలు ఉంటాయి. మణిద్వీపంలో వుండే అమ్మవారి ప్రత్యేక నామాలుగా వీటిని చెప్పుకోవచ్చును. రాశి చక్రంలోని ఒక్కొక్క నక్షత్రానికి ($13^0$ 20') ఈ 27 నామాల్లో ఒక్కొక్క నామం చొప్పున న్యాసం చేసుకుని జపించే లలితా ఆరాధకులు కూడా వుంటారు.

'ప్రణవ, గాయత్రీ మంత్రాది మహా మంత్రాలు తన స్వరూపముగా గలది' అని కూడా అర్థం చెప్పుకోవచ్చును.

ఒక గ్రామానికి సరిహద్దులెలా వుంటాయో మన శరీరానికి గూడా ముక్కు చివర, కళ్ళ చివర, చెవుల చివర మొదలైన చోట్ల 'సరిహద్దులు' లేదా 'పొలిమేరలు' వుంటాయి.

పరిశుద్ధమైన ప్రదేశంలో, మరీ ఎత్తుగా గాని, మరీ పల్లంగా గాని వుండనిది, స్థిరంగా వుండి కదలనిది, పైన వస్త్రము, దానిపైన జింక చర్మము, దాని పైన దర్భాసనం కలిగిన ఆసనం (పీట లాంటిది) మీద ఏకాగ్రచిత్తంతో కూర్చుని ధ్యానం చేయాలి – అని సాధారణంగా గీతావ్యాఖ్యాన కారులు చెబుతారు.

అన్నీ బాగానే ఉన్నాయి కాని – వస్త్రం, జింక చర్మం, దర్భాసనం ఇవి అంత ముఖ్యమైనవా అని అనిపిస్తుంది. ధ్యానం చెయ్యాలంటే ఒక జింక చావాల్సిందే కదా ఈ చెప్పిన పద్ధతి చూస్తే ! (జింక చావందే జింక చర్మం రాదు కదా!) అంటే మనం ధ్యానం తల పెడితే ఒక జింకకో, లేడికో మూడిందన్నమాట! మా గురువుగారి మాటలే ఇవి ! ఆయనే దీనికి అసలైన అర్థాన్ని ఇలా చెప్పారు.

'చేలా' అంటే 'వస్త్రం' అని కదా అర్థం. ఎలాగూ మనం మొండి మొలలతో కాకుండా – ఏదో ఒక వస్త్రాన్ని ధరించే వుంటాం కదా! ఆ వస్త్రమే – వస్త్రం, 'అజినం' అంటే – 'జింక చర్మమే' అనే అర్థం చెప్పుకోనక్కరలేదు. 'చర్మం' అని చెప్పుకుంటే – మనకున్న చర్మమే ఆ చర్మం. వేరే చర్మం అక్కర్లేదు.

'కుశోత్తరం' అంటే 'దర్భాసనం' అనే అర్థమే చెప్పుకోనక్కర్లేదు. మన పిరుదుల మీద, తొడల మీద వుండే సన్నని వెంట్రుకలే దర్భలు.

ఇలా సహజమైన అర్థాలు చెప్పుకుంటే 'ఆత్మ' స్వరూపులమైన మనకు ఇంతకు పూర్వం చెప్పిన 'సహజ సిద్ధమైన శరీరమే' ఆసన మౌతుంది అని అర్థం చెప్పుకుని, ధ్యానం చేసుకుందామనుకున్న తత్‌క్షణం ఆ స్థితిలో ఉండి చేసుకోవచ్చును. లేడి చర్మం, దర్భాసనం వచ్చేవరకు ధ్యానాన్ని వాయిదా వేసుకునే సదుపాయం ఆలోచించే వారి కోసం చెప్పుకోవాలనుకుంటే – ఆ అర్థాలు చెప్పుకోవచ్చు. 'Now or never' అనే తత్వం గల వారికి అక్కర్లేదు. అందుచేత మనకు (ఆత్మకు) మన శరీరం, అంతకంటే స్థిరమైన మనస్సు – నిజమైన ఆసనాలౌతాయి.

పతంజలి 'స్థిరసుఖమాసనమ్' అంటాడు. 'స్థిరంగాను సుఖంగాను ఏ విధంగా ఎక్కువ సేపు కూర్చోగలమో అది (Posture) ఆ వ్యక్తికి ఆసనమౌతుంది' అని దీని అర్థం.

''ఉత్తమం సహజావస్థా'' అని కూడా చెబుతారు. అంటే – 'సహజ సిద్ధమైన స్థితిలో వున్నదే ఉత్తమ ఆసనం' అని అర్థం చెప్పుకోవచ్చును.

అలాగే, సృష్టి అంతటిలోను స్థిరంగా కూర్చుని ఉన్న అమ్మవారికి 'సృష్టి'యే 'ఆసనం' ఔతుంది.

దహరాకాశంగల హృదయం - మనకు (ఆత్మకు) ఎలాంటి ఆసన స్థానమో - మొత్తం సృష్టికి ఆకాశం అలాంటిది కాబట్టి 'ఆకాశాన్నే ఆసనంగా కలిగినది' అని కూడా ఈ నామానికి అర్థం చెప్పుకోవచ్చును.

1) 'సృష్టినే ఆసనముగా గలది'.

2) 'ఆకాశమునే ఆసనముగా గలది'.

అనే అర్థాలు ఈ నామానికి చెప్పుకోవచ్చును.

## ౨౩౦. మహాయాగక్రమారాధ్యా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మహాయాగక్రమారాధ్యాయై నమః' అని చెప్పాలి.

మహా = గొప్పదైన, యాగ = యాగవిధానములో, క్రమ = క్రమబద్ధమైన పద్ధతిలో, ఆరాధ్యా = ఆరాధింపబడునది.

''తదర్థం కర్మ కౌంతేయ తత్కురుష్వమదర్పణమ్'' అని గీతావాక్యము.

ఏది చేసినా 'తనకుఅర్పణ' బుద్ధికాకుండా 'తదర్పణ' బుద్ధి వుంటే ఆ విధంగా చెయ్యడం - 'మహాయాగం' ఔతుంది. ఈ విషయమే సౌందర్యలహరిలో ''జపోజల్పః....'' అన్న 27వ శ్లోకంలో ఆది శంకరులు వివరిస్తారు.

ఏ పనిలో అయినా ఒక 'క్రమం' వుంటే ఆ పని రాణిస్తుంది. 'శిక్షణ'లో క్రమం వుంటే అది క్రమశిక్షణ అయినట్లే - చేసే పనుల్లో అంటే - ఆరాధనలో క్రమం వుంటే 'క్రమారాధన' ఔతుంది. ఒక పద్ధతిగా చేసే పనిని 'యాగం' అనవచ్చును. అలా చేసిన పని 'తదర్పణ' బుద్ధిగా చేస్తే 'మహాయాగం' ఔతుంది. కాబట్టి - 'తదర్పణ బుద్ధితో క్రమబద్ధమైన పద్ధతిలో ఆరాధింపబడునది' అని ఈ నామానికి అర్థం చెప్పుకోవాలి.

''ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః, అగ్నేరాపః, ...'' ఇది ఒక క్రమం. పరమాత్మ

– జీవాత్మ, ప్రకృతీ – పురుషులు, అయ్యవారు, అమ్మవారు సృష్టి – ప్రళయం, పగలు – రాత్రి, షడృతువులు ... మొదలైన వన్నీ కూడా క్రమం తప్పనివే ! ఇటువంటి వాటితో తన జీవితాన్ని అనుసంధానం చేసుకుంటూ, సమర్పణ భావంతో జీవించే వాడు ఈ 'మహాయాగం' చేసిన వాడౌతాడు.

గురువుగారికి 10 రూపాయలు, 50 రూపాయలు, 100 రూపాయలు, 1000 రూపాయలు, ఇలా సమర్పించు కుంటూ పోయి – ఇంక ఏమీ మిగలక తాను మిగిలిపోయి – చిట్టచివరకు తనని కూడా సమర్పించు కున్నాడట ఒక శిష్యుడు. ఆ గురువు నిజమైన గురువు కాబట్టి – 'వెధవా ముందే ఈ పని చెయ్యొచ్చుగా అవన్నీ నాకెందుకు ? 'సమర్పణ' అంటే ఏదో సమర్పించడం కాదు. తననే సమర్పణ చేసుకోడం ! అప్పుడే – నేను నీలో వుండి నిన్ను నడిపించేది, అన్నాడట !

దేవతల ప్రీతికై, అగ్ని ద్వారా హవిస్సును సమర్పిస్తూ చేసే శ్రీయాగ, అంబాయాగ, అగ్నిష్టోమ, జ్యోతిష్టోమాది యాగాలను 'మహాయాగా' లంటారు. ఈ మహాయాగాల ద్వారా ఒక క్రమమైన పద్ధతిలో ఆరాధింపబడునది అని ఇంకో అర్థం.

ఆగర్భస్థితి నుండి అంటే – గర్భస్థుడైనప్పటి నుండి – శ్మశాన ప్రవేశం చేసే స్థితి వరకు జరిగే జీవితంలో దేహంతో చెయ్య వలసినవి దేహంతోను, మనస్సుతో చెయ్యవలసినవి మనస్సుతోను, బుద్ధితో చెయ్యవలసినవి బుద్ధితోను ... ఇలా తన సమస్త అవయవ, ఇంద్రియ, అంతః కరణ చతుష్టయాలతో నిర్వర్తించ వలసిన పనులను ప్రకృతితో శ్రుతిని కలుపుతూ పద్ధతి ప్రకారం చెయ్యడం కూడా మహాయాగం క్రిందకే వస్తుంది. ఇటువంటి పద్ధతిలో ఆరాధింపబడే అమ్మవారిని కూడా 'మహాయాగక్రమారాధ్యా' అంటారు.

1) అగ్నిష్టోమాది మహాయాగాల ద్వారా ఆరాధింపబడునది.

2) తదర్పణ భావంతో గడిపే జీవితాన్ని – యాగ రూపంగాను, చూసే సృష్టిని – మహాయాగ రూపంగాను దర్శింప చేసి ఆరాధింపబడునది, అని ఈ నామానికి అర్థం చెప్పుకోవచ్చును.

## 231. మహాభైరవపూజితా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మహాభైరవ పూజితాయైనమః' అని చెప్పాలి.

'భౌ' లేదా 'భై' అను రవమును పుట్టించువారు 'భైరవులు' అని ఒక వ్యుత్పత్తి అర్థం. ఈ అర్థంలోనే కుక్కలను 'భైరవులు' అని కూడా అంటారు.,

''భరణ, రమణ, వమనకర్తా భైరవః'' అంటే – రప్పించడం, ఒప్పించడం, భరించడం లక్షణాలు కలవి' అనగా సృష్టి, స్థితి, లయ కారక లక్షణం కలవాడు భైరవుడు' అని ఇంకో వ్యుత్పత్తి అర్థం. ఇటువంటి లక్షణాలు కల భైరవులు మొత్తం మీద 8 మంది ఉంటారు. వారి పేర్లు 1) అసితాంగ భైరవుడు 2) రురు భైరవుడు 3) చండభైరవుడు 4) క్రోధభైరవుడు 5) ఉన్మత్త భైరవుడు 6) కపాల భైరవుడు 7) భీషణ భైరవుడు 8) సంహార భైరవుడు – పరమేశ్వరుని ఒక్కొక్క అంశతో వీళ్ళు ఉంటారు. వీరందరి సమష్టి రూపం అయిన భైరవుణ్ణి 'మహాభైరవుడు' అంటారు. ఆదిత్య మండలంలో మధ్యన వుండే నారాయణుణ్ణే ఈ 'మహాభైరవుడు' అంటారు. ఈ మహాభైరవుణ్ణే 'మార్తాండ భైరవుడని' అంటారు. మహాయాగాలతో ఈ నారాయణుడు అమ్మవారిని పూజించాడు అందుకని అమ్మవారు 'మహాభైరవ పూజితా' అయింది.

మంత్రశాస్త్రంలో ఇంకోవిధమైన సమన్వయం వుంది. క, ఖ, గ, ఘ, – చ, ఛ, జ, ఝ, – ట, ఠ, డ, ఢ, – త, థ, ద, ధ, – ప, ఫ, బ, భ, – ఈ ఐదువర్గాల్లో చివరి అక్షరాలైన 'ఘ, ఝ, ఢ, ధ, భ' లను కూడా భైరవ పదంతో సంకేతిస్తారు. ఈ అక్షరాలను ఉచ్చరిస్తున్నపుడే ఇవి భీకరమైన శబ్దోచ్చారణ కలిగినవని తెలుస్తుంది. కుక్కలు కూడా ఇటువంటి శబ్దాలనే చేస్తాయి. అందుకే కుక్కలను 'భైరవుల'ని గూడా అంటారు. ఈ ఐదు భైరవుల్లో చివరిదైన 'భ' అక్షరాన్ని 'మహాభైరవుడు' అంటారు. ఈయన మొదటి నలుగురి కన్నా పెద్దవాడు.

భైం – భైమి – అనే పదాలతో సంబంధము ఉండే 'భీమ' పదం కూడా పరమేశ్వరుణ్ణే (భీమేశ్వరుడు) సూచిస్తుంది.

ఇంకొక చిత్రమైన, విశిష్టమైన లక్షణం ఈ భైరవులకు ఉంటుంది. వీటికి భవిష్యత్కాల జ్ఞానం కూడా ఉంటుంది. అందుకనే వీటిని 'కాలభైరవులు' అని కూడా అంటారు. ఏదైనా ఒక సన్నివేశం లేదా సంఘటన జరిగిన తరువాత కాని అది జరిగినట్లు మనకు తెలియదు. కాని, ఈ కాలభైరవులకు జరుగబోయేది కూడా ముందే తెలుస్తుంది. ఒక వీధిలో రాత్రిపూట ఒక్కొక్కప్పుడు కుక్కలు ఒక రకమైన విషాదకర రావాలు చేస్తాయి. పెద్దవాళ్ళు వాటిని కసిరి, తోలివేస్తారు. త్వరలోనే ఆ వీధిలో ఒకరు చనిపోతారు అనే విషయం ఈ భైరవులకు ముందే తెలుస్తుంది. అందుకనే అవి అలా విషాదకర రావాలు చేస్తాయి. (రాబోయే భూకంపాలను గూడా ముందే పసికట్టే లక్షణం ఈ భైరవులకుంటుంది అంటారు)

అలాగే, మనం పరధ్యానంగా వున్నపుడు మనకు జరుగబోయే ప్రమాదాలు ముందే తెలిసి మనలను రక్షించే కొన్ని అజ్ఞాత, అపురూప శక్తులు కొన్ని (Sub conscious Faculties) ప్రతి వారిలోను ఉంటాయి. రాయి విసరబడి మనకు అది తగిలే లోపలే కనురెప్పలు మూతబడి కళ్ళు కాపాడబడే ప్రయత్నం లాంటివి మనలోని ఈ కాల భైరవుల వల్లే జరుగుతుంది.

ప్రాణం పోయే ముందర – ఆ చావు గురించి వీలైనంత వరకు తెలియనీయకుండా చేసే భైరవుడు 'మహాభైరవుడు' అని సమన్వయించుకోవాలి.

1) 'మహాభైరవుడు', 'మార్తాండ భైరవుడు' అను పేర్లతో పిలువబడు ఆదిత్యమండలాంతర వర్తి అయిన నారాయణునిచే పూజింపబడునది.

2) 'మనలోని అజ్ఞాత శక్తులచే పూజింపబడునది' అనగా – 'తన ఆజ్ఞలకు బద్ధులైన అజ్ఞాత శక్తులు కలది' అని అర్థం.

## 232. మహేశ్వర మహాకల్ప మహాతాండవ సాక్షిణీ

పదహారు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మహేశ్వర మహాకల్ప మహాతాండవ సాక్షిణ్యైనమః' అని చెప్పాలి.

మహేశ్వర = సదాశివునిచే, మహాకల్ప = మహాప్రళయ సమయమునందు

చేయుబడు, మహాతాండవ = గొప్ప తాండవనృత్యమును (చూడగల), సాక్షిణీ = సాక్షిస్వరూపిణి.

సృష్టి అంతా అమ్మవారి ప్రపంచం అయితే, ప్రళయ మంతా అయ్యవారి ప్రపంచం. బ్రహ్మ కల్పాంతానికి వచ్చే ప్రళయాన్ని 'మహాప్రళయ' మంటారు. అప్పుడు సృష్టి అంతా అయ్యవారిలో లీనమై వుంటుంది. ఆ స్థితిలోని ఈశ్వరుణ్ణి 'మహేశ్వరుడు' అంటారు. మహాప్రళయ స్థితిలో మహేశ్వరుడు చేసే నృత్యాన్ని 'మహాతాండవం' అంటారు. అమ్మవారి నృత్యాన్ని 'లాస్యం' అనీ, అయ్యవారి నృత్యాన్ని 'తాండవ' మనీ అంటారు. ఈ రెంటి గురించి ఆది శంకరులు అర్ధనారీశ్వర స్తోత్రంలో -

'ప్రపంచ సృష్ట్యున్ముఖ లాస్యకాయై - సమస్త సంహారక తాండవాయ' అంటారు.

ఈ మహాతాండవాన్ని, ఆ తాండవం చేస్తున్న శివుణ్ణి - చూచేవారు ఎవ్వరూ ఉండరు ఒక్క అమ్మవారు తప్ప. ఆ మహాతాండవాన్ని చూసే ఏకైక సాక్షి అవడం వలన అమ్మవారిని 'మహేశ్వర మహాకల్ప మహాతాండవ సాక్షిణీ' అన్నారు. అంటే మహా ప్రళయంలో కూడా ఇద్దరూ ఉన్నట్లే గదా! (ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాది ఉభావపి - గీత.)

మనలో ఎవరన్నా ఒంటరిగా ఉన్నపుడు గూడా - 1) 'ఒంటరిగా ఉండే 'మనం' 2) 'అలా ఒంటరిగా ఉన్నామని తెలియడం' - ఈ రెండూ వుంటాయి. ఈ 'తెలియడాన్నే' అమ్మవారు అంటారు. అంటే - ''తెలుసుకునేవాడు' అనే 'అయ్యవారి' తో పాటు 'తెలియడం' అనే అమ్మవారు' ఎప్పుడూ విడదీయని జంట లాగా వుంటుంది''. అని దీని అర్థం. తాండవం చేసే అయ్యవారిలోని చైతన్య శక్తి అమ్మవారే ! అమ్మవారు లేకపోతే 'అయ్యవారు' - 'కొయ్యవారే' ఔతారు కాని కదలలేరని ఆది శంకరులు సౌందర్యలహరిలో - 'శివఃశక్త్యా..' అన్న మొదటి శ్లోకంలో చెబుతారు.

1) 'మహా ప్రళయ సమయంలో మహేశ్వరుడు చేసే మహాతాండవానికి సాక్షీభూతురాలు'.

2) 'ఒంటరిగా ఉన్న వారిలో ఒంటరిగా ఉన్నానని తెలిసే జ్ఞానముగాను ఉండునది' అని ఈ నామానికి అర్థాలు చెప్పుకోవచ్చును.

## 233. మహా కామేశ మహిషీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మహాకామేశమహిష్యైనమః' అని చెప్పాలి.

మహా కామేశ = మహేశ్వరుని, మహిషీ= పట్టపురాణి.

'అయ్యవారిది – అమ్మవారిదే – సరియైన జంట ! అన్ని విధాలా ఇద్దరికీ సరిపోతుంది. రెండు చేతులు ఒక దానికొకటి సరిపోయినట్లు ఆ మహాకామేశ్వరునికి పట్టపురాణి అయిన అమ్మవారు అలా సరిపోతుంది.

సృష్టి జరుగక పూర్వం ఈ సృష్టి ఇలా రావాలని కోరిక గలిగితే, ఆ కోరికతో నిండిన ఈశుణ్ణి 'మహాకామేశు'డంటారు. ఆ కోరికను 'మహాకామం' అంటారు. ఆ కోరిక మేరకు వెలువడిన సృష్టి స్వరూపిణిని 'మహాకామేశ్వరి' అంటారు. అంటే మహాకామేశుని కోరికయే 'మహాకామేశ్వరి' అన్నమాట! ఆయనకు 'చేత' ఈవిడ, ఈవిడకు 'ఊహ' ఆయన అన్నమాట! అంటే – ఒకరి యొక్క మనస్సులో ఒకరు పూర్తిగా నిండి వుంటారన్నమాట! ఇంతకంటె చక్కని దాంపత్యం ఎవరి పట్ల చెల్లుతుంది ? ఎవరికి ఉంటుంది? అందుకని అమ్మవారిని – 'మహాకామేశునికి పట్టమహిషి' అన్నారు.

1) మహాకామేశునికి పట్టపురాణి.

2) మహాకామేశుని కోరిక యొక్క వ్యక్త స్వరూపిణి.

3) 'చేత' యొక్క 'చేతన స్వరూపిణి – అని ఈ నామానికి అర్థాలు చెప్పుకోవచ్చును.

## 234. మహాత్రిపుర సుందరీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మహా త్రిపురసుందర్యైనమః' అని చెప్పాలి.

మహా = గొప్పదైన, త్రిపురసుందరీ = త్రిపురసుందరి.

శబ్దపరంగా - మంద్ర, మధ్యమ, తారస్థాయిలు; స్వరపరంగా - ఉదాత్త, అనుదాత్త, స్వరితాలు; మాతృపరంగా - ప్రమాతృ, ప్రమేయ, ప్రమాణాలు; లోకపరంగా - భూర్భువస్సువ ర్లోకాలు; జ్ఞానపరంగా - జ్ఞాన, జ్ఞేయ, జ్ఞాతలు, - ఇటువంటి మూడు చొప్పున ఉండే వాటిని 'త్రిపుటి' అని - 'త్రిపురాలు' అని కూడా అంటారు. శ్రీ చక్రంలో మధ్యలో ఉండే బిందువు నుండి ప్రథమ త్రికోణము(Triangle) ఉద్భవించి, ఆ త్రికోణం యొక్క మూడు శీర్షాల నుండి ఈ మూడింటికి సంబంధించిన ముగ్గురు అధిష్ఠాన దేవతలు ఉద్భవిస్తారు, వారే - 'కామేశ్వరీ', 'వజ్రేశ్వరీ', 'భగమాలినీ' - దేవతలు. ఈ ముగ్గురు సుందరుల ఉద్భవానికి మూలకారణమైన 'బిందు' స్వరూపిణి అయిన అమ్మవారిని 'మహా త్రిపురసుందరి' అంటారు.

'మహిమాన్వితమైన, త్రిపురసమన్వితమైన సుందరి' అని ఈ నామానికి అర్థం.

## 235. చతుష్షష్ట్యుపచారాఢ్యా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'చతుష్షష్ట్యుపచారాఢ్యాయై నమః' అని చెప్పాలి.

చతుష్షష్టి= అరువది నాలుగు, ఉపచారాఢ్యా = ఉపచారములతో సేవింపబడునది.

'ఉపచారము' అంటే - సేవ - అని అర్థం చెప్పుకుంటే - ఈ నామానికి - 'అరువది నాలుగు ఉపచారములతో సేవింపబడు శ్రేష్ఠమైన దేవత' అని అర్థం వస్తుంది.

సాధారణంగా ఏ దేవత అయినా పంచోపచారాలతో గాని, షోడశోపచారాలతో గాని పూజింపబడుతుంది. అవే - ధ్యాన ఆవాహన, ఆసన, అర్ఘ్య, పాద్యాది ఉపచారాలు. కాని, లలితా అమ్మవారికి అరువది నాలుగు ఉపచారములతో విశిష్టమైన పూజావిధానం గూడా వుంది. భక్తుని పంచ జ్ఞానేంద్రియాలు, పంచతన్మాత్రలు, ఈ ఉపచారాల వలన వినియోగపడి - దేవతకు, భక్తునికి మధ్య సమన్వయం కుదిరి, దూరం తగ్గి సాన్నిధ్యం పెరుగుతుంది. విశిష్టపూజలో అమ్మవారికి చేసే ఉపచారాలు (64) అనుబంధంతో ఇవ్వబడినవి.

'ఉపచార' పదాన్ని 'ఉప + చార' గా విడదీస్తే - సమీపంగా చరించడం' అనే అర్థం వస్తుంది.

భూమి చుట్టూ చంద్రుడు తిరుగుతాడు. ఆ భూమి చంద్రుడితో పాటు సూర్యుని చుట్టూ తిరుగుతుంది. ఇలా తిరగడంలో సూర్యుని వెలుగులు చంద్రునిపైన బడి - స్వయం ప్రకాశం లేకపోయినా చంద్రుడు కూడా ప్రకాశంగా కనిపిస్తాడు. అయితే, ఈ సూర్యచంద్రులిద్దరికీ మధ్యలో భూమి అడ్డువస్తూ ఉండటం వలన రోజుకో రకంగా చంద్రుని వెలుగు పరిమాణం మారుతుంది. చంద్రుని యొక్క మారే వెలుగుల పరిమాణాలనే చంద్రకళలు అంటారు. వీటినే తిథులతో (Phases) సంకేతిస్తారు. చంద్రుడు సమీపంగా వస్తూ చరించడం మూలంగా ఏర్పడే ఈ పదహారు రకాల కళలను – పదహారు 'ఉపచారాల' ని అనవచ్చును. ప్రతి రోజు సూర్యోదయంవు, మిట్టమధ్యాహ్నము, సూర్యాస్తమయము, అర్ధరాత్రి – ఈ సమయాలను నాలుగు నిర్దేశ బిందువులుగా (Cardinal Points or Nodal Points) గా గుర్తిస్తే ఈ నాలుగు బిందువుల వద్ద జరిగే గమనాలలోని మార్పులను గూడా పరిగణలోనికి తీసుకుంటే మొత్తం మీద 4 X 16 = 64 రకాలుగా చంద్రుడు సమీపిస్తూ చరించడం జరుగుతుందని లెక్క వేసుకోవచ్చును. ఈ 64 రకాల 'సమీపగమనాలను' 64 ఉపచారములుగా సంకేతిస్తారు. ఈ సంకేత విద్యలో సూర్యుడు – ఆత్మను, భూమి – దేహాన్ని, చంద్రుడు – మనస్సును సూచిస్తారని తెలియాలి. ఇరుసు వంటి సూర్యుణ్ణి అనుసరించి చంద్రుడు అనుసరించే ఈ 64 ఉపచారాలను – ఆత్మను అనుసరించి మనస్సు చేసే చతుష్షష్టి ఉపచారాలుగా భావించాలి. ఇక్కడ ఆత్మ – అమ్మవారిని, మనస్సు – భక్తుణ్ణి సూచిస్తాయి. ఇది భూగోళ, ఖగోళ శాస్త్ర సంబంధమైన ఆధ్యాత్మిక సమన్వయం.

మొత్తం మీద ఈ నామానికి ఈ క్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1) అరువది నాలుగు ఉపచారములతో ఆరాధింపబడు శ్రేష్ఠమైన దేవత.

2) అరువది నాలుగు విధములైన మనోగమన ఉపచారములతో భక్తుడు ఆరాధించే ఆత్మ అనే పరదేవత.

3) సూర్యుడనే పరమేశ్వరుణ్ణి చేరడానికి 64 రకాలుగా సమీపంగా గమిస్తూ చరించే శ్రేష్ఠమైన చంద్రుడనే అమ్మవారు.

## 236. చతుష్షష్టి కళామయీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'చతుష్షష్టికళామయ్యై నమః' అని చెప్పాలి.

చతుష్షష్టి = అరువది నాలుగు, కళామయీ = కళలు గలది.

చంద్రుని గమనం వలన వచ్చే ఉపచారాలు (సమీపగమనాలు) 64 అని క్రిందటి నామంలో వివరించబడింది. ఈ 64 రకాల ఉపచారాలు సూర్యుణ్ణి సమీపించేందుకు 64 రకాల మార్గాలుగా అర్థం చేసుకుంటే - సూర్యుడనే పరమేశ్వరుణ్ణి చేరడానికి అనుసరించే చంద్రుడనే అమ్మవారి 64 రకాల సమీప గమనాలనే (ఉపచారాలనే) 64 కళలుగా సంకేతిస్తారు. ఇటువంటి '64 కళలు గలిగిన అమ్మవారు' అని ఈ నామానికి అర్థం. (చతుష్షష్టి కళలు అనుబంధములో తెలుపబడినవి.)

సౌందర్యలహరిలో ఆదిశంకరులు 'క్షితౌషట్పంచాశత్....' అనే శ్లోకంలో మనస్సుకు సంబంధించిన ఆజ్ఞాచక్రం వద్ద అమ్మవారి కిరణాలు 64 (మనసిచ చతుష్షష్టిరిచతే) అని చెప్పడంలో గూడా ఔచిత్యమిదే !

ఈ చతుష్షష్టి కళలు అనుబంధంలో ఇవ్వబడ్డాయి.

1) 64 కళలు కలిగినది.

2) చతుష్షష్టి కళాస్వరూపిణి - అని ఈ నామానికి అర్థాలు చెప్పుకోవచ్చును.

## 237. మహాచతుష్షష్టి కోటియోగినీగణ సేవితా

16 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మహాచతుష్షష్టి కోటియోగినీ గణసేవితాయైనమః' అని చెప్పాలి.

మహా = గొప్పదైన, చతుష్షష్టి= అరువది నాలుగు కోట్ల, యోగినీ గణ = యోగినీ బృందముచే, సేవితా = సేవింపబడునది.

ఈ లలితా సహస్ర నామ ప్రథమ భాగ వివరణ – అనుబంధంలో, శ్రీ చక్రములో ఉండే నవావరణములు, ఆ ఆవరణల వద్ద వుండే దేవతల వివరాలు చెప్పబడ్డాయి. ప్రథమావరణం అయిన భూపురంలో మధ్య భాగంలో 8 మంది, దీనికి అటూ ఇటూ 10 మంది చొప్పున ఆవరణ దేవతలు మొత్తం 28 మంది ఉంటారు. మధ్యలో వుండే 8 మంది పేర్లు 1. బ్రాహ్మీ, 2. మాహేశ్వరీ, 3. కౌమారీ, 4. వైష్ణవీ, 5. వారాహీ, 6. మాహేంద్రీ 7. చాముండీ, 8. మహాలక్ష్మీ. వీరిలో ఒక్కొక్కరికి ఎనిమిది మంది చొప్పున అక్షోభ్యాది అంశభూత శక్తిదేవతలుంటారు. అప్పుడు మొత్తం 8 X 8 = 64 మంది ఔతారు. ఈ 64 మందికి ఒక్కొక్కరికి 1 కోటి చొప్పున మొత్తం 64 కోట్ల యోగినీ గణం ఉంటారు. వీళ్లనే చతుష్షష్టికోటి యోగినులు అంటారు. వీళ్లంతా గొప్పశక్తి సంపన్నులు. ఇదే విధంగా నవావరణల్లో 9 X 64 కోట్లు = 576 కోట్ల యోగినులుంటారు. ఇటువంటి వారిచేత సేవింపబడుతుంది కాబట్టి అమ్మవారు 'మహాచతుష్షష్టి కోటి యోగినీగణసేవితా' అనే నామాన్ని పొందింది.

'గొప్పశక్తి సంపన్నులైన 64 కోట్ల యోగినీ దేవతల చేత సేవింపబడునది' అని ఈ నామానికి అర్థం.

## 238. మనువిద్యా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మనువిద్యాయై నమః' అని చెప్పాలి.

మనువిద్యా = మనువు చేత ఉపాసింపబడిన విద్యారూపిణి.

మానవ జాతికి మూలపురుషుడే మనువు. ఈ మనువు గురించి భగవద్గీతలోని జ్ఞానయోగంలో మొట్టమొదటి శ్లోకంలోనే చెప్పబడుతుంది.

''ఇమంవివస్వతే యోగం ప్రోక్తవానహమవ్యయమ్
వివస్వాన్ మనవేప్రాహ మనురిక్ష్వాకవేఽబ్రవీత్''.

యోగ రహస్యాన్ని పరమాత్మ మొట్ట మొదట వివస్వంతునికి ఉపదేశిస్తే – ఆ వివస్వంతుడు (సూర్యుడు) మనువుకు ఉపదేశించాడుట. ఆ మనువు తరువాత

ఇక్ష్వాకువుకు ఉపదేశించాడుట ! ఇదీ ఈ శ్లోకానికి అర్థం ( నేను వివరించిన 'తైత్తిరీయోపనిషత్తు' అనే గ్రంథంలో దీని పూర్తి వివరణ కావలసిన వారు చదువుకోవచ్చును).

అంటే, సూర్యుని తేజస్సు నుండి సూటిగా మొట్టమొదటగా లోకంలోకి వచ్చినవాడు 'మనువు' అన్నమాట ! ఈ మనువు నుండే మానవలోకం ఆవిర్భవించింది. మనువు వ్రాసిందే మనుధర్మ శాస్త్రం. దీన్నే 'మనుస్మృతి' అని కూడా అంటారు. ఇటు వంటి మనువు కూడా అమ్మవారిని తనదైన పద్ధతిలో ఉపాసించి ఆరాధించాడు. ఆ ఉపాసనా విధానాన్ని తెలిపే విద్యను 'మనువిద్యా' అంటారు. ఈ మనువిద్యలో రెండు రకాలున్నాయి. 1) భానువిద్య. ఇది ప్రాతఃకాలంలో ఉపాసింపబడేది. 2) చంద్రవిద్య. ఇది సాయంకాలం ఉపాసింపబడేది. 'మనువిద్య' – మన మనుగడకు అవసరమయేది.

పదిహేను అక్షరాల మంత్రంగా, మూడు కూటములతో మనువు ఉపాసించిన పంచదశాక్షరీ మంత్ర స్వరూపమే అమ్మవారు కాబట్టి, అమ్మవారికి 'మనువిద్యా' అని పేరు వచ్చింది. ఈ విధంగా అమ్మవారిని ఉపాసించింది మనువు ఒక్కడే కాదు. మొత్తం 12 మంది వున్నారు. 1. మనువు, 2. చంద్రుడు, 3. కుబేరుడు, 4. అగస్త్యుడు, 5. లోపాముద్ర, 6. మన్మథుడు, 7. అగ్ని, 8. ఇంద్రుడు, 9. సూర్యుడు, 10. దుర్వాసుడు, 11. స్కందుడు, 12. శివుడు. ఈ 12 మంది చేత శ్రీ విద్యా ఉపాసన, ఆచరణ, వ్యాప్తి జరిగింది.

'మనువు ఉపాసించిన మంత్రము యొక్క స్వరూపము' అని ఈ నామానికి అర్థం.

## 239. చంద్రవిద్యా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'చంద్రవిద్యాయై నమః' అని చెప్పాలి.

చంద్రవిద్యా = చంద్రునిచేత ఉపాసింపబడిన విద్యారూపిణి.

చంద్రుడు చంద్రమండలములను ఆధారముగా చేసుకొని ఉపాసించు విద్యను 'చంద్రవిద్యా' అంటారు. ఇంతకు ముందు చెప్పిన నామంలో అమ్మవారి ఉపాసకులలో

'చంద్రుడు' ఒకడు అని చెప్పబడింది. ఈ చంద్ర విద్యకు శ్రీ విద్యకు చాలా దగ్గర సంబంధం వుంటుంది. చంద్రుని షోడశకళలు, తిథులు, పర్వదినాలు, నక్షత్రాలు మొదలైన లెక్కలతో ఈ చంద్ర విద్య ఉంటుంది. అంతా అమ్మవారి పరంగానే వుంటుంది. అందుకని అమ్మవారిని చంద్ర విద్యాస్వరూపిణి గా చెబుతారు.

'చంద్రవిద్యాస్వరూపిణి' అని ఈ నామానికి అర్థం.

## 240. చంద్రమండలమధ్యగా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'చంద్రమండల మధ్యగాయై నమః' అని చెప్పాలి.

చంద్ర = చంద్రసంబంధమైన, మండల = మండలము నందు, మధ్యగా = మధ్యగా నుండునది.

ప్రతి వ్యక్తిలోను 'సోమకందము' అని ఒకటి ఉంటుంది. దీన్నే ఆంగ్లంలో Pinial Gland' అని అంటారు. ఈ గ్రంథి సరిగా లేకపోతే హృదయస్పందన సరిగా ఉండదు. తత్ఫలితంగా శ్రుతిలయాత్మకజ్ఞానం నశిస్తుంది. రుద్రగ్రంథి, ఇంద్రగ్రంథి కలసి ఉన్న స్థానం వద్ద ఇది ఉంటుంది. దీన్నే – చంద్రస్థానం అనీ, సుధాసింధువనీ, బిందు సరమనీ, మానస సరోవరమనీ కూడా అంటారు. చంద్రాగ్నుల సంధి స్థానం కూడా ఇదే ! దీన్నే ప్రకృతీ పురుషుల మేళన స్థానంగా గూడా చెబుతారు.

'చంద్రమండల మధ్యస్థమున ఉండునది' అని ఈ నామానికి అర్థం.

## 241. చారురూపా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'చారురూపాయైనమః' అని చెప్పాలి.

చారురూపా = మనోహరమైన రూపము కలిగినది.

ప్రపంచమంతా అమ్మవారి సౌందర్యంతో నిండి ఉంటుంది. ప్రతి అణువు సౌందర్యమే కాని, మిగిలిన వాటితో కలిస్తే సౌందర్యం పరిపూర్ణమవుతుంది. అందంగా

ఉన్న వస్తువు లోని భాగాలన్నీ అందంగా ఉంటేనే ఆ వస్తువుకు అందం వస్తుంది. అలా కాకపోతే – 'ఈ ఒక్కటీ గూడా అందంగా ఉండి వుంటే ఇంకా బాగుండేది' అని అనిపిస్తుంది. ఇటువంటి లోపం లేకుండా ఉన్నదే అమ్మవారి సమగ్ర స్వరూపం.

'మనోజ్ఞమైన రూపం కలది' అని ఈ నామానికి అర్థం.

## 242. చారుహాసా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'చారుహాసాయైనమః' అని చెప్పాలి.

చారుహాసా = అందమైన మందహాసము కలది.

అమ్మవారి తేజస్సు సూర్యుని ప్రకాశంగాను, సాన్నిధ్యం చంద్రుని వికాసంగాను ఉంటాయి. చంద్రుని వికాసానికి కారణం వెన్నెలే ! అమ్మవారి ముఖం – నిండు శరత్పూర్ణిమా బింబం. అసలు చంద్రుడే అందంగా, ఆహ్లాదకరంగా ఉంటాడు. ఆ చంద్రుడు నవ్వితే ఇంక ఎంత అందంగా, ఆహ్లాదకరంగా ఉంటుందో ! అలాంటి అందమైన చంద్రుని ఆహ్లాదకరమైన నవ్వును గలిగి ఉండే అమ్మవారి హాసం అతి మనోహరంగా ఉంటుంది. ఈ నవ్వులో స్వచ్ఛత, పవిత్రత, ప్రసన్నత, ప్రకృష్టంగా ఉంటాయి కాబట్టే 'చారుహాసా' అనే నామం చెల్లింది అమ్మవారికి.

'మూకుడు' అనే మూగకవి అమ్మవారి అనుగ్రహంతో అమ్మవారి ఈ మందహాసం మీద 'మందస్మిత' మనే శతకం ఆశువుగా చెప్పాడు. 'మూకపంచశతి' లోని ఐదవభాగమే ఈ శతకం.

అమ్మవారి మందహాసాన్ని ధ్యానం చేసిన వారికి ప్రాపంచిక పారమార్థిక సుఖాలు రెండూ దక్కుతాయి. అంటే – అమ్మవారి ఈ మధుర హాసధ్యానం భోగమోక్ష ప్రదం' అన్నమాట.

'మనోహరమైన మందహాసం గలది' అని ఈ నామానికి అర్థం.

## 243. చారుచంద్రకళాధరా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'చారుచంద్రకళాధరాయైనమః' అని చెప్పాలి.

చారుచంద్ర = అందమైన చంద్రుని, కళాధరా = కళను ధరించునది.

అమ్మవారి ముఖం శరత్పూర్ణిమా చంద్రబింబంలాగా ఉంటుంది. అలాంటి అమ్మవారు అలంకార ప్రాయంగాను, ఆభరణంగాను అందమైన చంద్రుని గూడా శిరస్సుపై ధరించి ఉంటుంది. అయితే ఈ విధంగా ధరింపబడిన చంద్రుడు పూర్ణచంద్రుడు కాడు. చంద్రునికి వుండే ఒకే ఒక అందమైన కళ మాత్రమే! వక్రమయూఖం (వంపులకిరణం) లాగా భాసించే చంద్రకళా రేఖాకృతిని దాల్చిన అమ్మవారిని చూస్తే, అమ్మవారి తేజస్సు – సూటిగానే కాక సుళ్ళు తిరుగుతూ కూడా ప్రసారమౌతూ ప్రకాశిస్తుందేమోననిపిస్తుంది.

అయితే ఏ పక్ష(Fort Night) పరంగా చూసినా పక్షపాతం(Partiality) లేకుండా సమరూపాన్ని, సమతేజస్సును కలిగి వుండే అష్టమి తిథికి చెందిన కళాకృతిని ( దీన్నే 16 నిత్యలలో 'త్వరితా' నిత్యతో సూచిస్తారు.) మకుటాలంకారంగా ధరిస్తుందని శ్రీ విద్యా సంప్రదాయ రహస్యార్థం.

'అందమైన (అర్థ) చంద్రకళను మకుటాలంకారంగా ధరించినది' అని ఈ నామానికి అర్థం.

## 244. చరాచరజగన్నాథా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'చరాచరజగన్నాథాయై నమః' అని చెప్పాలి.

చర = కదిలెడి, అచర = కదలని (వస్తు జీవసముదాయముగల) జగత్ = ఈ జగత్తుకు, నాథా = అధినాథురాలు లేదా ప్రభ్వి.

ఈ జగత్తులో సమస్త వస్తు జీవరాశులన్నిటినీ – 'కదిలేవి', 'కదలకుండా స్థిరంగా వుండేవి' – అని రెండు విభాగాలుగా గుర్తించవచ్చును. రాళ్ళు, అప్పలు, పర్వతాలు

ఇటువంటివి కదలవు. కాబట్టి, ఇవి అచరములు. కీటక, పక్షి, జంతు, మానవాది 84 లక్షల జీవరాశులు కదలిక గలిగినవి కాబట్టి, ఇవి చరములు. ఈ రెంటితోను ఉన్నదే జగత్తు. అటువంటి జగత్తుకు అధినాథురాలు అమ్మవారు.

'నాథ' అనే పదానికి 'భర్త', ప్రధాన నాయకుడు, ఉన్నతాధికారి. అనే అర్థాలు ఉన్నాయి. 'న' + 'అథ' అనే ఈ రెండు పదాల కలయిక వలన 'నాథ' అనే పదం ఏర్పడింది. అథ – అంటే 'అటుపైన' అని, న – అంటే 'లేదు' అనీ అర్థం. అంటే – 'ఇటుపైన ఇంకెవ్వరూ లేరు' అనే స్థితిలో ఎవరికైనా ఎవరైనా ఉంటే ఆ రెండో వారు మొదటివారికి 'నాథ' అనే మాటకు అర్హులౌతారు. భార్యకు భర్తను మించి అధికంగా ఇంకెవరూ లేకపోతే ఆ భర్త ఆ భార్యకు నాథుడౌతాడు. లేకపోతే కేవలం 'తాళి కట్టిన పెనిమిటి' మాత్రమే ఔతాడు. లేదా 'అధికారం చెలాయించే భర్త' అవుతాడు.

ప్రజలకు తమని పరిపాలించే వాడికన్నా ఇంకా అధికారిగా ఎవ్వరూ పైన ఉండకపోతే – ఆ పరిపాలించేవాడు ఆ ప్రజలకు 'నాథు' డౌతాడు.

అలాగే ప్రస్తుతం ఈ జగత్తుకు – అమ్మవారిని మించి ఆపైన పై అధికారి ఎవ్వరూ లేరు కాబట్టి, అమ్మవారు 'జగన్నాథా' అన్న పదానికి అర్హురాలు. ఎందుకంటే – సృష్టి, స్థితి, లయ కారకులైన త్రిమూర్తులు గూడా అమ్మవారి ఆజ్ఞలకు బద్ధులయే తమ కర్తవ్యాలను నిర్వర్తిస్తున్నారు కదా!

ఈ నామంలో ఉపయోగించిన 'చర' 'అచర' పదాలకు శాస్త్రీయమైన ఇంకో అర్థం ఉంది. ఈ జగత్తు అంతా 'చోటు' తోను, ఆ చోటు నుండి ఉత్పన్నమైన పంచభూతాలతో తయారైన వస్తుజాలంతోను – అమ్మవారుగా నిండి ఉంది. 'చోటు' గా ఒక 'చోటు' నుండి ఇంకో చోటుకు చలనం (Movement) ఉండదు. ఈ లక్షణం అమ్మవారికి ఉండే 'అచర' లక్షణ విశేషాన్ని, చోటులో వస్తువుల కదలిక లక్షణం అమ్మవారి 'చర' లక్షణ విశేషాన్ని సూచిస్తాయి.

(భ్రమణంలో ఉన్న వస్తువు ఏ అక్షాన్ని(Axis) ఆధారంగా చేసుకుని తిరుగుతుందో ఆ అక్షానికి కదలిక వుండదు. కాని, ఆ వస్తువుకు కదలిక వుంటుంది. ఇలా 'ఒకే సమయంలో రెండు లక్షణాలు ఆ వస్తువులో ఉంటాయి'. అని కూడా గుర్తుపెట్టుకోవాలి.

అందుకే భగవద్గీతలో గీతాచార్యుడు – 'కదులుతున్న దాంట్లో కదలకుండా వుండేది నేను' అన్నాడు.)

మొత్తం మీద ఈ నామానికి ఈ క్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1) కదలెడి, కదలని వస్తు జీవ సముదయాత్మకమైన జగత్తుకు అధినాథురాలు.

2) కదలని చోటులో కదలని లక్షణాన్ని, కదిలే వస్తు జీవజాలంలోని కదిలే లక్షణాన్ని కలిగిన అధిష్ఠాత్రి.

## 245. చక్రరాజ నికేతనా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'చక్రరాజనికేతనాయైనమః' అని చెప్పాలి.

చక్రరాజ = చక్రములలో గొప్పదైన దానిని, నికేతనా = నిలయముగా కలిగినది.

సూర్యుడు కేంద్రంగా ఉండి మిగిలిన గ్రహ ఉపగ్రహాలు తిరుగుతూ ఉండే వ్యూహాన్ని 'సూర్యకుటుంబం' అంటారు. ఈ వ్యూహం కూడా చక్రభ్రమణ లక్షణం కలది కాబట్టి దీనిని చక్రంతో పోల్చవచ్చు.

ఇటువంటి సూర్యులే మనకు ఆకాశంలో కనబడే తారలు (Stars)( నక్షత్రాలు కాదు) ప్రతి 'తారకు' సూర్యునికి ఉన్నట్లే వారి వారి కుటుంబ వ్యూహాలుంటాయి. అవి కూడా చక్రవ్యూహాన్ని కలిగి ఉంటాయి. జగత్తులోని అన్ని తారకల చక్రవ్యూహాలకు సామూహికమైన ఒకే ఒక చక్రాన్ని ఊహిస్తే దాన్ని 'జగచ్చక్రవ్యూహం' అంటారు. ఈ జగచ్చక్రవ్యూహం లోని కేంద్రాన్ని అనుసరించే అన్ని చక్రవ్యూహాల కదలికలు ఆధారపడి ఉంటాయి. అందువల్లనే ఈ జగచ్చక్రాన్ని 'చక్రరాజం' గాను, దాని కేంద్రబిందువును 'అమ్మవారి నిలయం' గాను సమన్వయించుకోవాలి.

ప్రతి దేవతకు వేరు వేరు యంత్రాలు, మంత్రాలు, తంత్రాలు ఉన్నాయి. యంత్రాలనే చక్రాలని గూడా అంటారు. దేవతాపరమైన ఈ చక్రాలన్నిటిలో విశిష్టమైనది, అన్ని చక్రాలకు ఆధారభూతమైనది అయిన శ్రీ చక్రాన్ని – 'చక్రరాజము' అంటారు. ఆ

శ్రీ చక్రంలోని బిందువు వద్ద అమ్మవారు ఉంటుంది కాబట్టి 'చక్రరాజనికేతనా' అనే పేరు అమ్మవారికి వచ్చింది. (అయితే ఈ అర్థం ఇక్కడ చెప్పుకుంటే స్తోత్రానికి చివర్లో వచ్చే 'శ్రీచక్రరాజనిలయా' అన్న 996 నామానికి మళ్ళీ ఇదే అర్థం చెప్పుకోవలసి ఉంటుంది. అందుకని ముందు చెప్పిన అర్థం ఇక్కడ చెప్పుకుంటే సరిపోతుంది.

'జగచ్చక్ర కేంద్రమే నిలయంగా గలది' అని ఈ నామానికి అర్థం.

## 246. పార్వతీ

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పార్వత్యైనమః' అని చెప్పాలి.

పార్వతీ = పర్వతరాజ పుత్రి.

పర్వతాలన్నింటికీ 'రాజు', అంటే – అధికుడు – హిమవత్పర్వతం. ఈ హిమవత్పర్వతేశ్వరుని కూతురు కాబట్టి అమ్మవారికి 'పార్వతి' అనే పేరువచ్చింది.

'పర్వతము' అంటే – 'కొండ' అనేది సామాన్యార్థం. 'లంక' అనే పదానికి ' 'Island' అనే అర్థం సరిఅయినది ఎలాకాదో. 'పర్వతం' – అంటే కొండ(Mountain or Hill) అని అనడం కూడా అలాంటిదే ! Island అనే ఆంగ్లపదానికి 'ద్వీపము' అని పదం ఉంది సంస్కృతంలో. రెండు మార్గాలుగా నీళ్ళుపోయి మళ్ళీ కలుసుకున్నప్పుడు, ఆ రెండు మార్గాలకు మధ్య ఏర్పడే భూభాగాన్ని 'ద్వీపం' (ద్వి–ఆపః) అంటారు. అయితే మరి 'లంక' అనే పదానికి ఆంగ్లపదం ఏమిటంటేEquator (భూమధ్యరేఖ) (లంక అనే పదానికి ఈ అర్థం ఉంది కాబట్టే – జ్యోతిశ్శాస్త్రంలో 'లంకోదయ చక్రం' అనే మాట వస్తుంది) ప్రస్తుతం – పర్వతం అనే పదానికి కూడా శాస్త్రీయమైన అర్థం వేరే వుంది. భూగోళాన్ని(Earth Globe) నారింజకాయలోని తొనల లాగా నిలువుగా కోస్తే వచ్చే భాగాలను 'ఖండాలు' అంటారు. వీటినే జ్యోతిశ్శాస్త్రంలో గాని, భూగోళ శాస్త్రంలో గాని 'Longitudes' (రేఖాంశలేక తులాంశరేఖలు) అంటారు. భూగోళంలో ఉండే ఉత్తరార్థ గోళాన్ని 'జంబూద్వీపం' అంటారు. ఈ జంబూద్వీపంలో కొంత ప్రదేశాన్ని 'భరత వర్షం' అంటే – ఆ భరత వర్షంలో ఉండే ఒక ఖండాన్ని 'భరతఖండం' అంటారు.

అందుకనే మనవాళ్ళు పూజకు ముందర చెప్పుకునే సంకల్పంలో పూజ జరిగేచోటు ఎక్కడ ఉన్నదీ చెప్పడం కోసం జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే .... అని చెప్తారు.

ఇక భూగోళాన్ని నిలువుగా కాక, అడ్డంగా వృత్తాకారపు ముక్కలుగా కోస్తే ఆ వృత్తాలను 'పర్వములు' అంటారు. వీటినే ఖగోళ, భూగోళ, జ్యోతిశ్శాస్త్రాలలో'Latitudes' అంటారు. అంటే – అక్షాంశ రేఖలన్నమాట! భూమి మీద గల ప్రదేశాల మధ్య దూరాన్ని కొలిచేవి ఈ 'పర్వాలే'! (రెండు ప్రక్క ప్రక్కల అక్షాంశ రేఖల మధ్య దూరం 69 4/9 మైళ్ళు ఉంటుదని చిన్న తరగతుల్లో చెబుతారు). అంటే, భూమి మీద ప్రదేశాలను కొలిచేందుకు ఉపయోగపడే వాటిని 'పర్వములు' (Nodal Points) అంటారన్నమాట! భూమి మీద సూర్యుని వల్ల కలిగే తమ నీడలను బట్టి కొండలు భూమిని కొలుస్తాయి. కాబట్టి కొండలకు – 'పర్వతాలు' ని పేరు వచ్చింది. (సప్తకుల పర్వతాలనే మాట కూడా ఇలా వచ్చిందే!) అటువంటి పర్వతాల్లో అత్యున్నతమైనది, మహిమాన్వితమైనది అయిన 'హిమవత్పర్వత రాజుకు పుత్రికకాబట్టి – అమ్మవారిని 'పార్వతి' అన్నారు.

(కాలపరంగా ఆలోచించినపుడు 'అమావాస్య', 'పూర్ణిమ' తిథులు మాసకాలాన్ని కొలవడానికి ఉపయోగిస్తాయి కాబట్టి – ఈ రెంటినీ కూడా 'పర్వములు' అంటారు. చెఱకుగడలోని కణుపులు – చెఱకు గడ పొడవును కొలవడానికి ఉపకరిస్తాయి కాబట్టి ఆ కణుపులను కూడా 'పర్వములు' అంటారు. మహాభారత విస్తృతిని కొలిచి చెప్పడానికి ఉపయోగిస్తాయి కాబట్టి దాని 18 భాగాలకు కూడా 18 'పర్వాలనే' పేరు పెట్టారు.)

'పర్వతరాజు పుత్రిక' అని ఈ నామానికి అర్థం.

## 247. పద్మనయనా

అయిదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పద్మనయనాయైనమః' అని చెప్పాలి.

పద్మ = పద్మములవంటి, నయనా = నయనములు కలది.

నేత్రాలను పద్మాలతో పోల్చడంలో చాలా ఔచిత్యం ఉంది. వెలుగుకు, చీకటికి కన్నులు బాగాస్పందిస్తాయి. వెలుగులో చైతన్యవంతమై చూడకలిగి, చీకటిలో చూడలేక

నిద్రలోకి జాఱుకున్నట్లు అయిపోతాయి. పద్మాలు కూడా సూర్యుని వెలుగుకు బాగా వికసిస్తూ ప్రఫుల్లవంతమై, చీకటిలో ముకుళిస్తూ నిద్రలోకి జారుకున్నట్లు అయిపోతాయి. 'రెప్పపాటు' – కాలాన్ని కొలవడానికి ఒక చిన్న ప్రమాణం, అలాగే పద్మం 'వికసించటం – ముకుళించటం' – లకు మధ్యకాలం కూడా కాలాన్ని కొలవడానికి పనికి వస్తుంది.

కన్నులకు, పద్మాలకు ఉండే – వికసించటం (తెరుచుకోడం) ముకులించటం (మూసుకోటం); సూర్యుని వెలుగుతో సంబంధాన్ని కలిగి ఉండటం; కాలాన్ని కొలవడానికి ప్రమాణాలుగా కూడా ఉపయోగపడడం – లాంటి సమాన లక్షణాల వలన నేత్రాలను పద్మాలతో పోలుస్తారు.

అమ్మవారి కళ్ళను పద్మాలతో పోల్చడంలో మరింత ఔచిత్యం ఉంది. శ్వేతపద్మాలు, లోహిత (రక్తవర్ణం) పద్మాలు – అని రెండు రకాల పద్మాలుంటాయి. అమ్మవారి దక్షిణనేత్రం సూర్యాత్మకం. ఇది రక్తవర్ణ పద్మాన్ని సూచిస్తుంది. అలాగే అమ్మవారి వామ నేత్రం చంద్రాత్మకం – ఇది శ్వేత వర్ణపద్మాన్ని సూచిస్తుంది. ఇటువంటి సంబంధము కలిగినవి కాబట్టే అమ్మవారి నయనాలను పద్మాలతో పోలుస్తారు.

'పద్మములతో పోల్చదగిన నేత్రములు గలది' అని ఈ నామానికి అర్థం.

## 248. పద్మరాగసమప్రభా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పద్మరాగసమప్రభాయైనమః' అని చెప్పాలి.

పద్మరాగ = పద్మరాగముల కాంతికి, సమ = సమానమగు, ప్రభా = శరీరకాంతి కలది.

ఉత్తమ జాతి పద్మరాగ మణులు ఎఱ్ఱగా వుంటాయి. అమ్మవారి శరీర కాంతి కూడా అలాగే వుంటుంది.

ఎఱ్ఱని వెలుగులు విరజిమ్మడంలో పద్మరాగమణులు ఎలాంటివో అమ్మవారి శరీరకాంతులు గూడా అలాంటివే అనే విషయాన్ని – ''అరుణాంకరుణాతరంగితాక్షీం'' అని చెప్పే ధ్యాన శ్లోకమే వివరిస్తుంది.

'పద్మరాగ మణుల కాంతికి తుల్యమైన శరీరకాంతులు కలది' అని ఈ నామానికి అర్థం.

## 249. పంచప్రేతాసనాసీనా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పంచప్రేతాసనాసీనాయైనమః' అని చెప్పాలి.

పంచప్రేతా = పంచప్రేతలైన బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివులను, ఆసనాసీనా = ఆసనముగా కలిగి ఆసీనురాలైనది.

ప్ర + ఈతా = ప్రేతా అని విడదీస్తే అసలైన శాస్త్రార్థం వస్తుంది. ప్ర – అంటే చక్కగా, ఈతా – అంటే వెళ్ళిపోయినది. 'చక్కగా వెళ్ళిపోయినది' – అంటే, పరలోకానికి అని ఒక అర్థం, చక్కగా పంచభూతాల్లోకి అంటే పదార్థంలోకి వెళ్ళిపోయినది అని రెండో అర్థం. ఇలా 'పంచభూతాల్లోకి వెళ్ళిపోగలిగే ద్రవ్యాన్ని ఆసనంగా చేసుకుని కూర్చుని ఉన్నది' అంటే – 'పంచభూతాలలో అధివసించి ఉన్నది' అని అర్థం.

పంచభూతాలకు – పంచ బ్రహ్మలైన బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివులు అధిపతులు. వీరి శక్తి క్షీణించినపుడు వీరు కూడా పంచభూతాలలోకి లీనమైపోతారు. (సౌందర్య లహరిలోని – 'విరించి ః పంచత్వం...' అన్న శ్లోకంలో ఆదిశంకరులు వివరిస్తారు.) అప్పుడు మొదటి నలుగురు నాలుగు కోళ్ళుగాను, సదాశివుడు పర్యంకంగాను ఏర్పాటైన మంచంమీద అమ్మవారు ఆసీనురాలై ఉంటుంది.

''పంచప్రేతల ఆసనముపై ఆసీనురాలైనది'' అని ఈ నామానికి అర్థం.

## 250. పంచబ్రహ్మస్వరూపిణీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పంచబ్రహ్మస్వరూపిణ్యైనమః' అని చెప్పాలి.

పంచబ్రహ్మ = పంచబ్రహ్మల, స్వరూపిణి = స్వరూపమైనది.

'పద్మరాగ మణుల కాంతికి తుల్యమైన శరీరకాంతులు కలది' అని ఈ నామానికి అర్థం.

## 249. పంచప్రేతాసనాసీనా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పంచప్రేతాసనాసీనాయైనమః' అని చెప్పాలి.

పంచప్రేతా = పంచప్రేతలైన బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివులను, ఆసనాసీనా = ఆసనముగా కలిగి ఆసీనురాలైనది.

ప్ర + ఈతా = ప్రేతా అని విడదీస్తే అసలైన శాస్త్రార్థం వస్తుంది. ప్ర – అంటే చక్కగా, ఈతా – అంటే వెళ్ళిపోయినది. 'చక్కగా వెళ్ళిపోయినది' – అంటే, పరలోకానికి అని ఒక అర్థం, చక్కగా పంచభూతాల్లోకి అంటే పదార్థంలోకి వెళ్ళిపోయినది అని రెండో అర్థం. ఇలా 'పంచభూతాల్లోకి వెళ్ళిపోగలిగే ద్రవ్యాన్ని ఆసనంగా చేసుకుని కూర్చుని ఉన్నది' అంటే – 'పంచభూతాలలో అధివసించి ఉన్నది' అని అర్థం.

పంచభూతాలకు – పంచ బ్రహ్మలైన బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివులు అధిపతులు. వీరి శక్తి క్షీణించినపుడు వీరు కూడా పంచభూతాలలోకి లీనమైపోతారు. (సౌందర్య లహరిలోని – 'విరించి ః పంచత్వం...' అన్న శ్లోకంలో ఆదిశంకరులు వివరిస్తారు.) అప్పుడు మొదటి నలుగురు నాలుగు కోళ్ళుగాను, సదాశివుడు పర్యంకంగాను ఏర్పాటైన మంచంమీద అమ్మవారు ఆసీనురాలై ఉంటుంది.

''పంచప్రేతల ఆసనముపై ఆసీనురాలైనది'' అని ఈ నామానికి అర్థం.

## 250. పంచబ్రహ్మస్వరూపిణీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పంచబ్రహ్మస్వరూపిణ్యైనమః' అని చెప్పాలి.

పంచబ్రహ్మ = పంచబ్రహ్మల, స్వరూపిణి = స్వరూపమైనది.

ఒక విషయం అర్థం కాక పూర్వం, అర్థమైన తర్వాత ఉండే స్థితులకు ఏ తేడా అయితే ఉందో దానిని; మెలకువ రాకపూర్వం మెలకువ వచ్చిన స్థితులకు ఏ తేడా అయితే ఉందో దానిని – 'చిత్' అంటారు. వాస్తవానికి ఇటువంటి రెండు స్థితులలోను మనిషిలో భౌతికంగా ఏ మార్పూరాదు కాబట్టి, 'చిత్' అనేది 'సూక్ష్మ శక్తి' కాని పదార్థమయమైంది కాదు, అందుకే ఈ చిత్ శక్తి భౌతికమైన, పరిమితమైన – కొలతలు గల పాత్రలతో నింపుకుని కొల్లగొట్టబడేది కాదు. అంతటా ఈ 'చిత్‌శక్తి' నిండి ఉంటుంది. దానికి శ్రుతి చేయబడి పొందిన ప్రేరణను బట్టి ఉపాసకునికి అది దక్కుతుంది. అయినా అలా పొందబడిన, అంతటానిండి ఉన్న ఆ 'చిత్ శక్తి' కి తరుగు ఉండదు. ఇలా అంతటా నిండి ఉన్న అమ్మవారిని 'చిన్మయీ' అన్నారు.

'జ్ఞానముగా నిండి వున్నది' అని ఈ నామానికి అర్థం.

## 252. పరమానందా

అయిదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పరమానందాయై నమః' అని చెప్పాలి.

పరమానందా = బ్రహ్మానంద స్వరూపము లేక నిరపేక్షకానంద రూపము.

చిత్, ప్రకాశ, విమర్శ బిందు క్రమంలో జ్ఞానం వ్యక్తమౌతుంది. – దీనికి వ్యతిరేక క్రమంలో అంటే, విమర్శ – ప్రకాశ – చిత్ క్రమంలో ఒక దానిలో ఒకటి లీనమైతే వచ్చే స్థితిని 'పరమానంద స్థితి' అంటారు. ఆ స్థితిలోని అమ్మవారు ' పరమానంద' ఔతుంది. 'చిన్మయీ' 'పరమానందా' స్థితులను ఈక్రింద సూచించిన విధంగా అర్థం చేసుకోవచ్చును.



(1) (2)

మొదటి పటం – 'కేంద్రం వద్ద ఉన్న 'నేను' నుండి అంటే, 'ఆత్మ' నుండి చిత్ – ప్రకాశ - విమర్శ మార్గంలో జ్ఞానం వ్యక్తమై అంతా చిన్మయమౌతుంద'ని సూచిస్తుంది.

రెండవ పటం – 'చిన్మయీ స్థితినుండి విమర్శ – ప్రకాశ –చిత్‌మార్గంలో జ్ఞానం కేంద్రం వద్ద ఉన్న 'నేను' అంటే ఆత్మలోనికి లీనమౌతుంది' అని సూచిస్తుంది. ఇక్కడ 'చిన్మయీ'ని – 'అమ్మవారు'గాను, కేంద్రం వద్ద వున్న 'నేను' లేదా 'ఆత్మ'ను – 'అయ్యవారు' గాను సమన్వయ పరచుకోవాలి.

'నేను' అనే అయ్యవారిలో లీనమై యుండే 'జ్ఞానం' అనే 'అమ్మవారి'ని 'పరమానందా' అంటారు. ఈ స్థితిని 'ముక్తి' లేదా 'మోక్షము' లేదా తైత్తిరీయోపనిషత్తులోని ఆనందవల్లిలో చెప్పిన పరాకాష్ఠ ఆనంద స్థితి అయిన 'బ్రహ్మానంద స్థితి' అంటారు. ఇలాంటి బ్రహ్మానంద స్థితులు మనకు అప్పుడప్పుడు లభ్యమౌతూనే ఉంటాయి. కాని, అవి అలాంటివని మనం గమనించం అంతే !

'నిరపేక్షక నిరతిశయానందరూపము' అని ఈ నామానికి అర్థం.

## 253. విజ్ఞానఘనరూపిణీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'విజ్ఞానఘనరూపిణ్యైనమః' అని చెప్పాలి.

విజ్ఞాన = విజ్ఞానము, ఘన = స్థిరత్వము పొందిన, రూపిణీ = రూపము గలది.

'మూర్తీభవించిన విజ్ఞానమే అమ్మవారు అంటే – 'విజ్ఞానం' – ఒక రూపుకట్టుకుంటే – ఆ రూపం అమ్మవారిది. (Embodiment of Knowledge or wisdom in flesh, blood and frame) అని అర్థం.

ఒక వస్తువును తయారు చేద్దామనుకున్నపుడు ఆ వస్తువు తాలుకు అన్ని వివరాలు సూక్ష్మంగా బుద్ధిలో ఉంటాయి. ఆ వివరాలనే ఆ వస్తువు యొక్క 'విజ్ఞానం' అంటాము. (ఉదా: మట్టితో చేసిన అరటిపండును చూసినపుడు – 'అచ్చు అరటిపండులాగా వుంది' అంటాము. అలా అరటిపండులాగా ఉంది అంటున్నపుడు మన మనస్సులో మెదిలే అరటిపండు తాలుకు లక్షణాలు – ఆ అరటి పండు తాలుకు విజ్ఞానం అవుతుంది).

తయారుచేసేవాడి బుద్ధిలో సూక్ష్మంగా వున్న వస్తు వివరణ విజ్ఞానం ఘనీభవించి పదార్థ మయమైన ఒక రూపును పొంది సృష్టిలో ఒక వస్తువుగా వ్యక్తమవుతుంది. సృష్టిలోని అన్ని వస్తువుల, జీవరాశుల విజ్ఞానం ఇలాగే ఘనీభవించి పదార్థమయంగా వ్యక్తమయితేనే ఈ సృష్టి ఏర్పడింది. కాబట్టి అమ్మవారు 'విజ్ఞానఘనరూపిణి!

'సమస్త విజ్ఞానము ఘన రూపం చెందిన 'సృష్టిస్వరూపిణి' అని ఈ నామానికి అర్థం.

## 254. ధ్యాన ధ్యాతృ ధ్యేయరూపా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ధ్యానధ్యాతృధ్యేయరూపాయైనమః' అని చెప్పాలి.

ధ్యాన = ధ్యానము యొక్క, ధ్యాతృ = ధ్యానము చేయు వాని యొక్క, ధ్యేయ = ధ్యాన లక్ష్యము యొక్క, రూపా = సమన్వయ, సమైక్య రూపము.

పతంజలి మహర్షి యోగసూత్రాల్లో సమాధిస్థితిని గూర్చి ''త్రయమేకత్ర సంయమమ్'' అన్నాడు. దృశ్యము, దృష్టి, ద్రష్ట; జ్ఞానము, జ్ఞేయము, జ్ఞాత ఇటువంటి వాటిని 'త్రిపుటి' అంటారు. ఈ మూడింటి మధ్య అంతరం వర్తించకుండా ఒకటైపోయిన స్థితిని 'సమాధిస్థితి' అని పతంజలి చెప్పిన సూత్రానికి అర్థం. ధారణలో – ధారణ చేసేవాడు, ధారణ చేయబడేది అనే రెండు ఉంటాయి. కాని ధ్యానంలో అలా వుండవు. ధ్యాత, (అంటే – ధ్యానం చేసేవాడు) ధ్యేయం (అంటే – ధ్యానం చేయబడేది) వేరు వేరుగా ఉన్నంతవరకు యోగలక్ష్యం చేకూరినట్లుకాదు. ఈ రెండూ 'ధ్యానము' అనే ప్రక్రియలో కలసిపోవాలి. ఒక చలన చిత్రం చూస్తున్నపుడు మొదట్లో తెర, పాత్రలు, పాత్రధారులు ప్రేక్షకుడు – ఇలా విడివిడిగా వున్నప్పటికీ – రాను రాను కథాసన్నివేశాల్లో లీనమైనపుడు –చూస్తున్నది సినిమా అని, బొమ్మలు తెరమీద పడుతున్నవని, పాత్ర వేసిన పాత్రధారులు ఫలానా వారని ఇలా ఏవీ గుర్తుండవు – చూడటంలో అన్నీ లీనమై పోయి 'అనుభూతి' మాత్రం మిగులుతుంది. అలాగే 'ధ్యానం' లో – 'ధ్యాత' – 'ధ్యేయము' లీనమై పోయి 'అనుభూతి' ఒక్కటే వర్తిస్తుంది. ఆ అనుభూతి – అమ్మవారు. ఈ స్థితిలో

'ధ్యాన, ధ్యాతృ, ధ్యేయాల – సమష్టి, సమైక్య రూపమే అమ్మవారు' అని ఈ నామానికి అర్థం. క్రింది పటంలో ఈ స్థితి కేంద్రం వద్ద బిందువుగా అమ్మవారు చూపబడింది.




1) ధ్యాన, ధ్యాతృ, ధ్యేయాల యొక్క సమష్టి సమైక్య స్వరూపిణి. 2) ధ్యానము - (అంటే – ఉపాసన), ధ్యాత – (అంటే – ధ్యానం చేసే వాడు), ధ్యేయము – (అంటే - ఉపాస్యదేవత) – ఈ మూడూ తన స్వరూపముగా గలది అమ్మవారు – అని ఈ నామానికి అర్థం.

## 255. ధర్మాధర్మవివర్జితా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ధర్మాధర్మవివర్జితాయైనమః' అని చెప్పాలి.

ధర్మ = విహితకర్మలు (విధింపబడిన కర్మలు. అధర్మ = అవిహిత కర్మలు (నిషిద్ధకర్మలు) (అనునవి) వివర్జితా = లేనిది.

సాధారణంగా 1) మనం చేసిన పనికి అనుకూలమైన ఫలితం వస్తే ఆ పనిని మనం జాగ్రత్తగా చేశామని, అనుకూలంగా రాకపోతే ఆ పనిని అజాగ్రత్తగా చేసామని అనుకుంటాము. అలాగే – 2) ఒక పనిని చేసి – ఒక్కొక్కసారి చాలా మంచి పని చేశామని, ఒక్కొక్క సారి చెడ్డపని చేశామని అనుకుంటాము. అలాగే – 3) మనకు ఇష్టమైన పనిచేస్తే మంచి ఫలితాన్ని, ఇష్టం లేని పనిచేస్తే అది చెడ్డఫలితాన్ని ఇస్తాయని కూడా అనుకుంటాము.

పై మూడు సందర్భాలలోను 'జాగ్రత్తగా చేశాము – అజాగ్రత్తగా చేశాము'; 'మంచి పనిచేశాము – చెడ్డపని చేశాము'; 'మంచి ఫలితం – చెడ్డఫలితం'; అనే మాటలు మనం అనుకున్నవి అనుకున్నట్లుగా 'జరిగినపుడు – జరగనపుడు' అనుకునే మాటలు.

ఎంత జాగ్రత్తగా, త్రికరణశుద్ధిగా చేసినా – ఒక్కొక్కప్పుడు చేసిన పనికి అనుకున్నట్లుగా ఫలితం రాకపోవచ్చు. చేసిన పనికి 'ఇలా ఫలితం రావాలని' మనం ముందే నిర్ణయించుకోడం వలన ఇలాంటివి జరుగుతాయి. జరిగే పనులన్నీ అమ్మవారి సంకల్పం ప్రకారమే జరుగుతాయి కాబట్టి, అజాగ్రత్తగా చేసినా, త్రికరణ శుద్ధిగా చేసినా – జరగవలసిన పనే మనవల్ల జరిగి, రావలసిన ఫలితమే వస్తుంది గాని – జరగకూడని పనిమనవల్ల జరగదు, రాకూడని ఫలితం రాదు అని అర్థం చేసుకోవాలి. ఈ మంచి – చెడ్డలు; ధర్మా – ధర్మాలు; అనుకూల – ప్రతికూలాలు; కలిసిరావడం – కలిసిరాకపోవడాలు – ఇవన్నీ మన దృక్పథాన్ని బట్టి, మనమనోవాంఛితాలను బట్టి, మనం కట్టుదిట్టం చేసిన చట్టాలను బట్టి, ఉంటాయికాని, అసలు విశ్వంలో ఏది జరగాలో, ఎలా జరగాలో ఏ ఫలితం రావాలో అన్నవాటిని అనుసరించి ఉండవు. విశ్వంలో జరగవలసినవి – ఎలా జరగాలో, ఎలాంటి ఫలితం రావాలో – అనేవి అమ్మవారి సంకల్పాన్ని బట్టి ఉంటాయి. అందుకని, మన ఈ ధర్మాధర్మ నిర్ణయాలు ఆవిడ వద్ద పనికి రావు, పనిచేయవు. 'అసలు మనం నిర్ణయించిన ఈ ధర్మాధర్మాలు, చట్టాలు మనవద్ద చెల్లుబాటు అవుతాయేమో గాని అమ్మవారి వద్ద తమ ఆటలు నిర్ణయాలు సాగవని, అవి – అంటే (అధర్మా ధర్మాలే) అమ్మవారిని విడిచేశాయి' అని ఈ నామానికి అర్థం చెప్పుకోవడం ఎక్కువ సబబుగా ఉంటుంది. అలా కాకుండా 'అమ్మవారే ఆ ధర్మాధర్మాలను విడిచింది' అని చెప్పుకుంటే – ధర్మంతో పాటు అధర్మం కూడా ఆవిడ వద్ద ఉండి, వాటిని విడువవలసిన అవసరం అమ్మవారికి ఏర్పడే పరిస్థితిని కల్పించిన వారమౌతాము.

భగవద్గీతలో కూడా 'సర్వధర్మాన్ పరిత్యజ్యమామేకంశరణం వ్రజ' అన్నాడు గీతాచార్యుడు. అంటే – విధించిన పని చేయడంలో తీసుకోవాల్సిన ధర్మాధర్మ నిర్ణయం నాకు వదిలి, నీకు విధించిన పని నువ్వు త్రికరణ శుద్ధిగా చెయ్యి. (Submit the right of judgement at my feet and do the duty assigned to you with Thought Word & Deed) అని ఈ శ్లోక పాదాలకు అర్థం.

1) 'ధర్మాధర్మాలచే విడువబడినది' – లేదా

2) 'మనధర్మా ధర్మనిర్ణయాలు వర్తించనిది' అని ఈ నామానికి అర్థం చెప్పవచ్చును.

## 256. విశ్వరూపా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'విశ్వరూపాయైనమః' అని చెప్పాలి.

విశ్వ = విశ్వము యొక్క; రూపా = రూపమైనది.

తారక, గ్రహ, ఉపగ్రహాదులతో కూడి వున్నదే విశ్వం. ఇవన్నీ బాహ్యంగా మనకు కనబడే బ్రహ్మాండానికి సంబంధించినవి. ఇవన్నీ సూక్ష్మరూపంలో పిండాండంలో కూడా ఉంటాయి. అంతకంటె సూక్ష్మాతి సూక్ష్మరూపంలో పరమాణు కేంద్రకాల్లో కూడా ఉంటాయి. ఈ విధమైన స్థూల సూక్ష్మరూపాల్లో ఉన్న సమస్తమూ విశ్వమే అవుతుంది. ఈ విశ్వమే అమ్మవారి రూపం. రెంటికీ భేదం లేదు. అమ్మవారిని చూడాలన్నా, అర్థం చేసుకోవాలన్నా – విశ్వాన్ని బాగా అవగాహన చేసుకోవాలి.

సాధారణంగా మూడు రకాల అవస్థలలో జీవుడుంటాడు. 1. జాగ్రదవస్థ, 2. స్వప్నావస్థ, 3. సుషుప్త్యవస్థ. జాగ్రదవస్థ అంటే మెలకువగా ఉన్నప్పటి స్థితి, స్వప్నావస్థ అంటే కలగంటున్నప్పుడు ఉండే స్థితి, సుషుప్త్యవస్థ అంటే నిద్రలో ఉన్నప్పటి స్థితి. ఈ మూడు స్థితులను సూచించే అమ్మవారి నామాలను, ఈ స్థితుల అభిమాన జీవులను సూచించడానికి సంకేతించే అమ్మవారి నామాలను ఈ నామం నుండి వివరించడం జరుగుతుంది.

విశ్వంలో మెలకువ స్థితిలో వుండే జీవుని సూచించడానికి వాడే అమ్మవారి నామమే 'విశ్వరూపా' అని అర్థం చెప్పుకోవాలి.

(శ్రీలలితాస్తోత్రంలోని ''విశ్వరూపా జాగరిణీ స్వపంతీ తైజసాత్మికా సుప్తాప్రాజ్ఞాత్మికా తుర్యాసర్వావస్థావివర్జితా'' అన్న శ్లోకం చాలా ముఖ్యమైనది. ఈ శ్లోకంలోని నామాలకు అర్థం వివరించిన తరువాత విశిష్టమైన అర్థం చివరకు చెప్పబడుతుంది.)

## 257. జాగరిణీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'జాగరిణ్యైనమః' అని చెప్పాలి.

జాగరిణీ = జాగ్రదవస్థను సూచించునది.

విశ్వంలో తిరిగే జీవుల మెలకువస్థితిని సూచించే అమ్మవారి నామం 'జాగరిణీ'

జాగ్రదవస్థలో వుండే జీవునికి సర్వేంద్రియ జ్ఞానం ఉంటుంది. కాబట్టి స్థూల శరీర వ్యవహారాలన్నీ నిర్వర్తింపబడుతున్నట్లు తెలుస్తుంది. ఇలా తెలియడానికి కారణమైన జ్ఞానాన్ని సూచించే అమ్మవారి పేరు 'జాగరిణీ' అంటారు.

'జాగ్రదవస్థను సూచించునది' అని ఈ నామానికి అర్థం.

## 258. స్వపంతీ

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'స్వపంత్యైనమః' అని చెప్పాలి.

స్వపంతీ = స్వప్నావస్థను సూచించునది.

కలను కంటున్నపుడు జీవునికి పంచేంద్రియాలు పనిచెయ్యక పోయినా అవి నిర్వర్తించవలసిన పనికూడా మనస్సే చేస్తుంది. స్వప్నంలో చూడబడే దృశ్యాలు, సన్నివేశాలు, సంఘటనలు, వస్తువులు, వ్యక్తులు అన్నీ కలలు గంటున్న జీవిమనస్సుతోనే చేయబడి ఉంటాయి. కాబట్టి, ఈ స్వాప్నిక లోకం సూక్ష్మమైనదే కాని స్థూలమైనది కాదు. ఈ స్వప్నావస్థలో ఉండే జీవుని సూచించే అమ్మవారి నామాన్ని 'స్వపంతీ' అంటారు.

'స్వప్నావస్థను సూచించునది' అని ఈ నామానికి అర్థం.

## 259. తైజసాత్మికా

అయిదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'తైజసాత్మికాయైనమః' అని చెప్పాలి.

తైజసాత్మికా = తేజస్సువంటి సూక్ష్మస్వప్నావస్థకు అధిష్ఠాత్రి.

స్వప్నావస్థలో ఉండే జీవుని యొక్క సూక్ష్మలోకస్థితిని సూచించే అమ్మవారి నామాన్ని 'తైజసాత్మికా' అంటారు. తేజస్సు ఎంత సూక్ష్మమైనదో మనస్సుతోనే చేయబడిన స్వప్నలోకం కూడా అంత సూక్ష్మమైనదీ అవడం వలన ఈ స్థితిని సూచించే అమ్మవారి నామాన్ని 'తైజసాత్మికా' అనడం జరిగింది.

''స్వప్నావస్థ యొక్క సూక్ష్మలక్షణ స్వరూపము' అని ఈ నామానికి అర్థం.

## 260. సుప్తా

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సుప్తాయైనమః' అని చెప్పాలి.

సుప్తా = నిద్రావస్థను సూచించునది.

స్వప్నావస్థలో పంచేంద్రియాలు పనిచేయకపోయినా వాటి పని మనస్సే నిర్వహిస్తుంది. ప్రస్తుతం చెప్పబడే 'సుషుప్తి' అవస్థలో మనస్సు, బుద్ధి రెండూ కూడా పనిచేయవు. ఇవి రెండు హృదయంలోనికి లీనమై ఉంటాయి. ప్రాణము ఉన్నప్పటికీ, జీవికి ఏమీ తెలియని స్థితి ఇది. ఏమీ తెలియదని అనుకున్నా – ఆనంద స్పర్శ మాత్రం ఉంటుంది. ఆ నిద్రానందానుభూతి అనిర్వచనీయమైనది కాబట్టి 'ఇలా ఉంటుంది అని' చెప్పలేము. జీవప్రజ్ఞ సర్వేశ్వర ప్రజ్ఞతో కలసి ఉండే తాత్కాలిక వ్యక్తిగత ప్రళయాన్ని సూచించే స్థితి ఇది. ఏమీ తెలియని గాఢ నిద్రావస్థ అయినప్పటికి మెలకువరాంగానే తాను సుఖంగా నిద్రించిన అనుభూతి జ్ఞానం మాత్రం ఉంటుంది. ఈ అనుభూతి జ్ఞానాన్ని సూచించే అమ్మవారి నామాన్ని 'సుప్తా' అంటారు.

'నిద్రావస్థను సూచించునది' అని ఈ నామానికి అర్థం.

## 261. ప్రాజ్ఞాత్మికా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు ప్రాజ్ఞాత్మికాయైనమః' అని చెప్పాలి.

ప్రాజ్ఞాత్మికా = ప్రజ్ఞయే స్వరూపముగా గలది.

సుషుప్తిస్థితిలో పంచేంద్రియాలు, మనస్సు, బుద్ధి కూడా పనిచెయ్యకపోయినా ప్రజ్ఞమాత్రం ఉంటుంది. మెలకువరాగానే తాను పొందిన నిద్రసుఖానుభూతి జ్ఞప్తికి రావడం ఈ ప్రజ్ఞ ఉండ బట్టే జరుగుతుంది. జీవి నిద్రలో కూడా పనిచేసే ఈ లక్షణాన్ని సూచించే అమ్మవారి నామం 'ప్రాజ్ఞాత్మికా'.

'సుషుప్తిస్థితిలోని జ్ఞాన కారణస్థితిని సూచించునది' అని ఈ నామానికి అర్థం.

## 262. తుర్యా

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'తుర్యాయైనమః' అని చెప్పాలి.

తుర్యా = తుర్యావస్థను సూచించునది.

తుర్యా (తురీయం) అంటే 'నాల్గవది' అనేది సూటి అర్థం. జాగ్రత్, స్వప్న, సుషుప్తి అవస్థలేకాక బ్రతికున్న జీవికి నాల్గవ అవస్థ కూడా ఉంది. దానిని 'తురీయావస్థ' అంటారు. స్థూల, సూక్ష్మ, కారణస్థితులకు అతీతంగా ఉంటుంది ఈ స్థితి. మనస్సు, బుద్ధి ఇవి – కళ్ళను ఆశ్రయించి ఉంటే ఆ స్థితి జాగ్రదవస్థను సూచిస్తుంది, చేతులను ఆశ్రయించి ఉంటే స్వప్నావస్థను, హృదయాన్ని ఆశ్రయిస్తే సుషుప్తిని – సహస్రారగతమైతే తురీయావస్థను సూచిస్తాయి. బుద్ధిలయమై పోకుండా సహస్రారంలోని అమ్మవారి చిత్కళతో అనుసంధానమై ఉంటే – అప్పుడు బుద్ధి చిన్మయమవుతుంది. అప్పటి అనుభూతి స్థితిని 'తురీయం' అంటారు.

'తుర్యావస్థను సూచించునది' అని ఈనామానికి అర్థం.

# 263. సర్వావస్థావివర్జితా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సర్వావస్థావివర్జితాయై నమః' అని చెప్పాలి.

సర్వ = అన్ని, అవస్థా = అవస్థలను, వివర్జితా = విడిచి అతీతముగా నుండునది.

జాగ్రత్, స్వప్న, సుషుప్తి అవస్థలు మూడింటిలోను ఉండక, వీటికి అతీతంగా ఉండే నాల్గవదైన 'తురీయావస్థ' లో ఉండే జీవుని జ్ఞానాన్ని సూచించే అమ్మవారి నామాన్ని 'సర్వావస్థావివర్జితా' అంటారు. ఈ స్థితిలో సర్వమూ చిన్మయంగా ఉండే నిరతిశయ ఆనందానుభూతి మాత్రమే ఉంటుంది తప్ప ఇతరమేమీ ఉండదు. ఈ లక్షణాన్నే 'జీవన్ముక్త లక్షణం' అంటారు. అంటే, శరీరంలో ఉండి కూడా మోక్షస్థితిలో వుండే లక్షణం అన్నమాట!

'అన్ని అవస్థలను విడిచి వాటికి అతీతముగా నుండునది' అని ఈ నామానికి అర్థం.

**విశిష్టార్థం:** వాస్తవానికి 'విశ్వరూపా' నుండి 'సర్వావస్థావివర్జితా' దాకా వుండే 8 నామాలను ఒక వర్గంగా భావించి అర్థం చెప్పుకోవాలి. విశ్వరూపా, తైజసాత్మికా, ప్రాజ్ఞాత్మికా – అనే నామాలచే సంకేతింపబడే వ్యక్తి పరిధి లోని జాగ్రత్, స్వప్న, సుషుప్తి అవస్థలకు చెందిన జీవుణ్ణి, సమష్టి పరిధిలో వరుసగా – వైశ్వానర, హిరణ్యగర్భ, ఈశ్వర నామాలచే సంకేతిస్తారు. ఈ మూడూ స్థూల, సూక్ష్మ – కారణస్థితులను సూచిస్తాయి. అందుకే వీటిని సూచించే వైశ్వానర, హిరణ్యగర్భ, ఈశ్వరుల, అనుగ్రహాన్ని వరుసగా శరీరంతో చేసే పూజతో, వాక్కులతో చేసే స్తోత్రాదులతో, మనస్సుతో చేసే ధ్యానంతో పొందాలి.

బయట ప్రపంచంలో మెలకువగా ఉండటం – 'విశ్వరూపలక్షణాన్ని', తనయందు తాను మేల్కొంచి ఉండటం – 'జాగరిణీ లక్షణాన్ని', ఏ ఒక్కని యందు కూడా తాను మెలకువగా ఉండలేకపోవడం – 'స్వపంతీ లక్షణాన్ని' సూక్ష్మస్వప్నలోకంలో ఉండడం – 'తైజసాత్మికా' లక్షణాన్ని, ఇతరులయందే కాక తన యందు గూడా తాను మేల్కొంచకపోడం – సుషుప్తి లక్షణాన్ని, సాధారణ ప్రజ్ఞగాక, విశేషమైన, విశిష్టమైన

ప్రజ్ఞయందలి లోకంలో ఉండ గలగడం – 'ప్రాజ్ఞాత్మికా' లక్షణాన్ని, తనను గురించి తనకు పూర్తిగా అవగాహన కలిగించే బుద్ధిని కలిగి ఉండటం – తురీయలక్షణాన్ని – శరీరంలో ఉండి కూడా అన్ని అవస్థలకు అతీతంగా ఉండి నిరతిశయ ఆనందస్థితిలో ఉండటం 'సర్వావస్థావివర్జితా' లక్షణాన్ని సూచిస్తాయి.

మనం 'కల' గన్నట్లే అమ్మవారు కూడా ఈ 'ఇల' ను 'కల' గంటుంది. అంటే – అమ్మవారు కనే 'కలే' ఈ సమస్త ప్రపంచం – అన్నమాట ! మనం అమ్మవారి యందు 'భావన' చెయ్యడం వలన అమ్మవారికి ఈ 'కల' వస్తుంది. ప్రతి సత్యంగోచరమైనపుడల్లా 'కల' నుండి 'మెలకువ' వచ్చినట్లే అర్థం చేసుకోవాలి. మనం మరణించేలోగా ఇలా ఎన్నోసార్లు మేల్కొంటాము. జీవితంలో ఇలాంటి కలలు ఎన్నోసార్లు వస్తాయి. ఎన్నోసార్లు మేల్కొంటాము. ప్రతిసారి మెలకువ వచ్చినపుడల్లా అంతకు పూర్వం స్థితి అబద్ధమని, తర్వాత స్థితి నిజం అని అనిపిస్తుంది. అసలు నిజంగా మెలకువ రావడం అంటే తనలో అమ్మవారి ప్రజ్ఞకు నోచుకోవడమే ! వాడే పరా ప్రకృతి యందు మేల్కొనినవాడు.

సుప్తి, స్వప్న, జాగ్రత్, తుర్యావస్థలు అనే నాలుగు పేర్ల అల్లబడిన గుడ్డ ఏదారంతో చేయబడిందో – ఆదారం వచ్చిన ప్రత్తి – అమ్మవారు. అందుకని ఆవిడయందు ఈ నాలుగు స్థితులు ఉంటాయిగాని ఆవిడకు ఇవి ఉండవు,' అని ఈ నామాలను అర్థం చేసుకోవాలి.

పైనచెప్పిన నాలుగు అవస్థలతో పాటు 'మరణ' మనేది కూడా జీవునికి ఒక అవస్థగా చెప్పుకోవచ్చును. అప్పుడు ఈ ఐదు అవస్థలను ఈ క్రింద తెలిపే ఉదాహరణ ద్వారా బాగా అవగాహన చేసుకోవచ్చును.

ఒక జీవి యొక్క ప్రాణమును త్రాడుతోను, ఆ త్రాడుకు కట్టిన బాల్చీని(Buckett) జీవిదేహం తోను పోల్చుకుని – ఆ బాల్చీ త్రాడును నూతి గిలక మీదుగా నూతిలోని నీటిలోకి జారవిడుస్తున్నామనుకోండి. అప్పుడు 5 రకాల స్థితులలో ఉండే బాల్చీని – పైన తెల్పిన 5 రకాల అవస్థలతోను సమన్వయ పరచి అర్థం చేసుకోవచ్చును. ఈ స్థితులు ఈ క్రింది పటాలలో చూపబడ్డాయి.




పటం '1' లో వున్న బాల్చీ – ఇది పూర్తిగా నూతిలోని నీళ్ళకు బాగా పైన అంటే బాహ్య ప్రపంచంలో ఉంటూ ప్రాణం అనే త్రాడుతో కట్టిన దేహం అనే బక్కెట్టు. ఇది తన నిండా బుద్ధి అనే నీళ్ళు నిండుగా కలిగి – 'చిన్మయీ' స్థితిని లేదా తురీయావస్థను సూచిస్తుంది.

పటం '2' లో ఉన్న బక్కెట్టు సరిగా నూతిలోని నీళ్ళ ఉపరితలంలో సమంగా తన అంచు కలిగి ఉంటుంది. బక్కెట్టు అంచుపైన గాలి అనే బాహ్య ప్రపంచం, క్రిందనీరు అనే అంతరంగ ప్రపంచం వర్తిస్తాయి. జీవి అనే బక్కెట్టు బాహ్యరంగానికి అంతరంగానికి సరిగ్గా మధ్యలో ఉండి అపుడే మెలకువ వచ్చే స్థితి అయిన జాగ్రదవస్థను సూచిస్తుంది.

పటం '3' లో వున్న బక్కెట్టు పూర్తిగా నీళ్ళు అనే అంతరంగం లోనే ఎటుకైనా కదలగలిగేట్లుగా ఉండి, తన స్వప్నలోకంలో తాను విహరిస్తూ ఉండే స్వప్నావస్థను సూచిస్తుంది.

పటం '4' లో వున్న బకెక్కెట్టు నూతిలోని అట్టడుగున ఉండే నేలమీద ఆని, స్థిరంగా ఉండి, సుషుప్తి అవస్థను సూచిస్తుంది.

పై నాలుగు స్థితులలోను బక్కెట్టుకు త్రాడు ఉంటుంది. అంటే జీవికి ప్రాణం ఉంటుంది.

పటం '5' లో వున్న బక్కెట్టు తాడు తెగి నూతిలోని అట్టడుగున ఉన్న నేలమీద ఆని ఉంటుంది. ఆ బక్కెట్టుకు తాడు తెగడం అంటే – జీవికి ప్రాణం లేదని, దేహం అనే బక్కెట్టు పూర్తిగా బాహ్య ప్రపంచంతో సంబంధం లేకుండా అయిపోయిందని తెలిపే

మరణావస్థను సూచిస్తుంది. బయట ప్రపంచంతో సంబంధం మళ్ళీ కల్పించాలంటే - కొత్త త్రాడు కట్టాలి. అంటే, ఆ మరణించిన జీవికి పునః ప్రాణప్రతిష్ఠ జరగాలి.

## 264. సృష్టికర్త్రీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సృష్టికర్త్ర్యైనమః' అని చెప్పాలి.

సృష్టి = సృష్టిని; కర్త్రీ = చేయునది. (చోటునుండి వేరుగా కత్తిరించునది)

ఈ నామం నుండి 'పంచకృత్య పరాయణా 'వరకు ఉండే' నామాల్లో అమ్మవారి పంచకృత్యములు, ఆ కృత్యములకు అనుగుణమగు రూపనామములు వివరింపబడతాయి.

సృష్టిని చేయడం అమ్మవారికి పంచకృత్యాల్లో ప్రథమ కృత్యం ఔతుంది.

బ్రహ్మ అనుభూతి నుండి జీవి అనుభూతి వేరవడానికి చేసే కృత్యమే సృష్టి కృత్యం.

తాను (గుడ్డ) నుండి చొక్కా గుడ్డ వేరే కత్తిరించేలాగా 'చోటు'ను సూచించే 'ఆకాశం' నుండి 'మాటును' సూచించే 'దహరాకాశం' గల జీవి ఆకారాన్ని కత్తిరించే కృత్యమే సృష్టికృత్యం.

జగన్నిర్మాణమే సృష్టి. మూలప్రకృతీ స్థితి నుండి (Premordial Matter) అమ్మవారు ఈ ప్రపంచాన్ని సృష్టిస్తుంది. వివిధ లక్షణాలతో, వివిధ గుణాలతో, వివిధ ఆకారాలతో ఉండే వివిధ పదార్థ జీవ ఉత్పత్తికి సంబంధించిన ఒక మహాద్భుతమైన కృత్యం ఈ సృష్టి కృత్యం. త్రిగుణాల యొక్క వేరు వేరు కలయికలతో 84 లక్షల జీవరాసుల్ని అమ్మవారు సృష్టిస్తుంది.

మండలాత్మకమైన రాశిచక్రం గూడా కృత్తికా (కత్తెర) నక్షత్రంతో ప్రారంభమవడం వేదాంగ జ్యోతిష సంప్రదాయం.

1) 'స్థావర జంగమాత్మకమైన యావత్ప్రపంచాన్ని సృష్టించునది' -

2) 'కృత్తికతో ప్రారంభమగు సృష్టి ప్రణాళిక గలది'. - అని ఈ నామానికి అర్థాలు చెప్పుకోవచ్చును.

## 265. బ్రహ్మరూపా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'బ్రహ్మరూపాయై నమః' అని చెప్పాలి.

బ్రహ్మ = బృహ్మణ లక్షణము గల; రూపా = రూపము గలది.

'బృహ్మణము' అంటే విచ్చుకొనుట అని అర్థం. ఒక్కడుగా వున్న పరబ్రహ్మ నుండి స్థావర జంగమాత్మకమైన సమస్త ప్రపంచాన్ని విచ్చుకునేటట్లు చేసే లక్షణాన్ని గూడా 'బృహ్మణము' అంటారు. అమ్మవారిలో గల ఈ లక్షణాన్ని రజోగుణానికి సంబంధించిన 'బ్రహ్మ' ద్వారా వినియోగింపచేసి యావత్సృష్టి నిర్మాణానికి అమ్మవారు కారకురాలైంది కాబట్టి అమ్మవారికి, 'బ్రహ్మరూపా' అనే నామం వచ్చింది.

బ్రహ్మయొక్క తండ్రి అయిన విష్ణువు (పద్మనాభుడు)కు సోదరి పార్వతి (పద్మనాభసహోదరి) కాబట్టి, బ్రహ్మకు మేనత్త పోలికే వచ్చింది అనుకుంటే ఈనామం మరింత బాగా అర్థమౌతుంది. అమ్మవారు సూచించు జాగ్రత్, స్వప్న, సుషుప్తి, తురీయావస్థలు నాలుగూ బ్రహ్మ యొక్క నాలుగు తలకాయలతో సమన్వయ పరచుకోవచ్చును. అంతే కాదు - ఆ బ్రహ్మ నాలుగు తలకాయలు పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ వాక్కు స్థితులను సూచిస్తాయని కూడా సమన్వయ పరచుకోవచ్చును.

1) 'బ్రహ్మద్వారా సృష్టి బాధ్యతను నిర్వర్తింప చేయునది'.

2) 'బ్రహ్మకు తన రూపమును ఇచ్చునది' - అనే అర్థాలు ఈ నామానికి చెప్పుకోవచ్చును.

## 266. గోప్త్రీ

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'గోప్త్ర్యైనమః' అని చెప్పాలి.

గోప్త్రీ = గోపన లక్షణము అనగా సంరక్షణ లక్షణం కలది.

శ్రీ విద్య గుప్త విద్యకాబట్టి ఆ శ్రీ విద్యను గోపనము అనగా సంరక్షించునది గాబట్టి అమ్మవారికి 'గోప్త్రీ' అనే నామం వచ్చింది.

పంచభూతాత్మకమైన ప్రపంచాన్ని రక్షించేది కనుక 'గోప్త్రీ' అన్న నామం అమ్మవారికి వచ్చింది.

బ్రహ్మ ఏ వస్తువును చేసినా, వ్యక్తిని సృష్టించినా, ఆ వస్తువులలోను, వ్యక్తులలోను తాను ఉండిపోతాడు. ('తత్సృష్ట్వా... తదేవానుప్రావిశత్' – తైత్తిరీయం) అయినప్పటికీ ఆ వస్తువును చూసే వ్యక్తికి, ఆ వస్తువు యొక్క నామరూపాలు మాత్రమే దక్కేట్టుగా చేసి లోపల వున్న పరబ్రహ్మను దాస్తుంది. ఈ గోపన లక్షణం ఉండబట్టి అమ్మవారికి 'గోప్త్రీ' అనే నామం వచ్చిందని చెప్పవచ్చు.

1) 'గోపన లక్షణం కలది'

2) 'శ్రీ విద్యను గోపనము చేయునది'

3) 'ప్రపంచమును రక్షించునది'

4) 'ప్రపంచము నందలి జీవ వస్తు సముదాయంలో వాటి నామరూపాలు మాత్రమే తెలియునట్లు చేసి వాటి అందలి పరబ్రహ్మను గోపనము చేయునది' – అనే అర్థాలు ఈ నామానికి చెప్పవచ్చును.

## 267. గోవిందరూపిణీ

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'గోవిందరూపిణ్యైనమః' అని చెప్పాలి.

గోవింద = విష్ణుమూర్తితో, రూపిణీ = రూపసమన్వయము కలది.

గో = కిరణముల ద్వారా పొందునట్టి, రూపిణీ = రూపములు గలది.

గోవిందుడంటే విష్ణుమూర్తి – అంటే స్థితికారుడు అంటే – జగత్తును సాకేవాడు లేదా రక్షించేవాడు. భూమి, హిరణ్యాక్షుని వలన సముద్రంలోంచి పాతాళం వైపుకు దిగజారిపోతుంటే ఆది వరాహం రూపంతో హిరణ్యాక్షుని సంహరించి భూదేవిని

రక్షించాడు విష్ణుమూర్తి. విశ్వం నిండా నిండి ఉండే వాడే ఈ విష్ణువు. ('విశ్వం విష్ణుః .... వషట్కారో....' విష్ణుసహస్రనామం) ('విశ్వంబు విష్ణుండు' – భాగవతం) విశ్వంలోని మహత్తత్వలక్షణం, సర్వవ్యాపకలక్షణం కలిగిన వారే ఈ అమ్మవారైన ఉమాదేవి, ఆవిడ సోదరుడైన విష్ణుమూర్తి.

'విష్ణుమూర్తి ద్వారా జగద్రక్షణ బాధ్యతను నిర్వర్తించునది' – అని ఈ నామానికి ఒక అర్థం.

'గోవింద' పదాన్ని – గో + విందం – అని విడదీస్తే ఇంకో అర్థం వస్తుంది. గో = కిరణముల ద్వారా, విందం = పొందునట్టి రూపము గలది' అని అర్థం. మనకు చెయ్యి (కరము) ఎలాంటిదో, సూర్యుడికి కిరణము అలాంటిది అని అర్థం చేసుకుంటే 'ఈ కిరణముల ద్వారా పొందబడు రూపము గలది' అని ఇంకో అర్థం. సూర్యుని కిరణాల రంగులోనే స్వర్ణం లేదా హిరణ్యం (బంగారం) ఉంటుంది. అమ్మవారు తప్తకాంచన వర్ణంలో వుంటుంది. ('హిరణ్యవర్ణాంహరిణీం' – అని శ్రీ సూక్తంలో చెప్పబడింది). అందుకనే 'కిరణముల ద్వారా పొందిన రూపము గలది' అనే అర్థం వచ్చింది.

మహానారాయణంలో – ''హగ్ం స శ్శుచిషత్ ... అబ్జా, గోజా, ఋతజా, అద్రిజా, ఋతం బృహత్'' – అనే మంత్రంలోని పదాలన్నీ పరబ్రహ్మపరం గాను లేదా సృష్టిస్వరూపిణి అయిన అమ్మవారి పరంగానూ గూడా చెల్లుతాయి. ఈ పదాల్లో 'గోజా' అనే పదం లాగానే 'గోవిందరూపిణీ' నామానికి కూడా 'గోవుల వల్ల నుండి పొందబడిన క్షీరాది రూపాల్లో వ్యక్తమగునది' అని చెప్పుకోవచ్చును.

మొత్తంమీద ఈ నామానికి ఈ క్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1) విష్ణుమూర్తితో రూప సమన్వయము కలది.
2) విష్ణుమూర్తి ద్వారా జగద్రక్షణ బాధ్యతను నిర్వర్తించునది.
3) కిరణముల ద్వారా పొందబడిన రూపము గలది.
4) గోవుల వల్ల పొందబడిన క్షీరాది రూపాలలో వ్యక్తమగునది.

## 268. సంహారిణీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సంహారిణ్యైనమః' అని చెప్పాలి.

సం(సమ్యక్ + హారము) = సంహారము – అనే పదానికి 'చక్కగా ప్రక్కకు తొలగించుట' లేదా 'చక్కగా కూర్పు చేయుట' అనేదే అసలైన అర్థం. అంతే కాని – 'చంపడం' అని అర్థం కాదు. 'ఋతుసంహారము' 'వేణీ సంహారము' అనే సమాసాలకు – విడిగా ఉన్న ఋతువులను కూర్పు చేయుట, విడివడిన కేశములను ముడిగా కూర్పుచేయుట – అని అర్థం. ('దుష్టదుశ్శాసనుడు స్పృశించిన ద్రౌపది కురులకు – వాని నెత్తురు రాసి – ఆ కురులను ముడిగా కూర్పు చేసి ద్రౌపది అభీష్టాన్ని తీర్చాడు' అని అర్థమే కాని 'వేణీసంహారము' అంటే – 'ద్రౌపది కురులను చంపాడు' అని అర్థం కాదు)

'సంహారా' నికి ఈ 'చంపుట' అనే అర్థం ఎలా వచ్చి ఉండాలంటే మొదట 'ప్రక్కకు తొలగించుట అనే అర్థం – 'నెట్టడం' గాను, ఆ నెట్టడం – 'తన్నడం' గాను మారుతూ చివరకు సంహారము అంటే – 'చంపడము' అనే అర్థం స్థిరపడిపోయింది.

సంహారము – అంటే లోపలకు ఉపసంహరించుట – అనే అర్థంలో 'వేణీ సంహారము' అంటే విడిగా వున్న కురులను ముడిలోనికి లీనము చేయుట – అని అర్థము చెప్పుకోవాలి. ఇక్కడ 'లీనము' అనే పదం ఎలావాడబడిందో – అలాగే ప్రళయంలో కూడ సమస్త వస్తుజీవజాలం – నీళ్ళల్లో కరిగి వున్న లవణాలలాగ లీనమై ఉంటాయి తప్పితే నశించవు. నీళ్ళ ద్రావణాన్ని వేడి చేస్తే ఏ లవణానికి ఆ లవణం వేరైనట్లు – ప్రళయం తర్వాత వచ్చే 'సృష్టి' లో సమస్త వస్తు జీవజాలం బయుటకు వ్యక్తమౌతుంది.

'ప్రళయ కాలంలో సమస్త వస్తు జీవజాలాన్ని చక్కగా తన లోనికి ఉపసంహరణ గావించి, లీనము చేసుకొనునది' అని ఈ నామానికి అర్థం.

## 269. రుద్రరూపా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'రుద్రరూపాయైనమః' అని చెప్పాలి.

రుద్రరూపా = రుద్రుని యొక్క, రూపా = రూపుదాల్చినది.

రుద్రులు పదకొండు మంది ఉంటారు. వీళ్ళనే ఏకాదశ రుద్రులంటారు. (వీరిపేర్లు అనుబంధంలో ఇవ్వబడ్డాయి) వీళ్ళు రోదసిలోని స్పందనాత్మక(Plane of Vibration) లోకానికి అధిపతులు. ఆకాశం శబ్ద గుణకం కాబట్టి 'నాదము' కూడా వీరికి సంబంధించిన లక్షణమే ! అన్ని శబ్దాలూ ఓంకార నాదంలోకి లీనమైనట్లే - ప్రళయంలో సమస్త వస్తు జీవజాలాన్ని తమ లోనికి లీనం చేసుకునే లక్షణం వీరికుంటుంది. ఈ లక్షణం తోనే అమ్మవారు ఈ రుద్రరూపం దాల్చి లయకారకత్వాన్ని నిర్వహిస్తుంది.

ఆదిశంకరులు సౌందర్యలహరిలో - 'క్వణత్కాంచీదామా.... ఆహోపురుషికా'' అనే శ్లోకంలో అమ్మవారిని పురమథితుః ఆహోపురుషికా' అన్నారు. అంటే, అమ్మవారు పురరిపుడైన శివుని అహంకారస్వరూపిణీ' అని ఒక అర్థం. శివునికి గర్వకారణమైన రూపం' అని ఇంకో అర్థం. శివుని 'స్వ-రూపం' లేదా సాక్షాత్తు తన రూపం' అని మరో అర్థం.

మొత్తం మీద ఈ నామానికి ఈ క్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1) రుద్రునిగా రూపు దాల్చినది.

2) నాదరూపిణి

3) రుద్రుని స్వరూపము.

## 270. తిరోధానకరీ

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'తిరోధానకర్యైనమః' అని చెప్పాలి.

తిరోధాన = మఱుగు పరచుటను; కరీ = చేయునది.

ప్రళయస్థితిలో సమస్త వస్తు జీవజాలము సృష్టి నుండి ఉప సంహరింపబడి, ఒదిగి ఒక చోటే కూర్పు చేయబడి, చైతన్య రహితంగా ఉంటే - చైతన్య స్వరూపురాలైన అమ్మవారు మళ్ళీ వాటిలోకి బీజరూపంలో - వాటి కారణ శరీర చైతన్యశక్తిగా ఉండి సృష్టి సమయం వచ్చేవరకు వాటిని తనకుక్షిలో నిక్షిప్తంగా ఉంచి రక్షించే కృత్యాన్ని 'తిరోధానము' అంటారు.

ఇది – చెట్టును – కనబడకుండా విత్తనంలోకి లీనం చెయ్యడం లాంటి ప్రక్రియగా అర్థం చేసుకోవాలి. అంటే – చెట్టు తాలుకు కొమ్మలు, రెమ్మలు, ఆకులు, కాయలు – మొదలైనవి ఏవీ కనబడవు కాని వాటి కారణ శరీర అంకురాలన్నీ విత్తనంలో ఉంటాయి. అలాగే, దేహాలద్వారా పదార్థమయంగా కనిపించేవన్నీ, కనబడకుండా ఉండే కారణ శరీరాల్లో గుప్తంగా ఉండి పోతాయన్నమాట!

(కారణమయ) 'శరీరములను మఱుగుపరచునది' అని ఈ నామానికి అర్థం చెప్పుకోవచ్చును.

## 271. ఈశ్వరీ

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ఈశ్వర్యైనమః' అని చెప్పాలి.

ఈశ్వరీ = ఈశ్వరుని యొక్క శక్తిరూపములో ఉండునది.

సమస్త ప్రపంచానికి అధిష్ఠాత్రి అయిన అమ్మవారు ఇంతకు ముందు నామంలో చెప్పిన తిరోధాన కృత్యాన్ని పంచ బ్రహ్మలలో నాల్గవవాడైన 'ఈశ్వరుని' రూపములో చేస్తుంది కాబట్టి 'ఈశ్వరీ' అనే నామం వచ్చింది.

మాయాతీతుడుగా ఉండే జగత్ప్రభువును పరబ్రహ్మఅనీ, మాయతో కూడిన ప్రభువును 'ఈశ్వరు'డని అంటారు. ఇట్టి ఈశ్వరుడు తన 'ఈశ్వరీశక్తి'తో తిరోధానకృత్యాన్ని నిర్వహిస్తాడు.

'ఈశ్వరీ శక్తి రూపముగా ఉండునది' అని ఈ నామానికి అర్థం.

## 272. సదాశివా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సదాశివాయైనమః' అని చెప్పాలి.

సదాశివా = సదాశివ స్వరూపిణి.

పంచబ్రహ్మలలో ఐదవ వాడు సదాశివుడు. శుద్ధసత్త్వ లక్షణం కలవాడు. మహాప్రళయంలో గూడా సాక్షీ భూతుడుగా ఉండే పునః సృష్టికార్యానుగ్రహ సంపన్నుడు. ఇట్టి సదాశివునితో అభేదము కలది అమ్మవారు. అందుకని అమ్మవారికి 'సదాశివా' అనే నామం వచ్చింది.

'సదాశివునితో అభేదము కలది' అని ఈ నామానికి అర్థం.

## 273. అనుగ్రహదా

అయిదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'అనుగ్రహదాయైనమః' అని చెప్పాలి.

అనుగ్రహ = అనుగ్రహమును; దా = ఇచ్చునది.

కల్పాంతంలో తన కుక్షియందు గుప్తంగా ఉంచుకొనిన సృష్టికారణ బీజాలను - కల్పారంభంలో పునః సృష్టిగా అనుగ్రహిస్తుంది కాబట్టి 'అనుగ్రహదా' అనే నామం అమ్మవారికి వచ్చింది.

ప్రపంచంలో తన స్థాయికి తగినట్లుగా, ఇంకొకరికి ఇచ్చే గుణం ఉంటే - అటువంటి వారికి పుచ్చుకునే అవకాశం కూడా వస్తుంది. అంటే - 'దానం ఎక్కడ ఉంటే- అనుగ్రహం అక్కడ వుంటుంది' అని అర్థం. మనకన్న తెలివిలో తక్కువ, ఆర్థికంగా తక్కువ, బలంలో తక్కువ అయిన - క్రింది వారికి మనం చేయి అందిస్తే - మన భుజంమీద పైవారి చెయ్యి ఉంటుంది. అంతేగాని - ఎప్పుడూ పైవాని అనుగ్రహం కోసం చూస్తే రాదు. ఈ విషయాన్ని గుర్తుంచుకుని అమ్మవారి ఈ నామాన్ని 'అనుగ్రహదాయైనమః' అని జపిస్తే - ఆవిడ అనుగ్రహాన్ని వర్షిస్తుంది. నిద్రాణమై, నిశ్చేతనంగా, అపరిపూర్ణంగా పడివున్న ప్రణాళికలు, కార్యక్రమాలు అన్నీ మళ్ళీ చక్కబడి ప్రారంభమౌతాయి.

'అనుగ్రహమును ఇచ్చునది' అని ఈ నామానికి అర్థం.

## 274. పంచకృత్య పరాయణా

ఎనిమిది అక్షరాల నామం. ఈనామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పంచకృత్య పరాయణాయైనమః' అని చెప్పాలి.

పంచకృత్య = సృష్టి, స్థితి, లయ, తిరోధాన, అనుగ్రహాలనే అయిదు కృత్యముల యందు; పరాయణా = ఆసక్తి కలది.

తను చేయవలసిన విధులను సక్రమంగా ఇష్టపడి చేయడం అన్నింటి కన్న ఉత్తమ ధర్మము. ఉత్తమ లక్షణము. ఈ విషయాన్ని అమ్మవారు – 'తాను తను నిర్వర్తించవలసిన కృత్యాలను ఆసక్తితో నిర్వర్తించడం ద్వారా తెలియ చేస్తోంది' అని ఈ నామం ద్వారా మనం తెలుసుకోవాలి. ఈ ఒక్క ధర్మాన్ని పాటిస్తే జరగాల్సినవన్నీ ఒక దాని తర్వాత ఒకటి సక్రమంగా సృష్టి ప్రణాళిక లాగా జరుగుతాయి. అని సూక్ష్మార్థం.

'నిర్వహించవలసిన పంచకృత్యాల యందు ఆసక్తి కలిగినది' అని ఈ నామానికి అర్థం.

239వ నామం అయిన 'చంద్రవిద్యా' నామం నుంచి 274వ నామం అయిన 'పంచకృత్యపరాయణా' అనే నామం వరకు చెప్పబడిన వన్నీ చంద్రవిద్యకు సంబంధించిన విశేషాలు. ఇక రాబోయే 'భానుమండలమధ్యస్థా' నామం మొదలు 'పుణ్యాపుణ్యఫలప్రదా' నామం వరకు 'భాను విద్య' కు సంబంధించిన విశేషాలు చెప్పబడతాయి.

## 275. భానుమండల మధ్యస్థా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'భానుమండల మధ్యస్థాయై నమః' అని చెప్పాలి.

భానుమండల = సూర్యుని మండలము నందు, మధ్యస్థా = కేంద్రము వద్ద ఉండునది.

అంతర్లీనమై, లయమై ఉన్న సృష్టి ఆకాశంలో ఇమిడి ఉంటుంది. దాన్ని ఆంగ్లంలో 'All subjectivity' అంటారు. దాంట్లోంచి మేల్కాంచి (Objectivity) ఇవతలకు రావడమే 'తారకలు' బయట పడటం. కాబట్టి, సూర్యుడు లాంటి తారకలన్నిటినీ ఆకాశానికి చిల్లులులాగా ఊహించవచ్చును. అలాంటి ఒక చిల్లు చుట్టూ ఏదో మండలం లాగా ఉన్నట్లు మనం భ్రాంతి పడేదే భానుమండలం.

'భానుమండల' పదాన్ని 'భా + అనుమండల' – అని విడదీస్తే – 'భా = వెలుగును, అనుమండల = అనుసరించి ఏర్పడు మండలమునకు, మధ్యస్థా = మధ్యనఉండునది – అని అర్థం వస్తుంది. అంటే – అమ్మవారు వెలుగుకు కేంద్రమని - వెలుగుకు – ఉత్పత్తి స్థానమని అర్థాలు వస్తాయి. ఈ అర్థాన్ని బట్టి ఎప్పుడైనా, ఎక్కడైనా ఎవరికి సంబంధించినదైనా వెలుగు – లేదా, తేజస్సు ఉంటే, ఆ వెలుగుకు, తేజస్సుకు ఉత్పత్తి కారణం అమ్మవారని గ్రహించాలి. అంటే – సూర్యుడు, అగ్ని, ఇతర తారకలన్నిటి వెలుగుకూ అమ్మవారే కేంద్రము, కారణము గూడా ! (వెలుగుల ముద్ద అమ్మవారని పీఠికలోనే చెప్పబడింది కదా!)

1) సూర్యమండలమధ్యవర్తి
2) సూర్యాంతర్వర్తి.
3) వెలుగులకు ఉత్పత్తి స్థానము
అనే అర్థాల ఈ నామానికి చెప్పుకోవచ్చును.

## 276. భైరవీ

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'భైరవ్యైనమః' అని చెప్పాలి.

భైరవీ = భైరవీ స్వరూపిణి.

ఇంతకు పూర్వం చెప్పిన నామంలో వెలుగులకు కేంద్రమని, భానుమండలాలవంటి అన్ని తారక మండలాలు ఏర్పడడానికి వెనుక ఉన్న తేజస్సుకు అమ్మవారే కేంద్రమని ఉత్పత్తి స్థానమని చెప్పబడింది. ఆ కేంద్రస్థానంలో ఉండే అమ్మవారికి ప్రత్యేకమైన పేరు ఉంది. అదే 'భైరవీ' నామం.

తెల్లజిల్లేడును 'అర్కం' అంటారు. సూర్యుణ్ణి గూడా 'అర్కుడు' అంటారు. అంటే సూర్యునికి, తెల్లజిల్లేడుకు సంబంధము ఉందన్నమాటే గదా!

సాయన సిద్ధాంతాన్ని అనుసరించి సూర్యుడు కర్కాటకరాశిలో పుష్యమీ నక్షత్రంలో ఉన్నపుడు అనగా జూన్ 24 నుంచి జులై 8తేదీల మధ్య నున్నపుడు

'పుష్యార్కయోగం' అని వస్తుంది. ఆ రోజున తెల్లజిల్లేడు వేరు తీసి దానిని శుభ్రం చేసి, పూజించి రాగి తాయెత్తులలో గాని, వెండి తాయెత్తులలో గాని ఉంచి ధరిస్తే చాలా భౌతికమైన, మానసికమైన రుగ్మతలు నివారింపబడతాయి. 'ఓం ఘృణి : సూర్య ఆదిత్య ఓం' అనే సూర్యమంత్రాన్ని గూడా జపిస్తే – ఇంకా మరింత ఆనుకూల్యం దీనికి సిద్ధిస్తుంది.

తెల్లజిల్లేడునే కాక 'ఉమ్మెత్త' ('ఉన్మత్త' అనే సంస్కృత పదం) ను గూడా 'భైరవీ' అంటారు. ఇంతకు పూర్వం 'మహాభైరవ పూజితా' అనే నామంలో చెప్పిన 8 మంది భైరవుల్లో 'ఉన్మత్త భైరవుడు' గూడా ఉంటాడు. మానసికమైన రుగ్మతలు (పిచ్చి, హిస్టీరియా మొదలగునవి) గూడా ఈ ఉన్మత్త భైరవునికి సంబంధించిన 'ఉమ్మెత్త' కాయనుండి తీసే 'Stramonium'అనే హోమియో ఔషధంతో నివారణమౌతాయి.

ఇవన్నీ ఇక్కడ చెప్పడం ఎందుకంటే 'భైరవీ' అనే నామం వెలుగుకు కేంద్రం, ఉత్పత్తి స్థానము అయిన అమ్మవారినే సూచిస్తుంది కాబట్టి, పరోక్షంగా అమ్మవారే ఈ రుగ్మతలన్నింటినీ చక్కదిద్దేది – అని అర్థం చేసుకోడానికి. ('మార్తాండ భైరవ' రూపంలో – సూర్యసంబంధమైన గుండె, రక్త ప్రసరణాది రుగ్మతలను; 'ఉన్మత్త భైరవ' రూపంలో మానసిక రుగ్మతలను అమ్మవారు నివారిస్తుంది.)

ఈ 'భైరవీ' నామంలో ప్రతిపాదింపబడే అమ్మవారు 'అనాహతచక్రాని'(Heart Centre) కి సంబంధించిన ద్వాదశ దళ పద్మ మధ్యంలో ఉన్నట్లు ధ్యానించాలి. (హృదయం – 'సింహ (Leo) రాశి' చేత సూచింపబడుతుంది. ఆ సింహరాశికి వెలుగుల మూర్తి అయిన సూర్యుడు (Sun) అధిపతి అని జ్యోతిశ్శాస్త్రం చెబుతుంది.)

12 సంవత్సరముల కన్యను కూడా 'భైరవీ' అంటారు.

1) 'భైరవీ' అనే పేరుతో పిలువబడు వెలుగుల కేంద్రము.

2) పన్నెండు సంవత్సరముల కన్య – అని ఈ నామానికి అర్థాలు చెప్పుకోవచ్చును.

## 277. భగమాలినీ

అయిదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'భగమాలిన్యై నమః' అని చెప్పాలి.

భగ = వెలుగుతూ గమనము చేయు వారిచే, మాలినీ = మాలిక లేదా – హారముగా అగుపించునది.

సూర్యుడు ఇతర తారకలు వెలుగుతూ ఆకాశంలో గమిస్తున్నట్లుంటాయి. అందుకనే సూర్యుణ్ణి 'గగనమణి' అని అంటారు. 12 రాశులలో ప్రకాశించే 12 రకాల లక్షణాలు గల సూర్యబింబం తాలూకు 12 రకాల మణులనిరంతర గమనాన్ని కాలచక్రంలో మనం చూస్తాము. కాలస్వరూపిణి అయిన అమ్మవారికి ఇవి మాలికా భరణాన్ని రూపొందిస్తాయి. అందుకని – ద్వాదశ ఆదిత్యులను మాలగా కలిగిన అమ్మవారిని 'భగమాలినీ' అంటారు. (ద్వాదశ ఆదిత్యుల పేర్లు అనుబంధంలో తెలుపబడ్డాయి).

మనం చూసే వెలుగు వాస్తవానికి వెలుగు చీకటుల ఏకాంతర (Alternate) త్వరితగమనం వల్ల ఏర్పడినదే! కాని (Persistence of Vision) 'స్పష్ట దృష్టి స్థిరత' లక్షణం వలన వెలుగునిరంతరం ఉన్నట్లు అనిపిస్తుంది. ఇలా కనబడుతూ కనబడకుండా! త్వరితంగా సాగే వెలుగుల మాలను అమ్మవారి 'భగమాలినీ' నామానికి అర్థంగా చెప్పుకోవచ్చును.

ప్రాణమున్న జీవి బ్రతుకుతున్నట్లు లెక్క. కనురెప్పలు మూతపడుతూ తెరుచుకుంటూ ఏకాంతరంగా (Alternate) జరిగితేనే అది చైతన్యానికి, జీవలక్షణానికి గుర్తు. అంతే గాని – ఎప్పుడూ కన్నులు మూసుకుని ఉన్నా – లేదా తెరుచుకుని ఉన్నా – అది శవలక్షణమే అవుతుంది కాని శివలక్షణం కాదు. ఈ విధంగా చీకటి వెలుగులతో త్వరితగతిని సాగే శాశ్వత కాలస్వరూపిణి కాబట్టి అమ్మవారు 'భగమాలినీ' అన్నారు.

పగలు సూర్యుడు కనబడుతూ, రాత్రి కనబడకుండా ఇలా నిరంతరం జరుగుతూ ఉండటం వల్లే కాలచక్రం తిరుగుతూ సృష్టి కొనసాగుతుంది. ఒక సంవత్సర కాలంలో త్వరితగతిని సాగే ఈ గమనాన్ని (Fast Forward Motion) ఊహిస్తే ఆ దృశ్యం ఆకాశంలో ఒక వెలుగుల మణిమాలలా భాసింప చేస్తుంది. అదృశ్యంగా విశ్వంలో భాసించే అమ్మవారిని 'భగమాలిని' గా చెప్పుకోవచ్చును.

'భగ' అనే పదానికి ఐశ్వర్యము అని గూడ అర్థం ఉంది. ఒకటి కన్నా ఎక్కువ సంఖ్యలో ఉన్న వాటి కూర్పును 'మాల' లేదా 'మాలిక' అంటారు. మాలిక కలదానిని

'మాలినీ' అంటారు. ఐశ్వర్యాలు 6 వుంటాయి. "ఐశ్వరస్య, సమగ్రస్య, వీర్యస్య, యశసఃశ్రియః, జ్ఞానవైరాగ్య యోశ్చైవషణ్ణాం భగ ఇతీరితా" – అంటే 1. సమగ్రత్వము, 2. వీర్యము, 3. కీర్తి, 4. సంపద, 5. జ్ఞానము, 6. వైరాగ్యము – వీటిని షడ్గుణైశ్వర్యాలంటారు. ఈ ఆరింటినీ కలిగిన అమ్మవారిని 'భగమాలిని' అంటారు.

(ఈ నామానికి రాబోయే 'భగవతీ' నామానికి గల తేడా 'భగవతీ' నామవివరణాంతంలో చెప్పబడుతుంది).

1) ఆకాశంలో వెలుగుతూ గమించే తారకాదులను మాలగా కలిగినది.

2) ద్వాదశ ఆదిత్యులను మాలగా కలిగినది.

3) చీకటి వెలుగులతో త్వరిత గతిని ఏకాంతరంగా సాగే కాల స్వరూపిణి.

4) రేయింబవళ్ళు కనపడకుండా కనబడుతూ ఆకాశంలో సాగే సూర్యబింబాలను మాలగా కలిగినది.

5) షడ్గుణైశ్వర్యాలను మాలగా కలిగినది – అని ఈ నామానికి అర్థాలుగా చెప్పవచ్చును.

## 278. పద్మాసనా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పద్మాసనాయైనమః' అని చెప్పాలి.

పద్మ = పద్మమును; ఆసనా = నెలవుగా కలిగినది.

సాధ్యస్థితిలో ఉన్న చోటు పద్మంలాగా విచ్చుకుంటే దాంట్లోంచి సృష్టిగా వ్యక్తమయేది కాబట్టి అమ్మవారు 'పద్మాసనా'.

సుషుమ్నామార్గంలోని మూలాధారాదిషట్పద్మవాసిని గాబట్టి 'పద్మాసనా'

సహస్రార పద్మాన్ని నిలయంగా కలిగింది కాబట్టి 'పద్మాసనా'.

సూర్యకిరణాలు పడంగానే అక్కడున్న చోటు పద్మంలాగా విచ్చుకుంటుంది. దాన్ని ఆసనంగా కలిగినది కాబట్టి అమ్మవారు పద్మాసనా'.

చోటు వ్యాకోచిస్తుంది (Space Expands), చోటు శ్వాసిస్తుంది (Space Breaths). చోటు స్పందిస్తుంది (Space pulsates). ఇలాటి ధర్మాలకు ఒక నమూనా పద్మం. ఎందుకంటే – సూర్యరశ్మికి పద్మం వ్యాకోచిస్తుంది. పగలు రాత్రి విచ్చుకుంటూ తెరుచుకుంటూ శ్వాస తీసుకుంటుంది. సంకోచ వ్యాకోచ ధర్మాలతో స్పందిస్తుంది. చోటుకి, పద్మానికి ఉండే ఈ సమాన ధర్మం శాశ్వతమైంది. అందుకే ఈ సృష్టి ఆవిర్భావాన్ని పద్మంతో పోల్చి చెబుతారు పద్మపురాణంలో. కాబట్టి, అమ్మవారు 'పద్మాసనా'. విశ్వసృష్టి గురించి ఎన్నో క్రొత్త సిద్ధాంతాలు చెప్పినా వాటి శాశ్వత, ధర్మ లక్షణాలను గూర్చి చెప్పే మౌళిక సూత్రాలు వేద పురాణాది ప్రాచీన గ్రంథాల్లో వుంటాయి. (The latest of the theories about creation of universe had their seeds in the earliest of their eternities).

1) చోటు అనే పద్మాన్ని ఆసనంగా గలది.
2) మూలాధార సహస్రారాది పద్మాలయందు నివసించునది.
3) సహస్రార పద్మనిలయంలో ఆసీనురాలైనది.

అని ఈ నామానికి అర్థాలు చెప్పుకోవచ్చును.

## 279. భగవతీ

నాలుగు అక్షరాలనామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'భగవత్యైనమః' అని చెప్పాలి.

భగవతీ = భగశబ్దస్వరూపిణి.

'భవగతీ' అన్నా 'భగమాలినీ' అన్నా అర్థం దాదాపు ఒకటే అయినా, ఈ నామాలను జపించి ధ్యానం చెయ్యడంలో చిన్న తేడా వుంది. 'మనం అమ్మవారిలో ఉన్నట్లు ధ్యానం చేస్తే' – భగవతీ ఔతుంది. 'అమ్మవారు మనలో ఉన్నట్లు ధ్యానం చేస్తే' – భగమాలినీ ఔతుంది. అయితే, ఇలా చెప్పినా అర్థమై ఉండదు. అందుకే ఇంకా బాగా అర్థమయేలా వివరిస్తాను.

ప్రపంచంలోని అందరూ ఎవరికి వారు తాము అమ్మవారిలో ఉన్నట్లు ధ్యానం చేస్తే – అప్పుడు అందరూ అమ్మవారనే ఒకే వెలుగులో ఉండి, ప్రపంచంలో ఆ అమ్మవారనే

ఒకే వెలుగు ఉంటుంది. ఆ ఒకే వెలుగును శ్రీ లలితాదేవి యొక్క 'భగవతీ' నామంగా అర్థం చేసుకోవాలి.

పైన చెప్పిన విధంగా కాకుండా ప్రపంచంలోని అందరూ ఎవరికి వారు వాళ్ళ వాళ్ల హృదయాలలో అమ్మవారు ఉన్నట్లు ధ్యానం చేస్తే – అప్పుడు ఒక్కొక్కరి హృదయంలోను ఒక్కొక్క అమ్మవారు చొప్పున వరుసగా అందరి హృదయాల్లోను వేరు వేరు అమ్మవార్లు వెలుగుతూ ఉంటారు. ఇలా – అందరి హృదయాలలోను వెలుగుతూ ఉండే వేరు వేరు అమ్మవార్ల యొక్క వరుసను – అంటే, అమ్మవార్ల మాల (హారం లేదాChain) ను శ్రీ లలితాదేవి యొక్క 'భగమాలినీ' నామంగా అర్థం చేసుకోవాలి.

'చైతన్య ప్రకాశ స్వరూపిణీ' అని ఈ నామానికి అర్థం.

## ౭౮౦. పద్మనాభ సహోదరీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పద్మనాభ సహోదర్యైనమః' అని చెప్పాలి.

పద్మనాభ = విష్ణుమూర్తి యొక్క సహోదరీ = సోదరి

నారములు అంటే 'నీరు' అని అర్థం. నారముల (నీటి) నుండి తామరకాడ పైకి వచ్చి, దానిపైన విచ్చుకోబోయే పద్మం వస్తుంది. ఆ తామరపువ్వు విచ్చుకోక పూర్వం చోటుకు చీకటి, రాత్రి ఔతూ – తామర పువ్వు విచ్చుకుంటే చోటుకు వెలుగు, తెల్లారడం ఔతూఉందన్నమాట! అంటే, చోటుకు తెల్లారక పూర్వం నారాయణుడు (నలుపు), తెల్లారిన తరువాత అమ్మవారు (తెలుపు) ఉంటారన్నమాట!. అంటే – తెల్లారిన తరువాత వచ్చే అమ్మవారు తెల్లారక పూర్వం ఉండే నారాయణునికి సోదరి అవుతుంది. దీన్నే ఆంగ్లంలో చెప్పుకోవాలంటే –

Space Dormant - విష్ణువు, Space Charged - అమ్మవారు.

పూర్వం దేవతలు చేసిన ఒక యజ్ఞ హోమ గుండంలో ఉద్భవించిన అండంలో సగభాగము నుండి అమ్మవారు, సగభాగము నుండి పద్మనాభుడు ఆవిర్భవించారు.

అందుకే ఆ ఇద్దరూ 'సోదరీ సోదరులు. (వీళ్లే వరుసగా – యశోదకు, దేవకీదేవికి జన్మిస్తారు).

'పద్మనాభుని సోదరి'

'తెల్లవారిన చోటు రూపము'.

అని ఈ నామానికి అర్థాలు చెప్పుకోవచ్చును.

## 281. ఉన్మేషనిమిషోత్పన్నవిపన్నభువనావళిః

పదహారు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ఉన్మేష నిమిషోత్పన్న విపన్నభువనావళ్యైనమః' అని చెప్పాలి.

ఉన్మేష= తెరువబడుటతోను, నిమిష= మూయబడుటతోను, ఉత్పన్న = పుట్టిన, విపన్న = లీనమైన, భువన + ఆవళిః = భువనావళిః = చతుర్దశ భువనములు కలది.

అమ్మవారి కనురెప్పలు తెరుచుకోడం చతుర్దశ భువనాలు ఉత్పత్తికి, కనురెప్పలు మూసుకోడం వాటి విపత్తికి, అంటే – లయానికి కారణభూతమౌతాయి. రెప్పలు తెరవడమే జరగక్కరలేదు, మూయడమే కానక్కరలేదు. ఆవిడ కనురెప్పలను తెరుద్దామని, మూద్దామని సంకల్పించినా చాలు – ఇలా జరుగుతుంది అని అర్థం. అంటే – అమ్మవారికి రెప్పపాటు కాలం చాలు బ్రహ్మాండాలను సృష్టించడానికి, లయం చేసుకోడానికి – అని గూడా అర్థం.

ఉత్ + మేషం = ఉన్మేషం – అంటే మేషరాశితో ప్రారంభించి, ని + మేషం – అంటే మేషం దగ్గర కొచ్చి అయిపోవడం' – అని అర్థం చేసుకుంటే – ఈ రెండు స్థితులకు మధ్యన చిట్టచివరగా ఉండే మీనరాశి (జలరాశి) వస్తుంది. మీనం అంటే 'మత్స్యం'. అంటే, సృష్టి ప్రళయాల మధ్య మీనరాశికి సంబంధించిన కథ ఉంటుంది అని అర్థం. ఈ కథ బైబిల్‌లో 'నోవాస్ ఆర్క్' (Novas arc) కథగాను, 'మత్స్యపురాణంలో 'మత్స్యావతార కథగాను చెప్పబడుతుంది. ఇది రెండు సృష్టుల మధ్య జరిగే జలప్రళయానికి సంబంధించిన కథ. మతాలు వేరైనా జగత్సృష్టికి, ప్రళయానికి సంబంధించిన కథలు ఒక విధంగానే ఉంటాయని అర్థం చేసుకోవాలి.

1) కనురెప్పలు తెరవడం మూయడంతో చతుర్దశ భువనాలను పుట్టించి లయం చేసుకోగలది.

2) మేషరాశితో ప్రారంభించి, మళ్ళీ మేషరాశి వచ్చే లోపల జరిగే సృష్టి ప్రళయాల మధ్య జలరాశి అయిన మీనరాశికి సంబంధించిన కథ జరుపునది.

3) రెప్పపాటు కాలంలో సృష్టి ప్రళయాలను సృష్టించకలది - అనే అర్థాలు ఈ నామానికి చెప్పుకోవచ్చును.

## 282. సహస్రశీర్షవదనా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సహస్ర శీర్షవదనాయైనమః' అని చెప్పాలి.

సహస్ర = వెయ్యి లేదా అనంతమైన, శీర్ష = శిరస్సులతో, వదనా = ముఖములు కలది.

సహస్ర పదానికి 'వెయ్యి' అనే కాక 'అనంతం' అనే అర్థం కూడా వుంది. కాబట్టి, అమ్మవారికి వెయ్యి తలకాయలు, వెయ్యి ముఖాలు వుంటాయని పైకి అర్థమైనా - అనంతమైన తలలు, అనంతమైన ముఖాలు కలది అని అర్థం చెప్పుకోవాలి. ఈ వెయ్యి తలలు, వెయ్యి ముఖాలు వేరే ప్రత్యేకంగా ఉన్నట్లు అర్థం చేసుకోకూడదు. విశ్వంలో ఉన్న అనంతమైన జీవుల తలలన్నీ అమ్మవారి తలలుగాను, ముఖాలన్నీ అమ్మవారి ముఖాలుగాను ధ్యానించి దర్శించాలి.

'అనంతమైన శీర్షములు, ముఖములు కలది' అని ఈ నామానికి అర్థం చెప్పుకోవచ్చును.

ఈ నామానికి రాబోయే రెండు నామాలకు కలిపి 'సహస్రపాత్' నామం తర్వాత రేఖా గణిత పటంతో వివరణ ఇవ్వబడుతుంది.

## 283. సహస్రాక్షీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సహస్రాక్ష్యైనమః' అని చెప్పాలి.

సహస్ర = వెయ్యి లేదా అనంతమైన, అక్షీ = కన్నులుగలది. విశ్వంలోని జీవుల కన్నులన్నీ అమ్మవారి కన్నులుగా ధ్యానించి దర్శించాలి. అప్పుడు అమ్మవారి 'సహస్రాక్షీ' అన్న ఈ నామానికి అర్థాన్ని, అనుభూతి పొందడం జరుగుతుంది.

ఇంద్రుణ్ణి కూడా సహస్రాక్షుడని అంటారు. ఇంద్రుడంటే దేవతా శక్తులకు అధిపతి. అమ్మవారు కూడా సర్వదేవతలచే ఆరాధించబడేది కాబట్టి, ఈ నామం ద్వారా ఇంద్రునికీ అమ్మవారికీ గల సామ్యాన్ని అర్థం చేసుకోవచ్చును.

'అనంతమైన కన్నులు కలది' అని ఈ నామానికి అర్థం చెప్పుకోవచ్చును.

## 284. సహస్రపాత్

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సహస్రపాదేనమః' అని చెప్పాలి.

సహస్ర = అనంతమైన, పాత్ = పాదములు కలది.

ఇంతకు ముందు చెప్పిన 'సహస్ర శీర్షవదనా' 'సహస్రాక్షీ' నామాల్లాగానే ఈ నామాన్ని గూడా విశ్వపరంగా అర్థం చెప్పుకుంటే విశ్వంలోని జీవుల పాదాలన్నీ అమ్మవారి పాదాలుగా ధ్యానిస్తే – ఈ నామం యొక్క అర్థం దర్శనమౌతుంది.

'అనంతమైన పాదములు కలది' అని ఈ నామానికి అర్థం.

'సహస్రశీర్షవదనా' 'సహస్రాక్షీ' 'సహస్రపాత్' అనే ఈ మూడు నామాలు విష్ణుసహస్ర నామాల్లోను, శివసహస్ర నామాల్లో కూడా వస్తాయి. ఈ ముగ్గురికీ ఉన్న ఈ మూడు నామాలను బట్టి విశ్వానికి అధినాథుడై పరబ్రహ్మగా చెప్పబడే ఒకే ఒక దేవుని యొక్క మూడు రూపాలే ఈ ముగ్గురివీ అని తెలుస్తుంది – ఈ మూడు నామాలను ఈ క్రింద తెలిపిన రేఖాగణిత పటంతో చక్కగా అవగాహన చేసుకోవచ్చును.



ఈ వృత్తంలోని కేంద్రం '0' పరబ్రహ్మను సూచించే అమ్మవారి గాను, ఆ కేంద్రం నుండి వ్యక్తమయే వ్యాసార్థాలను (OA, OB, OC, ..) కిరణాలు గాను, ఆ వ్యాసార్థాల అంత్యబిందువులు, జీవులుగాను, (A, B, C, D ...) ఆ అంత్య బిందువులతో ఏర్పడే వృత్తపరిధిని విశ్వంగాను సమన్వయపరచుకోవాలి. అప్పుడు –

వృత్తం అనే విశ్వంలో OAB, OBC లాంటి వాటిని సెక్టారులంటారు. ఇవి ఎన్నైనా ఉండవచ్చును. కాబట్టి, వీటి శీర్షాలు గూడా ఎన్నైనా ఉండవచ్చును. అలాగే - OAB సెక్టారుకు వుండే వైశాల్యమే దాని ముఖం (వదనం Face) ఔతుంది. ఇటువంటి ముఖాలెన్నైనా వుండవచ్చు. అలాగే, సెక్టరులోనిAB, BC ....లాంటి వృత్త చాపాలను పాదాలంటారు. ఇవి గూడా ఎన్నైనా వుండవచ్చు. అందుకని ఈ చిత్రంలో అదే వృత్త కేంద్రానికి – ఎన్నైనా శీర్షాలు, ఎన్నైనా వదనాలు, ఎన్నైనా పాదాలు వుండటానికి అవకాశం వున్నట్లే – అమ్మవారికి కూడా ఇలా అవకాశం వుంటుంది కాబట్టి – సహస్ర శీర్షవదనా, సహస్రాక్షీ, సహస్రపాత్' అనే నామాలు అమ్మవారి పట్ల సార్థకమౌతాయి.

(చిత్రం ద్వారా చెప్పుకుంటే బాగా అర్థం అవుతుందని ఇలా చెప్పడం జరిగింది. వెయ్యితలలువుంటాయన్నపుడు – వెయ్యి కళ్ళు, వెయ్యి పాదాలు ఎలా వుంటాయి ? రెండు వేల చొప్పున వుండాలి గదా – అనే సందేహానికి గూడా తావుండదు.)

'ఎన్నైనా తలలను, ఎన్నైనా ముఖాలను, ఎన్నైనా కళ్ళను, ఎన్నైనా పాదాలను కలిగి యుండుటకు అవకాశము కలది' అని వరుసగా ఈ మూడు నామాలకు అర్థం చెప్పుకుంటే బాగుంటుంది.

## 285. ఆ బ్రహ్మకీటజననీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ఆ బ్రహ్మకీటజనన్యైనమః' అని చెప్పాలి.

ఆ బ్రహ్మ = బ్రహ్మనుండి, కీట = కీటకముల వరకు అందరికి జననీ = తల్లి.

ఎంత పెద్దవారైనా తల్లి ద్వారానే భౌతిక ప్రపంచంలోకి రావాలి. తల్లి లేందే జన్మవుండదు. అంటే – ప్రతి వారికీ జన్మనిచ్చేది తల్లి. సృష్టికారుడైన బ్రహ్మనుండి – ఆ

బ్రహ్మతో పోలిస్తే సూక్ష్మాతి సూక్ష్మంగా వుండే కీటకానికి కూడా – జన్మరావాలంటే తల్లి వుండాల్సిందే ! అటువంటి తల్లులందరికీ మూలకారణమైన తల్లి 'శ్రీ లలితాదేవి'. (పీఠికలో ఈ విషయం వివరించడం జరిగింది కాబట్టి ఇక్కడ మళ్ళీ వివరణ ఇవ్వటం లేదు)

ఎత్తిన జన్మకు ఉత్తమ లక్ష్యం – బ్రహ్మపదప్రాప్తి. ఎత్తిన జన్మకు అధమ ఫలం – కీటక జన్మప్రాప్తి. అయినా ఈ ఇద్దరికీ జన్మనిచ్చేది అమ్మవారే ! కర్మఫలాలను నిర్ణయించి తగిన శరీరాలతో వారికి పునర్జన్మ నేర్పాటు చెయ్యడం గూడా అమ్మవారే చేస్తుంది.

'బ్రహ్మనుండి కీటకం వరకు అందరికీ తల్లి' అని ఈ నామానికి అర్థం.

## 286. వర్ణాశ్రమ విధాయినీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'వర్ణాశ్రమ విధాయిన్యైనమః' అని చెప్పాలి.

వర్ణ = (నాలుగు) వర్ణములను, ఆశ్రమ = (నాలుగు) ఆశ్రమములను, విధాయినీ = ఏర్పాటు చేయునది.

ఈ నామాన్ని చాలా విపులంగా నిష్పక్షపాతంగా అర్థం చేసుకోడానికి ప్రయత్నించాలి. 'వర్ణం' అనే పదాన్ని సరిగా అర్థం చేసుకోకుండా 'కులం' అనే పదంతో కలగా పులగం చేసుకుని అసలైన మూల అర్థాన్ని, మూలభావాన్ని భ్రష్టుపట్టించి, అసందర్భంగా అర్థాలు చెప్పుకుని అనర్థాలకు దారితీయించారు. ఈ విషయంలో పండితులు, పామరులు కూడా ఒకే రకంగా ప్రవర్తించడం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది.

'వర్ణము' – అంటే రంగు, ఒక రకమైన పాట, అక్షరము మొదలైన అర్థాలెన్నో వున్నాయి. వాటితో 'తరగతి'(Class) లేదా Category అనేది కూడా ఒక అర్థం. ఈ చివరి అర్థాన్నే ప్రస్తుత నామంలోని 'వర్ణం' అనే పదానికి చెప్పుకోవాలి గాని, కులానికి (Caste) సంబంధించిన పదంగా అర్థం చెప్పుకోకూడదు.

మానవజాతిని నాలుగు తరగతులుగా విభజించానని – శ్రీకృష్ణుడే – చాతుర్వర్ణ్యం మయాసృష్టమ్' అని గీతలో చెప్పాడు. అయితే ఈ విభజన ఏ విధంగా, దేనిని ఆధారంగా

(Basis) చేసుకుని చేయడం జరిగిందో కూడా అదే శ్లోకంలోని రెండో పాదంలో 'గుణకర్మ విభాగశః' అని సూటిగా చెప్పాడు.

ఈ రెండో పాదానికి వక్రభాష్యాలు తీసుకోకుండా, అర్థ సంక్లిష్టతకు భావ సందిగ్ధతకు అవకాశం రానీయకుండా సూటిగా 'వారి వారి గుణములను బట్టి, వారు చేయగల కర్మలను బట్టి ఈ విభజన జరిగింది' అనే అర్థం చెప్పుకోవాలి. అంటే దీనిని బట్టి వ్యక్తుల స్వభావాన్ని, ప్రవర్తనను, గుణములను (Mental inclinations) బట్టి, వారుసమర్థతతో, నిపుణతతో, చేయగల పనిని బట్టి ఈ విభజన జరిగిందని చక్కగా అర్థమౌతోంది. అంతేకాదు. 'జన్మ' కు ఈ 'వర్ణా' నికి ఏమీ సంబంధము లేదన్న విషయం గూడా స్పష్టమౌతోంది.

అయితే, భగవద్గీతలోని ఈ శ్లోకంలో చతుర్వర్ణాలు అన్నాడు కాని వాటి పేర్లు చెప్పలేదు. అవి – బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణాలు. ఈ నాలుగు వర్ణాల గూర్చి – పురుష సూక్తంలో గూడా

'బ్రాహ్మణో஽స్యముఖమాసీత్, బాహూరాజన్యః కృతః
ఊరూతదస్యయద్వైశ్యః, పద్భ్యాగ్ం శూద్రోఅజాయత'

అని చెప్పబడింది. అయితే, ఇక్కడ చెప్పిన విషయానికి కూడా సరియైన అర్థాన్ని చాలామంది చెప్పరు. పైకి కనబడే స్థూలార్థాన్నే తీసుకున్నారు గాని, సూక్ష్మార్థాన్ని గ్రహించలేదు. స్థూలార్థ ప్రకారం – విశ్వాన్ని ఒక పురుషునిగా సమన్వయ పరచుకుంటే – (Personification of Universe with a man) ఆ విశ్వపురుషుని ముఖం నుండి బ్రాహ్మణుడు, బాహువుల నుండి క్షత్రియుడు, తొడల నుండి వైశ్యుడు, పాదాల నుండి శూద్రుడు – పుట్టారు అనే అర్థం వస్తుంది. (కాని పురుషసూక్తంలో చెప్పబడిన ఈ ఋక్‌లు ఆలంకారిక భాషలో (Figurative language) వున్నాయని గ్రహించాలి. ఎవ్వరూ ముఖంలోంచి, బాహువుల్లోంచి, తొడల్లోంచి, పాదాల్లోంచి పుట్టరు.

'వాడు తల్లినోట్లోంచి ఊడిపడ్డాడు' అంటే తల్లి నోట్లోంచి పుట్టాడని కాకుండా 'అచ్చుతల్లి పోలిక అన్నమాట' అని ఎలా అర్థం తీసుకుంటున్నామో – ఇక్కడ చెప్పిన విషయం గూడా అలాగే అర్థం చేసుకోవాలి. అలాగే, ఆంగ్లంలో Rose is the queen

of the garden'. అంటే – తోటకు గులాబీ పువ్వు రాణీ గారు – అని కాకుండా తోటలో పూసే పూలలో అన్నిటి కన్న గులాబీ పువ్వు అందమైనది' అని ఎలా అర్థం చేసుకుంటున్నామో అలాగే ఇక్కడ కూడా అర్థం చేసుకోవాలి. దీనిని ఆలంకారిక భాష (Figurative language) అంటారు.

సంస్కృతంలో 'ముఖం' అంటే 'నోరు' అని అర్థం గాని 'వదనం' (Face) అని అర్థం కాదు. (మౌఖిక పరీక్ష – అంటే సూటిగా నోటితో సమాధానాలు చెప్పవలసిన పరీక్ష అనే అర్థం గాని, 'వదనం యొక్క కవళికలు(Facial expressions) మారుస్తూ చెప్పే పరీక్ష' అని కాదు. తెలుగులో వదనానికి వేరే పదం లేక 'ముఖం' అనే పదాన్నే వాడుతున్నాము). ఏదైనా విషయాన్ని విపులంగా చెప్పడానికి మనిషికి 'నోరు' ఎలాగో – సమాజానికి విషయాలను విపులంగా చెప్పడానికి సామర్థ్యమున్న వ్యక్తులు అలాగన్నమాట! వీరినే బ్రాహ్మణులు అన్నారు. మొగ్గలాగా వున్న విషయాన్ని పువ్వులాగా విచ్చుకునేట్లు (బృహ్మణం చెందడం) చెప్పగలిగే వానిని 'బ్రాహ్మణులు' అంటారు. అందుచేతనే – సమాజంలో ఇలాంటి వారిని – ఒక తరగతి అంటే ఒక వర్గంగా చేసి, ఆ వర్గాన్ని 'బ్రాహ్మణవర్గము' అన్నారు. అలాగే, బాహువులు ఆత్మరక్షణకు ఉపయోగిస్తాయి కాబట్టి– 'రక్షించే' లక్షణం వున్న మానవులందర్నీ ఒక తరగతిగా చేసి ఆ వర్గాన్ని 'క్షత్రియవర్గం' అన్నారు. అలాగే శరీరానికి ముఖ్య సంపద అయిన గుండె, ఊపిరితిత్తులు, మూత్రపిండాలు మొదలైన వాటిని తమ నెత్తి మీద పెట్టుకుని కాపాడే తొడలు ఎలాంటివో– దేశ సంపదను సద్వినియోగ పరచే – ఎగుమతులు, దిగుమతులు, వాణిజ్య వ్యాపారాలు నిర్వహించే మానవ వర్గాన్ని 'వైశ్య వర్ణము' అన్నారు. అలాగే, భౌతిక శ్రమతో పనులను చక్కగా చేయగల వారిని ఒక వర్గంగా చేసి 'శూద్రవర్ణము' అన్నారు. ఈ నాలుగు వర్ణాల వాళ్ళు వరుసగా ఈ నాలుగు రకాల పనులు చేయగలుగుతారు. వీరికి వరుసగా జ్ఞానము (wisdom), రక్షణ (Protection), ప్రయోజనం (Utility), శారీరక శ్రమ (work) - అనేవి కీలక లక్షణాలుగా(Characteristics) వుంటాయి. ఇవి డాక్టరు, ప్లీడరు, లాయరు లాంటివే కాని, కులాలు కావు. అందరూ అన్ని పనులకు అర్హులు కారు. ఎవరు ఏపే పనికి అర్హులు అన్నదానిని బట్టి ఈ నాల్గింటిలో వారిని ఆ వర్గానికి కేటాయిస్తారు. ఈ నాలుగు రకాల వర్గాల వాళ్ళ భారతదేశ ప్రభుత్వానికే కాదు. అన్ని దేశాల, అన్ని పార్టీల,

ప్రభుత్వాలకు అవసరమే. ఈ విధమైన విభజనను అన్ని దేశాలవారూ చేసుకోవచ్చును. ఈ నాలుగు వర్ణాల వారినే – Preachers, warriors, Businessmen, Workers అని ఆంగ్లంలో అనువాదం చేసుకోవచ్చును.

ఒకే తండ్రికి బిడ్డలైనా వారి మానసిక లక్షణాన్ని బట్టి, చేయు గల పనిని బట్టి - ఒకడు బ్రాహ్మణుడవచ్చును, ఇంకొకడు క్షత్రియుడు, మరొకడు వైశ్యుడు ఇంకొకడు శూద్రుడు అవచ్చును. అయితే, ఇక్కడ ఒక ముఖ్య విషయంచెప్పుకోవాలి. ఒక బ్రాహ్మణ వర్ణానికి సంబంధించిన వ్యక్తి యొక్క కుమారుడు తిరిగి బ్రాహ్మణ వర్ణానికి చెందినవాడే అవడానికి, క్షత్రియువర్ణానికి చెందిన వ్యక్తి యొక్క కుమారుడు తిరిగి క్షత్రియ వర్ణానికి, (ఇలాగే మిగతావి గూడా) చెందిన వాడే అవడానికి ఎక్కువ అవకాశం(Opportunity) ఉంటుంది. ఎందుకంటే – తండ్రి దగ్గఱ, ఇంటిలోను గూడా దానికి సంబంధించిన వాతావరణం, నేపథ్యము (Background) అంతకు పూర్వమే వుంటుంది కాబట్టి. ఇది – ఒక డాక్టరు కొడుకు డాక్టరు అవడానికి, లాయరు కొడుకు లాయరు అవడానికి ఎక్కువ అవకాశం వుంటుంది అనడం లాంటిది. ఇంకా బాగా అర్థమవాలంటే – ప్రధానమంత్రి సంతానం ప్రధానమంత్రి అవడానికి ఎక్కువ అవకాశం వుంటుంది. అయితే ఆ అవకాశాన్ని వినియోగించుకునే వారిపట్ల మాత్రమే ఇది సత్యం. (ఈ విషయం మనకు బాగా తెలుసు!)

కులాలు వేరు – అవి వృత్తులను బట్టి వచ్చేవి. వాటికీ వర్ణాలకీ సంబంధము లేదు. కులాలు ఎన్నైనా వుండవచ్చు. కాని వర్ణాలు మాత్రం నాలుగే అని గుర్తుంచుకోవాలి. ఈ నాలుగు వర్ణాల వారు దేశ ప్రగతికి పురోభివృద్ధికి అవసరమైన వారు. వీటిలో ఒకటి ఎక్కువ, ఒకటి తక్కువ అనే భేదం లేదు. నాలుగు వర్ణాల వారి సామూహిక కృషిపై (Coordinated effort) దేశపరిస్థితి ఆధారపడి వుంటుంది. (ఇంకా ఈ 'వర్ణం' అనె పదం గురించి పూర్తి అవగాహన కలగాలంటే ధర్మవ్యాధుడి కథ, భారతంలో నహుష ప్రశ్నలు చదవాలి) వర్ణధర్మాలు ఎంత చక్కగా పాటింపబడితే దేశప్రగతి అంత చక్కగా వుంటుంది.

ఇక ఆశ్రమాలు. ఇవి నాలుగు వుంటాయి. ఒక వ్యక్తి జీవిత కాలంలో అంచెలంచెలుగా సాధించే స్థితులను బట్టి ఇవి ఏర్పాటు చేశారు. 1. బ్రహ్మచర్యము, 2.

గార్హపత్యము 3. వానప్రస్థము 4. సంన్యాసము. బ్రహ్మచర్యంలో - కేవలం విద్యాసముపార్జన; గార్హపత్యంలో - సంసార నిర్వహణ, అతిథి అభ్యాగతుల సేవనము, పిల్లల పోషణాది బాధ్యతలు; వానప్రస్థంలో - విశ్రాంత జీవనము (Retired life) (అవసరమైనపుడు మాట్లాడడం, అనవసరమైనపుడు మౌనంగా వుండటం, కొడుకులైనా సరే అడిగితే సలహాలివ్వడం, అడక్కపోతే తెలిసినా - సలహాలు చెప్పకుండా వుండటం లాంటి వాటి శిక్షణకు సంబంధించిన ఆశ్రమం ఇది.) ఇక చివరిది సంన్యాసం. ఇది పుచ్చుకుంటేను, ప్రమోషన్ ద్వారాను వచ్చేది కాదు. జీవితంలోని ప్రవర్తన ద్వారా వచ్చే ఒక స్థితి. దేనికీ అతుక్కోకుండా, అంటే - సంగం లేకుండా జీవితాన్ని గడపడం అన్నమాట! సంసారిగా ఉండి కూడా సంన్యాసిలాగా జీవించే వారుంటారు. సన్యాసిగా ఉండి కూడా సంసారి లాగా ఉండే వాళ్ళుంటారు. అందుకని వారి ఆశ్రమాన్ని - వేషాన్ని బట్టి, ధరించిన బట్టలను బట్టి, పెరిగిన గడ్డాలను, గోళ్ళను, జుట్టును బట్టి నిర్ణయించకూడదు. జీవిలో పరిపూర్ణత్వం రావాలంటే ఈ నాలుగు ఆశ్రమ విధానాలను సక్రమంగా నిర్వహించి ఆచరణ ద్వారా లక్ష్యాన్ని సాధించాలి.

'నాలుగు వర్ణములను - నాలుగు ఆశ్రమములను ఏర్పాటు చేయునది' అని ఈ నామానికి అర్థం.

## 287. నిజాజ్ఞారూపనిగమా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'నిజాజ్ఞారూపనిగమాయైనమః' అని చెప్పాలి.

నిజ = తన యొక్క, ఆజ్ఞా = ఆదేశములే, రూప = రూపుగట్టుకొనిన, నిగమా = వేదములు అయినది.

అమ్మవారి ఆజ్ఞలన్నీ రూపుకట్టుకుంటే ఆ రూపం వేదాలౌతాయి. వేదాల్లో ఏది చెప్పబడినా అది అమ్మవారి ఆజ్ఞ, ఆదేశము, శాసనము అని గుర్తుంచుకోవాలి. అమ్మవారి ఆజ్ఞలకు వ్యతిరేకమైనవి వేదాల్లో ఉండవు. శాశ్వత సత్యాలన్నీ అమ్మవారి ఆదేశాలే! అందుకే తైత్తిరీయోపనిషత్తులోని ఆనందవల్లిలో ''భీషాఽస్మాద్వాతః పవతే, భీషోదేతి సూర్యః, భీషాఽస్మాదగ్నిశ్చేంద్రశ్చ...'' అని చెప్పబడింది.(అమ్మవారి ఆజ్ఞలకు భయపడి

వాయువు వీస్తున్నాడట! సూర్యుడు ఉదయిస్తూ వేడిమిని వెదజల్లుతున్నాడట! అగ్ని, ఇంద్రుడు వాళ్ళకు కేటాయించిన పనులు వాళ్ళు చేసుకుంటూ పోతున్నారట!) ఇవన్నీ అమ్మవారి ఆజ్ఞలే! వేద ఋక్కులు కూడా!

ఈ నామాన్ని జపిస్తే – మనంతకు మనకే ఏ పనులు చేయకూడదు, ఏ పనులు చేయవచ్చో తెలిసేట్లుగా అమ్మవారు అనుగ్రహిస్తుంది. 'నిజాజ్ఞారూపనిగమా' అన్న దానికి వాస్తవానికి అర్థం ఇదే!

'తన ఆజ్ఞలే రూపుకట్టుకున్న వేదములు అయినది' అని ఈ నామానికి అర్థం.

## 288. పుణ్యాపుణ్యఫలప్రదా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పుణ్యాపుణ్యఫలప్రదాయైనమః' అని చెప్పాలి.

పుణ్యా = మంచిపనులకు, అపుణ్యా = చెడ్డపనులకు, ఫల = వాటి వాటికి తగిన ఫలములను, ప్రదా = చక్కగా ఇచ్చునది.

శ్లో. 'పుణ్యస్యఫలమిచ్ఛంతి పుణ్యం నేచ్ఛంతి మానవాః,
నపాపఫల మిచ్ఛంతి పాపం కుర్వంతి యత్నతః.'

''సాధారణంగా మానవుడు పుణ్యకార్య ఫలం రావాలని కోరతాడు కాని పుణ్య కార్యాలు చెయ్యడు, పాపాలు చేస్తూ పాపకార్యఫలం రాకూడదని ఆశిస్తాడు'' అని పై శ్లోకానికి అర్థం.

ఇంతకు ముందు నామంలో – మనంతకు మనకే ఏ పనులు చెయ్యాలో, ఏవి చెయ్యకూడదో తెలిసేట్లుగా అమ్మవారు అనుగ్రహిస్తుంది – అని చెప్పబడింది. అయితే 'ఎలా తెలుస్తుంది మనంతకు మనకే ?' అన్న దానికి సమాధానం ఈ ప్రస్తుత నామంలో వుంది. మనం చేసుకున్న దాన్ని బట్టి – మన కర్మ ఫలాలను మనకు మనమే సృష్టించుకునేట్లు చేస్తుంది కాబట్టి, మనం ఏపనులు చేయవచ్చో, ఏ పనులు చేయకూడదో మనము ముందే జాగ్రత్తపడి చేసుకుంటాం. అంటే –

పుణ్యకార్యలు చేస్తే పుణ్యఫలాలు - అపుణ్య కార్యాలు చేస్తే అపుణ్యఫలాలు వస్తాయని చెప్పే విషయం నమ్మడం కాదు, నిజంగా తెలుస్తుందన్న మాట! దాంతో వళ్ళు దగ్గర పెట్టుకుని ఎప్పుడూ పుణ్యకార్యాలే చేస్తాము గాని పాపకార్యాలు చెయ్యము. ఇదీ సాధకులకు అమ్మవారిచ్చే శిక్షణ !

'మంచి పనులకు మంచి ఫలితాలను, చెడ్డపనులకు చెడ్డఫలితాలను ఇచ్చునది' అని ఈ నామానికి అర్థం.

## 289. శ్రుతిసీమంతసిందూరీకృతపాదాబ్జధూళికా

పదహారు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'శ్రుతిసీమంత సిందూరీకృత పాదాబ్జధూళికాయైనమః' అని చెప్పాలి.

శ్రుతి = వేదములనెడు స్త్రీల యొక్క; సీమంత = పాపిటలను, సిందూరీ కృత = సిందూరము ధరించునట్లు చేసిన, పాదాబ్జ = పాద పద్మము యొక్క, ధూళికా = ధూళిని కలిగినది.

'బాలా' - 'బాలికా' అయినట్లు, 'ధూళి' - 'ధూళికా' ఔతుంది. 'ధూళికా' - అంటే 'చిన్న ధూళికణము' అని అర్థం.

ఈ నామం ఎంత అర్థవంతమైందో అంత అందమైనది గూడా !

పాపిటలో సిందూరం స్త్రీలను పుణ్యస్త్రీలుగాను, కన్యల వర్గము నుండి వేరుగా - 'కాంతుని గల కాంతలగాను' గుర్తింప చేస్తుంది. అందుకే పాపిటలో సిందూరం ఆడవారికి సౌభాగ్యవర్ధనం. అంటే - వారి భర్తలకు ఆయుర్వర్ధనం. ఈ నామంలో వేదాలను పుణ్యస్త్రీలతో పోల్చారు వ్యాసులవారు.

ఈనామం వ్రాయడానికి ముందు వ్యాసులవారికి ఈ క్రింద తెలిపిన దృశ్యం దర్శనం జరిగి ఉంటుందని నా ఊహ.

నాలుగు వేదాలు అనే పుణ్యస్త్రీలు ఒక రోజున తమ తల్లి అయిన అమ్మవారి దర్శనానికై వచ్చారు. అమ్మవారు సింహాసనా రూఢి అయి ఉన్నది. అమ్మవారు పాదం

మోపే పీఠం ఎత్తుగా వుంది. ఆ పీఠం వద్దకు జేరి నలుగురు పుణ్యస్త్రీలు ఒకరి తరువాత ఒకరు అమ్మవారి పాదంపై మూర్ధాన్ని ఉంచి, తలను ఒక్కసారి క్రిందకు వంచి నమస్కరించారు. అప్పుడు అమ్మవారి కాలి బొటన వ్రేలి కున్న ఎఱ్ఱని పారాణి శ్రుతి సీమంతినుల (వేదవనితల) సీమంతాల (పాపట) గుండా స్పృశిస్తూ ఆ పాపిట్లలో సిందూరం పెట్టినట్లైంది. (వేద వనితలు మధ్య పాపిటలే తీస్తారు, ప్రక్క పాపిటలు గాదు)

ఈ దృశ్యం దర్శనం జరిగిన వ్యాసులవారికి వళ్ళు పులకరించి వెంటనే 'శ్రుతి సీమంత సిందూరీ కృతపాదాబ్జధూళికా' అని అమ్మవారిని స్తుతించారు. ఇదిసహస్రనామ స్తోత్రంలో కమనీయమైన ఉపమానాలతో ఉన్న రమణీయమైన నామం.

అమ్మవారి పాదపద్మ రజాన్ని శిరస్సు నందలి పాపిటలో ధరించినందు వలన శ్రుతి వనితలు పవిత్రవంతమయ్యారు. అంటే – అమ్మవారి పద సౌభాగ్యాన్ని (వేద వాఙ్మయం) తనలో విస్తరింప చేసుకున్నందువల్లనే వేదాలు అంత పవిత్రంగా భారతీయులచే పూజింపబడుతున్నాయి అని అర్థం. ( అంటే వేద వాఙ్మయంలో అంతా అమ్మవారి గురించి, అమ్మవారి జగత్పరిపాలన గురించి, ఆదేశాల గురించి ఉంటుందని పరోక్షంగా చెప్పడం అన్నమాట !

శ్రుతి శీర్షాల సీమంతాలను అమ్మవారు తన పాదాంగుళితో దున్ని, ఆ పాపిట్లలో పడిన తన పాదపారాణి రజస్సును సిందూరంలా స్ఫురింపచేసింది అనడంలో – ఆ శ్రుతి శీర్షాలైన ఉపనిషత్తులను జ్ఞానం అనే పంట పండటానికి సిద్ధం చేసి సిందూరం దిద్దినట్లుగా భావించడం – మరింత మనోజ్ఞంగా ఉంటుంది. వస్తువు తయారైన తరువాత అన్నీ పరీక్షించి బాగుంది అని 'అగ్‌మార్క్ లేదా ISI ముద్ర వేసి విపణివీధిలోకి పంపినట్లు, శ్రుతి శిరస్సుల (ఉపనిషత్తుల)లోని జ్ఞాన విషయాలన్నీ బాగున్నాయని అమ్మవారు తన కాలిగోటితో ముద్ర వేసి వాఙ్మయ ప్రపంచంలోకి పంపించింది అనడం ఇంకా మనోహరంగా ఉంటుంది.

శ్రుతిలయ బద్ధమైన జీవితం గడిపే సాధకులు ఈ నామాన్ని జపిస్తే వారి జీవితమంతా మంచితనము (సు), వెలుగు (భ) చైతన్యము (గ) నిండి 'సౌభాగ్యకరమైన, ఆహ్లాదకరమైన, వైభవోపేతమైన జీవితాన్ని గడుపుతారు.

1) 'శ్రుతి వనితల సీమంతాలకు సిందూరము ధరించునట్లు చేసిన పాదపద్మము యొక్క ధూళిక కలిగినది' –

2) శ్రుతి శీర్ష సీమంతాలను తన పాదాంగుళితో దున్ని జ్ఞాన మనే పంట పండడానికి సిద్ధం చేసిన పాద పారాణి ధూళిక కలిగినది.

3) శ్రుతి శీర్ష జ్ఞాన విషయాలు చక్కగా ఉన్నాయని పాదాంగుళితో వాటిపై 'అనుమతి ముద్ర' ను వేసి వాఙ్మయ ప్రపంచంలోనికి పంపిన పాదధూళిక కలది' అని ఈ నామానికి అర్థాలు చెప్పుకోవచ్చును.

## 290. సకలాగమ సందోహశుక్తి సంపుటమౌక్తికా

పదహారు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సకలాగమ సందోహ శుక్తిసంపుటమౌక్తికాయైనమః' అని చెప్పాలి.

సకల = అన్ని, ఆగమసందోహ = ఆగమ శాస్త్రములనెడు, శుక్తి = ముత్యపు చిప్పలచే, సంపుటి = చక్కగా ఉంచబడిన లేదా నిక్షిప్తము చేయబడిన, మౌక్తికా = ముత్యము.

ఇంతకు ముందు నామంలాగానే ఈ నామం గూడా ఈ లలితా స్తోత్రంలో తల మానికమైనది. అమ్మవారు ముత్యం లాంటిదట ! సాధారణంగా స్వచ్ఛమైన వారిని ముత్యంతో పోలుస్తారు. ఆ ముత్యాన్ని గూడా 'కడిగిన ముత్యం' అంటారు. కాని, అమ్మవారు కడగవలసిన అవసరం లేని ముత్యం. ఎందుకంటే – ముత్యపు చిప్పలలోనే గుప్తంగా నిర్మలంగా ఉన్న ముత్యం. అమ్మవారు ముత్యం లాంటిది అని పోలిస్తే అది అతి సామాన్యంగా చెప్పినట్లేఔతుంది. వ్యాసులవారు ఎలా చెప్పారో, ఈ ముత్యం చరిత్ర ఏమిటో కొంచెం విపులంగా వివరిస్తాను.

ముత్యపు చిప్పలలో పడ్డ వాన చినుకులే ముత్యాలౌతాయి. అలా అని అన్ని కార్తెలలోని వర్షపు చినుకులు ముత్యాలు కాలేవు. స్వాతి వర్షపు చినుకులే, ముత్యపు చిప్పలలో పడితే – అవి ముత్యపు చిప్పలలో మధ్య నిక్షిప్తమై, కొన్ని రోజులు సమాధి స్థితిలో లాగా ఉండి ముత్యాలౌతాయి.

అయితే, మిగతా నక్షత్రాల కంటె ఈ స్వాతీ నక్షత్రము యొక్క ప్రాముఖ్యము, ప్రాశస్త్యము ఏమిటి ? ఈ స్వాతి నక్షత్రం తులారాశిలో నిండుగా నాలుగు పాదాలూ

ఉంటుంది. ఈ తులారాశి ఏడవరాశి. అన్ని రాశులలోకి అందమైన(Lovely), సౌష్ఠవమైన (Symmetrical) రాశి. మాసాల్లో ఏడవదైన ఆశ్వయుజం గూడా ఈ తులారాశికి సంబంధించినదే. సూర్యుడు తులారాశిలో ఉండి, ఈ తులారాశికి ఎదురుగా$180^0$లలో మేషరాశిలో చంద్రుడున్నపుడు 'ఆశ్వయుజ పూర్ణిమ' వస్తుంది. ఆశ్వయుజ శుద్ధపాడ్యమి నుండి చంద్రుడు ఈ పూర్ణిమ వచ్చే నాటికి పరిపూర్ణుడై షోడశకళాప్రపూర్ణుడౌతాడు. అమ్మవారి పంచదశాక్షరీ మంత్రంలోని 15బీజాక్షరాలను ఆశ్వయుజ శుక్లపక్షంలోని 15 తిథులతోను సమన్వయ పరచుకోమని పీఠికలో చెప్పడం జరిగింది. చంద్రుని 16 కళలను 'షోడశీ' మంత్రానికి 16 అక్షరాలుగా సమన్వయ పరచుకోవాలి. అందుచేత ఈ నామంలో స్వాతి వర్షపు చినుకుల ద్వారా పరిపూర్ణస్థితిని చేరే ముత్యంతో అమ్మవారిని పోల్చడం ఎంతో చక్కని ఔచిత్యాన్ని సంతరించు కుంటుంది. (పైగా ఈ స్వాతీ నక్షత్రం వుండే తులారాశి – మానవుని నాభి ప్రాంతాన్ని సూచిస్తుంది. ఈ నాభి వద్దనే 'మణి' పూర చక్రం' ఉంటుంది).

'స్వాతి' – అనే పదాన్ని 'స్వ + అతి' అని విడదీస్తే – ''అతిశయించిన 'స్వ' తత్త్వం గలది'' అనే అర్థం వస్తుంది. 'అతిశయించిన 'స్వ'తత్త్వం అమ్మవారే! అని ఆదిశంకరులు 'పురమథితుః ఆహోపురుషికా' – అంటే – శివుని అహంకార స్వరూపిణిగా– అంటే, శివుని వ్యక్త స్వరూపంగా) సౌందర్యలహరిలో చెబుతారు. (క్వణత్కాంచీదామా శ్లోకం)

ఇంతవరకు 'అమ్మవారు ముత్యం లాంటిది' అనడం దాకానే చెప్పుకున్నాం (ఈ ముత్యం అందరికీ అందుబాటులో ఉండేట్లుగా ఉండే అన్ని ముత్యాల లాంటిది కాదుట!) ముత్యం – ముత్యపు చిప్పల గుప్పిటలో నిక్షిప్తమై భద్రంగా, రహస్యంగా ఉంచబడి ఉంటుంది. మరి – అమ్మవారు అనే ముత్యం తాలూకు ముత్యపు చిప్పలు ఎలాంటివి అంటే – సకల ఆగమాల సమూహమే ! అంటే – అన్ని స్మృతులు (శాస్త్రాలు) అన్ని శ్రుతులే (వేదాలు) ఆ ముత్యపు చిప్పలట !

అలాంటి వేద శాస్త్రాల గుప్పిటలనే ముత్యపు చిప్పలలో గుప్తంగా దాచబడివుంచిన ముత్యము అమ్మవారు గాని – సామాన్యంగా అన్ని చోట్ల, బాహ్యంగా అందరికీ తేలిగ్గా లభ్యమయే, కడగవలసి వచ్చే – సాధారణ ముత్యం కాదుట! అంటే – 'సకలనిగమ

ఆగమ శాస్త్రాలన్నింటి లోనూ సూక్ష్మంగా, రహస్యంగా ప్రతి పాదింపబడేది అమ్మవారి శత్త్వమే' అని దీని భావం.

ముత్యపు చిప్పలు రెండింటి మధ్యన ముత్యం నిక్షిప్తమై ఉంటుంది. ఆ రెండు ముత్యపు చిప్పలు ఏవంటే - ఒక వైపు నిగమాలు (శ్రుతలు లేక వేదాలు), ఇంకోవైపు ఆగమాలు (స్మృతులు లేక శాస్త్రాలు) అన్నమాట!

ఆడంబరాలు, పటాటోపాలు, ప్రదర్శనాత్మకమైన ఉపాసనా విధానాలు లేకుండా, గోప్యంగా, ప్రశాంతంగా, నిదానంగా, సాధనా మార్గంలో అమ్మవారిని ఆరాధించే సాధకులు ఈ నామాన్ని జపిస్తే - ''వారి ఆరాధన శుచి వంతమై, పవిత్రమై 'ముక్తివంత' మౌతుంది. అంటే - 'ముక్తిఫలాన్ని' పొందుతారు' - అనగా, వారు మోక్షస్థితిని పొందుతారు'' అని అర్థం.

'సకల వేదశాస్త్రాల సమూహమనే ముత్యపుచిప్పల గుప్పిటలో గుప్తముగా ఉంచబడిన ముత్యము' అని ఈ నామానికి అర్థం.

## 291. పురుషార్థప్రదా

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పురుషార్థ ప్రదాయైనమః' అని చెప్పాలి.

పురుష= పురుషునకు కావలసిన, అర్థ = ప్రయోజనములను, ప్రదా = చక్కగా ఇచ్చునది.

పురుషార్థాలంటే పురుషుడై పుట్టినందుకు పొందవలసిన ప్రయోజనాలు,(Utilities) సాధించవలసిన లక్ష్యాలు - వీటినే చతుర్విధ పురుషార్థాలంటారు. (The four ends of man) అయితే, 'ఇవి పురుషులకేనా, స్త్రీలకు అక్కరలేదా' అనే అనుమానం రావచ్చు. అసలు 'పురుష' అనే పదానికి వ్యుత్పత్తి తెలిస్తే అలాంటి సందేహం రాదు. 'పురమునందు ఉండు వ్యక్తిని పురుషు'డంటారు. అయితే ఇక్కడ 'పురము' అంటే ఊరు, పట్టణము కాదు. ఈ శరీరమే పురము. అంటే శరీరం (దేహం) లో వుండే వ్యక్తిని పురుషుడు అంటారు. దేహంలో వుండేది జీవుడు కాబట్టి , 'ఆడజీవుడు,

'మగజీవుడు' వుండడు కాబట్టి – పురుషుడు అంటే 'జీవి' అని అర్థం చెప్పుకోవాలి. ఈ జీవి పదం ఆడవారికి, మగవారికి కూడా సమంగా వర్తిస్తుంది కాబట్టి – పుట్టిన ప్రతి జీవి జీవితంలో సాధించవలసిన లక్ష్యాలను పురుషార్థాలంటారని ముందు తెలుసుకోవాలి. లేకపోతే 'అన్నీ మగవారికే కాని – మహిళలకు ఏముంది మన శాస్త్రాల్లో' అనే విప్లవ ప్రవృత్తి చెలరేగుతుంది.

పురుషార్థాలు నాలుగు. 1 . ధర్మము 2. అర్థము 3. కామము 4. మోక్షము. 'ధర్మము' అన్న పదానికి సరైన ఆంగ్ల పదం లేదనే చెప్పాలి. ఏవో కొన్ని చెప్పు కోవాలంటే Righteousness, Duty, Justice, Property, Law - ఇలా కొన్ని పదాలు చెప్పుకోవచ్చు.

'చేయువలసిన పనిని' ధర్మము అనవచ్చును. పుట్టిన ప్రతి వ్యక్తి నిర్వర్తించవలసిన బాధ్యతలు, సమాజంలో ఉంటున్నందుకు పాటించవలసిన నియమాలు – అన్నీ ధర్మం క్రిందకే వస్తాయి.

1) ధర్మం చేస్తే – 'అది మనల్ని రక్షిస్తుందిట' – అనే కారణంతో గాని,

2) ధర్మం చేస్తే – 'మనతోటి వారుకూడా మనపట్ల ధర్మంగా ఉంటారు కాబట్టి' – అనే కారణంతో గాని,

3) ధర్మం చెయ్యకపోతే – 'శిక్షిస్తారుట' – అనే కారణంతో గాని ధర్మం చెయ్యకూడదు.

4) 'ధర్మం చెయ్యడం ధర్మం కాబట్టి' – అనే కారణం తోనే ధర్మం చెయ్యాలి. ఇలా చేసే బుద్ధిని ప్రసాదించేది అమ్మవారు.

'అర్థం' అంటే డబ్బు అని కాదు అర్థం. 'ప్రయోజనం (Utility) అనేది సరైన అర్థం.

ప్రయోజనం సిద్ధించేందుకు అవసరమయేది అర్థం. ఇది కూడా నోట్ల కట్టలు, కరెన్సీ (Money) అర్థంలో కాకుండా సంపద (Wealth) అనే అర్థంలో దీన్నే గ్రహించాలి. అంటే – తనకు, ఇతరులకు కూడా అన్ని సమయాల్లోనూ ఉపయోగపడేది.

ఈ సంపదను ప్రసాదించేది అమ్మవారు.

'కామం' అంటే ప్రేమ(Love), లాలస(Lust), లైంగికానందము(Sex) కాదు. 'కామం' అంటే – 'అనుభవించగలగడం' (Accomplishment) దేనినైనా పొంది అనుభవిస్తున్నపుడు కలిగే అనుభవాన్ని – వాస్తవానికి 'కామం' అనాలి. కాని – ప్రస్తుతం దాని అర్థమే మారిపోయింది.

ఈ 'అనుభవ తృప్తిని' కూడా ఇచ్చేది అమ్మవారే !

'మోక్షం' బంధమోచనం. అంటే – ఆంగ్లంలో – Salvation or Liberation అనే అర్థాలు చెప్పుకోవచ్చును. 'ముక్తసంగస్థితిని' మోక్షం అంటారు. అంటే – దేనికీ అంటని స్థితిని (Non attachment) 'ముక్తసంగస్థితి' అంటారు. అందరిలాగే అన్ని విధ్యుక్త ధర్మాలు నిర్వర్తిస్తూ ఉన్నా దేనికీ అతుక్కోని స్థితి ఇది. చింతకాయ – చింతగుల్లగా – లేదా, కొబ్బరికాయ – కొబ్బరి కురిడీగా అయిన స్థితి ఇది. బ్రతికి ఉండగానే సాధించే ఒక విశిష్టస్థితి ఇది. అంతే గాని చచ్చిపోయిన తర్వాత వచ్చేదిగాదు.

ఈ స్థితిని గూడా ప్రసాదిస్తుంది అమ్మవారు.

మొదటి మూడింటిని – అంటే ధర్మార్థ కామాలను భార్యాభర్తలిద్దరూ కలసి సాధించవచ్చునేమో కాని, నాల్గవదైన మోక్షం మాత్రం వ్యక్తిగతమైనదే ! సాధనకు సంబంధించినది – అందుకే వివాహ మంత్రాలలో 'ధర్మేచ – అర్థేచ – కామేచ, నాతిచరామి' – అని చెప్తారు కాని – 'మోక్షేచ' అని చెప్పించరు. (పనిలోపని వాటితో పాటు – మోక్షాన్ని' గూడా కలిపి చెప్పే పురోహితులు కూడా ఉండవచ్చు. అది వేరే సంగతి !) ధర్మార్థాలు అనే రెండు గట్ల (Banks) మధ్య కామం అనే ప్రవాహం సాగాలి. అంటే – హద్దులను నిర్ణయించు 'ధర్మము – అర్థము' – అనే రెండు గట్లను అతిక్రమించకుండా 'కామం' వుండాలి.

అర్థకామాలు రెండూ ధర్మోత్తరంగా వుండాలి కాని – కామోత్తరంగా ధర్మార్థాలు, అర్థోత్తరంగా ధర్మకామాలు ఉండకూడదు. వీటిని ఈక్రింది భుజాలలో చూపినవిధంగా సంకేతించవచ్చును.(✓పెట్టినపద్ధతి సరియైనది, Xపెట్టిన పద్ధతి సరికానిది)




ఈ ధర్మార్థ కామాలకు మధ్య సరియైన సమన్వయం వుండి సమపాళ్ళలో జీవితం వుంటే (అంటే - When there is equal proportion among Dharma, Artha and Kama) - అప్పుడు ఆ జీవి జీవితాన్ని ఒక సమబాహు త్రిభుజంతో పోల్చవచ్చును. వీటి మధ్య అనుపాతం చెడితే అప్పుడు జీవితం విషమబాహు త్రిభుజంలాగా ఉంటుంది.

జీవితం – ధర్మార్థ కామాలతో సమబాహు త్రిభుజంలా ఉన్న వానికి మోక్షం ఆ త్రిభుజం యొక్క గరిమనాభి(Centroid) లాగా మధ్యలో దానంతకు అదే సిద్ధిస్తుంది. ఈ స్థితిలో ఉన్న జీవికి తన జీవితంలో ఇతర లక్ష్యాలను సూచించే Ortho centre (O), In centre (I), Circum Centre (s) అన్నీ ఈ గరిమనాభి తో ఏకీభవిస్తాయి గూడా ! అంటే మోక్షం కోసం వేరే ప్రయత్నం అక్కర్లేదన్నమాట ! ఇదెలాసాధ్యం అనే సందేహం రావచ్చును.

ఒక నాలుగు అడుగులు పొడవు గల కఱ్ఱను ఇచ్చి సరిగ్గా అడుగు పొడవుగల నాలుగు ముక్కలుగా విరగగొట్టమన్నప్పుడు మనం దాన్ని సరిగ్గా అడుగు అడుగు దూరాల్లో విరగగొట్టవలసి వచ్చేది మూడుసార్లే ! (క్రింది పటంలో A, B, Cల వద్ద) నాలుగో అడుగుముక్క విరగగొట్టవలసిన పనిలేదు. మూడు సార్లు మనం చేసిన సరియైన ప్రయత్నంలో నాల్గవది దానంతట అదే సిద్ధిస్తుంది! అలాగే – ధర్మార్థ కామాల విషయంలో 'సమతౌల్యం' ఉంటే ఆ జీవికి మోక్ష స్థితి వచ్చినట్లే !




'పురుషునకు కావలసిన ప్రయోజనములను ఇచ్చునది' – అని ఈ నామానికి అర్థం.

## 292. పూర్ణా

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పూర్ణాయైనమః' అని చెప్పాలి.

పూర్ణా = పూర్ణురాలు.

కొఱత; కొఱతలేనిది; మొదలు, తుదిలేనిది; క్షయ - వృద్ధులు లేనిది - అయినదేమన్నా వుంటే దాన్ని 'పూర్ణా' అని అనాలి. 'చోటు' కు ఈ లక్షణాలుంటాయి. అమ్మవారు సరిగ్గా అలాంటిదన్న మాట ! అంటే, అన్నిటిలోనూ 'పుష్కలత్వమే' - గాని 'శుష్కత్వం' ఉండదు.

ప్రతిమాసం పూర్ణిమను ఇస్తున్నట్లుగానే - ప్రతిజీవికి మనస్సనే చంద్రుణ్ణి పూర్ణచంద్రునిగా ప్రకాశింప చేసే తరుణం, అవకాశం ఇసుంది అమ్మవారు. ఆ రాజరాజేశ్వరిని ఆరాధించి ధ్యానించే వారిలో - ఎప్పుడూ ఆశాజనకంగా (optimistic & Postive thinking) జీవించే వారికే శ్రీ విద్య భాసిస్తుంది, అటువంటి వారిని పూర్ణవంతులను చేస్తుంది అమ్మవారు. దీన్నే 'పూర్ణదీక్ష' 'పాదుకాంతదీక్ష' అంటారు శ్రీ విద్యలో 'పరిపూర్ణమైన మనస్సు, పవిత్రమైన భావాలు, నిత్యసంతృప్తి' లక్షణాలు కలవారే పూర్ణదీక్షాపరులు, ఇవి లేకపోతే ఈ దీక్ష తీసుకున్నా ఒకటే లేకపోయినా ఒకటే!

'పూర్ణమదఃపూర్ణమిదం....' అనే ఈశావాశ్యోపనిషత్ శాంతి పాఠంలో చెప్పిన పూర్ణం - అమ్మవారే !

(చోటువలె) పరిపూర్ణురాలు' అని ఈ నామానికి అర్థం.

## 293. భోగినీ

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'భోగిన్యైనమః' అని చెప్పాలి.

భోగినీ = భోగములను అనుభవించునది లేదా భోగములనుఇచ్చునది.

సుఖాలను అనుభవించే వాడిని - 'భోగి' అంటారు. అయితే 'యోగి' కాకుండా

కేవలం 'భోగి' అయితే చివరకు వాడు 'రోగి' అవుతాడు. కాబట్టి నిజమైన 'భోగి' స్థితి రావాలంటే ముందు 'యోగి' కావాలి. 'ఎంతతినాలో అంతే తిని, తినకూడనివి తినకుండా వుండే వాణ్ణి, – 'యోగి' అంటారు.

'భోగము' అంటే 'త్రాచు పాము పడగ' అని కూడా అర్థం వుంది. అయ్యగారికి ఈ భోగము వుంటుంది – అందుకే అయ్యవారిని (శివుణ్ణి) 'భోగుడు' అని కూడా అంటారు. (భోగేశ్వర స్వామి) 'ఈ విధమైన భోగి' గా మనలను తయారు చేయ గలుగునది కాబట్టి అమ్మవారిని 'భోగినీ ' అన్నారు.

(తనకు అనేది లేకుండా జీవులకు ఇవ్వవలసినవి అన్నీ ఇచ్చేసి, కపాలంతో అడుక్కుంటాడు ఈ భోగి. అంటే – అప్పులు లేకుండా ఉన్నాడన్నమాట ! అందుకే ఆయనకు ఏ బాధా లేదు. అందుకే ఆయన్ని పాము కూడా కాటు వేయలేదు. పన్నగ శయనునికీ, పన్నగ భూషణునికీ – ఈ ఇద్దరికీ పాములు కాట్లు వేయవు)

భోగినీ అంటే – 'చుట్టలు, చుట్టుకుని ఉండే పాము' అని అర్థం వుంది కాబట్టి – కుండలినీ శక్తిని కూడా మూలాధారం వద్ద 3 1/2 చుట్లతోనిద్రిస్తూ వుండే పాముతో పోలుస్తారు కాబట్టి – 'భోగినీ' అంటే 'కుండలినీ రూపము గలది' అనే అర్థం కూడా చెప్పుకోవచ్చును. గృహశయ్యాది ఎనిమిది భోగాలను ఇచ్చునది అని అర్థం చెప్పవచ్చు. (ఎనిమిది భోగాల పేర్ల అనుబంధంలో ఇవ్వబడ్డాయి)

1) భోగములను ఇచ్చునది.

2) భోగిగా మనలను తయారు చేయునది.

3) కుండలినీ రూపము గలది – అని ఈ నామానికి అర్థాలు చెప్పుకోవచ్చును.

## 294. భువనేశ్వరీ

అయిదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'భువనేశ్వర్యైనమః' అని చెప్పాలి.

భువన = చతుర్దశ భువనములకు, ఈశ్వరీ = అధినాథురాలు.

భువనాలు పద్నాలుగు ఉంటాయి. వీటినే చతుర్దశ భువనాలు అంటారు. వీటి పేర్లు అనుబంధంలో చెప్పబడ్డాయి. ఈ చతుర్దశ భువనాలనే మనలోని ప్రజ్ఞాస్థితులను తెలిపే వివిధ లోకాలుగా సంకేతిస్తారు. ఈ 'వివిధ ప్రజ్ఞాస్థితులలోను అంతర్యామిత్వం వహించునది' అని కూడా ఈ నామానికి అర్థం చెప్పవచ్చును.

భు = పుట్టుటకు, వన = వనములకు అనగా జలములకు, ఈశ్వరీ = అధినాయకురాలు అని ఇంకో అర్థం.

1) చతుర్దశ భువనాలకు అధినాయకురాలు.

2) మనలోని ప్రజ్ఞాస్థితులను తెలిపే వివిధ లోకాలకు అధి నాయకురాలు.

3) పుట్టుకకు, జలములకు అధినాయకురాలు - అని ఈ నామానికి అర్థాలు చెప్పుకోవచ్చును.

## 295. అంబికా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'అంబికాయై నమః' అని చెప్పాలి.

అంబికా = తల్లి

సంస్కృతంలో 'అంబా' పదం, తెలుగులో 'అమ్మ' పదం ఒకే అర్థాన్ని సూచిస్తాయి. ఆ అర్థమే తల్లి. 'బాలా' పదం నుండి 'బాలికా' పదం పుట్టినట్లు 'అంబా' పదం నుండి 'అంబికా' పదం పుట్టింది. ఈ రెంటికీ 'తల్లి' అనేది గూడా అర్థం, కాకపోతే - 'అంబికా' అంటే 'చిన్నతల్లి' అని అర్థం చెప్పుకోవాలి.

'తల్లి' అని ఈ నామానికి అర్థం.

## 296. అనాదినిధనా

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'అనాదినిధనాయైనమః' అని చెప్పాలి.

అనాదినిధనా = ఆది, అంతము లేనిది.

'ఆది' అంటే – జననమనీ, 'అంతము' అంటే, – మరణమనీ అర్థం చేసుకోవాలి. జీవులకు ఉండే ఈ రెండు లక్షణాలు జీవేశ్వరి అయిన అమ్మవారికి ఉండవు.

'జననమరణాలు లేనిది' అని ఈ నామానికి అర్థం.

## 297. హరిబ్రహ్మేంద్రసేవితా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'హరి బ్రహ్మేంద్ర సేవితాయైనమః' అని చెప్పాలి.

హరి = విష్ణువు చేత, బ్రహ్మ = బ్రహ్మ చేత, ఇంద్ర = ఇంద్రునిచేత, సేవితా = సేవింపబడునది.

హరి బ్రహ్మేంద్రులేకాదు – సకలదేవతలు సేవించే పరదేవత అమ్మవారని దేవీ భాగవతంలో –

''బహ్మ విష్ణుస్తథా శంభుః వాసవో వరుణోయమః
వాయురగ్నిః కుబేరశ్చ త్వష్టా పూషాశ్వినౌ భగః
ఆదిత్యా వసవా రుద్రా విశ్వేదేవా మరుద్గణాః
సర్వే ధ్యాయంతి తాం దేవీం సృష్టిస్థిత్యంత కారిణీమ్''

అన్న శ్లోకంలో చెప్పబడింది.

అమ్మవారిని సేవించే వారిని ఉపాసించడం కన్నా – వారందరూ సేవించే అమ్మవారినే సేవించడం శ్రేయస్కరమని పై శ్లోకం చదివి గ్రహించాలి.

'హరి, బ్రహ్మ, ఇంద్రులచే సేవింపబడునది' – అని ఈ నామానికి అర్థం.

## 298. నారాయణీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు నారాయణ్యైనమః' అని చెప్పాలి.

నారాయణీ = నారాయణత్వ లక్షణము గలది.

'అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్యనారాయణ స్థితః' అని మంత్రపుష్పం – సృష్టి ప్రళయాలకు నేపథ్యంలో ఉండే పరదేవతను గూర్చి చెబుతుంది.

నల్లబల్లమీద ఒక నల్లని మసిబొగ్గుతో ఒక వృత్తాన్ని గీస్తే – ఆవృత్తంలోపల, ఆ వృత్తం బయట, ఆ వృత్తరేఖలోను, ఆ వృత్త రేఖ క్రింద – అన్నిటా వ్యాపించి ఉన్న (ప్రస్తుతం నలుపు) తత్వాన్ని 'నారాయణ తత్త్వం' లాంటిదిగా అర్థం చేసుకోవాలని – అని మంత్రపుష్పం సూచిస్తుంది. ఇలా సర్వత్రా వుండేది కాబట్టి అమ్మవారికి 'నారాయణీ' అనే నామం వచ్చింది. ఈ నారాయణియే మరో విధంగా

'సర్వమంగళమాంగళ్యే శివే సర్వార్థసాధికే
శరణ్యే త్ర్యంబకే దేవి నారాయణి నమోஉస్తుతే' – అన్న శ్లోకంలో

ప్రతిపాదింపబడుతుంది. 'సర్వమంగళములను చేకూర్చేది, సర్వార్థాలను సాధించి పెట్టేది, మూడు కన్నులు కలది, శరణాగతికి తగినది, శివుని పత్ని అయిన దేవి – నారాయణీ' అని ఈ శ్లోకానికి అర్థం.

సర్వాంతర్యామిగా ఉండటం – 'నారాయణ' పదం సూచిస్తే – ఆవిధంగా ఉన్నట్లు తెలుసుకునే ప్రజ్ఞను – 'నారాయణీ' – పదం సూచిస్తుంది. 'పద్మనాభ' – 'పద్మనాభ సహోదరీ' పదాలు ఎలాగో 'నారాయణ' – 'నారాయణీ' పదాలు కూడా అలాంటివే!

విష్ణువు జగన్మోహినీ రూపం పొందడానికి పూర్వం అమ్మవారి మంత్రాన్ని జపించి, జపించి, జపించి అమ్మవారై పోయాడు. ''హరిస్త్వామారాధ్య... పురానారీభూత్వా...'' అని ఆది శంకరులు కూడా సౌందర్యలహరిలో చెబుతారు. ఆ 'నారీమతల్లి' యే నారాయణీ నామంతో తెలుపబడే అమ్మవారు.

'నారాయణ' – 'నారాయణీ' పదాలలోని సారూప్యాన్ని, సామ్యాన్ని బాగా అర్థం చేసుకోవాలంటే – తిరుమలలోని వేంకటేశ్వర స్వామి విగ్రహాన్ని, ఆయనకు జరిగే వివిధ సేవల తీరును జాగ్రత్తగా పరిశీలిస్తే తెలుస్తుంది.

1) ఆయన పేరు వేంకటేశ్వర స్వామియే అయినా – 'బాలాజీ' అనే ఇంకొక

నామం కూడా ఉన్నది. 'బాలా' అన్నది అమ్మవారికి సంబంధించిన 'బాలాత్రిపుర సుందరిని' సూచిస్తుంది.

2) ఆయనకు అభ్యంగన స్నానం చేయించేది శుక్రవారము నాడు. మొగవారు సాధారణముగా శుక్రవారము తలంటు పోసుకోరు. ఆడవారే శుక్రవారము తలంటు పోసుకుంటారు.

3) వేంకటేశ్వర స్వామిని బిల్వపత్రాలతో కూడా పూజిస్తారు. ఇది కూడా అమ్మవారికి సంబంధించినదే! ('వనస్పతిస్తవ వృక్షోథబిల్వః' – శ్రీ సూక్తం.)

మొట్టమొదట్లో ఆదిశంకరులచే తిరుమలలో ప్రతిష్ఠించబడినది ఆకర్షణ శక్తిపీఠమే! అది తరువాత వైష్ణవ పీఠంగా మార్చబడింది.

వైష్ణవ విగ్రహాలు చాలా భారీగా, చాలా పెద్ద పన్నాలో ఉంటాయి. (అనంత పద్మనాభ స్వామి, వరదరాజస్వామి, గోవిందరాజ స్వామి, జగన్నాథ స్వామి .... వాటితో పోలిస్తే తిరుమల వెంకటేశుడు చిన్న పరిమాణంలో వున్నట్లే !

అభిషేకం చేసే రోజు వస్త్రాలు, ఆభరణాలు తీసినపుడు జాగ్రత్తగా పరిశీలిస్తే విగ్రహానికి ఎక్కువగా అమ్మవారి లక్షణాలున్నట్లు తెలుస్తుంది. ఇవన్నీ ఎందుకు వ్రాస్తున్నానంటే – తిరుమలలోని దేవుడు 'శక్తి' అని – అమ్మవారే నని నిరూపించడం కోసం మాత్రం కాదు. 'నారాయణు' నికి 'నారాయణి' కి భేదం లేదని తెలియ చెప్పేందుకు వెలసిన దైవంగా తిరుమలేశుని అర్థం చేసుకోవాలనడం కోసం మాత్రమే !

శివుడనే నిర్గుణ బ్రహ్మాండానికి, చీర, రవిక ధరింప చేస్తే – 'నారాయణీ'; పంచ, ఉత్తరీయం ధరింపచేస్తే – 'నారాయణుడు' అవతారనే విధంగా అర్థం చేసుకోవచ్చును.

ఎలాగూ ఈ నామాలకు, రూపాలకు అతీతంగా ఉండే వారే ఈ దైవాలు అని ముందు రాబోయే 'నామరూపవివర్జితా' అనే నామంలో వస్తుంది కూడా ! ఈ ఇద్దరికి సంబంధించిన మంత్ర బీజాక్షరాల్లో 'క్లీం' అన్నది ఇద్దరికీ వస్తుంది. 'క్లీం' అన్నది 'ఆకర్షణ', 'సౌందర్యం' 'కళాత్మకత' లను సూచించే బీజాక్షరం. ఈ లక్షణాలు ఇద్దరికీ వున్నాయి గదా !

1) నారాయణత్వ లక్షణం గలది.

2) సర్వాంతర్యామిగా ఉన్నట్లు తెలియు ప్రజ్ఞ – అనేవి ఈ నామానికి అర్థాలుగా చెప్పవచ్చును.

## 299. నాదరూపా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'నాదరూపాయైనమః' అని చెప్పాలి.

నాద = నాదము యొక్క; రూపా = రూపము అయినది.

అవ్యక్తం నుండి వ్యక్తమైన ప్రథమ రూపమే నాదం. ''నాదాఖ్యాసర్వభూతేషు జీవరూపేణ సంస్థితా''.

సర్వభూతాల్లోను నాదరూపంగా, జీవరూపంగా ఉండి, ఆది, అంతము అనేవి లేకుండా, సూక్ష్మంగా ఉంటూ, ఎప్పుడూ నాశము లేని అక్షర పరబ్రహ్మమే అమ్మవారు అని అర్థం చేసుకోవాలి. ఏది పలికినా, ఉచ్చరించినా గొంతు నుండి వచ్చేనాదం యొక్క అవస్థా భేదాలే గదా! – అందుకని అమ్మవారు – నాదరూపా.

శ్వాస విడిగా ఉన్నప్పుడు దాని ప్రజ్ఞ దానిదే, మన ప్రజ్ఞ మనదే! శ్వాస వాక్కు అయినపుడు, ఈ రెండూ కలిసి నాదమౌతుంది. (Noise with consciousness is voice).

మనలో ఏ అంగముల యందు ఒత్తిడి లేకుండా గొంతు నుండి ఉద్భవించేది నాదం. 'ఉచ్చరించడానికి కావలసిన శక్తి'ని – 'ఉచ్చరిద్దామన్న సంకల్పాన్ని' – ఈ రెంటినీ ధ్యానం చేస్తూ నాదాన్ని ఉచ్చరించాలి. అలా ఉచ్చరించినపుడు వెలువడే నాదాన్ని వింటూ ఉంటే – మనకు తెలియకుండానే 'నాదం' మనలోంచి వ్యక్తమౌతూ ఉంటుంది. అభ్యాసం చేసే వారికి ఈ విధంగా ఎంత సేపైనా నాదం వస్తూనే ఉంటుందని సాధనలో తెలుస్తుంది. నిలకడగా ఉన్న జలాశయం చిన్న రాయి తాకిడితో అలజడికి గురికాబడి అనంతమైన తరంగాలనిస్తూ – ఆ అలజడిని అంతటా ఆవరింప జేసినట్లు – అనంతమైన ఆకాశంలో వ్యక్తం కాబోయే సృష్టియొక్క బీజ పరిమాణంలోని బిందువుగా ఉత్పన్నమై విశ్వం అంతటా తన పరిణామాన్ని నామరూపాల్లో విస్తరించే అమ్మవారిని 'నాదరూపా' అనవచ్చును.

'నాదము యొక్క రూపము' – అని ఈ నామానికి అర్థం.

## 300. నామరూపవివర్జితా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'నామరూపవివర్జితాయైనమః' అని చెప్పాలి.

నామ = పేరు, రూపా = ఆకారము, వివర్జితా = లేనిది.

(ఈ నామాన్ని చదివేటప్పుడు 'నామరూపా – వివర్జితా' అని విడదీసినట్లు చదవడం జరగవచ్చు. అది తప్పు. మొత్తం 'నామరూపవివర్జితా' అని కలిపి చదవాలి. లేకపోతే 'వివర్జితా' అనేది ఒక నామమై అమ్మవారు – వర్జింపబడేది అవుతుంది)

ఏది పలికినా, ఉచ్చరించినా గొంతునిండి వచ్చే నాదం యొక్క అవస్థా భేదాలే – కాబట్టి అమ్మవారిని 'నాదరూపా' అన్నారు. ఈ నాదం నుండి అన్ని రకాల శబ్దాలు, ధ్వనులు, పదాలు, వాక్కులు వచ్చినా – వీటన్నిటికీ అతీతంగా ఉండేదే అమ్మవారు. అంటే, అలా వెలువడిన ధ్వనుల నామాలతోను, రూపాలతోను సంబంధం లేనిదే ! నినాదాలు ఎన్ని రకాలుగా ఉన్నా, నాదం ఒక్కటే ! ఆ నాదమే అమ్మవారు. ఆ నాదానికి – నినాదాలభాషా, లిపి, అర్థ తాత్పర్యాదులతో సంబంధము లేదు అన్న విధంగా ఈ నామాన్ని అర్థం చేసుకోవాలి.

చైతన్య ప్రకృతికి ఐదు అంశాలుంటాయి. అవి – నామ, రూప, అస్తి, భాతి, ప్రియములు. ఈ ఐదింటిలో మొదటి రెండూ అయిన నామరూపాలుమిథ్యాంశములే ! మిగిలిన అస్తి, భాతి, ప్రియములే సత్, చిత్, ఆనందాంశములు. ఈ 'సత్ చిదానంద' స్వరూపమే అమ్మవారు. అందుకని ఆవిడ 'నామరూపవివర్జితా' అయింది.

ఏ బంగారు నగలలో అయినా నగ 'పేరు', ఆ నగ 'ఆకారం' తీసివేస్తే మిగిలిందంతా బంగారమేగా! అలాంటి బంగారం అమ్మవారు. ఏ వ్యక్తిలో అయినా, ఆ వ్యక్తిపేరు, ఆ వ్యక్తి రూపం తీసివేస్తే మిగిలినదంతా పరమాణువులతో ఉండే పదార్థమేగా! నామరూపాల్లేని ఆ పదార్థమే ప్రకృతి స్వరూపిణి అయిన అమ్మవారు అని గ్రహించాలి.

'నామ రూపములకు అతీతముగా ఉండునది' అని ఈ నామానికి అర్థం.

# 301. హ్రీంకారీ

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'హ్రీంకార్యైనమః' అని చెప్పాలి.

హ్రీంకారీ = హ్రీంకార స్వరూపిణి

శ్రీం, హ్రీం, క్లీం, ఐం, సౌః, అనే పంచప్రణవాల్లో రెండవదైన 'హ్రీం' కారంలో 'హ, కార, 'ర' కార, 'ఈ' కారాలు కలసి ఉంటాయి. 'హ' కారం – నిశ్వాసాన్ని, 'ర' కారం అగ్ని బీజమైన – రేఫాన్ని 'ఈ' కారం – శక్తిని సూచిస్తాయి. నిశ్వాసాన్ని అనుసరించి వచ్చే 'హ' కారం స్వరపేటికల(Vocal Cords) మధ్య ఘర్షణకు గురియై అనగా 'రే' ఫాన్ని కూడి, నిశ్వసించడానికి అవసరమయే శక్తిని కూడగట్టుకుని – అంటే 'ఈం' తో కూడి 'హ్రీం' కారంగా వ్యక్తమవుతుంది. (ఈ 'హ్రీం' కారాన్నే 'మాయాబీజం', 'హృల్లేఖ' అని గూడా అంటారు.)

ఏ పదమైనా ఉచ్ఛరింపబడి వ్యక్తమవాలంటే ఈ. 'హ' కార, 'ర' కార 'ఈ' కారాలతో కూడిన 'హ్రీం' కార సహకారం అవసరం. అందుకే – 'హరి', 'హర', 'బ్రహ్మ'. ఈ ముగ్గురిలో ఎవరు ఉచ్చారణలో వ్యక్తమవాలన్నా – నిశ్వాసము (హ), అగ్నిబీజము ( ర) శక్తిబీజము (ఈ) – ఈ మూడింటితో కూడిన 'హ్రీం' అవసరము – ఎంతైనా వుంది. శంకరాచార్యులవారు సౌందర్యలహరిలోని మొదటి శ్లోకంతో 'అతస్త్వామారాధ్యాం హరిహర విరించ్యాదిభిరపి' – అన్న మూడవపాదంలోనే ఈ విషయాన్ని సూచన ప్రాయంగా చెప్పారు. హరి, హర, బ్రహ్మలు నిన్ను ఆరాధిస్తూ, నీ మీద ('హ్రీం – మీద) ఆధారపడి వ్యక్తమౌతారని ఈ శ్లోక పాద భావం.

'హ్రీం' కారంలో ఉండే 'హ' కార, 'ర' కార, 'ఈ' కారాలు వరుసగా స్థూల, సూక్ష్మ, కారణ దేహాలను సూచిస్తాయి. 'ఓం' కారం – పురుషవాచకం(Spirit) అయితే, 'శ్రీం' కారం – ప్రకృతి వాచకం(Matter), 'హ్రీం' కారం – శక్తి వాచకం(Force) అవుతాయి.

భువనేశ్వరీ మంత్ర బీజాక్షరాన్ని 'హ్రీం' తో సంకేతిస్తారు.

1) పంచప్రణవాల్లో రెండవది.

2) మాయా బీజరూపిణి.

3) స్థూల, సూక్ష్మ కారణ సంయుక్త రూపిణి అయిన హ్రీంకార స్వరూపిణి.

4) వ్యక్తశక్తి బీజరూపిణి.

5) భువనేశ్వరీ మంత్రరూపిణి – అని ఈ నామానికి అర్థాలు చెప్పుకోవచ్చును.

## 302. హ్రీమతీ

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'హ్రీమత్యైనమః' అని చెప్పాలి.

హ్రీమతీ = లజ్జాసూచిత బీజాక్షర రూపిణి.

సర్వభూతాల్లోను 'లజ్జారూపం'లో ఉండే అమ్మవారిని 'హ్రీమతీ' అంటారు. (యాదేవీ సర్వభూతేషు లజ్జారూపేణ సంస్థితా).

'లజ్జాసూచిత బీజాక్షర రూపిణి – అని ఈ నామానికి అర్థం.

## 303. హృద్యా

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'హృద్యాయైనమః' అని చెప్పాలి.

హృద్యా = హృదయమునకు ఆనందము అయినది.

హృదయానికి సంబంధించిన తేజ స్వంతమైన ధాతువును 'ఓజస్సు' అంటారు. శరీరంలేని జీవునికి శరీరం ధరించాలని కోరిక ఉంటే – ఆ కోరిక – ఒక 'దంపతి' హృదయాల్లో 'ఓజస్సు' లాగా ప్రారంభిస్తుంది. 'ఇక్కడ పుడదాం' అనే అభిలాషలాగా గర్భంలో వ్యక్తమౌతుంది. అటుపైన అదే 'ఓజస్సు' పుట్టిన వాడి హృదయంలో తేనె బొట్టు లాగా మరణంవరకు ఉండి పోతుంది. ఆ ఓజస్సే – ప్రతి వ్యక్తి హృదయంలోని తీపి అనుభూతికి కారణమవుతుంది.

అకారణ, కరుణ, భూతదయ, సత్ప్రవర్తనాదులతో ఈ ఓజస్సు ధాతువును పెంచుకోవచ్చును. కాని Tonic లతోను, Medicineలతోను కాదు.

1) హృదయమునకు తీపి అయినది.

2) ప్రతి వారి హృదయంలోను ఉండు తీపి అనుభూతికి స్పందించునది.

## 304. హేయోపాదేయవర్జితా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'హేయోపాదేయవర్జితాయైనమః' అని చెప్పాలి.

హేయ = విడువదగినది, ఉపాదేయ = గ్రహింపదగినది, వివర్జితా = విడచినది, అనగా – లేనిది.

తనకు సంబంధించినది కాక రెండవది వున్నపుడు దానిని విడుచుటకు కాని, స్వీకరించుటకు కాని, అవకాశము వుంటుంది. విశ్వమంతా తానే అయినపుడు ఈ రెంటికి అవకాశము వుండదు. ఈ – విడుచుట(Reject), స్వీకరించుట (Accept) అనే పరస్పర వైరుధ్య లక్షణాలు అమ్మవారికి ఏ విషయంలోనూ వుండవు. చివరకు భక్తుల విషయంలో కూడా ! వాడు పనికి రాని వాడు కాబట్టి వదిలెయ్యాలి, వీడు పనికి వస్తాడు కాబట్టి స్వీకరించాలి అని కూడా వుండదు. అందరి మీదా సమానంగానే అనుగ్రహాన్ని వర్షిస్తుంది. అయితే, ఆ అనుగ్రహాన్ని పొంది బాగుపడే గుణం వారిలో వుండాలి అంతే ! చంద్రుడు పక్షపాతం లేకుండా వెన్నెలను అడవి మీదా, చలువ రాతి మేడమీద సమానంగానే వెదజల్లుతాడు, అయితే – అడవిని కాచిన వెన్నెల పనికి రాకుండా పోతుంది. చలువరాతి సౌధం మీద మరింత చల్లదనాన్ని వైభవాన్ని చేకూరుస్తుంది. వెన్నెలను వర్షింపచేసే చంద్రుణ్ణి' తన ఎడమకంటిగా కలిగిన అమ్మవారు కూడా అంతే ! – అని సౌందర్యలహరిలో 'దృశాద్రాఘీయస్యా... వనేవా హర్మ్యేవా సమకరనిపాతోహిమకరః' అనే శ్లోకంలో ఆదిశంకరులు తెలియపరుస్తారు.

'విడువ తగినవి, గ్రహింపతగినవి అనునవి ఏమియు లేనిది' – అని ఈ నామానికి అర్థం చెప్పుకోవచ్చును.

## 305. రాజరాజార్చితా

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'రాజరాజార్చితాయైనమః' అని చెప్పాలి.

రాజ = రాజులకు, రాజ = రాజులైన వారిచేత, అర్చితా = అర్చింపబడునది.

రాజులు, చక్రవర్తులు అందరూ బ్రహ్మోపేంద్ర మహేంద్రాది దేవతామూర్తులను అర్చిస్తారు కాబట్టి - బ్రహ్మోపేంద్ర మహేంద్ర కుబేర, చంద్ర దేవతా మూర్తులందరూ ఆ రాజులను ఆదుకుంటూ, ఆనందింప చేస్తారు – అంటే రంజింప చేస్తారు. కాబట్టి, ఈ దేవతామూర్తులు రాజులకు రాజులౌతారు. అంటే - 'రాజరాజు' లౌతారు. ఈ రాజరాజులందరూ అమ్మవారిని ఉపాసించి, అర్చించిన వారే కాబట్టి - అమ్మవారు 'రాజరాజార్చిత' అవుతుంది.

ఎంతటి స్థాయిలో వున్న వారైనా వారి ప్రభుత్వం చక్కగా కొనసాగబడాలంటే ఏది ప్రధానంగా కావాలో – అది అమ్మవారికి సంబంధించిన ప్రణాళికే! ఆ ప్రణాళికను అమలు పరిస్తే అది 'రాజవిద్య' అవుతుంది – లేదా అది ఎక్కడ నుంచి వచ్చిందో అక్కడే వుంటే 'రాజగుహ్యం' అవుతుంది. ఈ రెంటి గురించి భగవద్గీతలోని 9వ అధ్యాయమైన 'రాజవిద్యారాజగుహ్యం' లో చెప్పబడుతుంది.

'రాజులచేత, రాజులకు రాజులైన వారిచేత గూడా అర్చింపబడునది' అని ఈ నామానికి అర్థం.

ఈ నామాన్ని జపిస్తే తైత్తిరీయంలో చెప్పబడిన 'ఆప్నోతి స్వారాజ్యం' లోని 'స్వ' రాజ్యాన్ని అమ్మవారు ఇస్తుంది.

## 306. రాజ్ఞీ

రెండక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'రాజ్ఞ్యైనమః' అని చెప్పాలి.

రాజ్ఞీ = రాణి

సంస్కృతంలో 'రాణీ' అనే పదానికి సమానార్థకంలో వాడబడే ఇంకొక పదం 'రాజ్ఞీ'. లాటిన్‌లో 'రెజీనా' అనే పదం గూడా ఈ రాజ్ఞీపదం నుండే వచ్చి వుండాలి. విశ్వంలోని అందరి చేత అర్చింపబడి అందరిపైనా అధికారము కలది – అవడం వలన, విశ్వాన్ని సృష్టించి, పాలించి తనలో లీనం చేసుకునేది' కాబట్టి, విశ్వానికి అమ్మవారు రాజ్ఞి. ప్రత్యేకించి చతుర్దశ భువనాలకు ఈశ్వరి అయిన భువనేశ్వరిని సూచించే నామం ఇది.

అన్నిటికీ, అందరికీ, అధికారిణి' అని ఈ నామానికి అర్థం.

## 307. రమ్యా

రెండక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'రమ్యాయైనమః' అని చెప్పాలి.

'రమ్' అనే ధాతువునుండి 'రమ్యా' అనే పదం వచ్చింది. 'రమ్' అంటే 'ఆహ్లాదకరమని' అర్థం. 'ఆహ్లాదకరంగా వుండటం ఎలాగా ? – అని ప్రశ్న వేసుకుంటే 'ఆహ్లాదకరంగా వుండటమే' అని సమాధానం చెప్పుకోవలసి ఉంటుంది. జీవితంలో సుఖపడటం, సుఖపడకపోవటం – అని ఉండదు. సుఖపడదలచుకోడం, సుఖపడదలచుకోక పోవడమే ఉంటాయి. సుఖపడదలచుకుంటే – పచ్చడి మెతుకులు తిని గూడా సుఖపడవచ్చు. సుఖపడదలచు కోకపోతే – ఎన్నిరకాల పిండి వంటలతో భోజనం చేసినా సుఖపడకుండా ఉండవచ్చు.

'ఇలా' ఉండటం వలన మనకు ఒకప్పుడు నష్టమైతే అది 'రమ్య' మవదు. ఏదీ నష్టం కాకుండా – ఏది మనలను ఆనందంలో ఉంచుతుందో అది 'రమ్యం'. అను క్షణం అలా ఉండేది అమ్మవారే! అందుకనే ఆమె 'రమ్యా'.

'మనోహరమైనది' అని ఈ నామానికి అర్థం.

## 308. రాజీవలోచనా

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'రాజీవలోచనాయైనమః' అని చెప్పాలి.

రాజీవ = పద్మములవంటి; లోచనా = కన్నులు కలది.

వెలుగు, సంక్షేమం, జ్ఞానం, మెలకువ, అర్థమవడం – మొదలైన వాటితో సత్సంబంధం కలిగిన కళ్ళను పద్మాలతో పోలుస్తారు. అమ్మవారివి అటువంటి కళ్ళు కాబట్టి – అమ్మవారిని ' రాజీవలోచనా' అన్నారు.

'పద్మముల వంటి కన్నులు కలది' అని ఈ నామానికి అర్థం.

## 309. రంజనీ

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'రంజన్యైనమః' అని చెప్పాలి.

రంజనీ = రంజింప చేయునది లేదా రంజనము చేయునది.

వ్యక్తులు, సన్నివేశాలు రంజింపబడాలంటే, వ్యక్తుల ద్వారా జరిగే సంభాషణ, ఒకరి సాన్నిధ్యం వలన ఒకరికి కలిగే అనుభూతి బాగుండే విధంగా వుండాలి. ఇలా చేయగల సామర్థ్యాన్ని 'రంజనం' అంటారు. చోటులో 'అస్తిత్వం' మాత్రమే వుంటే ఇది సాధ్యం కాదు. 'అస్మిత్వం' వుంటే ఇది సాధ్యమౌతుంది. అంటే – చోటంతా తానే అయి వుండటం అన్నమాట. ఇది అమ్మవారికే చెల్లుతుంది. మిగిలిన ఎవరికైనా చోటులో కొంతమేరకు – 'అస్తిత్వమే' వుంటుంది గాని, అంతటా – 'అస్మిత్వం' వుండదు.

రంజింప చేయునది – అని ఈ నామానికి అర్థం.

## 310. రమణీ

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'రమణ్యైనమః' అని చెప్పాలి.

రమణీ = రమింప చేయునది.

ప్రపంచం మనకు బాగుంటే – ప్రపంచంలో 'రమ్యత్వం', మనం ప్రపంచానికి బావుంటే – మనలో 'రంజనీత్వం' వున్నట్లు లెక్క. ఈ రెంటినీ కలిగిన లక్షణాన్ని 'రమణీత్వం' అంటారు. ఈ లక్షణం అమ్మవారిని సూచిస్తుంది.

'రమ్యత్వము, రంజనీత్వము ఈ రెండును ఒప్పు లక్షణము కలది అమ్మవారు' – అని ఈ నామానికి అర్థం.

## 311. రస్యా

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'రస్యాయైనమః' అని చెప్పాలి.

రస్యా = రస స్వరూపిణి.

అన్నిటి యందు వాటి సారభూతమైన లక్షణాన్ని 'రసం' అంటారు. అన్నిటి యందు అంతర్లీనమై సారభూతమై వున్నవాడే పరమాత్మ. అందుకే శ్రుతులు గూడా ఆ పరబ్రహ్మను 'రసోవైసః' అని ప్రతిపాదిస్తాయి. అమ్మవారు పరబ్రహ్మస్వరూపిణి కాబట్టి 'రస్యా'.

అన్నిటికీ మూలం 'ఆనందం' కాబట్టి, అమ్మ ఆనందరూపాన్ని - రసస్వరూపంగా చెప్పుకోవాలి.

1) రసస్వరూపిణి.

2) ఆనందరూపిణి – అని ఈ నామానికి అర్థాలు.

('రాజ్ఞీ' అనే బిరుదు నామం గల అమ్మవారికి వుండాల్సిన లక్షణాలే – రమ్యా, రాజీవలోచనా, రంజనీ, రమణీ, రస్యా – అని తర్వాత వచ్చిన నామాల్లో చెప్పబడ్డాయని తేలికగా గ్రహించవచ్చును. అంతేకాదు. ఈ రాజ్ఞి ఎవరో కాదు. 'భువనేశ్వరీదేవి' యే! ఆ భువనేశ్వరీదేవికి సంబంధించిన బీజాక్షరంలో వుండే 'హ' కార, 'ఈ' కారద్వయం, బిందు, 'రేఫా' కారాలనే ఈ రమ్యా రాజీవలోచనాది నామాలు వరుసగా సూచిస్తాయి.

## 312. రణత్కింకిణి మేఖలా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'రణత్కింకిణి మేఖలాయై నమః' అని చెప్పాలి.

రణత్ = మ్రోగుచుండు; కింకిణి = చిరుగజ్జెలతో కూడిన, మేఖలా = మొలనూలు లేదా వడ్డాణము గలది.

'రణత్, కింకిణి' అనే పదాలు ఉచ్చారణలో వివిధ ధ్వనులను సంకేతించే అక్షరాలను సూచిస్తాయి. 'మేఖలా' అనే పదం 'మంత్రసంకేతా'న్ని తెలియచెస్తుంది. అంటే – ఇంతకు పూర్వం చెప్పిన 'రాజ్ఞీ' మంత్రంలోని వర్ణాలను – ఈ నామంలోని రణత్కింకిణి సూచించే అక్షరాలుసూచిస్తాయని, ఆ అక్షరాల కూర్పును – ఈ నామంలోని 'మేఖలా' పదము సూచిస్తుందని గ్రహించాలి.

'మ్రోగుచుండు చిరుగజ్జెలతో కూడిన మొలనూలు గలది' అని ఈ నామానికి అర్థం.

## 313. రమా

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'రమాయైనమః' అని చెప్పాలి.

రమా = లక్ష్మీదేవి. (శ్రీదేవి)

'రమింపదగిన వాటికి ఆరామంగా ఉండేది' – 'రమా'. గృహము, రాజ్యము, స్వర్ణము, వైకుంఠము – ఇటువంటి వన్నీ ఆనందాన్నిచ్చేవే! వీటన్నింటిలో అస్తిత్వానికి సంబంధించిన స్థితిశక్తిని లక్ష్మీదేవితో సంకేతిస్తారు. అంతే కాదు అన్నిటి యందలి శోభను వైభవాన్ని గూడా లక్ష్మీదేవితో పోలుస్తారు. ఈ లక్ష్మీదేవి పంచప్రకృతులలో రెండవది. పంచప్రకృతులకు నేపథ్యంలోని పరాప్రకృతి అమ్మవారు కాబట్టి, ఈ 'రమా' నామం గూడా అమ్మవారికి బిరుదునామంగా చెల్లుతుంది.

'లక్ష్మీ కళాస్వరూపిణి' అని ఈ నామానికి అర్థం.

## 314. రాకేందువదనా

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'రాకేందువదనాయైనమః' అని చెప్పాలి.

రాకేందు = పూర్ణిమా చంద్రుని పోలిన; వదన = ముఖము గలది.

అమ్మవారి ముఖం (Face) రాకాచంద్రునిలాగా నిండుగా, గుండ్రంగా, ప్రసన్నమైన చల్లని వెన్నెల వెలుగులు వెదజల్లుతూ వుంటుంది.

'వదనా' అనే పదం 'ఉచ్చారణ' అనే అర్థాన్ని గూడా సూచిస్తుంది. 'ఉచ్చారణ' ద్వారా వాఙ్మయం బయటకు వ్యక్తమౌతుంది. ఆకాశంలోంచి మొట్టమొదటగా నాదం పుట్టి, ఆ నాదం నుండి సమస్తము వ్యక్తమౌతుంది. అమ్మవారి ముఖం అనే దర్పణంలో కనబడే అయ్యవారి వివిధ ప్రతిబింబాలే ఈ సృష్టి యావత్తూ. అంటే, తన ముఖం అనే అద్దంలో అమ్మవారు సమస్త సృష్టిని ఇముడ్చుకుని ఉన్నదన్నమాట! (విశ్వం దర్పణ దృశ్యమాన నగరీ...) ఆ విధంగా ఇముడ్చుకొనబడిన సృష్టిని వ్యక్తం చేయడానికి అవసరమయే ఉచ్చారణను – ఈ 'వదనా' పదం సూచిస్తుంది. అమ్మవారి ఈ వదనాన్ని పూర్ణిమా చంద్రునితో పోల్చారు. సూర్యుడు – ఆత్మను, అయ్యవారిని సూచిస్తాడు. చంద్రుడు – మనస్సును, అమ్మవారిని సూచిస్తాడు. పూర్ణిమా చంద్రుడు సూర్యుని నుండి సంపూర్ణంగా వెలుగును గ్రహించి, ఆ వెలుగును చల్లని వెన్నెలలాగా వెదజల్లుతాడు. అలాగే, అయ్యవారి తత్వాన్ని తన ముఖం ద్వారా అమ్మవారు సంపూర్ణంగా వ్యక్తపరుస్తుంది. అందుకని అమ్మవారి ముఖం 'రాకేందువదన' అయింది.

1) పూర్ణిమాచంద్రుని పోలిన ముఖం కలది.

2) పూర్ణిమా చంద్రుని తన ముఖంగా కలిగినది.

– అని ఈ నామానికి అర్థాలు చెప్పుకోవచ్చును.

## 315. రతిరూపా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'రతిరూపాయై నమః' అని చెప్పాలి.

రతి = ఆసక్తి, రూపా = రూపమైనది.

అందరిలోనూ ఉండే 'ఆసక్తి'ని వాఙ్మయంలో 'రతి' అనే పదంతోను, పురాణాల్లో 'రతీదేవి' అనే ఒక పాత్ర (Character)తోను సంకేతిస్తారు. ఆసక్తి ఉన్నవారికి ఆసక్తి

తీరుతున్నపుడు 'ఆనందం' కలుగుతుంది. ఈ 'ఆనందానుభవాన్ని' పురాణాల్లో 'మన్మథుని'తో సంకేతిస్తారు. అందుకే – ఈ 'ఆసక్తి' అనే 'రతీదేవి'కి మాత్రమే ఆనందానుభవం' అనే 'మన్మథుడు' గోచరమౌతాడు. మిగిలిన వారికి గోచరం కాడు' అని పురాణ కథలో చెప్పడంలోని ఔచిత్యమిదే!

మొత్తం ప్రపంచంలోని ఆనందానికి సంబంధించిన ఆసక్తికి ఒక రూపాన్ని ఊహిస్తే – ఆ రూపం 'రతిరూపం'. అవుతుంది. 'మొత్తం ప్రపంచం అంతా ఆనంద స్వరూపమే' – (Whole world is a form of enjoyment) అనే స్థాయికి ఎదిగిన సాధకునికి స్ఫురించే అమ్మవారి బిరుదునామం 'రతిరూపా' అని చెప్పుకోవచ్చును.

'ఆనందాసక్తికి రూపమైనది' – అని ఈ నామానికి అర్థం చెప్పుకోవచ్చును.

## 316. రతిప్రియా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'రతిప్రియాయైనమః' అని చెప్పాలి.

రతి = ఆసక్తి యందు; ప్రియా = ప్రీతికలది.

ఆసక్తి (కుతూహలం) ఉంటేనే దేన్నైనా సాధించేది. ఆసక్తి లేకపోతే ఎదుగూ బొదుగూ వుండదు, పొందేది ఏదీ వుండదు. ఈ ఆసక్తి మంచి వాటిపరంగా వుంటే మంచికి, చెడ్డవాటి పరంగా వుంటే చెడ్డకూ దారితీస్తుంది. దేనిపరంగా ఉంటుందన్నది సంస్కారాన్ని బట్టి, పూర్వజన్మ వాసనలను బట్టి ఉంటుంది. కర్మనుబట్టి ఆసక్తిని రేకెత్తించి జీవులచే జన్మకర్మలను చేయిస్తుంది అమ్మవారు. దీనికంతకూ 'ఆసక్తి' ప్రధానమౌతోంది కాబట్టి అమ్మవారికి ఆ ఆసక్తి ఒక విధంగా ప్రీతికరమే అవుతుంది.

సృష్టి కార్యానికి కూడా 'ఆసక్తి' అవసరం కాబట్టి సృష్టి స్వరూపిణి అయిన అమ్మవారికి 'ఆసక్తి' – ప్రీతికరమే ఔతుంది.

1) ఆసక్తి యందు ప్రీతికలది.

2) రతీదేవి యందు ప్రీతికలది అనే అర్థాలు ఈ నామానికి చెప్పుకోవచ్చును.

## 317. రక్షాకరీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'రక్షాకర్యైనమః' అని చెప్పాలి.

రక్షాకరీ = రక్షించునది.

సృష్టించడంతో సరిపెట్టుకోకుండా సర్వజీవుల్ని అవసరాన్ని బట్టి రక్షించుకునే లక్షణం కూడా అమ్మవారికి ఉంటుంది. ఈ రక్షణ ఎన్నోరకాలుగా ఉండవచ్చు. ఒక్కొక్కప్పుడు జీవులకు ఇష్టమైనవి చేస్తే రక్షింపబడతారు. ఒక్కొక్కప్పుడు ఇష్టం లేనివి చేస్తే రక్షింపబడతారు. ఏది జరిగితే మనకు నచ్చుతుందో అది శుభం కాదు. ఏది జరిగితే మనకు మంచిఔతుందో – దాన్ని 'శుభము' అనాలి. ఆ శుభం జరగడం కోసం అమ్మవారు జీవుల పట్ల వ్యవహరించే తీరు ఏదైనా, ఎలాంటిదైనా 'రక్షణ' క్రిందకే వస్తుంది అని గ్రహించాలి.

రక్ష + ఆకరీ – అని విడదీస్తే 'సర్వరక్షణలకు ఆకరము – అనగా, నిలయము అయినది' అనే అర్థం గూడా ఈ నామానికి చెల్లుతుంది. 'రాజ్ఞీ' అనే నామాన్ని ఉపాసించే సాధకులకు వచ్చే ఫలం ఈ నామం సూచిస్తుంది, అంటే – ఫలశ్రుతి అవుతుందని అర్థం చెప్పుకోవచ్చు. రక్షణ రేఖలాగా అనిపించే దిక్చక్రం(Horizon) లోపల ఉన్న జీవులను రక్షించేది. విశ్వగోళాన్ని – దిక్చక్రం వద్ద వేరయే రెండు అర్ధగోళాలు కలిగిన పెద్ద కుంకుమ బరిణె లాగా ఊహిస్తే – ఆ బరిణెలో జీవుల్ని ఉంచి రక్షించేదిగా 'రక్షాకరీ' నామాన్ని జపిస్తూ అమ్మవారిని ధ్యానం చేయాలి.

1) 'రక్షించునది'.

2) 'సర్వరక్షణలకు నిలయమైనది' – అనే అర్థాలు ఈ నామానికి చెప్పుకోవచ్చును.

## 318. రాక్షసఘ్నీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'రాక్షసఘ్న్యైనమః' అని చెప్పాలి.

రాక్షసఘ్నీ = రాక్షసులను సంహరించునది.

'రక్షస్', 'రక్షా', 'రాక్షస' – ఇవి ఒకే జాతి పదాలు. వాస్తవానికి ఇవి ఒకే అర్థం గల పదాలు గూడా! కాని, రాను రాను రక్షస్, రాక్షస పదాల మధ్య అంతరం పెరిగి పెరిగి 'రక్షస్సు' లంటే – రక్షించేవనీ, 'రాక్షసుల' ంటే – దేవతలశత్రువులనీ అర్థాలు వచ్చాయి. అయితే – ఈ రెండు పదాలకు గల ఒకే అర్థాన్ని బట్టి అమ్మవారు 'రక్షాకరీ' అన్నపుడు 'రక్షణ చేకూర్చునది' అని అర్థం ఎలా చెప్పుకుంటున్నామో 'రాక్షసఘ్నీ' అన్నపుడు కూడా 'రక్షస్సులను కూల్చునది' అనే అర్థం చెప్పుకోవాలి కదా! చెప్పుకోవచ్చు.

కోడిగ్రుడ్డుకు లోపల వుండే పిల్ల (Chick) పూర్తిగా తయారవాలంటే రక్షస్సులాపైన వుండే పెంకు(Shell) దాన్ని జాగ్రత్తగా రక్షించాలి. ప్రకృతిలో ఈ పనిని అమ్మవారు ఏర్పాటు చేస్తోంది. కాబట్టి, లోపల పిల్ల రక్షింపబడుతోంది. కొంతకాలానికి గ్రుడ్డులోపల పిల్ల పూర్తిగా తయారైన తరువాత పైన రక్షణ కవచంలా వుండే పెంకు వుండకూడదు. బ్రద్దలవ్వాలి. రక్షక కవచంలా వుండే పెంకును బ్రద్దలయేట్లుగా చేసి పిల్ల బయటకు వచ్చి బ్రతికే విధానం గూడా ప్రకృతిలో అమ్మవారు ఏర్పాటు చేసింది. అవసరమైనపుడు అదే పెంకును రక్షస్సులా పనిచేయించే అమ్మవారిని 'రక్షాకరీ' అనే నామంతోను, అనవసరమైనపుడు రక్షస్సులా పనిచేసిన అదే పెంకును బ్రద్దలయేలాగా చేయించే అమ్మవారిని 'రాక్షసఘ్నీ' అనే నామంతోను పిలవాలి. కాబట్టి, ఈ విధంగా అమ్మవారు ఒకే అర్థంలో 'రక్షాకరీ', 'రాక్షసఘ్నీ' గూడా ఔతుంది.

వ్యక్తులు సమాజంలో ఎదగాలంటే కొంతవరకు అహంకారం అనే పెంకు ఉండాలి. అటు పైన సాధకునిలా మారాలంటే ఆ పెంకు బ్రద్దలవాలి. ఈ రెంటినీ అమ్మవారు చేస్తుంది.

భక్తుల్ని రక్షించుకోడంలో శ్రీలలితాదేవిగా చేసేపనులను బట్టి అమ్మవారిని 'రక్షాకరీ' గాను, రాక్షసుల్ని సంహరించడంలో – మహిషాసురమర్దినిగా చేసే పనులను బట్టి అమ్మవారిని 'రాక్షసఘ్నీ' గాను చెప్పుకోవచ్చును.

1) రాక్షసులను సంహరించునది.

2) అనవసరమైనపుడు రక్షస్సులను గూడా కూల్చునది – అనే అర్థాలు ఈ నామానికి చెప్పుకోవచ్చును.

## 319. రామా

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'రామాయైనమః' అని చెప్పాలి.

నిత్యానంద లక్షణంతో సల్లక్షణ సంపన్నురాలైనస్త్రీని 'రామా' అంటారు. అసలు కశ్మలాలు, కల్మషాలు లేని స్త్రీని కూడా 'రామా' అంటారు. 'రామా' అనే పదంలో మొదటి అక్షరం – 'ర' కలుషాలను, కశ్మలాలను పోగొట్టే 'అగ్నిబీజం' అవడం, రెండవ అక్షరం 'మ' – మలినాలను కడిగి వేసే 'జలబీజం' అవడమే ఇందుకు కారణం.

ఎప్పుడూ సంతోషంగా, క్రీడాత్మకంగా రంజిల్లుతూ వుంటుంది కాబట్టి అమ్మవారిని 'రామా' అనిఅన్నారు.

1) లక్షణవతి అయిన స్త్రీ.
2) క్రీడాత్మక లక్షణం కలది – అనే అర్థాలు ఈ నామానికి చెప్పుకోవచ్చును.

## 320. రమణలంపటా

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'రమణలంపటాయైనమః' అని చెప్పాలి.

రమణ = రమణునితో, లంపటా = అత్యంత సాన్నిహిత్య, సామ్య సంబంధము గలది.

ఆవిడ ఎవరి యందు రమిస్తుందో ఆయన్ని 'రమణుడు' అంటారు. 'రమణుడు' – అంటే 'భర్త' అని అర్థం. అమ్మవారి భర్త అయ్యవారే కదా! అయ్యవారికి, అమ్మవారికి అన్నిటిలోను పోలికలే ! అన్ని విషయాల్లోనూ సామ్యమే ! ఇద్దరిదీ విడదీయు లేని సంబంధము ( అర్ధనారీశ్వరతత్వం) ఈ ఇద్దరికథకు ఆది అంతము ఉండదు. జరుగుతూ వుంటుంది. ఆకాశమనే కాగితంమీద, ఆదిశేషువు చెప్పుతూ వుంటే(Dictate) – సరస్వతి లేఖిని అయి, చతుర్ముఖుడు వ్రాస్తూ వుంటే – ఈ లోకేశ్వరుల గురించి ఎంత వ్రాసినా అయిపోవడం ఉండదు. ఇద్దరూ విడిపోవడం ఉండదు. అయ్యవారిపై వుండే అమ్మవారి

అమితమైన, అనంతమైన అనురాగమే ఇందుకు కారణం. ఇలాంటి లక్షణం వుండబట్టే అమ్మవారిని 'రమణలంపటా' అన్నారు.

'రమణునితో విడదీయలేని సంబంధము కలది' – అని ఈ నామానికి అర్థం.

## 321. కామ్యా

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కామ్యాయైనమః' అని చెప్పాలి.

కామ్యా = కోరదగినటువంటిది.

అటుకులకు ఆశపడే స్థితినుండి అనంతానంద మోక్షస్థితిదాకా మన కోర్కెల స్థాయిని పెంచేది అమ్మవారే ! ఈ మధ్యలో మనల్ని ఆదుకుంటూ, అవసరమైన ఆశలను తీరుస్తుంది. ఆలోచనా స్థాయిని పెంచుతుంది. చివరకు అపురూపమైన మోక్షాన్ని గూడా అనుగ్రహిస్తుంది కాబట్టి – అన్ని విధాలా అందరూ కోరదగినది అమ్మవారే !

'కోరదగినటువంటిది' – అని ఈ నామానికి అర్థం.

## 322. కామకళారూపా

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేట్పపుడు 'కామకళారూపాయైనమః' అని చెప్పాలి.

కామ = కామేశ్వరుని, కళా = కళయొక్క; రూప = రూపమైనది.

మంత్రశాస్త్రంలో 'క్లీం' అనే అక్షరాన్ని 'కామకళాబీజం' అంటారు. ఈ 'క్లీం' అనే అక్షరం 'క, ల, ఈ, ం' అని నాల్గింటితో కూర్పు చేయబడినది. ఈ నాల్గింటిలో 'క, ల, ఈ' లను వదిలి నాల్గవదైన బిందువుతో కూడిన నాదాన్ని ఎవరు వింటూ ఉంటారో, పలుకుతూ ఉంటారో వాళ్ళు ఉత్కృష్టమైన పదవిని పొందుతారని' ఆగమ శాస్త్రాల్లో చెప్పబడుతుంది. బిందువుతో కూడిన నాదము – అయ్యవారైతే – ఆనాదరూపమే అమ్మవారు. ఈ రూపాన్నే 'కామకళారూపం' అంటారు.

అయ్యవారు – అమ్మవారిని చూస్తున్నపుడు, వింటున్నపుడు – ఇవేమీ అమ్మవారు కాదని, చివరకు – ఆవిడలో ఏమి చూస్తే ఆవిడ లేకపోయినా ఆవిడను చూడగలగడం, ఆవిడను వినకపోయినా, ఆవిడను వినగలగడం – సిద్ధించగలదో ఆ రూపాన్ని అమ్మవారి 'కామకళారూపం' – అంటారు.

(వాస్తవానికి ఇటువంటి రూపమే – ప్రతి భర్తకు భార్య అవుతుంది కాని భౌతికంగా కనబడే రూపంకాదు. ఒక విధంగా చెప్పుకోవాలంటే – కలలు కంటున్నపుడు కూడా ఇదే రూపాన్ని చూస్తాము.)

అయ్యవారు అమ్మవారి యొక్క ఈ రూపంతోనే అమ్మవారితో రమిస్తూ ఉంటాడు. అలా రమించే అయ్యవారిని 'కాముడు' లేదా 'రమణుడు' అంటారు.

1) కాముని యొక్క కళారూపిణి.

2) కామకళా బీజరూపిణి – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 323. కదంబకుసుమప్రియా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కదంబకుసుమప్రియాయైనమః' అని చెప్పాలి.

కదంబ = కడిమి, కుసుమ = పువ్వులయందు, ప్రియా = ప్రేమకలిగినది.

కదంబ వృక్షాన్ని – నీప వృక్షమని, కడిమిచెట్టనీ, కవికె చెట్టుఅనీ గూడా అంటారు. ఈ వృక్షం మన ఆంధ్రదేశంలో ఎక్కువగా కనబడదు.

చెట్లలో లక్ష్మీప్రదమైనవి కొన్ని ఉన్నాయి. వాటిలో తులసి, కదంబము (కడిమి) బిల్వము (మారేడు) ముఖ్యమైనవి. వీటికి దళాలు గాని, పువ్వులు గాని మూడు మూడు చొప్పున వుంటాయి. ఈ మూడు చెట్ల పువ్వులు అమ్మవారికి ఎంతో ఇష్టం. వీటిలో కడిమి పూలు అరుణారుణ వర్ణంలో ఉంటాయి కాబట్టి అమ్మవారికి మరింత ప్రీతికరం.

విష్ణువుకు – తులసి; శివునికి, లక్ష్మీదేవికి – మారేడు అంటే ఎక్కువ ఇష్టం. ఈ మూడు చెట్లలో ఏ ఒక్క చెట్టన్నా గృహావరణలో లేకపోతే – ఆ ఇంట్లో దేవతారాధన,

అర్చన, పూజాదులు తిన్నగా సాగవు. ఆటంకాలు, అంతరాయాలు, ప్రతిఘటనలు, వస్తాయి.

ఒక మంత్రం, ఒక సుగంధ ద్రవ్యం, ఒక రంగు, ఒక ఆహార పదార్థం – వీటి సమ్మేళనమే తంత్రం అవుతుంది. పవిత్రమైన తంత్ర సిద్ధిలేకపోతే – ఆ ఇంట్లో పనులు శుభ్రంగా వుండవు – పని వాళ్ళు గూడా సరిగా పనిచెయ్యరు.

అమ్మవారు – దివిని (కారణాన్ని) భువిని (కార్యాన్ని) సృష్టిప్రక్రియ ద్వారా అనుసంధానం చేస్తుంది. ఆకాశం మేఘావృతమై ఉరుములు ఉరిమినపుడు కడిమి చెట్టు మొగ్గ తొడుగుతుంది. అంటే భువిని, దివిని కలిపే వర్షధారలంటే కడిమి చెట్లకు ఇష్టమన్నమాట! అమ్మవారికి, కడిమి చెట్లకు ఈ విధమైన లక్షణంలో సామ్యం వుండబట్టే – అమ్మవారికి కడిమి చెట్లతోటలన్నా (కదంబవనవాసినీ), కడిమి పూలగుత్తులన్నా (కదంబ మంజరీ క్లుప్తకర్ణపూర మనోహరా), కడిమి పూలన్నా (కదంబ కుసుమప్రియా)చాలా ఇష్టం.

'కడిమి పువ్వులందు ప్రీతిగలిగినది' – అని ఈ నామానికి అర్థం.

## 324. కళ్యాణీ

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కళ్యాణ్యై నమః' అని చెప్పాలి.

కళ్యాణీ = శుభలక్షణములు కలది.

'కళ్యాణ' పదానికి 'శుభం' అనీ, 'మంగళప్రదమనీ' అర్థాలున్నాయి. ఎప్పుడూ శుభలక్షణాలతో వుండి, మెట్టినింటి కాపరానికి స్మశానంలో అడుగుపెట్టినా, ఆ స్మశానాన్ని గూడా మంగళప్రదం చేసి – సకల సృష్టి మహోత్సవానికి అక్కడ మంగళతోరణాలు కట్టించగల సర్వమంగళ కాబట్టి అమ్మవారు 'కళ్యాణీ' అనే నామంతో పిలువబడుతుంది.

మనలోంచి పుట్టే శుభప్రదమైన వాక్కును కళ్యాణీ వాక్కు అంటారు. మనలోంచి వాక్కు పుట్టడం అటుంచి వాక్కులోంచి మనం పుట్టినట్లు తెలియాలి. 'తానే వాక్కు,

వాక్కేతాను' - అని తెలిసి ఉచ్చరిస్తాడు ఋషి. అలాంటి 'వాక్కే' 'కళ్యాణీవాక్కు' అవుతుంది.

'కళ్యాణీ' అనే విశేషం వాక్కుకే కాకుండా గుఱ్ఱానికి కూడా వాడతారు. 'పంచకళ్యాణీ' అని అంటారు. చదరంగంలో రాజుకు, మంత్రికి, శకటానికి, ఏనుగుకు, బంటుకు, లేని ఎత్తు గుఱ్ఱానికి ఉంటుంది. మంత్రికి కూడా నాలుగు వైపులకు పోగల ఎత్తులున్నా గాని పైకి ఎగర గలిగే ఎత్తులేదు. గుఱ్ఱానికి ఈ ఎత్తువుంది. అంటే నలువైపులా వుండే వారి గురించే కాకుండా, పైవాడి గురించి కూడా ఇంగితజ్ఞానం వున్నట్లు లెక్క. అలాంటి గుఱ్ఱం 'పంచకళ్యాణి' అవుతుంది.

పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ - అనే నాల్గుస్థితులలో ఉండే వాక్కుకు పైన ఉన్నవాడి (పరమాత్మ) సంకల్పంతో కూడా సత్సంబంధం ఉంటే ఆ వాక్కు 'కళ్యాణీవాక్కు' అవుతుంది.

ఈ నామానికి సంబంధించిన అమ్మవారి అవతారం 'అశ్వారూఢా'

1) శుభ లక్షణములు గలది.

2) శుభప్రదమైన వాక్స్వరూపిణి.

3) బ్రహ్మప్రాప్తిని పొందించు కల్యాణము యొక్క రూపము.

శుభములు, శుభప్రదమైన వాక్సంపత్తి కావాలనుకునేవారు ఈ నామాన్ని జపించాలి.

## 325. జగతీకందా

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'జగతీకందాయైనమః' అని చెప్పాలి.

జగతీ = జగత్తుకు, కందా = మూలమైనటువంటిది.

మొత్తం జగత్తుకు మూలం జగజ్జనని అయిన అమ్మవారే కాబట్టి అమ్మవారికి 'జగతీకందా' అనే నామం వచ్చింది.

'కళ్యాణీ', 'జగతీకందా', ఈ రెండు నామాలు అమ్మవారి 'అశ్వారూఢా' 'మదద్రవా' అవతారాలకు సంబంధించినవి. 'మదం' అంటే మొదట్లో 'పరవశత్వం'

అని మంచి అర్థమే వుండేది. రాను రాను అది 'వళ్ళు తెలీకపోవడం,' 'పెద్దాచిన్నా తేడా తెలీకపోవడం,' 'వళ్ళు కొవ్వెక్కడం' 'పొగరెక్కడం' అనే అర్థాలకు దారితీసింది. పరవశత్వంలో కూడా వళ్ళు తెలీకపోడం ఉంటుంది గాని పొగరెక్కడం ఉండదు.

'మదద్రవా' అంటున్నపుడు ద్రవించే లక్షణమేదో ధ్వనిస్తోంది. అంతేకాదు. 'మంద్ర' అనే పదం గూడా స్ఫురిస్తోంది. వాస్తవానికి 'మంద్ర' అనేపదాన్ని 'మ[?]' అని వ్రాయాలి. 'మ[?]' లోని '[?]' అనే సంయుక్తాక్షరం 'ఆనన్ద' స్థితిని సూచిస్తుంది. (వాస్తవానికి నీలకంఠ మంత్రాన్ని 'న్ద్రీం' అని వ్రాయాలి. అంతేకాని 'ద్రీం' కాదు. అలాగే, దత్తాత్రేయ మంత్రాన్ని 'న్ద్రాం' అని వ్రాయాలి. అంతేగాని 'ద్రాం' అని వ్రాయరాదు. కాని, ఈ రెంటినీ 'ద్రీం' అని, 'ద్రాం' అనే ప్రస్తుతం వ్రాస్తున్నారు.)

'సర్వజగత్తుకు మూలమైనది' అని ఈ నామానికి అర్థం.

## 326. కరుణారససాగరా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కరుణారససాగరాయైనమః' అని చెప్పాలి.

కరుణారస = దయాలక్షణానికి, సాగర = సముద్రము వంటిది.

అమ్మవారు అనురాగవల్లి. ఆ అనురాగానికి అవధులు లేవు. అవధులు (ఒడ్డులు, హద్దులు) లేకుండా వుండే దాన్ని 'సముద్రం' అని అంటారు. కాబట్టి అమ్మవారు అనురాగానికి, దయకు సముద్రం లాంటిది. జగజ్జనని కాబట్టి ప్రపంచంలోని సమస్త మానవ, జంతు, వస్తు సంచయం మీద అపారమైన ప్రేమ, దయ, దాక్షిణ్యం వుంటాయి. స + అగర = సాగర ఔతుంది. 'గరము' అంటే 'గరళం'. 'అగరం' అంటే 'అమృతం' కాబట్టి 'కరుణారససాగరా' అంటే 'కరుణారస అమృతస్వరూపిణి' అని ఇంకో అర్థం వస్తుంది.

1) దయకు సముద్రం వంటిది.

2) కరుణారస అమృత స్వరూపిణి – అనే అర్థాలు ఈ నామానికి చెప్పుకోవచ్చును.

## 327. కళావతీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కళావత్యైనమః' అని చెప్పాలి.

కళావతీ = కళాస్వరూపిణీ.

సకలదేవతా కళలు, సకల విద్యాకళలు, సకల మంత్రదేవతా కళలు అన్నీ అమ్మవారి స్వరూపమే కాబట్టి అమ్మవారు 'కళావతీ!

'సకలకళాస్వరూపమైనది' అని ఈ నామానికి అర్థం చెప్పుకోవచ్చును.

## 328. కలాలాపా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కలాలాపాయైనమః' అని చెప్పాలి.

కల = కళలను, ఆలాపా = ఆలాపనా స్వరూపముగా కలిగినది.

అమ్మవారి ఆజ్ఞలు, ఆదేశాలు – వేదాలైతే, అమ్మవారి ఆలాపనలు – 'కళలు' అవుతాయి. సల్లాపాలు – 'నవరసాలు' అవుతాయి. ప్రపంచంలోనివన్నీ అమ్మవారి నుండి వెలువడినవే ! ఏవీ వృథా కావు. మహాదేవి యొక్క మధురమైన గళాలాపనలన్నీ కళారూపాలయ్యాయి. అందుకని అమ్మవారు 'కలాలాపా'!.

'సమస్త కళలను తన ఆలాపనా స్వరూపముగా గలది' అని ఈ నామానికి అర్థం.

## 329. కాంతా

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కాంతాయైనమః' అని చెప్పాలి.

కాంతా = కామింపబడినటువంటిది.

జగత్తుకే అధినాథుడైన కామేశ్వరునిచే కామింపబడినటువంటిది కాబట్టి అమ్మవారు 'కాంతా' అని ఒక అర్థం.

ఎవరి కారణము వలన బ్రహ్మకు ద్వితీయ పరార్థ సమాప్తకాలంలో అంతం కలదో ఆమె 'కాంతా' అని ఇంకో అర్థం.

'కం' అనే అక్షరం 'బ్రహ్మ' ను సూచిస్తుంది. బ్రహ్మమును అంతఃస్వరూపముగా గలది. అంటే 'బ్రహ్మకు అధిష్ఠాత్రి' అని ఇంకో అర్థం. అందరూ చివరకు ఎవరి సాన్నిధ్యాన్ని చేరుదామని కోరుకుంటారో ఆమె 'కాంత' (ముక్తికాంత). ('రక్తికాంత' పై ధ్యాస తగ్గి ముక్తి కాంతపై ధ్యానం పెరగాలి.)

1) కామేశ్వరునిచే కామింపబడినది.
2) బ్రహ్మఅంతమునకు కారణమైనది (ప్రళయములో)
3) బ్రహ్మమును తన అంతఃస్వరూపముగా గలది.
4) అందరికీ గమ్యమైనది – అనే అర్థాలు ఈ నామానికి చెప్పుకోవచ్చును.

## 330. కాదంబరీ ప్రియా

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కాదంబరీ ప్రియాయైనమః' అని చెప్పాలి.

కాదంబరీ = పరవశించుటను, ప్రియ = ఇష్టపడునది.

మధువు, మద్యము – లను సేవించడం వలన తన్మయీ కరణం, పరవశత్వము, వళ్లు తెలీకపోవడం, వస్తాయి. అలా సేవించడం వలన వచ్చేదాన్ని 'కాదంబరీ' అనాలి. కాని ప్రస్తుతం సేవించే 'కల్లు' లాంటి వాటినే 'కాదంబరీ' అని అర్థం చెప్పుకుంటున్నారు. అంతే కాదు – అమ్మవారికి ప్రీతికరమైనదని నచ్చచెప్పుకుని, అమ్మవారి భక్తులమని చెప్పుకునే కొందరు కల్లు త్రాగుతారు. కల్లు నైవేద్యం గూడా పెడతారు. ఇవన్నీ వామాచారం క్రిందకు వస్తాయి.

'పరవశించుటను ఇష్టపడునది' అని ఈ నామానికి అర్థం.

## 331. వరదా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరింఛేటప్పుడు 'వరదాయైనమః' అని చెప్పాలి.

వరదా = వరములను ఇచ్చునది.

'వరములు' అంటే 'కోర్కెలు' అని అర్థం కాకుండా 'శ్రేష్ఠమైన' అంటే - 'శ్రేయస్సును కలుగచేయునవి' - అని అర్థం చెప్పుకోవాలి. లేకపోతే మనం కోరే అడ్డమైన కోర్కెలను గూడా అమ్మవారు తీర్చవలసి వస్తుంది.

కాదంబరీ స్థితికి పోయినపుడు కోరవలసిన దేమిటో తెలుస్తుంది. కోరినవి పనికి రావడం కాకుండా, పనికి వచ్చేవే కోరే స్థితికి రావాలి. అప్పటి స్థితిలో కోరే కోర్కెలను 'వరములు' అంటారు. 'అట్టి వరములను ఇచ్చునది' అమ్మవారు.

అమ్మవారికి వరదముద్ర లేకపోయినా అమ్మవారి చరణయుగళమే భక్తుల కోర్కెలకు మంచి ఫలాలిస్తాయి అని 'సౌందర్యలహరి' లోని ''త్వదన్యఃపాణి భ్యాం.... చరణావేవనిపుణౌ'' అన్న 4వ శ్లోకంలో ఆది శంకరులు చెబుతారు.

యజ్ఞయాగాదులలో చివరకు ఋత్విక్‌లకు, బ్రాహ్మణులకు - దక్షిణలు, సంభావనలు యజమాని ఇస్తాడు. ఆవిధంగా యజమాని రూపంలో వర దక్షిణను ఇచ్చే అమ్మవారిని 'వరదా' అని అనవచ్చును.

1) వరములను (శ్రేయస్సును కలుగ చేయునవి) ఇచ్చునది.

2) యజమాని రూపంలో దక్షిణను ఇచ్చునది.

అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 332. వామనయనా

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'వామనయనాయైనమః' అని చెప్పాలి.

వామ = అందమైన, నయనా = నేత్రములు గలది.

అనుగ్రహాన్ని వర్షించే కళ్ళే అందమైన కళ్ళు. మిగిలినవి ఆకర్షణీయమైనవి, అపురూపమైనవి కావచ్చు. అమ్మవారి కళ్ళు ముఖ్యంగా అనుగ్రహాన్ని వర్షించేవే ! ఎందుకంటే - అమ్మవారు తన కళ్ళతోనే అందరినీ పోషించి, లాలించి సాకుతుంది. అమ్మవారు మీనాక్షి. ('వక్త్రలక్ష్మీ పరీవాహచలన్మీనాభలోచనా' నామ వివరణ చూడండి).

వామదేవుడంటే – 'శివుడు' కాబట్టి 'వామనయనా' అంటే 'శివుని కన్ను' అని ఒక అర్థం. (శివుని ఎడమకన్ను అమ్మవారిదే కదా!) శివుని సాన్నిధ్యమునకు తీసుకు పోవునది అనగా శివుని పొందింప చేయునది' అని మరో అర్థం ('నయ్' అంటే నడిపించుట అనే అర్థంలో)

'వా' అంటే వాత్సల్యమును, 'మ' అంటే 'మమత'ను తన రెండు కన్నులుగా గలది అని మరో అర్థం.

వెన్నెముకలోని ప్రధానమైన నాడుల్లో ఎడమవైపునాడి చంద్రాత్మకం. ఇది గూడా అమ్మవారికి సంబంధించినదే. ఇది వామ మార్గగామిని గాబట్టి వామనయనా.

1) అందమైన, అనుగ్రహ పూరితమైన కన్నులు గలది.
2) శివుని కన్నుగా నున్నది.
3) శివుని పొందింపచేయునది.
4) వాత్సల్య, మమతలను తన రెండు కన్నులు గాగలది.
5) ఇడానాడీ ప్రజ్ఞాస్వరూపిణి – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 333. వారుణీ మదవిహ్వలా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'వారుణీ మదవిహ్వలాయైనమః' అని చెప్పాలి.

వారుణీ = వరుణసంబంధమైన, మద = పరవశత్వము చెందిన, విహ్వలా = మనోలక్షణము గలది.

వారుణీ అంటే – మత్తుపానీయంగా అర్థం చెప్పుకుని, 'అటువంటి పానీయ సేవనం వలన మనస్సు వికలత్వము చెందినది' – అని అర్థం చెప్పుకోకూడదు. ఇక్కడ 'వారుణీ' అంటే – 'భార్గవీ – వారుణీ' విద్యా అని తైత్తిరీయంలోని భృగువల్లిలో వచ్చే బ్రహ్మ జిజ్ఞాసకు సంబంధించిన విద్య. ఈ వారుణీ విద్యవలన బ్రహ్మ దర్శనం జరిగి పరవశత్వం కలుగుతుంది. ఆ 'పరవశత్వ స్థితిలో వున్న మనో లక్షణం గలది' అని అర్థంచెప్పుకోవాలి.

మనలో వెన్నెముకకు పశ్చిమ దిక్కుకు సంబంధించిన వాడు 'వరుణుడు'. తూర్పు దిక్కుకు సంబంధించిన వాడు 'ఇంద్రుడు' ఈ ఇద్దరి ప్రజ్ఞలనూ వరుసగా 'వారుణీ' - 'ఐంద్రీ' అంటారు. వీళ్లనే పురాణాల్లో వరుసగా కశ్యపుని భార్యలైన 'కద్రువ' - 'వినత' లతో సంకేతిస్తారు.

కామానికి, మోక్షానికి గూడా 'మదము' అంటే – 'పరవశత్వం' అనుభవలక్షణమే అవుతుంది.

దాంపత్యంలో తండ్రి తన శుక్రం ద్వారా కొడుకు అవుతున్నప్పుడు కూడా ఈ పరవశత్వ లక్షణం వుంటుంది. మోక్షంలో తన వ్యక్తిగత ప్రజ్ఞ విశ్వాత్మ ప్రజ్ఞ లోనికి లీనమై వుంటుంది. అప్పుడూ ఈ పరవశత్వ లక్షణము వుంటుది. అయితే మొదటిది తాత్కాలికం గాను రెండవది శాశ్వతంగాను వుంటుంది.

యోగాభ్యాసంలో మూలాధారం నుండి సహస్రారం దాకా వెళ్ళిన కుండలినీ శక్తి అక్కడ బ్రహ్మరంధ్రము నుండి అమృతాన్ని స్రవించి సమస్త నాడీమండలాన్ని తడుపుతుంది. (సుధాధారాసారైః ''రసామ్నాయమహసః' సౌందర్యలహరిలోని శ్లోకం) అప్పుడు కలిగే అనుభూతి పరవశత్వమే ! ఈ స్థితిలో బాహ్య జ్ఞానం వుండదు. అంటే, వళ్ళు తెలియదు. దీన్ని 'ప్రవృత్తిరహితస్థితి' అంటారు. శరీరంలో పైకి క్రిందకు సంచరించే 'వాయు సంచారనాడి' అయిన వారుణిని ఈవిధంగా నియంత్రణ చేసి ఈ పరవశత్వ స్థితిని పొందవచ్చును. ఈ స్థితిలోని అమ్మవారిని 'వారుణీ మదవిహ్వలా' అంటారు.

'మోక్షానందపరవశత్వ లక్షణము గలది' అని ఈ నామానికి అర్థం చెప్పుకోవచ్చును.

## 334. విశ్వాధికా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'విశ్వాధికాయైనమః' అని చెప్పాలి.

విశ్వ = ప్రపంచమునకు, అధికా = మించినది. అనగా అధికురాలు.

అమ్మవారు జగజ్జనని కాబట్టి విశ్వాని కంటె ముందు వుండి, విశ్వాన్ని తనలో కలిగి, విశ్వాన్ని సృష్టించి, విశ్వాన్ని సాకి, చివరకు విశ్వాన్ని తన లోకి లీనం చేసుకునేది. కాబట్టే 'విశ్వాధికా' అనే నామం అమ్మవారికి వచ్చింది. అంటే విశ్వానికి నేపథ్యం(Back ground) అమ్మవారు. పైగా మనం చూసే విశ్వం అసలులో నాల్గవవంతే! (పాదో஽స్య విశ్వాభూతాని... పురుషసూక్తం) దానిని బట్టి – 'అసలు' – అమ్మవారైతే, విశ్వం ఆమెలో నాల్గవవంతే కదా!

'విశ్వము కంటే అధికురాలు' అని ఈ నామానికి అర్థం.

## 335. వేదవేద్యా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'వేదవేద్యాయైనమః' అని చెప్పాలి.

వేద = వేదముల చేత, వేద్యా = తెలియదగినది.

అమ్మవారిని గురించి తెలుసుకోవాలంటే వేదాలు పరమ ప్రామాణికాలు. అమ్మవారు జ్ఞాన స్వరూపిణి. వేదాలు జ్ఞాన ప్రబోధకాలు కాబట్టి వేదాల ద్వారానే అమ్మవారిని గురించి తెలుసుకోగలిగేది! అందుకే –

'వేదైశ్చ సర్వైరహమేవ వేద్యః' అన్నది వేదం. వేద సర్వస్వమూ జ్ఞానమే! వేద జ్ఞానానికి అక్షర రూపాలే వేద గ్రంథాలు.

అమ్మవారు నివసించే చింతామణి గృహానికి తూర్పు ద్వారం – ఋగ్వేదం, దక్షిణ ద్వారం – యజుర్వేదం, పశ్చిమ ద్వారం – అధర్వణ వేదం, ఉత్తరద్వారం – సామవేదం. బ్రహ్మ విద్యాది (శుద్ధ విద్యాది) మంత్రాలన్నీ ఈ నాలుగు ద్వారాలకు బయటే వుంటాయి. అమ్మవారిని చూడాలంటే (తెలుసుకోవాలంటే) ఈ మార్గాల ద్వారానే తప్ప ఇంకో మార్గం లేదు కాబట్టి, అమ్మవారు 'వేదవిద్యా'.

'వేదముల ద్వారా తెలియదగినది' అని ఈనామానికి అర్థం.

# 336. వింధ్యాచలనివాసినీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'వింధ్యాచల నివాసిన్యైనమః' అని చెప్పాలి.

వింధ్యాచల = వింధ్యపర్వత ప్రాంతమున, నివాసినీ = నివాసము గలది. దుర్గలు రెండు విధాలు 1) పులివాహనం గల దుర్గ, 2) సింహవాహనం గలదుర్గ.

పులివాహనం గల దుర్గ వింధ్యాద్రి గుహల్లో వుంటుంది. సింహవాహనం గల దుర్గ సహ్యాద్రి గుహల్లో వుంటుంది అంటారు.

ఈ వింధ్యాద్రి, సహ్యాద్రులుసప్తకుల పర్వతాలకు చెందినవి. ఉత్తర భారతదేశాన్ని, దక్షిణ భారతదేశాన్ని వింధ్యాద్రి విడదీస్తూ మధ్యగా వుంటుంది. మనిషిని సరిగా ఇలా రెండు భాగాలుగా విభజించే బిందువు నాభి. నాభికి ఎగువ – ఉత్తర భాగం. నాభికి దిగువ దక్షిణ భాగం వర్తిస్తాయన్నమాట. సరిగ్గా ఈ నాభి ప్రాంతంలో వుండే చక్రాన్ని 'మణిపూర చక్రం' అంటారు. దానిని బట్టి మణిపూర చక్రస్థానంలో వుండే అమ్మవారిని – వింధ్యాచలనివాసినీ – అని అర్థం చేసుకోవాలి.

శ్లో. వైవస్వతేంతరే ప్రాప్తే ఉభౌ శుంభ నిశుంభ కౌ
ఉత్పత్స్యేతే వరాన్మత్తే దేశోపద్రవ కారిణీ
నందగోప కులే జాతా యశోదా గర్భసంభవా
తావహం నాశయిష్యామి నందాభ్యా వింధ్యవాసినీ.

వైవస్వత మన్వంతరంలో – నందగోపుని కులంలో, యశోదా గర్భంలో పుట్టి – దేశానికి ఉపద్రవాలను సృష్టించే – శుంభనిశుంభులు – అనే రాక్షసులను – సంహరించిన నందగోపుని కూతురే 'వింధ్యవాసినీ' అని పై శ్లోకానికి అర్థం. అంటే – అటు దేవకీ గర్భాన కృష్ణుడు, ఇటు యశోదా గర్భాన అమ్మవారు (దుర్గ) పుట్టారన్నమాట!

1) వింధ్యాచల ప్రాంతంలో నివాసము గలది.

2) మణి పూర చక్రము నందు నివాసము గలది – అని ఈ నామానికి అర్థాలు చెప్పుకోవచ్చును.

(ఇక సహ్యాద్రి. ఇది పశ్చిమ భాగాన వుంటుంది. వెన్నెముక పై కొన వద్ద భ్రూ మద్యప్రాంతంలో వుండే చక్రాన్ని ఆజ్ఞాచక్రం అంటారు. ఇది తూర్పుదిశను సూచిస్తుంది. క్రింది కొసవద్ద వుండే చక్రాన్ని 'మూలాధారం' అంటారు. ఇది పశ్చిమ దిశను సూచిస్తుంది. మొత్తం భౌతికశక్తి(Physical strength) అంతా కేంద్రీకృతమైన కేంద్రమే మూలాధారం. కాబట్టి, మనలో ఇక్కడే మహిషాసురుడు కూడా వుంటాడు. సింహవాహనయై – ఆ మహిషాసురుణ్ణి చంపిన అమ్మవారు సహ్యాద్రి గుహల్లో వుంటుంది.)

## 337. విధాత్రీ

మూడు అక్షరాల నామం. ఈ నామంలో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'విధాత్ర్యైనమః' అని చెప్పాలి.

విధాత్రీ = విధానమును చేయునది.

మొత్తం సృష్టి ప్రణాళిక యొక్క విధానాన్ని రూపొందించేది కాబట్టి అమ్మవారు విధాత్రి (The Deciding Deity of order of the Universe) ఈ ప్రణాళికతో సహకరిస్తే మన పట్ల అమ్మవారు – 'విధానం' (Path)గా వుంటుంది. ఎదురు తిరిగితే మన పట్ల 'విధి' (Fate)గా వుంటుంది.

సంసారభారాన్ని (భౌతికంకాదు) గృహస్థు ఎలా మోస్తాడో – అలాగే విశ్వం యొక్క భారాన్ని అమ్మవారు మోస్తుంది. ఇది మామూలు విషయం కాదు. ఎంతో సామర్థ్యం, నైపుణ్యం వుంటేనే మోయగలిగే భారం – అమ్మవారు ఈ భారాన్ని చక్కగా విశిష్టమైన పద్ధతిలో మోయగలుగుతోంది కాబట్టి అమ్మవారికి 'విధాత్రీ' అనే నామం వచ్చింది.

విశేషమైన రీతిలో విశ్వం యొక్క (భారాన్ని) బరువు బాధ్యతలను మోయునది – అని ఈ నామానికి అర్థం.

## 338. వేదజననీ

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'వేదజనన్యైనమః' అని చెప్పాలి.

వేద = వేదములకు, జననీ = తల్లి

అమ్మవారి లక్షణాలను, లక్ష్యాలను, సృష్టి నిర్వహణా ప్రణాళికను జీవన విధానమును గుఱించి వివరించేవే వేదాలు. అటువంటి వేదాలకు ఉత్పత్తి స్థానం అమ్మవారు కాబట్టి అమ్మవారు – వేదజననీ.

'వేదములకు తల్లి' – అని ఈ నామానికి అర్థం.

## 339. విష్ణుమాయా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'విష్ణుమాయాయైనమః' అని చెప్పాలి.

విష్ణు = విష్ణుమూర్తి యొక్క, మాయా = మాయా స్వరూపిణి.

లేనిది వున్నట్లు గాను, ఉన్నది లేనట్లుగాను భ్రమను పేట్టే లక్షణాన్ని 'మాయ' అంటారు. సూర్యోదయం, సూర్యాస్తమయం వాస్తవానికి లేకపోయినా ఉన్నట్లు మనకు అనిపించినట్లే – వాస్తవానికి నిరంతర చైతన్యంతో వుండే పరమాణువులతో తయారైన దేహం – స్థిరంగా, స్థూలంగా వున్నట్లు భ్రమింప చెయ్యటం స్థితి కారుడైన విష్ణుమూర్తి మాయే గదా! ఈ విధంగా ఆలోచిస్తే మొత్తం ప్రపంచమే 'మాయ' ఔతుంది. విష్ణుమూర్తి చేత స్థితికి సంబంధించిన కృత్యాన్ని అమ్మవారు ఈ విధంగా మాయా వ్యూహంతో నిర్వహిస్తోంది. విష్ణుమూర్తి నేపథ్యంలో పనిచేసే అమ్మవారిఈ మాయను 'విష్ణుమాయ' అన్నారు. సత్యమని ఒప్పుకోడానికి గాని, అసత్యమని తోసివేయటానికి గాని వీలులేనిది ఈ మాయ.

'మమమాయా దురత్యయా' – అతిక్రమించలేనిది నా మయ – అని గీతలో కృష్ణుడు చెబుతాడు.

''మాయాంతు ప్రకృతిం వింద్యా, మాయినంతు మహేశ్వరమ్'' – 'మాయ అనేది ప్రకృతి అని – ఆ మాయ తన వశంలో వున్న వాణ్ణి మహేశ్వరుడనీ' – ఈ శ్లోకానికి అర్థం.

'యాదేవీ సర్వభూతేషు విష్ణుమాయేతిశబ్దితా' - అంటే - సర్వభూతాల్లోనూ విష్ణుమాయ అని చెప్పబడే అమ్మవారి శక్తినే విష్ణుమాయ అంటారు' అని ఈ శ్లోకపాదా అర్థం.

'విష్ణువు ద్వారా పనిచేసే మాయా లక్షణ స్వరూపిణి' అని ఈ నామానికి అర్థం.

## 340 విలాసినీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'విలాసిన్యైనమః' అని చెప్పాలి.

విలాసినీ = వినోదాత్మక, క్రీడాత్మక, లక్షణము గలది.

సాధన ప్రారంభ దశలో యోగమార్గాన్ని అగమ్యంగా చెయ్యడంలో ఆచ్ఛాదించి వుండే అమ్మవారి శక్తిని 'విలాసినీ శక్తి' అంటారు. అమ్మవారు తన 'విలాసినీ' మోహంలో పడేట్లుగా చేసి అసలు గమ్యాన్ని మరచి పోయేట్టుగా చేసే శక్తిని 'విలాసినీ శక్తి' అంటారు. ఈ శక్తి కలిగిన అమ్మవారిని 'విలాసినీ' అంటారు. ఈ విలాసినీ శక్తి కరుణ లేనిదే యోగం సిద్ధించదు - సరిగదా - కనీసం యోగ మార్గం కూడా సుగమంగా భాసించదు. అమ్మవారు అనుగ్రహం కలిగి త్రోవ ఇస్తే తప్ప యోగమార్గాన్ని అనుసరించడం జరుగదు, యోగసిద్ధి చేకూరదు. అమ్మవారి ఈ విశిష్టలక్షణాన్ని 'విలాసిని' అంటారు. ఈ విలాసినీ లక్షణాన్ని పుణికి పుచ్చుకుని విష్ణుమూర్తి జగన్మోహినీ రూపంతో శివునితో సహా చాలా మందిని మోహంలో పడేశాడు.

1) యోగమార్గధ్యేయ సాధ్యాసాధ్యాలను నియంత్రించే అమ్మవారి ఒక విశిష్టశక్తి.

2) వినోదాత్మకంగా, క్రీడాత్మకంగా సృష్టి ప్రణాళికను నిర్వహించునది - అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

(విష్ణుమాయా విలాసినీ - అని ఇంతకు ముందు నామాన్ని ఈ నామాన్ని కలిపి ఒకే నామంగా చెప్పే పద్ధతి కూడా వుంది. అపుడు విష్ణుమాయ యందు విలాసమును చూపునది అని అర్థం చెప్పుకోవాలి.)

## 341. క్షేత్రస్వరూపా

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'క్షేత్రస్వరూపాయైనమః' అని చెప్పాలి.

క్షేత్ర = క్షేత్ర పదంచే సంకేతింపబడే వాటి; స్వరూపా = స్వరూపంగా నుండునది.

'క్షేత్రము' అంటే భూమి, పొలము, పుణ్యక్షేత్రము అనే అర్థాలే కాకుండా 'శరీరం' అనే అర్థం కూడా వుంది. ఈ విషయం గీతలో – 'ఇదం శరీరం కౌంతేయ క్షేత్రమిత్యభిధీయతే' అని భగవానుడే స్వయంగా అర్జునునికి చెప్తాడు.

ప్రతి జీవిలో – 'దేహి' 'దేహము' అని రెండు భాగాలుంటాయి. తాను భౌతికంగా వుండటానికి జీవి అనే గృహస్థు కల్పించుకున్న గృహమే – 'దేహం'. జీవిలోని రెండవ భాగమైన దేహమే ప్రస్తుతం చెప్పబడే 'క్షేత్రం'. అంటే – జీవిలోని దేహభాగముగా నుండునది. అని ఈ నామానికి అర్థం. అంతేకాదు – పుణ్యక్షేత్రంగాను, భూమిగాను, పొలంగాను, స్థలంగాను, పుణ్యక్షేత్రదేవతా విగ్రహంగాను – వుండేది అమ్మవారే ! అంటే – నామరూపాత్మక మైన స్థూల ప్రపంచమంతా అమ్మవారే అని చెప్పుకోవచ్చును.

'నామరూపాత్మకమైన స్థూల ప్రపంచ స్వరూపిణి' అని ఈ నామానికి అర్థం చెప్పవచ్చును.

## 342. క్షేత్రేశీ

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'క్షేత్రేశ్యైనమః' అని చెప్పాలి.

క్షేత్ర = క్షేత్రమునకు, ఈశీ = అధికారిణి.

జీవికి వుండే – దేహ, దేహి భాగాల్లో మొదటి దాని గురించి ఇంతకు ముందు నామంలో చెప్పబడింది. ప్రస్తుతం రెండవ భాగం అయిన 'దేహి' గురించి చెప్పబడుతోంది. అదృశ్యంగా వుండి దేహాన్ని నడిపించే చైతన్య శక్తిని 'క్షేత్రేశీ' అంటారు. మళ్ళీ ఇది ఒక జీవులపట్ల మాత్రమే కాదు. ఇంతకు ముందు నామంలో చెప్పినట్లు – పుణ్యక్షేత్రము

మందలి దేవతా విగ్రహంలోని చైతన్య శక్తికి, నామరూపాత్మకమైన స్థూల ప్రపంచాన్ని నడిపించే చైతన్య శక్తికి గూడా ఈ నామం వర్తిస్తుంది.

1) జీవి శరీరాన్ని నడిపే చైతన్యశక్తి

2) 'నామరూపాత్మకమైన స్థూల ప్రపంచాన్ని అదృశ్యంగా వుండి నడిపించే చైతన్యశక్తి' అని ఈ నామానికి అర్థాలు చెప్పుకోవచ్చును.

## 343.క్షేత్రక్షేత్రజ్ఞపాలినీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'క్షేత్రక్షేత్రజ్ఞపాలిన్యైనమః' అని చెప్పాలి.

క్షేత్ర = స్థూలభాగమైన దేహమును, క్షేత్రజ్ఞ = సూక్ష్మభాగమైన దేహిని, పాలినీ = పాలించునది లేదా రక్షించునది.

ఇంతకు ముందు చెప్పిన జీవికి సంబంధించిన స్థూలభాగమైన శరీరమును, సూక్ష్మభాగమైన శరీరధారిని గూడా అమ్మవారే సంరక్షిస్తూ పరిపాలిస్తుంది. అంటే, ఈ రెంటి మనుగడకు అమ్మవారే అధికారిణి, అసలు కారణం – అని ఈ నామం తెలియచేస్తుంది.

'దేహమును, దేహిని గూడా పరిపాలించి సంరక్షించునది' అని ఈ నామానికి అర్థం.

## 344. క్షయవృద్ధివినిర్ముక్తా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'క్షయవృద్ధివినిర్ముక్తాయైనమః' అని చెప్పాలి.

క్షయ = తరుగుదల, వృద్ధి = పెరుగుదల, వినిర్ముక్తా = లేనిది.

జీవికి – పుట్టడం, ఉండటం, రూపం మారడం, పెరగడం, కృశించడం, నశించడం అనే ఆరు వికారాలు వుంటాయి కాని జనన మరణాలతో సంబంధము లేకుండా, వాటికి అతీతంగా నేపథ్యంలో విశ్వ సృష్టిస్థితిలయాలను నిర్వహిస్తూ వుండే పరబ్రహ్మస్వరూపిణి అయిన అమ్మవారికి తరుగుదలలు, పెరుగుదలలు వుండవు. ఎప్పుడూ ఒకే విధంగా

వుంటుందని ఒక అర్థం.

ప్రకృతిలో – ఇది తరిగిపోతోంది, అది పెరిగిపోతోంది, ప్రపంచం క్షీణిస్తోంది, నశిస్తోంది – అనే భావనలు అమ్మవారికి వుండవు. ‘రూపాలు, స్థితులు మారవచ్చునేమోగాని ఉన్నదేదో వుంటుంది క్రొత్తది రాదు, ఉన్నది పోదు’ అన్నదే (Law of conservation of Mass, Matter and Energy) ఇటు ఆధ్యాత్మిక రంగంలోనూ, అటు విజ్ఞాన శాస్త్ర రంగాల్లోనూ గూడా ప్రాథమిక సూత్రం. అందుకని అమ్మవారికి కృశించి నశించడాలు, వృద్ధి చెంది ఎండిపోవడాలు ఉండవు.

సమాజపరంగా కూడా – ‘వీళ్ళ దిగజారుతున్నారు. వీళ్ళ ఎదుగుతున్నారు, ఈజాతి తరిగిపోతోంది, ఈజాతి పెరిగిపోతోంది’ అనే వైరుధ్య భావాలు కూడా అమ్మవారికి వుండవు, కలుగవు.

సృష్టిలోని ప్రతి వస్తువు పట్ల, వ్యక్తిపట్ల జీవి పట్ల వర్తింపచేసి తమ ఆటలు సాగించుకున్న క్షయ వృద్ధి లక్షణాలు – అమ్మవారి దగ్గర కూడా తమ లక్షణాలను వర్తింప చేయాలని చూసి, లాభం లేదు ఇక్కడ మన ఆటలు సాగవని అమ్మవారిని వదిలేశాయి – అని కూడా ఈ నామానికి అర్థం చెప్పుకోవచ్చును.

ఎవరిలో అయినా ఇతరుల పట్ల ఇలాంటి తరగడాలు పెరగడాలతో మాటి మాటికీ మారే అభిప్రాయాలుంటే వారు అమ్మవారిని ఈ నామంతో జపిస్తే వారికాభావాలు పోతాయి.

తనను గురించి కూడా తానే – తక్కువగాను (Inferiority Complex) ఎక్కువ గాను (Superiority Complex) అంచనావేసుకుని, వరుసగా కుములుతూ గాని, విఱ్ఱవీగి పోతూ గాని ఉండేవారు ఈ నామంతో అమ్మవారిని జపిస్తే వారికి ఆ లక్షణాలు లేకుండా చేసి చక్కదిద్దుతుంది.

1) తరిగే లక్షణం, పెరిగే లక్షణం వర్తించనిది.

2) క్షీణించే, వృద్ధి చెందే లక్షణాలచే వదలివేయబడినది.

3) ఇతరుల పట్ల మాటి మాటికీ మారుతూ వుండే అభిప్రాయాలను గాని, తన పట్ల తన కుండే తక్కువ ఎక్కువ భావాలు గాని లేకుండా చేయునది – అనే అర్థాలు ఈ నామానికి చెప్పుకోవచ్చును.

వుంటుందని ఒక అర్థం.

ప్రకృతిలో – ఇది తరిగిపోతోంది, అది పెరిగిపోతోంది, ప్రపంచం క్షీణిస్తోంది, నశిస్తోంది – అనే భావనలు అమ్మవారికి వుండవు. 'రూపాలు, స్థితులు మారవచ్చునేమోగాని ఉన్నదేదో వుంటుంది క్రొత్తది రాదు, ఉన్నది పోదు' అన్నదే (Law of conservation of Mass, Matter and Energy) ఇటు ఆధ్యాత్మిక రంగంలోనూ, అటు విజ్ఞాన శాస్త్ర రంగాల్లోనూ గూడా ప్రాథమిక సూత్రం. అందుకని అమ్మవారికి కృశించి నశించడాలు, వృద్ధి చెంది ఎండిపోవడాలు ఉండవు.

సమాజపరంగా కూడా – 'వీళ్ల దిగజారుతున్నారు. వీళ్ల ఎదుగుతున్నారు, ఈజాతి తరిగిపోతోంది, ఈజాతి పెరిగిపోతోంది' అనే వైరుధ్య భావాలు కూడా అమ్మవారికి వుండవు, కలుగవు.

సృష్టిలోని ప్రతి వస్తువు పట్ల, వ్యక్తిపట్ల జీవి పట్ల వర్తింపచేసి తమ ఆటలు సాగించుకున్న క్షయ వృద్ధి లక్షణాలు – అమ్మవారి దగ్గర కూడా తమ లక్షణాలను వర్తింప చేయాలని చూసి, లాభం లేదు ఇక్కడ మన ఆటలు సాగవని అమ్మవారిని వదిలేశాయి – అని కూడా ఈ నామానికి అర్థం చెప్పుకోవచ్చును.

ఎవరిలో అయినా ఇతరుల పట్ల ఇలాంటి తరగడాలు పెరగడాలతో మాటి మాటికీ మారే అభిప్రాయాలుంటే వారు అమ్మవారిని ఈ నామంతో జపిస్తే వారికాభావాలు పోతాయి.

తనను గురించి కూడా తానే – తక్కువగాను (Inferiority Complex) ఎక్కువ గాను (Superiority Complex) అంచనావేసుకుని, వరుసగా కుములుతూ గాని, విఱ్ఱవీగి పోతూ గాని ఉండేవారు ఈ నామంతో అమ్మవారిని జపిస్తే వారికి ఆ లక్షణాలు లేకుండా చేసి చక్కదిద్దుతుంది.

1) తరిగే లక్షణం, పెరిగే లక్షణం వర్తించనిది.

2) క్షీణించే, వృద్ధి చెందే లక్షణాలచే వదలివేయబడినది.

3) ఇతరుల పట్ల మాటి మాటికీ మారుతూ వుండే అభిప్రాయాలను గాని, తన పట్ల తన కుండే తక్కువ ఎక్కువ భావాలు గాని లేకుండా చేయునది – అనే అర్థాలు ఈ నామానికి చెప్పుకోవచ్చును.

విజయా = విశిష్ట లేదా విశేషమైన జయమును కలిగినది.

ఎక్కడా ఎప్పుడూ అపజయం లేనిది కాబట్టి అమ్మవారు 'విజయా' ఔతుంది.

'జయము, 'విజయము' అనే పదాలకు వేరే వేరే అర్థాలున్నాయి. బయట పరిస్థితులపైన, వ్యక్తులపైన మనకు నియంత్రణ, ఆధిపత్యం వస్తే దాన్ని 'జయము' (Conquest) అంటారు. మన మీద మనకు అంటే – మన ఇంద్రియాలు, మనస్సు, అరిషడ్వర్గాలైన కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలపైన నియంత్రణ, ఆధిపత్యం వస్తే దాన్ని 'విజయము' (success) అంటారు. బాహుబల పరాక్రమ చతురంగ బల సంపన్నత్వంతో బయట వారిపై జయం సాధించవచ్చునేమో గాని, అవి తనపై తన ఆధిపత్యానికి దోహదపడవు. (విశ్వామిత్రుడే దీనికి సరియైన ఉదాహరణ). అందుకే, తనపై తన ఆధిపత్యాన్ని సూచించే జయం – 'విశేషమైన' అనే అర్థాన్ని సూచించే 'వి' అక్షరంతో 'విజయము' అనే పదంతో చెప్పబడింది. ఇలాంటి విజయం కలగడానికి కావలసిన సుగుణాలను అలవరచుకోడానికి; సర్దుబాటు చేసుకోడానికి – అవకాశాలను కల్పించి, ప్రతి సాధకుడు ఈ విజయాన్ని పొందడం కోసం దోహదపడుతుంది కాబట్టి అమ్మవారు 'విజయా' నామంతో సూచింపబడింది. సుగుణాలను అలవరచుకున్న వారికి సర్దుబాట్లు చేసుకుని చక్కదిద్దుకున్న వారికి తమపై తమకి విజయం వస్తుంది. కాని అలా చక్కదిద్దుకొనని వారికి విజయం రాదు.

1) ఎప్పుడూ ఎక్కడా అపజయము లేనిది.

2) సుగుణాలను అలవరచుకోడానికి, సర్దుబాట్లు చేసుకోడానికి కావలసిన అవకాశాలు కల్పించి, విజయం పొందడానికి దోహదపడునది. (తన్ను తాను జయించకలిగే స్థితిని (విజయాన్ని) ముందు కలుగజేసి ఇతరులను జయించ కలిగే స్థితిని (జయాన్ని) అమ్మవారు ఇస్తుందనే ఉద్దేశ్యంతోనే ఈ 'విజయా' నామం ముందు చెప్పబడి ఇటుపైన 'జయా' నామం (377) చెప్పబడుతుంది. అర్జునుడు తన్ను తాను జయించుకుని 'విజయు'డై, అటుపైన 'జయ' మనే భారతకథలో 'జయా'న్ని సంపాదించాడు.)

## 347. విమలా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'విమలాయైనమః' అని చెప్పాలి.

విమల = మలినములు స్పృశింపనిది.

నిలవవుండి సహజత్వాన్ని కోల్పోయిన వాటిని 'మలములు' అంటారు. 'మల' సంబంధమైనదే 'మలినము'. ఈ 'మలినము' అనే పదాన్ని విశేషణంగా గూడా వాడతారు. 'మలినభావాలు' అన్నపుడు, 'మలిన' అన్న పదము స్థూల పదార్థాన్ని సూచించదు. కేవలం 'నీచమైన' అనే విశేషణాన్ని సూచిస్తుంది. అమ్మవారు నిత్యనూతనంగా స్వచ్ఛంగా ఉంటుంది. సహజత్వాన్ని రూపు మాపే ఏ మలినమూ అమ్మవారి దగ్గర వుండదు. ఏ మలినమూ అమ్మవారిని స్పృశించదు. కాబట్టి, అమ్మవారు 'విమలా'. అలాగే అమ్మవారి భావాలు పవిత్రంగా, ప్రపంచ సౌభాగ్యాన్ని కోరేవిగా వుంటాయి కాబట్టి అమ్మవారు 'విమలా'.

1) ఏవిధమైన మలినములు అంటనిది.

2) ఏ విధమైన మలిన భావములు లేనిది – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

(తనపై విజయాన్ని సాధించిన సాధకునికి విమలత్వము ఉంటుందని ఈ నామం సూచిస్తుంది).

## 348. వంద్యా

రెండు అక్షరాల నామం. ఈనామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'వంద్యాయైనమః' అని చెప్పాలి.

వంద్యా = నమస్కరింపతగినది.

సకల జీవసంతతి, దేవతాగణము, త్రిమూర్తులు – అంతా గూడా నమస్కరింప తగిన మూర్తి ఒక్కరే ! ఆ ఒక్కరే – అంతటి భక్తిని, ప్రపత్తిని చూరగొనగలిగేది. ఆవిడే – జగజ్జనని అయిన శ్రీ లలితా దేవి.

'నమస్కరింపతగినది' అని ఈ నామానికి అర్థం.

('విజయము', 'విమలత్వము' సాధించిన సాధకుడు వందనీయుడౌతాడు అని ఈనామం సూచిస్తుంది.)

## 349. వందారుజనవత్సలా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'వందారు జనవత్సలాయైనమః' అని చెప్పాలి.

వందారు = నమస్కరించు శీలము గల, జన = జనుల యందు, వత్సలా = వాత్సల్యము గలది.

'అభివాదనశీలస్య నిత్యంవృద్ధోపసేవినః
చత్వారితస్య వర్ధంతే ఆయుర్విద్యాయశోబలమ్' – అని మనువు చెప్తాడు.

'నిత్యం వృద్ధులసేవ, పెద్దల ఎడ గౌరవ భావం – ఇవి సహజ సిద్ధంగానే అలవాట్లుగా ఉన్నవారికి ఆయుర్దాయం, విద్య, కీర్తి, బలము వృద్ధి చెందుతాయి', అని ఈ శ్లోకానికి అర్థం. వీళ్ళనే 'వందారు జనం' అంటారు. వీళ్ళ ఎడల అమ్మవారికి విపరీతమైన వాత్సల్య భావం వుంటుందిట. వాత్సల్యం అనగా ప్రేమే! అమ్మవారి ముందు అందరూ బిడ్డలేకాబట్టి – చిన్నవారి ఎడల వుండే ప్రేమను వాత్సల్యం అంటారు. కాబట్టి అమ్మవారు – వందారుజనవత్సలా' అయింది. ('విజయము', 'విమలత్వము' గలవారే వందారు జనులౌతారని ఈ నామం సూచిస్తుంది.)

'నమస్కరించుశీలము గలవారి యందు వాత్సల్యము కలది' అని ఈ నామానికి అర్థం.

## 350. వాగ్వాదినీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'వాగ్వాదిన్యైనమః' అని చెప్పాలి.

వాగ్వాదినీ = వాక్కులను చక్కగా వ్యక్తపరచగలుగుటకు ప్రేరణ నిచ్చు పరావాగ్దేవత. ఏ పనికైనా ముందు మన వాక్కు తిన్నగా ఉండాలి. అలా వుంటేనే ఆ పని సానుకూలమౌతుంది. లేకపోతే ప్రతికూలమౌతుంది.

వాక్కుతో సాధించలేనిది లేదు. పరావాక్కుకు సంబంధించిన వాగ్దేవత పేరు

'వాగ్వాదినీ'. ఈ వాగ్వాదినీ దేవత ద్వారా అమ్మవారు తన భక్తుని అనుగ్రహించి, అతనికి కావాలసినవి చేకూరుస్తూ వుంటుంది. అయితే, ఈ అమ్మవారి అనుగ్రహం పొందాలంటే ఒకటే నియమం – 'ఇతరులను తన మాటలతో నొప్పించకుండా అవసరమైనపుడు, అవసరమైన మేరకు మాత్రమే మాట్లాడటం'. ఈవాగ్వాదినీ దేవతకు సంబంధించిన శ్లోకం, మంత్రం ఈ క్రింది తెలుపబడినాయి.

''ఓష్ఠాపిధానానకులీ దంతైః పరివృతాపవిః
సర్వస్మైవాచ ఈశానా చారుమామిహవాదయేత్''
(జమదగ్ని తన కుమారునికి ఇచ్చిన మంత్రం ఇది).

(ఓం) ఐం క్లీం సౌః వద వద వాగ్వాదినీ స్వాహా'' – ఈ మంత్రాన్నే అమ్మవారి త్రయోదశాక్షరీ మంత్రం అని గూడా అంటారు. సరస్వతీ ఆకుని నేతిలో ముంచి ఈ మంత్రం జపిస్తూ హోమం చెయ్యాలి.

(ఈ శ్లోకంలోని యోగపరమైన అర్థాన్ని 'నవవిద్రుమబింబ శ్రీ న్యక్కారిరదనచ్ఛదా' అన్న 24వ నామం యొక్క వివరణలో చూడవచ్చును.)

'వాక్కులను చక్కగా వ్యక్తపరచుటకు ప్రేరణ నిచ్చు పరావాగ్దేవత' – అని ఈ నామానికి అర్థం.

## 351. వామకేశీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'వామకేశ్యైనమః' అని చెప్పాలి.

వామక + ఈశీ – వామకేశీ = వామకేశ్వరుని భార్య.

శివుని అవతారాల్లో వామకేశ్వరుడనే ఒకాయన వున్నాడు. ఈయన భార్యపేరు 'వామకేశి'. ఈమె అమ్మవారి అంశయే! ఈ వామకేశ్వర పేరుతోనే ఒక తంత్రం గూడా వుంది. దాని పేరు 'వామకేశ్వర తంత్రం' (ఎడమవైపు నాడి అయిన ఇడానాడిని స్పృశిస్తూ వచ్చిన వాక్కు తాలూకు తంత్రమే ఇది).

వామ = అందమైన, కేశీ = కేశములు గలది. అని విడదీసి అర్థం చెప్పుకుంటే 'అందమైన కురులు కలది' అని ఇంకో అర్థం వస్తుంది.

1) వామకేశ్వరుని భార్య.

2) అందమైన కేశసంపద కలిగినది – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 352. వహ్నిమండలవాసినీ

ఎనిమిద అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'వహ్నిమండల వాసిన్యైనమః' అని చెప్పాలి.

వహ్ని = అగ్ని, మండల = ప్రాకారమునందు, వాసినీ = వసించునది. (ఈ నామానికి 'జ్వాలామాలిని కాక్షిప్తవహ్నిప్రకారమధ్యగా' అన్న 71వ నామం యొక్క వివరణగూడా చూడాలి)

శ్రీ చక్రంలో మధ్యగా మొదట్లో వుండే త్రికోణ చక్రం (త్రిభుజం) వుంటుంది. దీని మధ్యలో అగ్ని స్వరూపురాలైన 'జ్వాలామాలినీ' అనే పేరుగల నిత్యాదేవతచే వెదజల్లబడిన వహ్నిమండల వుంటుంది. ఇక్కడకు ఎవ్వరూ రాలేరు. వచ్చినా భస్మం అయిపోతారు. అంటే, మండల మధ్యంలో మార్తాండ భైరవ రూపంలో వుండే అమ్మవారితో కలసిపోతారు. విడిగా వున్నప్పుడు ఏ వస్తువుకైనా, వ్యక్తికైనా అస్తిత్వం వుంటుంది గాని, అగ్నితో కలిస్తే అగ్ని వుంటుంది. ఇతరం వుండదు. అల్లాంటి మండలం ఇది. చిన్న 'నేను'లు (souls) పెద్ద నేను (Spirit)తో లీనమయే చోటుఇది.

'వహ్నిమండలము నందు వసించునది' అని ఈ నామానికి అర్థం.

## 353. భక్తిమత్కల్పలతికా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'భక్తిమత్కల్పలతికాయై నమః' అని చెప్పాలి.

భక్తిమత్ = భక్తికలవారిపట్ల, కల్పలతికా = కల్పవృక్షపు తీగవంటిది.

భక్తి కలవారిని 'భక్తిమతులు' అంటారు. ఒక దాని యందు ఒకటి చక్కగా లీనమై వుండటాన్ని – 'భక్తి' అంటారు. నీళ్ళయొక్క సాన్నిధ్యంలో పంచదార కరిగిపోయి, తన ప్రత్యేక అస్థిత్వాన్ని కోల్పోయి నీటిలో కలసిపోయి వుంటుంది. ఇలాగే, ఒక వ్యక్తి ఇంకొకరి సాన్నిధ్యంలో ఒరిగిపోయి, అతని వ్యక్తిత్వం కరగిపోతే, ఆ రెండవ వారి యందు ఈ వ్యక్తికి భక్తి వున్నట్లు, అర్థం చేసుకోవాలి. భక్తి ఇద్దరినీ ఏకం చేసిందన్నమాట! అలాంటి భక్తుల పట్ల అమ్మవారు కల్పవృక్షపు తీగలాంటిదట! చతుర్విధ భక్తులైన – ఆర్తులకు, జిజ్ఞాసువులకు, అర్థార్థులకు, జ్ఞానులకు – కావలసినవి వేరు వేరుగా వుంటాయి కాబట్టి వారి వారి అవసరాలను బట్టి అమ్మవారు వారికి ఏర్పాటు చేస్తుందని గ్రహించాలి. మళ్ళీ – శ్రవణం, కీర్తనం, స్మరణం, పాదసేవనం, అర్చనం, వందనం, దాస్యం, సఖ్యం, ఆత్మనివేదనం – అనే తొమ్మిది విధాలైన భక్తులలో ఏ విధమైన భక్తి వున్నా చాలు. ఆభక్తుణ్ణి బాధ్యతగా అమ్మవారు ఆదుకుంటుంది.

'భక్తుల పట్ల కల్పవృక్షపు తీగవంటిది' అని ఈ నామానికి అర్థం.

## 354. పశుపాశ విమోచనీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పశుపాశవిమోచన్యైనమః' అని చెప్పాలి.

పశుపాశ = వివిధ పాశములచే బంధింపబడువారిని, విమోచనీ = బంధ విముక్తులను చేయునది.

పాశము చేత బంధింపబడే జీవులన్నింటినీ 'పశువులు' అంటారు. మామూలు జంతువులు భౌతికమైన పాశములచే (పలుపులు) బంధింపబడి వుంటాయి. మనుష్యులు బంధింపబడేది భౌతికమైన పలుపులతో కాదు. మానసికమైన బంధాలతో బంధింపబడి, బయటపడలేక సతమతమైపోతారు. వీటినే 'భవబంధా' లంటారు. అమ్మవారిని అర్చిస్తే ఇలాంటి వారికి జ్ఞానోదయం కలిగి, సమస్యలు పరిష్కరింపబడి, బంధమోచనం జరుగుతుంది.

(భవ) బంధములనుండి విముక్తిని కలుగచేయునది' అని ఈ నామానికి అర్థం.

## 355. సంహృతాశేషపాషండా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సంహృతాశేష పాషండాయైనమః' అని చెప్పాలి.

సంహృత = సంహరింపబడిన, అశేష = సకలమైన, పాషండా = పాషండులు కలది.

ధర్మ విరుద్ధ ప్రవర్తన కలవారిని, వేద నిందితులను, విధ్యుక్త ధర్మాలు నిర్వర్తించని వారిని 'పాషండులు' అంటారు. వీరి వలన సమాజం చెడిపోవడానికి, ధర్మం భ్రష్టుపట్టడానికి అవకాశం వుంటుంది కాబట్టి – వీళ్ళ వలన సమాజం దెబ్బతినకుండా వుండేందుకు ఇటువంటి పాషండులందరినీ నిశ్శేషంగా సంహరిస్తుంది.

'పాషండులను నిశ్శేషంగా సంహరించునది' అని ఈ నామానికి అర్థం.

## 356. సదాచారప్రవర్తికా

ఎనిమది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సదాచార ప్రవర్తికాయైనమః' అని చెప్పాలి.

సదాచార = సంప్రదాయబద్ధమైన, శ్రోత్రీయ మార్గము ననుసరించి యుండునట్లు, ప్రవర్తికా = ప్రవర్తింప చేయునది, లేదా అట్టి ప్రవర్తన మన మనస్సుకు నచ్చునట్లు చేయునది.

శ్రుతులు – ఉపనిషత్తులు తెలిపిన ఆచార వ్యవహారాలను 'సదాచారాలు' అంటారు. ఈ సదాచారానికి అనుగుణంగా వుండే ప్రవర్తన మన మనస్సుకు గూడా నచ్చునట్లు చేస్తుంది – అమ్మవారు

'యద్యదా చరతి శ్రేష్ఠః తత్తదేవే తరో జనః,
సయత్ప్రమాణం కురుతే లోకస్తదను వర్తతే.''

''శ్రేష్ఠులైన వారు, పెద్దలు ఏవి ఆచరిస్తారో దాన్నే ప్రమాణంగా తీసుకుని మిగిలిన వారు అనుసరిస్తారు.'' అని గీతా ప్రబోధం. కాబట్టి, అమ్మవారు తాను జగజ్జననిగా,

గృహిణిగా, భార్యగా, అధికారిణిగా ఇలా వివిధ బాధ్యతలను ఎలా నిర్వర్తించాలో అలా ప్రవర్తిస్తుంది. ఇతరుల నుండి అదే ప్రవర్తనను ప్రోత్సహిస్తుంది. తేడా వచ్చినపుడు సరిదిద్దుకోడానికి అవకాశాలను, సన్నివేశాలను, సంఘటనలను వారి వారి జీవితాల్లో కల్పించి సరిదిద్దుకునేట్లుగా చేస్తుంది.

'సంప్రదాయమైన పద్ధతిలో ప్రవర్తింప చేయునది'

'సదాచార ప్రవర్తనలను ప్రోత్సహించునది' – అని ఈ నామానికి అర్థాలు చెప్పుకోవచ్చును.

('సంహృతా శేషాపాషండా,' 'సదాచార ప్రవర్తికా' అనే నామాలు 'వినాశాయుచ దుష్కృతాం' 'పరిత్రాణాయ సాధూనాం' అన్న గీతాచార్యుని వాగ్దానాన్ని స్ఫురింప చేస్తాయి.)

## 357. తాపత్రయాగ్ని సంతప్త సమాహ్లాదన చంద్రికా

పదహారు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'తాపత్రయాగ్నిసంతప్త సమాహ్లాదన చంద్రికాయైనమః' అని చెప్పాలి.

తాపత్రయ = ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవిక తాపములనెడి, అగ్ని = అగ్నిచేత, సంతప్త = తపింప చేయబడిన వారలకు, సమాహ్లాదన = మిక్కిలి సంతోషమును కలుగ చేయునట్టి, చంద్రికా = వెన్నెల వంటిది.

ఈ నామం నుండి 'స్వాత్మానందలవీభూత బ్రహ్మాద్యానంద సంతతిః' అనే నామం దాకా పురుషార్థ సాధనకుపకరించే బ్రహ్మ విద్య ఉపదేశింపబడుతుంది. దీన్నే 'తరుణీ విద్య' అంటారు.

'తాపత్రయము' అనే సమాసంలోనే తాపాలు మూడు రకాలుగా వుంటాయని తెలుస్తోంది. అవి 1. ఆధ్యాత్మికము 2. ఆధి భౌతికము 3. ఆధి దైవికము. శరీరానికి వచ్చే గుండె నొప్పి, వంటి పోటు, జ్వరాదివ్యాధులను ఆధ్యాత్మిక తాపాలంటారు. దొంగల బాధలు, పొరుగువారితో పోట్లాటలు, కొట్లాటలు, జంతువుల వలన, కీటకముల వలన వచ్చు బాధలను ఆధి భౌతిక తాపాలంటారు. ఇక అతివృష్టి అనావృష్టి వడగాడ్పులు

మొదలైన బాధలు ఆధిదైవిక తాపాలంటారు. ఆధ్యాత్మిక తాపము ఉపశమిస్తే వ్యక్తిగతముగా ప్రతిఫలముంటుంది. ఆధి భౌతిక తాపోపశమనం వలన సమాజానికి ప్రతిఫలము, ఆధిదైవిక తాపోపశమనం వలన జగత్కళ్యాణమే ప్రతిఫలముగా సిద్ధిస్తుంది.

'తాపత్రయముల వలన కలిగే బాధలలో మగ్గిపోయే వారికి శీతలోపచారాలు చేసి, ఆహ్లాదపరిచే చల్లని వెన్నెల వంటిది' - అని ఈ నామానికి అర్థం.

(మైనం లాంటి బుద్ధిని అంతకంటే వేడిగా చంచలంగా వుండే ఇంద్రియాల దగ్గఱకు, మనస్సు దగ్గరకు తీసుకు వెళ్ళకుండా, అంతకంటే స్థిరమైన స్థితిలో చల్లగా వుండే ఆత్మేశ్వరి దగ్గరకు తీసుకువెళ్తే గాని ఈ తాపత్రయోపశమనం కలుగదు.)

## 358. తరుణీ

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'తరుణ్యైనమః' అని చెప్పాలి.

తరుణీ = ఎప్పుడూ తరుణ వయస్సు, అనగా - ఒకే రీతి యౌవనము గలది. 'తరుణీ' అంటే 'పసగల షోడశాబ్దముల కన్నియ' అన్నాడు ఒక కవి. 'తరుణం' అంటే 'తగిన సమయం' (Present tense) అని గూడా అర్థం వుంది. అంటే తగిన వయస్సులో వున్న స్త్రీని 'తరుణీ' అంటారు. అందరు స్త్రీలకు తమ తమ జీవితాల్లో ఈ తరుణ వయస్సు వుంటుంది కాని, కొంతకాలమే వుంటుంది. అటుపైన 'ప్రౌఢ', 'వృద్ధ' ఇలా మారి మారి చివరకు జరామరణాలు చేరువై తనువు చాలిస్తారు. కాని, అమ్మవారు ఎప్పుడూ తరుణవయస్సులోనే ఏకరీతి యౌవనంలో వుంటుంది. 'సదాషోడశ వర్షాంచనవ యౌవన దర్పితాం' అంటే - పదహారు సంవత్సరాల వయస్సుతో నిత్యము యౌవనానంద స్థితిలో వుంటుంది అమ్మవారు.

1) 'ఎప్పుడూ ఏకరీతి యౌవనంలోను నుండునది'

2) ఎప్పుడూ పదహారు సంవత్సరాల యౌవనానంద స్థితిలోనుండునది' - అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 359. తాపసారాధ్యా

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'తాపసారాధ్యాయైనమః' అని చెప్పాలి.

తాపస = తపస్సు చేయువారిచే, ఆరాధ్యా = ఆరాధింపబడునది.

ఆహార విహార చేష్టలలో నియమ బద్ధంగా వుండి, ద్వంద్వాలకు అతీతంగా వుండి, త్రికరణ శుద్ధిగా సదాచారాలను పాటిస్తూ తాపత్రయం రహితులైన వారిని – 'తాపసు' లంటారు. ఇట్టి తాపసులచే అమ్మవారు ఆరాధింపబడుతుంది., ఉపాసింపబడుతుంది.

'తాపసులచే ఆరాధింపబడునది' అని ఈ నామానికి అర్థం.

## 360. తనుమధ్యా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'తను మధ్యాయైనమః' అని చెప్పాలి.

తను = కృశించిన అనగా సన్నని, మధ్యా = కటి ప్రదేశము (అనగా నడుము గలది).

(ఇంతకు పూర్వము ప్రథమభాగంలో – 'లక్ష్యరోమలతాధారతా సమున్నేయ మధ్యమా' అనే నామం వచ్చింది. ఈ నామ వివరణ కూడా చూడాలి)

'తనువు' అంటే స్వల్పము, కృశించిన, తక్కువ మొదలైన అర్థాలున్నాయి. ప్రస్తుతం – ఇది అమ్మవారి నడుముకు సంబంధించిన నామం కాబట్టి 'తను' అంటే 'సన్నని' అనే అర్థం చెప్పుకోవాలి. అమ్మవారి నడుము బాగా సన్నగా వుంటుంది. ఇలా వుండడం మంచి సాముద్రిక లక్షణం. నడుం సన్నగా వుండే స్త్రీలకు గర్భిణీ దశలో సౌకర్యముగా వుంటుంది. సుఖప్రసవం జరుగుతుంది. నడుములావుగా వున్న స్త్రీలకు ప్రసవ సమయంలో చాలా కష్టంగా వుంటుంది. అంతేకాక, అలాంటివారికి చాకిరీ చేయించుకోవాల్సిన అవసరంగాని, చాకిరీ చెయ్యాల్సిన అవసరం గాని కలగవచ్చు.

'తనువు' అంటే శరీరం లేదా వపుషము అని అర్థం. 'శ్రీ చక్రం శివయోర్వపుః' అన్నారు. దీనిని బట్టి శ్రీ చక్రం లోని అమ్మవారి శరీరం, అంటే – తనువు వుంటుంది. ఆ శ్రీ చక్ర తనువుకు మధ్యలో వుండేది, అనగా – 'బిందువు' అని అర్థం. అంటే అమ్మవారు 'బైందవాసనా' అని గూడా ఈ నామానికి అర్థం వస్తుంది.

ప్రతి వ్యక్తి తనువులో మధ్యస్థానం హృదయం కాబట్టి 'హృదయంలో వుండునది' అని ఇంకో అర్థం.

ప్రతివ్యక్తి వెన్నెముక యందు మధ్యగా, తిన్నగా, సన్నగా (తామరతూడుపోగులాగా) వుండే సుషుమ్నానాడిని గూడా 'తనుమధ్యా' అని చెప్పుకోవచ్చును.

శరీరంలో నాభికి పైన వుండే దేవలోకాలకు, క్రింద వుండే రాక్షసలోకాలకు మధ్యలో వుండి ఆ రెంటినీ సమన్వయ పరుస్తూ అధోలోక వాసులకు ఊర్ధ్వలోక ప్రాప్తిని కలుగ చేయడానికి సరియైన మార్గము(Proper channel)గా అమ్మవారు వుంటుంది కాబట్టి 'తనుమధ్యా'.

1) సన్నని నడుము గలది.

2) శరీర మధ్యంలో వుండే హృదయాంతర్వర్తి.

3) వెన్నెముకలో సుషుమ్నగా నుండునది.

4) అధోలోకవాసులకు ఊర్ధ్వలోక ప్రాప్తిని కలుగ చేయుటకు తిన్నగాను, సన్నని ద్వారముగాను నుండునది – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 361. తమోఽపహా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'తమోఽపహాయైనమః' అని చెప్పాలి.

తమస్ + అపహా = చీకటిని పోగొట్టునది, అజ్ఞానమును పోగొట్టునది.

'తమస్సు', అంటే – చీకటి. ప్రళయంలో ప్రపంచమంతా చైతన్య రహితమై

కారుచీకటిలో, నిండు నిద్రలో వున్నట్లు వుంటుంది. అటువంటి చీకటి వంటి స్థితిలోని ప్రళయం నుండి చైతన్య వంతమైన సృష్టిని, రాత్రి నుండి సూర్యోదయం అయినట్లు రప్పిస్తుంది కాబట్టి అమ్మవారు తమోఽపహా.

'తమస్సు' అంటే అజ్ఞానం. అవిద్యను, అజ్ఞానుల అజ్ఞానాన్ని పోగొట్టి బ్రహ్మజ్ఞానాన్ని చేకూరుస్తుంది. అర్థంకాని విషయం పట్ల అవగాహన కలగేలా చేస్తుంది, కాబట్టి అమ్మవారు 'తమోఽపహా'.

'చీకటిని, అజ్ఞానాన్ని, జడత్వాన్ని పోగొట్టునది' – అని ఈ నామానికి అర్థం.

## 362. చితిః

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'చిత్యైనమః' అని చెప్పాలి.

చితిః = కూర్పు, జ్ఞానబిందు సమీకరణ.

'చితిః' అంటే 'చిత్'కు సంబంధించిన పదంగా అర్థం చేసుకుని 'జ్ఞానం' అని సాధారణంగా అర్థం చెబుతారు. కాని 'చితిః' అంటే వాస్తవానికి వేరే అర్థం వుంది. ప్రోగుచేయుట, పేర్చుట, కూర్చుట, సమీకరించుట (Collecting లేదా gathering లేదా heap అనే అర్థాలు చెప్పుకోవాలి. 'చితిపేర్చండి' అంటే – 'పుల్లలను దగ్గరకు చేర్చి మండించడానికి ఏర్పాటు చెయ్యమనే అర్థం గదా ! అప్పుడు 'చితి' అంటే – 'దగ్గరకు కూర్చడం' లేదా 'సమీకరించడం' అనే అర్థం వస్తుంది. అయితే అమ్మవారు వేటిని సమీకరిస్తుంది ? వ్యక్తి మెదడులోని జ్ఞాన సంబంధమైన బిందువులను (Spots) ఒక చోటకు చేర్చి జ్ఞానాన్ని కలుగచేస్తుంది. ఈ పని ఎంతో తెలివితో చేయాల్సిన పనిగా బట్టి 'చితిః'. అంటే 'Intelligent gathering of the spots of intelligence ' – అని ఆంగ్లంలో అనవచ్చు. ఈ నామానికి తెలుగులో 'జ్ఞాన బిందువులను తెలివిగా ఒక చోటకు సమీకరించునది' అని అర్థం చెప్పుకోవాలి. లేదా – 'జ్ఞాన బిందు సంచయకారిణి' అని చెప్పుకోవాలి.

## 363. తత్పదలక్ష్యార్థా

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'తత్పదలక్ష్యార్థాయైనమః' అని చెప్పాలి.

తత్పద = 'తత్' పదముచే నిర్దేశింపబడు, లక్ష్య + అర్థ = లక్ష్యార్థా = లక్ష్యము యొక్క ప్రయోజనముగా నున్నది.

'తత్' పదంచేత నిర్దేశింపబడేది – విశ్వానికే మూలకారణమైన 'పరబ్రహ్మ'. అమ్మవారు పరబ్రహ్మ స్వరూపిణి. కాబట్టి తత్పద లక్ష్యానికి ప్రయోజనం అమ్మవారే ఔతుంది.

విశ్వానికి సంబంధించిన 'ఈశుడు – ఈశ్వరి' – ఈ రెండూ కలసి వున్న మూలకారణం ఏదైతే వున్నదో దాన్ని 'తత్' పదం చేత నిర్దేశిస్తారు. ఈ పదంలో 'త' ఈశుణ్ణి, 'త్' ఈశ్వరిని సూచిస్తాయి అనుకుంటే – 'తత్' లోని 'త్' భాగం అమ్మవారే కాబట్టి, 'తత్పద లక్ష్యార్థా' అన్నపుడు 'తత్పద లక్ష్యం' లో సగం అమ్మవారే అని కూడా అర్థం చేసుకోవచ్చును.

అలాగే ఈ 'తత్' పదంలోని 'త' కారం సూచించే ఈశుణ్ణి తన లక్ష్యార్థంగా పెట్టుకున్నది – అని మరో అర్థం కూడా చెప్పవచ్చును. ('తత్సవితుర్వరేణ్యం ... ప్రచోదయాత్' అనే గాయత్రీ మంత్రం ఈ 'త', 'త్'లకు మధ్య నిక్షిప్తం కాబడిందని గూడా తెలుసుకోడం సముచితం)

1) 'తత్' పద లక్ష్యానికి ప్రయోజనమైనది.

3) 'తత్' పద లక్ష్యంలోని అర్ధభాగంగా వున్న ఈశ్వరి.

3) 'తత్' పద లక్ష్యంలోని అర్ధభాగమైన 'ఈశుని' తన లక్ష్యార్థంగా వున్నది – అని ఈ నామానికి అర్థాలు చెప్పుకోవచ్చును.

## 364. చిదేకరసరూపిణీ

ఎనిమిది అక్షరాలనామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'చిదేక రసరూపిణ్యై నమః' అని చెప్పాలి.

చిత్ = జ్ఞానచైతన్యమే, ఏకరస = ఒకే ఒకరసముగా, లేదా సర్వసారముగా, రూపిణి = స్వరూపముగా గలది.

విశ్వంలోని అన్నింటిలోను 'అమ్మవారి' అస్తిత్వాన్ని తెలుసుకోవాలన్నా, గ్రహించాలన్నా, దర్శించాలన్నా ఒకే ఒక పదంతో సూచించే 'చైతన్యమే' ఈ ''చిత్'' అని గ్రహించాలి. ప్రతి జీవిలోను అమ్మవారి రూప, తత్త్వ సారాన్ని దర్శించేది కూడా ఈ ఒకే ఒక 'చిత్' రసానుభూతితోనే! అందుకని అమ్మవారు - 'చిదేకరసరూపిణి'.

'సారభూతమైన చైతన్యమే తన రూపంగా గలది' అని ఈ నామానికి అర్థం చెప్పుకోవచ్చును.

## 365. 'స్వాత్మానంద లవీభూత బ్రహ్మాద్యానంద సంతతిః'

పదహారు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'స్వాత్మానందలవీభూతబ్రహ్మాద్యానందసంతత్యైనమః' అని చెప్పాలి. ఈ నామాన్ని రెండు సమభాగాలుగా చెప్పకూడదు.

స్వ + ఆత్మ + ఆనంద = స్వాత్మానంద = తనకు సంబంధించిన ఆనందముతో, లవీభూత = లేశమాత్రమైన, బ్రహ్మ + ఆది + ఆనంద సంతతిః - బ్రహ్మాద్యానందసంతతిః = బ్రహ్మానందము, ప్రజాపతి ఆనందము - మొదలైన ఆనందముల సమూహము గలది.

విశ్వ సృష్టికి మూలకారణం ఆనందం (ఆనందో బ్రహ్మేతివ్యజానాత్ - తైత్తిరీయం). ఈ ఆనందం అమ్మవారిది. అంటే, అమ్మవారి ఈ ఆనందం లోంచే విజ్ఞానమయ, మనోమయ, ప్రాణమయ, అన్నమయ కోశాలతో నిండి వుండే సమస్త విశ్వమూ వచ్చింది. ఈ విశ్వంలో కీటక, పక్షి, జంతు, నర, వానర, యక్ష, కిన్నెర, కింపురుష, దేవ, గంధర్వ, త్రిమూర్త్యాదులందరికీ ఎవరికి సంబంధించిన ఆనందం వారి కుంటుంది. వీరందరిలో విడివిడిగా వుండే ఆనందం అమ్మవారి ఆనందంలోని లవలేశ భాగమే!

తైత్తిరీయోపనిషత్తులోని 'బ్రహ్మవల్లి' లేదా 'ఆనందవల్లి' లో రకరకాల ఆనందాల గురించి వాటి మధ్య వుండే సంబంధం గురించి చెప్పబడుతుంది. యువకుడు, సాధుత్వము

గలవాడు, వేదాధ్యయనం చేయువాడు, శిష్టాచార సంపన్నుడు, దృఢవంతుడు, బలవంతుడు, కోరికలు తీరి ఈ భూమిని పాలించువాడును అయిన ఒక మనుష్యుని ఆనందాన్ని 'మానుషానందము' అంటారు. ఈ మానుషానందాన్ని కొలవడానికి ఒక ప్రమాణంగా (Standard unit) తీసుకుంటే ఒక వందమానుషానందాలు ఒక మనుష్య గంధర్వానందానికి, ఒక వందమనుష్య గంధర్వానందాలు ఒక దేవగంధర్వానందానికి, ఒక వంద దేవ గంధర్వానందాలు ఒక చిరలోక లోక పితరుల ఆనందానికి, ఒక వంద చిరలోక లోక పితరుల ఆనందం ఒక ఆ జానజ దేవానందానికి, ఒక వంద ఆజానజదేవానందాలు ఒక కర్మదేవానందానికి, ఒక వంద కర్మదేవానందాలు ఒక దేవానందానికి, ఒక వందదేవానందాలు ఒక ఇంద్రానందానికి, ఒక వంద ఇంద్రానందాలు ఒక బృహస్పతి ఆనందానికి, ఒక వంద బృహస్పత్యానందాలు ఒక ప్రజాపత్యా నందానికి, ఒక వంద ప్రజాపత్యానందాలు ఒక బ్రహ్మానందానికి సమానము అని తైతిరీయంలో చెప్పబడుతుంది. ఇలాంటి బ్రహ్మాది ఆనందాలన్నీ అమ్మవారి ఆనందంలో లేశమాత్రమే' అని ఈ నామం తెల్పుతుంది – అంటే, అమ్మవారి ఆనందం సముద్రం లాంటిదైతే ఆ సముద్రంలో మిగిలిన బ్రహ్మాద్యానందాలు బిందువుల్లాంటి వన్నమాట !

'తన ఆనందంలో లవలేశ మాత్రమే అయిన బ్రహ్మాద్యానందములు కలిగినది' – అని ఈ నామానికి అర్థం.

## 366. పరా

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పరాయైనమః' అని చెప్పాలి.

పరా = పరాస్థితిలోని వాగ్రూపము.

తరుణీ విద్యోపదేశము ఇంతకు ముందు నామంతో పూర్తి అయింది. ఈ నామం నుండి 'శృంగారరస సంపూర్ణా' నామం దాకా ఈ 'తరుణీ విద్య' లో ఉపాసన చేయబడు 'వాగధీశ్వరీ స్వరూపము' గూర్చి చెప్పబడుతుంది.

అవ్యక్తంలోంచి మొట్ట మొదటగా వ్యక్తమయేది 'నాదం'. విశ్వమంతా పంచభూతాత్మకం – ప్రళయ స్థితిలో క్రింది స్థాయి పంచభూతాలైన పృథివి, ఆపస్, తేజస్,

వాయువులు ఐదవ దైన ఆకాశంలోకి లీనమై వుంటాయి. కాని, ఆకాశాన్ని చూస్తే అవి లీనమై వున్నట్లు తెలియదు. అనిపించదు కూడా! ఆకాశం శబ్ద గుణకం కాబట్టి ఆకాశం నుండి మళ్ళీ సృష్టి వ్యక్తమవడానికి ముందు 'శబ్దమే' వ్యక్తమౌతుంది. వాఙ్మయ ప్రపంచంలో ముందుగా మనిషి లోంచి 'నాద' రూపంలో శబ్దం ఉత్పన్నమై, నిశ్వాసను అనుసరించి, సర్వపేటికల మధ్య రాపిడికి గురి అవడంలో 'రేఫాన్ని' కూడ కట్టుకుని, గొంతులోంచి నోటి ద్వారా శబ్దం వ్యక్తమౌతుంది. మనిషిలోంచి నాదం ఎలా వ్యక్తమౌతుందో, పంచభూతాల్లో సూక్ష్మతమమైన ఆకాశంలోంచి నాదం అలాగే వ్యక్తమౌతుంది. అంటే– అటు భౌతిక సృష్టికి, ఇటు వాఙ్మయ సృష్టికి అవ్యక్తం నుండి మొట్టమొదట వ్యక్తమయేది నాదమే! (బైబిల్ లోని జాన్(John) దర్శించిన సృష్టిపర జ్ఞాన సూత్రాలు కూడా ఇవే! (First there was the word. The word was with the God. He uttered forth the word and hence there was the world) 'ఆదిలో ఒక వాక్యముండెను. అది ఆయన చెంతనే వుండెను. ఆయన దానిని ఉచ్చరించగా ఈ ప్రపంచం ఉద్భవించెను' అని తెలుగు అనువాదం) ఈ నాదాన్నే భారతీయులు 'ప్రణవం' లేదా 'ఓంకారము' అన్నారు. అవ్యక్తబ్రహ్మ యందు బిందువుగా వ్యక్తమయే నాదం సాధ్యస్థితిలో(Potential or latent or unmanifested state) వుంటుంది. అంటే – ఈ బిందు వికసనములో – మొదట నాదము, అటుపైన వివిధ స్థితులలో వాక్కు – వ్యక్తమౌతుంది. వ్యక్తం కాబోయే వాక్కు యొక్క వివిధ స్థితులను గూర్చి, ఈ 'వాగధీశ్వరీ' స్వరూప వర్ణనగా ఈ నామం నుండి చెప్పబడుతుంది.

వ్యక్తం కాబోయే సృష్టికి ముందున్న బ్రహ్మను 'పరా' అంటారు. అలాగే, వ్యక్తం కాబోయే వాక్కు ఉచ్చరించబడటానికి ముందు 'బ్రహ్మ' గా, అంటే – 'ఉచ్చరించేవాడు' (Utterer) గా వుంటుందన్నమాట ! ఈ స్థితిలో వున్న వాక్కును 'పరా' స్థితిలోని వాక్కు లేదా 'పరావాక్కు' అంటారు. ఆద్యంతాలు లేకుండా వుండే శబ్దతత్త్వమైన అక్షర బ్రహ్మనాదం అనే పేరుతో ప్రతి జీవిలోను వ్యక్తమయే పరమేశ్వరిని 'పరా' అంటారు.

'వాక్కుగా వ్యక్తం కాబోయే శబ్దతత్త్వ అక్షర బ్రహ్మస్థితిలో నున్న పరావాక్కు' అని ఈ నామానికి అర్థం.

## 367. ప్రత్యక్చితీరూపా

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ప్రత్యక్చితీరూపాయైనమః' అని చెప్పాలి.

ప్రత్యక్ = స్వస్వరూపము యొక్క, చితీ = జ్ఞానమే, రూపా = స్వరూపముగా గలది.

'తనను గురించి తనకు తెలిసే జ్ఞానము యొక్క స్వరూపమే ఇంతకు ముందు చెప్పిన పరావాక్కు యొక్క రూపం' – అని ఈ నామం చెబుతుంది.

'పరావాక్స్వరూపిణి' అని ఈ నామానికి అర్థం.

## 368. పశ్యంతీ

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పశ్యంత్యైనమః' అని చెప్పాలి.

పశ్యంతీ = రెండవస్థితిగా వ్యక్తం కాబోయే వాక్కు.

శబ్దాన్ని ఉచ్చరిద్దామనే సంకల్పం మొట్టమొదట సహస్రార చక్రంలోని కేంద్రబిందువు వద్ద కలుగుతుంది. ఇది పరావాక్కు యొక్క స్థానం. సంకల్పం కలిగిన వెంటనే సుషుమ్న ద్వారా మూలాధార చక్రం వద్ద కార్యరూపంలో జరగటానికి ప్రేరణ జరుగు తుంది. శబ్ద ప్రసారానికి ఒక యానకం(Medium) వుండాలి కాబట్టి, ఈ ప్రేరణ వల్ల ముందుగా హృదయకమలంలోని అనాహత చక్రం వద్ద వాయువు ఉత్పన్నమౌతుంది. ఈ స్థితిని వాక్కు యొక్క 'పశ్యంతీ స్థితి' అంటారు. ఇది బిందువుకు బాహ్యంగా వుండే మొదటి త్రిభుజం చేత శ్రీ చక్రంలో సూచింపబడుతుంది. యాభై మాతృకా వర్ణాలు అవ్యక్తంగా ఇక్కడ వుంటాయి. అంటే, ఈ మాతృకా వర్ణాలన్నీ, 'పశ్యంతీ వాగ్రూపాల'న్నమాట! వీటి ధ్వనులన్నీ వాయురూపంలో ఇక్కడ అవ్యక్తంగా వుంటాయి.

'హృదయకమలంలో ప్రవేశించిన పరావాక్కు యొక్క సూక్ష్మరూపమైన రెండవ స్థితిలోని వాక్కు' – అని ఈ నామానికి అర్థం చెప్పవచ్చును.

## 369. పరదేవతా

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పరదేవతాయైనమః' అని చెప్పాలి.

పరదేవత = పశ్యంతీ వాక్కు యొక్క సూక్ష్మరూపము,

హృదయ కమలంలో ప్రవేశించిన పరావాక్కు యొక్క రెండవ స్థితిలోని పశ్యంతీ వాక్కు యొక్క సూక్ష్మరూపాన్ని 'పరదేవత' అంటారు. ఈ దేవత ఇంద్రియాలతో గ్రహించకలిగేది కాదు. మనస్సుతో మాత్రమే ధ్యానింపతగిన ధ్యేయ స్వరూపము అవడం వలన 'పరదేవత' అన్నారు. సూక్ష్మ స్థితిలో వున్న ఈవిడ వాక్కులే శ్రుతులు, స్మృతులు అవుతాయి. (వేదశాస్త్రమయీ వాణీ యస్యాఃపరదేవతా)

'పశ్యంతీ వాక్కు యొక్క సూక్ష్మరూపము' అని ఈ నామానికి అర్థం.

## 370. మధ్యమా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మధ్యమాయైనమః' అని చెప్పాలి.

మధ్యమా = పశ్యంతీ, వైఖరీ వాక్కులకు 'మధ్య' వుండు స్థితికి సంబంధించిన వాక్కు.

హృదయ కమలంలో పశ్యంతీ స్థితిలో వున్న వాక్కు, అటుపైన తలకు మొండెమునకు 'మధ్యన' వంతెన లాగా వుండే కంఠం వద్ద గల విశుద్ధి చక్రస్థానానికి చేరుతుంది. ఈ స్థితిలో వుండే వాక్కును 'మధ్యమా' అంటారు. ''మరీ 'పశ్యంతీ' అంత సూక్ష్మం కాదు గాని మధ్యమంగా ఉంటుంది'' అని అనటానికి తగ్గట్టుగా వుండే ఈ వాక్ స్థితిని 'మధ్యమా' అన్నారు.

'పశ్యంతీ వాక్కుకు వైఖరీవాక్కుకు మధ్యవుండు స్థితికి సంబంధించిన వాక్కు' – అని ఈ నామానికి అర్థం.

## 369. పరదేవతా

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పరదేవతాయైనమః' అని చెప్పాలి.

పరదేవత = పశ్యంతీ వాక్కు యొక్క సూక్ష్మరూపము,

హృదయ కమలంలో ప్రవేశించిన పరావాక్కు యొక్క రెండవ స్థితిలోని పశ్యంతీ వాక్కు యొక్క సూక్ష్మరూపాన్ని 'పరదేవత' అంటారు. ఈ దేవత ఇంద్రియాలతో గ్రహించకలిగేది కాదు. మనస్సుతో మాత్రమే ధ్యానింపతగిన ధ్యేయ స్వరూపము అవడం వలన 'పరదేవత' అన్నారు. సూక్ష్మ స్థితిలో వున్న ఈవిడ వాక్కులే శ్రుతులు, స్మృతులు అవుతాయి. (వేదశాస్త్రమయీ వాణీ యస్యాఃపరదేవతా)

'పశ్యంతీ వాక్కు యొక్క సూక్ష్మరూపము' అని ఈ నామానికి అర్థం.

## 370. మధ్యమా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మధ్యమాయైనమః' అని చెప్పాలి.

మధ్యమా = పశ్యంతీ, వైఖరీ వాక్కులకు 'మధ్య' వుండు స్థితికి సంబంధించిన వాక్కు.

హృదయ కమలంలో పశ్యంతీ స్థితిలో వున్న వాక్కు, అటుపైన తలకు మొండెమునకు 'మధ్యన' వంతెన లాగా వుండే కంఠం వద్ద గల విశుద్ధి చక్రస్థానానికి చేరుతుంది. ఈ స్థితిలో వుండే వాక్కును 'మధ్యమా' అంటారు. ''మరీ 'పశ్యంతీ' అంత సూక్ష్మం కాదు గాని మధ్యమంగా ఉంటుంది'' అని అనటానికి తగ్గట్టుగా వుండే ఈ వాక్ స్థితిని 'మధ్యమా' అన్నారు .

'పశ్యంతీ వాక్కుకు వైఖరీవాక్కుకు మధ్యవుండు స్థితికి సంబంధించిన వాక్కు' - అని ఈ నామానికి అర్థం.

# 371. వైఖరిరూపా

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'వైఖరీరూపాయైనమః' అని చెప్పాలి.

వైఖరీ రూపా = స్పష్టముగా వ్యక్తమైన వాక్కు.

మూలాధారం నుండి బయలు దేరిన పరావాక్కు అనాహతం ద్వారా ఊర్ధ్వంగా పోతూ పశ్యంతీస్థితిని దాటి మధ్య మాస్థితిలో విశుద్ధిని చేరినపుడు శుద్ధమై, నాలుక, తాలు, ఓష్ఠములు (పెదవులు), శిరస్సు, నాసికాస్థానములందు సుస్పష్టరూపాన్ని పొంది, నాలుక సహాయంతో ముఖం (అంటే-నోరు) ద్వారా ఉచ్చరింపబడి వ్యక్తమౌతుంది. ఈ విధంగా చివరిదశలో సుస్పష్టంగా నోటి ద్వారా ఉచ్చరింపబడిన వాక్కును వైఖరీ స్థితిలో వున్న వాక్కు అంటారు. ఈ నాల్గవస్థితిలో వైఖరీ వాక్కు మాత్రమే ప్రపంచానికి విదిత మవుతుంది. శ్రోతలు వినగలుగుతారు.

'సుస్పష్టముగా ఉచ్చరింపబడి వ్యక్తమైన వాక్కు యొక్క రూపము' అని ఈ నామానికి అర్థం.

దీనిని బట్టి ఇంతవరకు పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ స్థితులలోని నాలుగు వాక్కులలో మొదటి మూడు స్థితులలోని వాక్కును శ్రోతలు వినలేరని నాల్గవ స్థితిలోని వైఖరీ వాక్కును మాత్రమే వినగలుగుతారని అర్థం అవుతోంది. ఈ విషయం సరస్వతీ సూక్తంలో కూడా –

మం. ''చత్వారి వాక్పరిమితా పదాని
తాని విదుర్బ్రాహ్మణాయేమనీషిణః
గుహా త్రీణి నిహితా నేంగయంతి
తురీయం వాచో మనుష్యావదంతి''–

అని చెప్పబడింది. 'వాక్కుకు నాలుగు స్థితులు వుంటాయని విజ్ఞులకు తెలుస్తుంది. వీటిలో మూడు స్థితులలోని వాక్కు గుహలోనే వుంటుంది. బయటకు రాదు. నాల్గవ స్థితిలోని వాక్కునే మనుష్యులు పలుకుతున్నారు'. అని పై మంత్రానికి అర్థం. అంటే –

వాక్ప్రపంచం మొత్తంలో నాల్గవ వంతు మాత్రమే మానవులమైన మనం వింటున్నాం. కాని, వృక్షాలు (Plant Kingdom) పరావాక్కును, పక్షులు – పశ్యంతీ వాక్కును, జంతువులు (Animal Kingdom) మధ్యమా వాక్కును కూడా వినగలవట!

వాక్ప్రపంచంలో నాల్గవ వంతు మాత్రమే మనుష్యులు వినగలరు అన్నట్లు గానే, భౌతిక ప్రపంచం మొత్తంలో నాల్గవ వంతు మాత్రమే మనుష్యులు చూడగలిగేది – మిగిలిన మూడు భాగాలు లోపలే వుంటాయి' అని పురుషసూక్తంలో 'పాదోఽస్యవిశ్వాభూతాని, త్రిపాదస్యా మృతందివి' అన్న ఋక్కులో చెప్పబడుతుంది.

జీవికూడా మాతృగర్భంలో తొమ్మిది నెలలు వుండి, అటుపైన ప్రసవింపబడి భౌతికంగా ప్రపంచంలోకి వ్యక్తమౌతాడు. అంటే – 360 డిగ్రీలు గల వృత్తం(Circle) సూచించే ఒక సంవత్సరాత్మక జీవితంలో మూడు వంతులైన 270 డిగ్రీలు సూచించే తొమ్మిది నెలల జీవిత చరిత్ర – జీవికి గర్భంలో వున్నపుడే జరిగిపోయి, మిగిలిన 90 డిగ్రీలు సూచించే నాల్గవవంతు భాగమైన 3 నెలల కాలం భౌతిక ప్రపంచంలో వ్యక్తమైన జీవిత చరిత్రగా జరుగుతుంది. జీవి గర్భంలో ఉన్నపుడు జరిగిన కాలం 9 నెలలకు సమానమైన 270 రోజులు దేవమానంలో జరుగుతాయి కాబట్టి, మనుష్య మానంలో 270 సంవత్సరాలకు సమానమౌతాయి. అలాగే, బయటకు వ్యక్తమైనపుడు జరిగే మిగిలిన 3 నెలలకు సమానమైన తొంభై రోజులు – తొంభై సంవత్సరాల కాలానికి సమానం. ఈ తొంభై సంవత్సరాలు జీవికి సుమారు ఆయుర్దాయముగా సమన్వయపరచుకోవాలి. అంటే – ఈ సందర్భంలో కూడా మూడు వంతుల జీవికథ గర్భంలోనే, మనం చూడని స్థితిలో జరిగి, మిగిలిన నాల్గవ వంతు కథను మాత్రమే ప్రపంచంలో చూడటం జరుగుతోందన్నమాట!

కృష్ణచరిత్రను తెల్పే భాగవతంలో గూడా ద్వాదశ మాసాత్మక పురుషుడైన వాసుదేవుని తొమ్మిది స్కంధాల జీవితకథ దేవకీ గర్భంలోనే జరిగి, పదవ స్కంధారంభంలో భౌతిక ప్రపంచంలోకి కృష్ణుడు ప్రసవింపబడి, మిగిలిన మూడు స్కంధాల జీవితకథ భౌతిక కక్ష్యలో జరుగుతుంది. అంటే, ఈ సందర్భంలో కూడా మూడు వంతుల కథ గర్భంలోనే జరిగి, నాల్గవ వంతు కథ మాత్రమే భౌతికంగా జరుగుతోందని తెలుస్తోంది కదా! నాలుగు నెలల కాలం గర్భంలో వున్నపుడు పిండానికి (Foetus) ప్రతినెలలోను జరిగే మార్పులకు

సంబంధించిన కథలు ఆయా స్కంధాలలో చెప్పబడతాయి. ఉదా – మూడవ నెలలో వున్న జీవికి సంఖ్యల గురించిన ప్రజ్ఞ వికసిస్తుంది. అందుకు తగ్గట్టుగా మూడవ స్కంథంలో 'కపిలుడు దేవహూతికి సాంఖ్యమును వివరించుట' అనే కథా భాగం వుంటుంది. పదవనెలలో జరిగే కృష్ణుని జననం దశమ స్కంథంలో వుంటుంది.

భౌతిక ప్రపంచంలో ప్రతి వస్తువునిగాని, వ్యక్తిని గాని నిర్దేశించడానికి ఒక ఉనికికి సంబంధించిన బిందువు (Location), దూరము (Distance) లేదా ఎత్తు, వైశాల్యము (Area), పరిమాణము (Volume) వుంటాయి. అయినా ప్రపంచంలో వ్యక్తిని గాని, వస్తువును గాని చూస్తున్నపుడు పరిమాణమే కనబడుతుంది కాని – మిగిలిన మూడు అంశాల గురించి భావనలోకి రాదు. అవి నేపథ్యంలోనే వుండి పోతాయి. పరిమాణమే ఎదురుగా భాసిస్తుంది. అంటే – ఈ సందర్భంలో గూడా మూడు వంతులు నేపథ్యంలోను, నాల్గవవంతు మాత్రమే చూడబడే స్థితిగాను వున్నదన్నమాటే గదా!

వాక్కుకు సంబంధించిన నాలుగుస్థితులను ఆధునిక మానవునికి గాని, శాస్త్రజ్ఞునికి గాని అర్థమయేలాగా చెప్పాలంటే క్రింది ఉదాహరణ చెప్పుకోవచ్చును.

ఒకడు ఒక పుస్తకాన్ని చూశాడు. వెంటనే ఇది ఒక పుస్తకము అని చెబుదామనుకున్నాడు. ఇలా చెబుదామనుకున్న సంకల్పం ఉచ్చరించే వాడి రూపంలో వుంది. ఈ స్థితిలోని వాక్కును 'పరా' వాక్కు అంటారు. దీన్ని 'సంకల్పం' గా గాని 'ఉచ్చరించేవాడు' (బ్రహ్మ) గా గాని సమన్వయ పరచుకోవచ్చును.

సంకల్పం కలగంగానే దాన్ని ఒక 'భావం' లోకి మార్చుకోడం జరుగుతుంది. భావంలోకి మార్చబడిన వాక్కును 'పశ్యంతీ వాక్కు' అంటారు.

భావంలోకి మార్చబడిన దాన్ని వ్యక్తం చెయ్యడానికి 'సంకేతాలతో' ఒక 'భాష' లోకి మార్చుకోడం జరుగుతుంది. మనస్సులోనే జరిగే ఈ సంకేతాల భాషారూపంలో వున్న వాక్కును 'మధ్యమావాక్కు' అంటారు.

మనస్సులో ఒక భాషలో వున్న వాక్కును భౌతికంగా నోటితో ఉచ్చరిస్తే – అప్పుడు వ్యక్తమయే వాక్కును 'వైఖరీ వాక్కు' అంటారు. ఈ స్థితిలో వున్న వాక్కునే ఎదుటివారు వినగలరు. ఇంతకు పూర్వం మూడు స్థితులలోని వాక్కును వినలేరు. ఈ నాలుగు స్థితులను వరుసగా –

పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ వాక్ స్థితులంటారు.

పరాస్థితిని – సంకల్పము గాను, పశ్యంతీ స్థితిని – భావము గాను, మధ్యమాస్థితిని సంకేతము గాను, వైఖరీ స్థితిని – ఉచ్చారణ గాను – సమన్వయపరచుకోవచ్చును. వీటినే ఆంగ్లంలో – Will, Concept or import, Code and utterance స్థితులు (States)గా అర్థం చేసుకోవాలి.

పురాణాల్లో – ఉచ్చరించే వాడిని బ్రహ్మతోను, ఉచ్చరింప బడుతున్నదాన్ని సరస్వతి తోను (ప్రవాహంగాను), వారి వాహనాన్ని 'సోహం' శ్వాసలో వున్న హంస (హంసో) గాను సంకేతిస్తారు. వారిద్దరి సంభాషణమే ఈ సృష్టిగా వ్యక్తమౌతుందని చెబుతారు.

ముఖం ద్వారా (వ్యక్తమయే) ఒక పదం, రెండు పదాలు, నాలుగు పదాలు, ఎనిమిది పదాలు ... ఇలా అనేక అక్షరాల రూపంలో వ్యక్తమయే వాక్కును 'గౌరీదేవి' తో పోలుస్తారు. ఈ భావనే గౌరీదేవికి సంబంధించిన మంత్రంలో – ''గౌరీర్మిమాయ సలిలానితక్షత్యేక పదీ, ద్విపదీ సాచతుష్పదీ, అష్టాపదీ, నవపదీ, బభూవుషీ సహస్రాక్షరా పరమేవ్యోమన్'' – అని చెబుతారు.

'గౌః' అంటే వెలుగు అని అర్థం – 'గౌరి' అంటే లోపల వున్న అర్థాన్ని బయటకు వెలుగుగా ఇచ్చునది అని అర్థం.

'వాగ్దేవి' గా అమ్మవారికి సంబంధించిన ఈ నాలుగు నామాలకు ఇలా ఎన్నో రకాల సమన్వయం వుందని గ్రహించాలి.

## 372. భక్తమానసహంసికా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'భక్తమానసహంసికాయైనమః' అని చెప్పాలి.

భక్త = భక్తుల యొక్క, మానసా = మనస్సులందు విహరించు, హంసికా = ఆడు హంస.

'మానస' అంటే మనస్సు లేదా మానస సరోవరం. భక్తులు అమ్మవారి ధ్యానంలో వున్నపుడు – వాళ్ళ మనస్సులనే సరోవరాల్లో అమ్మవారు ఆడుహంసలాగా విహరిస్తుందిట.

మనస్సు చంచలంగా కాకుండా స్థిరంగా వుంటే అది మానస సరోవర మవుతుంది. అప్పుడు ఆ మనస్సులో నిలచిన 'శ్వాస' 'హంస' అవుతుంది. ఇది యోగాభ్యాసంలో ఒక స్థితి.

ఒక్కొక్కపుడు ఈ స్థితిలో మన ప్రమేయం లేకుండానే శ్వాస తాత్కాలికంగా నిలుస్తుంది. మన ప్రమేయం వుండి శ్వాస ఆగడాన్ని 'శ్వాసనిలుపుట' అనాలి గాని – 'శ్వాస నిలుచుట' – అనకూడదు. ఈ రెంటికీ భేదం వుంది. శ్వాస నిలుచుట – స్టేషన్‌లో రైలు ఆగడం లాంటిది. శ్వాస నిలుపుట – దొంగలు రైలు ఆపడం లాంటిది. ఇలా శ్వాస నిలిచిన స్థితులలో ద్రష్ట, దృష్టి, దృశ్యము, లేదా జ్ఞానము, జ్ఞేయము, జ్ఞాత ఏకమై వుంటాయి.

'భక్తుల యొక్క మనస్సరస్సులలో ఆడు హంసగా విహరించునది' – అని ఈ నామానికి అర్థం.

## 373. కామేశ్వరప్రాణనాడీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కామేశ్వర ప్రాణనాడ్యై నమః' అని చెప్పాలి.

కామేశ్వర = శివుని, ప్రాణనాడీ = ప్రాణనాడీ స్వరూపిణి. నరాలు రాగి తీగలలాంటివి. వాటి గుండా విద్యుత్ ప్రవహిస్తేను, ప్రవహించకపోతేను ఉండే తేడా దేనివల్ల అయితే వస్తుందో దానిలాంటిది 'నాడి' అనాలి. శవానికి నరాలుంటాయి కాని నాడీమండలం పనిచెయ్యదు. కాబట్టి, నాడీమండలం సూక్ష్మమైందే కాని స్థూలమైన పదార్థంతో చేయబడి వుండదు (ప్రథమ భాగంలో – అనుబంధంలోని 'నాడులు' శీర్షిక చదవండి)

(Habituated pulsation leads to the formation of Nerves ఈ నాడులు అయస్కాంత బలరేఖల (Magnetic lines of force) లాంటివి అన్నమాట.

సృష్టికి ఉన్ముఖంగా పరావాక్కు బయలుదేరితే అది వచ్చే త్రోవను 'కామేశ్వర ప్రాణనాడీ' అనవచ్చును. ఈనాడి లేకపోతే – శివుడు – శవమౌతడు, కదలలేడని, సృష్టిని

ప్రభవించలేడని ఆదిశంకరులు సౌందర్యలహరిలోని మొదటి శ్లోకంలో అంటారు. (శివఃశక్త్యాయుక్తో .. నఖలు కుశలః స్పందితుమపి)

ఈ కామేశ్వర ప్రాణ నాడికి సంబంధించిన పరావాక్కే తైత్తిరీయంలో 'సోఽకామయత ... బహుస్యాం ప్రజాయేయేతి' అని చెప్పబడింది.

'కామేశ్వరుని ప్రణాళికకు ప్రాణనాడి (అతి ముఖ్యమైనది) వలె నుండునది' – అని ఈ నామానికి అర్థం.

## 374. కృతజ్ఞా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కృతజ్ఞాయై నమః' అని చెప్పాలి.

కృతజ్ఞా = చేయబడే పనులన్నీ తెలిసినది.

ఎప్పుడు ఎవరు ఏ పని, ఎలా చేశారో, చేస్తున్నారో అన్నీ తెలిసినది. అంటే – ప్రాణులు చేసే పాప పుణ్యాలన్నీ ఎప్పటికప్పుడు తెలుసుకునేది. ఇందుకు అమ్మవారికి కొంతమంది నమ్మకంగా పనిచేసే సాక్షులున్నారు. వాళ్ళను గూర్చి –

''సూర్యస్సోమోయమః కాలోమహాభూతాని పంచచ
ఏతేశుభాశ్శుభస్యేహ కర్మణో నవసాక్షిణః''.

అనే శ్లోకం వివరిస్తుంది. 'సూర్య, చంద్ర, యమ, కాల, పంచ భూతాలు అనే తొమ్మిది మంది సాక్షుల ద్వారా ఎప్పటికప్పుడు, ప్రాణులు చేసే మానసిక, శారీరిక దుష్కృత్య, సుకృత్యాలన్నీ తెలుస్తాయి' అని పై శ్లోకార్థం. ఈ అర్థంలో అమ్మవారు 'కృతజ్ఞా'. ఎవరు ఏవిధంగా అర్చించినా, వారు చేసిన పనులను బట్టి, చేసిన వారి ఉద్దేశ్యాలను బట్టి (Motives) వారికి అవసరమయే వాటిని, అవసరమైన సమయాల్లో సమకూర్చడంలో మరుపు లేకుండా గుర్తుపెట్టుకునేది కాబట్టి అమ్మవారు 'కృతజ్ఞా'.

1) అందరూ చేయు అన్ని విధములైన కృత్యములను గూర్చి తెలిసినది.

2) చేసిన పనిని బట్టి ప్రతిఫలమును సమకూర్చునది – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 375. కామపూజితా

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారిని పూజించేటప్పుడు 'కామపూజితాయై నమః' అని చెప్పాలి.

కామ = కామునిచే, పూజిత = పూజింపబడునది.

'కాముడు' అంటే శివుడు, మన్మథుడు, కోర్కెలు కలవాడు అని మూడురకాల అర్థాలు వున్నాయి.

కామేశ్వరుడు జగజ్జననిని పూజించి తన జగత్సృష్టి కార్యక్రమాన్ని ప్రారంభించాడు కాబట్టి అమ్మవారు - కామ పూజితా. పిల్లవాడైనా శరీరం లేకపోయినా, మన్మథుడైన కాముడు అమ్మవారిని ఆరాధించి ఆమె అనుగ్రహాన్ని పొంది ముల్లోక వాసులను గూడా జయించకల సామర్థ్యాన్ని పొందాడు. (హిమగిరిసుతే కామపికృపాం అపాంగాత్తేలబ్ద్వా... జగదిదమనంగో విజయతే...' (సౌందర్యలహరి - ఆదిశంకరులు) అందుచేత అమ్మవారు కామపూజితా.

కోర్కెలు కలవారిని 'కాము' లంటారు. వారందరూ తమ కోర్కెలు తీరడం కోసం అమ్మవారిని పూజిస్తారు. అందుచేత అమ్మవారు 'కామపూజితా'.

1) శివునిచే పూజింపబడునది.

2) మన్మథునిచే పూజింపబడునది.

3) కోర్కెలు గల వారిచే పూజింపబడునది - అని ఈ నామానికి అర్థాలు చెప్పుకోవచ్చును.

## 376. శృంగారరససంపూర్ణా

ఎనిమది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'శృంగార రససంపూర్ణాయైనమః' అని చెప్పాలి.

శృంగ + ఆర + రస = శృంగారరస = శీర్షములతోను, కోణములచేతను, నవరసాదినావముల చేతను, సంపూర్ణ = (కూడి) నిండుగా వున్నది.

'శృంగము' అంటే కొమ్ము, కోణము లేదా శీర్షము(Apex or vertex) 'ఆర' అంటే కోణము (Angle) లేదా మూల (Corner) లేదా దళ, 'రస' అంటే నవరస సంబంధమైన వాటితో, సంపూర్ణా = సంపూర్ణత్వము చెల్లునది. శ్రీ చక్రం శీర్షాలు, త్రిభుజాలు, కోణాలు ఆవరణాలు వాటి వాటి వద్ద వుండే శృంగార రసాధిదేవతలతో నిండుగా వుంటుంది. (శ్రీ చక్రంలో నవావరణల వద్ద వుండే నవరసాధి దేవతా నామాలు ప్రథమ భాగం అనుబంధంలో తెలుపబడ్డాయి).

శృంగార రసం రసాలకు రాజు వంటిది. అంటే, శృంగారరసం వల్ల వచ్చే ఆనందం అంతటి దన్నమాట ! అందుకే ఈ శృంగార రసాన్ని 'బ్రహ్మానందము' తో సమతూగ గలదానిగా చెబుతారు. కాబట్టి; అట్టి 'బ్రహ్మానందముతో ఎల్లప్పుడూ నిండి వుండునది' అని ఇంకో అర్థం చెప్పుకోవచ్చును.

1) కోణ, దళ, నవావరణ రసదేవతా సమన్వితమైన శ్రీ చక్ర సంపూర్ణ స్వరూపము.

2) బ్రహ్మానందముతో నిండి వుండునది - అని ఈ నామానికి అర్థాలు చెప్పుకోవచ్చును.

## 377. జయా

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'జయాయైనమః' అని చెప్పాలి.

జయ = జయస్వరూపిణి.

అమ్మవారికి అన్నిటిలోనూ జయమే కాని అపజయం లేదు. చివరకు మృత్యువును గూడా జయించినది అమ్మవారు. తనపై తనకు ఆధిపత్యము సంపాదిస్తే అటుపైన ఇతరుల పైన గూడా ఆధిపత్యం వస్తుంది. వీటినే 'విజయము' - 'జయము' అంటారు. అమ్మవారికి ఈ రెండూ వున్నాయి ( ఇంతకు పూర్వం వచ్చిన 'విజయా' నామంలో వివరణ చదవాలి).

తనను అర్చించిన వారికి జయాన్ని ప్రసాదిస్తుంది కాబట్టి, అమ్మవారు 'జయా'.

1) అపజయము లేనిది.

2) అర్చించిన వారికి జయాన్ని ప్రసాదించునది – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

ఈ 'జయా' అనే అమ్మవారు శ్రీ చక్రంలోను, మనలోను వుండే స్థానాలు రాబోయే ముందు మూడునామాల్లో చెప్పబడుతాయి.

## 378. జాలంధరస్థితా

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'జాలంధరస్థితాయైనమః' అని చెప్పాలి.

జాలంధర = జాలంధరసూచిత, స్థిత = స్థానమునందున్నది.

శ్రీ చక్రంలోని వసుకోణ దశార యుగ్మ మన్వస్రముల సమూహానికి 'జాలంధర పీఠ' మనే సంకేతం వుంది. ఇది మనలో అనాహత చక్రస్థానంలో వుంటుంది. ఇక్కడ వుండే అమ్మవారిని 'జాలంధరస్థితా' అంటారు.

## 379. ఓడ్యాణపీఠనిలయా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ఓడ్యాణపీఠనిలయాయైనమః' అని చెప్పాలి.

ఓడ్యాణ పీఠ = ఓడ్యాణ పీఠమునందు, నిలయా = ఉన్నది.

శ్రీ చక్రంలోని కేంద్రం వద్ద గల త్రిభుజాన్ని 'ఓడ్యాణపీఠస్థానం' అంటారు. ఇది మనలో ఆజ్ఞా చక్ర స్థానంలో వుంటుంది. ఇక్కడ వుండే అమ్మవారిని 'ఓడ్యాణ పీఠనిలయా' అంటారు.

(ఎడమమోకాలు ఎడమ చంకలో బిగించి, కుడికాలు జాపి కూర్చునే స్థితిని 'ఓడ్యాణబంధం' అంటారు. ఇది – యోగివేమన కూర్చునే స్థితికి దగ్గరగా వుంటుంది.)

## 380. బిందుమండలవాసినీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'బిందుమండలవాసిన్యైనమః' అని చెప్పాలి.

బిందుమండల = బిందువును పరివేష్టించి యుండు స్థానము, వాసినీ = వసించునది.

శ్రీ చక్రంలోని కేంద్రగతమైన బిందువు సర్వానందములకు, సర్వచక్రాలకు, మాతృకావర్ణాలకు కారణ స్వరూపము. ఇక్కడ వసించే అమ్మవారిని 'బిందు మండలవాసినీ' అంటారు.

మనలో బ్రహ్మరంధ్రానికి క్రిందుగా వుండే చంద్రమండలాన్నే బిందుమండలం అంటారు. అక్కడ వుండే అమ్మవారినే 'బిందుమండల వాసినీ' అంటారు.

జాలంధర, ఓడ్యాణపీఠ, బిందుమండలాలు సూచించే స్థానాలు వరుసగా ప్రేమకు, జ్ఞానానికి, ఆనందానికి నిలయాలు. ఇవే – హృదయము, భ్రూమధ్యము, బ్రహ్మరంధ్ర ప్రాంతాలు. వీటినే సత్, చిత్, ఆనంద స్థితులుగా సమన్వయ పరచుకోవచ్చును.

## 381. రహోయాగక్రమారాధ్యా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'రహోయాగక్రమారాధ్యాయై నమః' అని చెప్పాలి.

రహోయాగ = ఒంటరిగా చేయు యాగ పద్ధతిలో, క్రమ = క్రమముగా, ఆరాధ్యా= ఆరాధింపబడునది.

ఒంటరిగా చేయు యాగం అనంగానే ఏవేవో అశ్లీలార్థాలతో వామాచారులు ఈ నామం యొక్క అసలు అర్థానికి దూరమై, సమయాచర పద్ధతులకు దూరమయ్యారు.

విశ్వం మొత్తాన్ని 'ఒక్కడిగా' చూచే స్థితిని ఒంటరితనంగా అర్థం చేసుకోవాలి. దీన్నే 'అనన్య' స్థితి అంటారు. అంటే, ఆ ఒక్కడూ తప్ప ఇతరమంటూ ఏమీలేని స్థితి. అంతేగాని విశ్వంలో తాను ఒంటరిగా వున్న స్థితికాదు. అనన్య స్థితిలో చేసే యాగాన్ని

'రహోయాగం' అంటారు. పిండాండములో శ్రీ చక్ర భావన చేసి, ఆయా ఆవరణ దేవతలు, వారి పరివార దేవతలు, ఆ – ఆవరణలు, చక్రములు, దళాలు అన్నిటినీ ఒక క్రమపద్ధతిలో ఆరాధించే విధానాన్ని 'అంతర్యాగం' అంటారు. ఈ అంతర్యాగ శ్రీ చక్రార్చనే 'రహోయాగం' ఔతుంది. పిండాండ, శ్రీ చక్రాలను సమన్వయ పరుస్తూ అన్ని విషయాల్లోను అభేదాన్ని దర్శించి చేసే యాగం ఇది. ఈ విధంగా చేసే యాగం అమ్మవారికి ఇష్టంగూడా! ('అంతర్ముఖ సమారాధ్యా' అనే నామం తర్వాత వస్తుంది).

'అనన్యభావంతో క్రమమైన పద్ధతిలో ఆరాధింపబడునది' అని ఈ నామానికి అర్థం.

## 382. రహస్తర్పణతర్పితా

ఎనిమిది అక్షరాల నామం. ఈనామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'రహస్తర్పణ తర్పితాయైనమః' అని చెప్పాలి.

రహస్ = రహస్యముగా చేయు, తర్పణ = తర్పణలచే, తర్పితా = తృప్తి చెందునది.

పైన తెలిపిన రహోయాగంలో ఆయా ఆవరణ దేవతలకు, వారి పరివార దేవతలకు చేసే పూజాంగ తర్పణలకు తృప్తి చెందిన అమ్మవారిని 'రహస్తర్పణతర్పితా' అంటారు.

ధ్యానంలో 'శ్వాస' రాను రాను 'ఓం' గా మారితే 'ఈ' రహస్తర్పణ జరుగుతుంది. ఈ స్థితిలో ''శ్వాసలోని ఉచ్ఛ్వాస – నిశ్వాసలనే భర్త – భార్యల మధ్య వ్యత్యాసం, తగ్గి ఏకమై అనన్య స్థితి వస్తుంది''. అని చెప్పే ఆధ్యాత్మిక 'శ్వాస దాంపత్యాన్ని' రహస్తర్పణగా అర్థం చేసుకోవాలి.

సౌందర్యలహరిలో ఆది శంకరులు – తొమ్మిదవ శ్లోకం అయిన 'మహీంమూలాధారే .... సహరహసిపత్యావిహరసే' – అన్నచోట 'కుండలినీ శక్తి అనే అమ్మవారు సహస్రారం లోని శివునితో ఏకాంతంగా, రహస్యంగా కలిసిపోయి విహరిస్తుంది' – అని చెప్పుకోవడంలో కూడా ఇదే విధమైన భావాన్ని గ్రహించాలి.

'రహోయాగ తర్పణలకు తృప్తి చెందునది' అని ఈ నామానికి అర్థం.

## 383. సద్యఃప్రసాదినీ

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సద్యః ప్రసాదిన్యైనమః' అని చెప్పాలి.

సద్యః = తక్షణములోనే, ప్రసాదినీ = అనుగ్రహించునది.

ప్రతిరోజూ రాత్రినిద్రలో మనలోని జీవేశ్వర ప్రజ్ఞ సర్వేశ్వర ప్రజ్ఞలోకి లీనమైన తక్షణమే సుషుప్తానందాన్ని (నిద్రాసుఖానుభూతిని) పొందుతున్నట్లుగా ఈ నామాన్ని అర్థం చేసుకుంటే –

'రహోయాగ క్రమారాధనచే తృప్తిచెందిన క్షణంలోనే అనుగ్రహమును ఇచ్చునది' అని ఈ నామానికి అర్థం చెప్పుకోవచ్చును. అంటే ఆంగ్లంలో ఈ ప్రసాద గుణాన్ని – 'Instant result giving nature' అంటారు.

## 384. విశ్వసాక్షిణీ

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'విశ్వసాక్షిణ్యైనమః' అని చెప్పాలి.

విశ్వ = విశ్వములోని (కృత్యములకు) సాక్షిణీ = ఒకే ఒక సాక్షి.

విశ్వంలో జరిగే పనులన్నిటికీ ఒకే ఒక సాక్షి అమ్మవారు. కొన్ని కొన్ని పనులకు కొందరు కొందరు సాక్షులుండవచ్చుగాని, అన్ని పనులకు వుండలేరు. ప్రళయం వచ్చినపుడు ఆ ప్రళయానికి సాక్షి ఎవరు? విశ్వాన్ని సృష్టించి, పాలించి, తనలోకి లీనం చేసుకునే అమ్మవారు తప్పితే సాక్షి ఎవరుంటారు? అందుకని అమ్మవారు 'విశ్వసాక్షిణి'.

'విశ్వములోని కృత్యములకు ఒకే ఒక సాక్షిణి' – అని ఈ నామానికి అర్థం.

## 385. సాక్షివర్జితా

అయిదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సాక్షివర్జితాయైనమః' అని చెప్పాలి.

సాక్షి = సాక్షి, వర్జితా = లేనిది.

ప్రళయంతో సహా అన్ని వేళలా విశ్వానికంతకూ అమ్మవారే సాక్షి అన్నపుడు అటువంటి అమ్మవారికి మరల ఇంకొక సాక్షి ఎవరుంటారు? అందుకనే – వర్జింపబడిన అంటే – లేకుండా చేయబడిన సాక్షి గలది' అంటే – 'తనకు సాక్షిగా వేరే ఎవరూ లేనిది' అని ఈ నామానికి అర్థం.

## 386. షడంగదేవతాయుక్తా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'షడంగదేవతాయుక్తాయైనమః' అని చెప్పాలి.

షట్ + అంగదేవత = ఆరు అంగదేవతలతో, యుక్తా = కూడి వున్నది.

'అంగములు' అనగానే వేదాంగాలు గుర్తుకు వస్తాయి. అమ్మవారు వేద స్వరూపిణి కాబట్టి – శిక్షా, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము – అను ఆరు వేదాంగాలతో అమ్మవారు – 'షడంగ దేవతాయుక్త' అవుతుంది.

అలాగే అంగన్యాసంలో చెప్పే హృదయం, శిరస్సు, శిఖ, కవచము, నేత్రము, అస్త్రము – అనే షడంగాలతో గూడా అమ్మవారు 'షడంగదేవతాయుక్త' ఔతుంది.

ఇలా 1) అంగదేవతలు 2) ఆయుధ దేవతలు 3) ఆవరణ దేవతలు 4) నిత్యా దేవతలు 5) ఆమ్నాయ దేవతలు 6) పరివార దేవతలను గూడా కూడి వుంటుంది.

'ఆరు రకముల అంగదేవతలతో కూడి వుండునది' అని ఈ నామానికి అర్థం.

## 387. షాడ్గుణ్య పరిపూరితా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'షాడ్గుణ్యపరిపూరితాయైనమః' అని చెప్పాలి.

షాడ్గణ్య = ఆరు విధములైన గుణములచే, పరిపూరితా = పుష్కలముగా నిండి యుండునది.

షడ్గుణాలు అంటే ఆరు గుణాలు. మహానిర్వాణ తంత్రంలో వీటిని - 1) భూతదయ 2) దానము 3) వైరాగ్యము 4) సమబుద్ధి 5) నిర్మోహమాటము 6) ముముక్షత - అనే ఆరు గుణములుగా చెబుతారు. ఈ ఆరు గుణాలతో పుష్కలంగా నిండి వున్నది అమ్మవారు. లేదా, పురాణాల్లో, 1) ఐశ్వర్యము 2) వీర్యము 3) యశము 4) శ్రీ 5) జ్ఞానము 6) వైరాగ్యము - ఈ ఆరింటిని షడ్గుణాలుగా చెబుతారు. ఈ ఆరుగుణాలు పుష్కలంగా నిండి వున్నది అమ్మవారు.

'శృంగారరససంపూర్ణా' నామం నుండి 'షాడ్గుణ్యపరిపూరితా' నామం వరకు రహోయాగ విశేషాలు చెప్పబడినవి. ఇక రాబోయే 'నిత్యక్లిన్నా' నామం నుండి 'భక్తహార్దతమో భేద భానుమద్భానుసంతతిః' అనే నామం వరకు ' తరుణీ విద్య'కు అంగభూతమైన 'ప్రభావిద్య' గురించి చెప్పబడుతుంది.

## 388. నిత్యక్లిన్నా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కారంచేసేటప్పుడు 'నిత్యక్లిన్నాయైనమః' అని చెప్పాలి.

నిత్య = ఎల్లప్పుడూ, క్లిన్నా = దయార్ద్రతతో తడుపబడి యుండునది.

అమ్మవారి దాక్షిణ్యానికి అవధులు లేవు. 'అరుణాం కరుణాతరంగితాక్షీం''... అని ధ్యానశ్లోకంలో అమ్మవారి దయాగుణమే మొదట్లో చెప్పబడింది. ఆ దయాగుణానికి సంబంధించినదే ఈ నిత్య క్లిన్నా నామం. ఖేదము - ఖిన్నము అయినట్లే, స్వేదము - స్విన్నము అయినట్లే. క్లేదము - క్లిన్నము ఔతుంది. అంటే - 'క్లిన్నా' అనేది 'క్లేదా'నికి Past participle అన్నమాట! 'క్లిన్నా' అంటే - 'నీళ్ళతో తడపబడటం' అని అర్థం. అయితే ఇక్కడ నీళ్ళని మనం మామూలుగా వాడుకునే నీళ్ళలాగా అర్థం చేసుకోకూడదు.

కరుణ - హృదయం నుండి పొర్లిపోయి, ఆ కరుణాజలంతో, ఆకార నామరూపాలతో వుండే అమ్మవారు మొత్తం తడిసిపోతే - ఆ స్థితిలోని అమ్మవారిని 'నిత్యక్లిన్నా' అనాలి.

('నిత్యక్లిన్నా - మదద్రవా' అనే మంత్రాన్ని శ్రీ విద్యలో 'చండాలినీ' అనే మంత్రంగా చెబుతారు. 'చండాలిక' అన్నది ఒక వీణ పేరు. సొరకాయ (ఆనపకాయ) బుఱ్ఱలు రెంటి మధ్య కఱ్ఱ పెట్టి తంత్రికతో వాయిస్తే అది 'చండాలిక' ఔతుంది. దీన్ని కొన్ని నిమ్నజాతుల వాళ్ళు వాయించుకునే వారు. అందుకనే ఆ నిమ్న జాతుల వారికి 'చండాలురనే' పేరు వచ్చింది).

భక్త జనులకు భుక్తిముక్తులను సమకూర్చేది నిత్యక్లిన్నా అనే పేరుతో పిలువబడే త్రిపురాంబయే – అని గరుడపురాణంలో చెప్పబడింది.

నిత్యాదేవతలలో శుక్ల పక్ష తృతీయ నాటి నిత్యాదేవత పేరు 'నిత్యక్లిన్నా'. అమ్మవారు ఈ దేవతా స్వరూపమే కాబట్టి – నిత్యక్లిన్నా అని చెప్పబడింది.

'ఎప్పుడూ దయార్ద్రతతో తడుపబడి ఉండునది' అని ఈ నామానికి అర్థం.

## 389. నిరుపమా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'నిరుపమాయైనమః' అని చెప్పాలి.

నిర్ + ఉపమా = నిరుపమా = పోల్చి చెప్పుటకు ఉపమానము ఏమియు లేనిది.

అమ్మవారికి సంబంధించిన ఏ ఒక్క గుణ సంబంధ విషయానికైనా రూప సంబంధ విషయానికైనా, బలసామర్థ్య సంబంధ విషయాలకైనా పోలిక చెప్పడానికి ఏమీ లేవు. అన్నీ అమ్మవారిలోంచి వచ్చి, అమ్మవారిచే పాలింపబడి, అమ్మవారిలోనికి లీనమయేవే అయితే – అమ్మవారిని పోల్చడానికి ఏ విషయమైనా, ఏ వస్తువైనా ఎలా పనికి వస్తుంది ? (Parts will never be equal to whole) అందుకని అమ్మవారు 'నిరుపమా'

'పోల్చి చెప్పుటకు ఉపమానము ఏమియు లేనిది' అని ఈ నామానికి అర్థం.

## 390. నిర్వాణ సుఖదాయినీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'నిర్వాణ సుఖదాయిన్యై నమః' అని చెప్పాలి.

నిర్ + వాన = నిర్వాణ = సర్వనివృత్తి రూపమైన బ్రహ్మపద ప్రాప్తి లేక మోక్ష సంబంధమైన, సుఖ = ఆనందమును, దాయినీ = ఇచ్చునది.

ఏ దేవత అయినా ప్రసాదించ గల పరిమితమైన, తాత్కాలికమైన ఐశ్వర్య భోగాది లౌకిక సుఖాలను, స్వర్గాది సుఖాలనే గాకుండా 'అనంతానందానుభూతి అయిన మోక్షాన్ని గూడా అనుగ్రహించగలది అమ్మవారు.

'మోక్షానందాన్ని ప్రసాదించునది అమ్మవారు' అని ఈ నామానికి అర్థం.

## 391. నిత్యాషోడశికారూపా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'నిత్యాషోడశికారూపాయై నమః' అని చెప్పాలి.

నిత్యా = నిత్యాదేవతలగానున్న, షోడశికారూపా = పదహారు కళల రూపము

నిత్యా దేవతలు పదహారు మంది ఉంటారు. చంద్రుని పదహారు కళలకు సంబంధించిన పదహారు తిథులను సూచించే దేవతలే నిత్యాదేవతలు. అమ్మవారు షోడశ కళాప్రపూర్ణురాలు కాబట్టి, ఈ పదహారు నిత్యలు అమ్మవారి కాంతి విభూతులే ! (ఈ నిత్యాదేవతల పేర్లు, తిథులతో వాటికి కల సంబంధము ప్రథమభాగంలోని అనుబంధంలో తెలుపబడినది)

15 తిథులకు సంబంధించిన 15 నిత్యా దేవతల రూపంతో ఉండే పదహారవ నిత్యపేరు, 'షోడశీనిత్యా' అని గూడా అంటారు. 'నిత్యలలో షోడశీనిత్యారూపంలో ఉండునది' అని కూడా ఈ నామానికి అర్థం చెప్పుకోవచ్చును.

'పదహారు నిత్యాదేవతలను తన స్వరూపముగా గలది' అని ఈ నామానికి అర్థం.

# 392. శ్రీకంఠార్ధశరీరిణీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'శ్రీకంఠార్ధ శరీరిణ్యైనమః' అని చెప్పాలి.

శ్రీ కంఠ = శివుని, అర్ధ = సగము, శరీరిణీ = శరీరముగా నున్నది.

అణువు దగ్గర నుండి బ్రహ్మాండం దాకా ప్రకృతీ పురుషుల సమ్మేళనమే అని భారతీ వాఙ్మయము చెబుతుంది. పదార్థమంతా పరమాణు సంచయు మేననీ, ఆ పరమాణువులన్నీ ధనాత్మక ఋణాత్మక ఆవేశకణ సముదాయమేననీ విజ్ఞాన శాస్త్రం చెబుతుంది. 'శ్రీకంఠార్ధశరీరిణీ' అనే నామం ఈ విషయానికి సంబంధించినదే!

ప్రకృతీ పురుషుల కలయిక తోనే ప్రపంచ సృష్టి జరుగుతోంది. ఈ ఇద్దర్నీ విడదీయలేము. ఈ రెండూ ప్రతి జీవిలోని 'నాది – నేను' 'దేహము – ఆత్మ', విభాగాలను సూచించేవి.

నాదిలో నేను వుంటే – జీవికి అది కారాగారవాస స్థితిని (Imprisonment), నేనులో నాది ఉంటే – అది మోక్షానందస్థితిని (Liberation) తెలియజేస్తాయి. ఈ ప్రకృతీ పురుషుల కలయిక – సమ్మేళన(Synthesis) లాంటిదే గాని, సమ్మిశ్రం(Mixture) లాంటిది కాదు. ప్రయోజనం వున్నంతవరకు ఉండేది – 'సమ్మిశ్రం'. ప్రయోజనం లేకపోయినా ఉండేది – 'సమ్మేళనం'.

ఈ నామాన్ని 'శ్రీకంఠ + అర్ధశరీరిణీ – అని విడదీస్తే ''శివునిలో అర్ధ శరీరంగా వుండునది'' అని అర్థం చెప్పుకోవాలి. అలా కాకుండా, శ్రీ + కంఠ + అర్ధ శరీరిణీ – అని విడదీస్తే – శ్రీ = శ్రీవిద్య, కంఠ = కంఠముగాను – అనగా వాక్కుగాను, అర్ధ = అర్థముగాను, శరీరిణీ = శరీరముగా గలది. అంటే – '' శ్రీ విద్యను – 'వాక్కు' గాను 'అర్థం' గాను, తన శరీరముగా గలది'' అని అర్థం.

'శ్రీకంఠుణ్ణి తన అర్ధ శరీరంగా గలది' అని కూడా అర్థం చెప్పవచ్చు. శంఖం ఆకారంలో ఉండే కంఠాన్ని; ఉచ్ఛ్వాస, నిశ్వాసలను – క్రింద చూపిన 'కం', 'ఠం' లతో చూపిన త్రిభుజాలలాగ సూచిస్తే –




అప్పుడు పై త్రిభుజం – ఉచ్ఛ్వాసాన్ని, అయ్యవారిని సూచిస్తుంది. క్రింది త్రిభుజం – నిశ్వాసాన్ని, అమ్మవారిని సూచిస్తుంది. కంఠాన్ని సూచించే మొత్తం చిత్రంలో సగంభాగం అయ్యవారిది, సగంభాగం అమ్మవారిది అని తేలిగ్గా అర్థమౌతుంది. వాక్కు, ఉచ్ఛ్వాసం – ఇవి అయ్యవారికి సంబంధించినవి గాను; అర్థము, నిశ్వాసము – ఇవి అమ్మవారికి సంబంధించినవి గాను గుర్తు పెట్టుకోవాలి.

1) శివునిలో సగము శరీరముగా గలది.

2) శివుణ్ణి తన అర్థ శరీరముగా గలది.

3) శ్రీ విద్యను – వాక్కుగాను, అర్థంగాను, తన శరీరముగా గలిగినది.

4) శ్రీకంఠుడు అర్థమగుటకు అనగా, అవగాహన అగుటకు ఆయన శరీరముగా నున్నది.

5) శివుని సృష్టి ప్రయోజనమునకై ఆయన శరీరము గా నున్నది. – అనే అర్థాలు ఈ నామానికి చెప్పుకోవచ్చును.

## 393. ప్రభావతీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ప్రభావత్యైనమః' అని చెప్పాలి.

ప్రభావతీ = వెలుగులు విరజిమ్ము రూపము గలది.

తన నుండి బయటకు వెలుగులు చిమ్మే లక్షణాన్ని 'భా' అంటారు. 'ప్ర' అంటే 'ప్రకృష్టమైన' అని అర్థం. కాబట్టి, అమ్మవారిది ప్రకృష్టంగా వెలుగులు విరజిమ్ము రూపము.

అమ్మవారే వెలుగుల ముద్ద – దానికి తోడు అమ్మవారి చుట్టూ తేజస్సుతో వుండే అణిమాది అష్టసిద్ధశక్తులు, ఆవరణ దేవతలు, నిత్యాదేవతలు మొదలైన వారందరూ వుంటారు. అప్పుడు అమ్మవారి సాన్నిధ్యం ఎలా వుంటుందో ఊహించుకుంటే 'ప్రభావతీ'

నామం అర్థమవుతుంది. దేన్నైనా చక్కగా అర్థమయే లాగా చేయగల ప్రకాశ ప్రజ్ఞాన స్వరూపిణి అన్నమాట! మనం నిద్రపోతూ వుండగా కూడా మనలో మేల్కొని వుంటుంది.

ఈ మెలకువ వివిధ స్థావర జీవరాసుల జాతులలో వివిధ రకాలుగా వుంటుంది. ఖనిజ లవణాల స్థాయిలో (Mineral kingdom) - పెరుగుదల, తరుగుదల రూపంలో మాత్రమే వుంటుంది. వృక్షజాతి (Plant Kingdom) లో – స్పందన (Sensation) రూపంలో వుంటుంది గాని వాటి స్పందనను తెల్పే ఇంద్రియం వుండదు. జంతు జాతిలో (Animal Kingdom) – మనస్సు వుంటుంది గాని, 'తాను' ఉన్నట్లు తెలిసే ప్రజ్ఞ వుండదు. మానవజాతిలో (Human Kingdom) – పైన తెలిపినవి అన్నీ వుండి విజ్ఞాన, వివేకాలు గూడా వుంటాయి. తన్ను తాను తెలుసుకోగలిగే ప్రజ్ఞ(Consciousness) గూడా వుంటుంది.

అన్నిటా మెలకువగా వుండే ఈ 'ప్రభావతీ' అమ్మవారే ఇన్ని రకాల స్థాయిలలో వుండే మెలకువలకు కారణం. ఈ ప్రభావతియే సుషుమ్నాగ్ని స్వరూపం. ఈ ప్రభావతియే సవితృమూర్తి యొక్క పవిత్రమైన వెలుగులకు మూలకారణం.

1) వెలుగులు విరజిమ్ము రూపము గలది.

2) అన్నిటిలో మేల్కొని వుండే ప్రకాశ, ప్రజ్ఞాన స్వరూపిణి.

3) సుషుమ్నాగ్ని యొక్క, సవితృమూర్తి యొక్క ప్రకాశస్వరూపిణి. అని – ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 394. ప్రభారూపా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ప్రభారూపాయైనమః' అని చెప్పాలి.

ప్రభా = వెలుగుల యొక్క, రూపా = రూపము.

ఇంతకు ముందు నామంలో అమ్మవారు 'వెలుగులు జిమ్ము రూపము' అని చెప్పబడింది. ప్రస్తుత నామంలో – 'ఆ వెలుగులు ఒక ఆకారం పొందితే ఆ ఆకారం సూచించు రూపమే' అమ్మవారు అని చెప్పబడుతోంది.

'వెలుగు' అంటే 'విప్పారుట' అని అర్థం చెప్పుకోవాలి. తెరమీద బొమ్మ పడుతున్నపుడు – తెరకు, మనకు ఏది తేడానో దాన్ని 'కన్పించడం' లేదా 'విప్పారడం' అంటారు. ఈ 'విప్పారే' లక్షణంగా మనలో వుండేది అమ్మవారే!

1) వెలుగుల రూపము.

2) విప్పారుగుణరూపము – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 395. ప్రసిద్ధా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ప్రసిద్ధాయైనమః' అని చెప్పాలి.

ప్ర = ప్రకృష్టముగా, సిద్ధా = సిద్ధముగా నున్నది.

సాధ్యస్థితి (Potential state), సిద్ధస్థితి (Manifested state) అని రెండురకాల స్థితులుంటాయి. ఒక తెల్లకాగితం మీద బిందువు పెడితే – ఆ బిందువు చుట్టూ $360^0$ సిద్ధస్థితిలో వున్నట్లు, ఆ బిందువు పెట్టక పూర్వం అక్కడ $360^0$ సాధ్యస్థితిలో వుంటాయని అర్థం చేసుకునేలాగా ఈ రెండు స్థితుల భేదాన్ని గుర్తించాలి.

ఏ క్షణంలో అయినా, ఎక్కడ అయినా, ఎలా అయినా వుండటానికి సిద్ధమై (నరసింహస్వామి లాగా) అమ్మవారు ఉంటుంది అని ప్రస్తుత నామంలో చెప్పబడుతోంది. ఇలా అన్ని చోట్లా సిద్ధ స్థితిలో వుండగలది కాబట్టి అమ్మవారు 'ప్రసిద్ధా'.

'సకలజనులు 'అహం' (నేను) అని వాడబడే దాని రూపంగా ప్రసిద్ధి చెందినది – అని ఈ నామానికి అర్థం.

## 396. పరమేశ్వరీ

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పరమేశ్వర్యైనమః' అని చెప్పాలి.

పరమ + ఈశ్వరీ = పరమునకు అధికారిణి.

ప్రపంచంలోనివన్నీ జనన మరణాలకు అతీతం కాదు. అన్నీ సాపేక్షకములే ! కాని, జనన మరణాతీతంగా, నిరపేక్షకంగా, సచ్చిదానంద చైతన్యం ఒకే ఒక్కటి వున్నది. దాన్ని 'పరము' (Absolute) అంటారు. ఈ 'పరము' ఎవరి అధీనమో ఆ కారణాన్ని 'పరమేశ్వరీ' అంటారు.

'పరమునకు అధికారిణి' అని ఈ నామానికి అర్థం.

## 397. మూలప్రకృతిః

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మూలప్రకృత్యైనమః' అని చెప్పాలి.

మూలప్రకృతి = అన్ని ప్రకృతులకు మూలమైనది.

ప్రకృతి అంటే స్వభావం అని చెప్పుకోవాలి. ప్రకృతులలో చాలా రకాలుంటాయి. 1) నా ప్రకృతి (Individual Nature), 2) మానవ ప్రకృతి (Human nature) 3) జీవ ప్రకృతి (Living being nature) 4) రసాయనిక ప్రకృతి (Chemical nature) 5) గ్రహప్రకృతి (Planetary nature) 6) సౌరప్రకృతి (solar nature) 7) బ్రహ్మాండ ప్రకృతి (Cosmic nature). ఇలా చిట్టచివరగా చెప్పబడిన బ్రహ్మాండ ప్రకృతి నేపథ్యంలో– మిగిలిన ప్రకృతులు అదే వెనుకమార్గ వరుసలో వర్తించి, చిట్టచివరకు ప్రతి వ్యక్తికి సంబంధించిన ప్రకృతి (Individual nature) వర్తిస్తుంది.

ప్రకృష్టమైన ప్రారంభ సృష్టి కృత్యాన్ని నిర్వహించేది కాబట్టి అమ్మవారిని మూలప్రకృతి అన్నారు.

మూలప్రకృతినే 'పరాప్రకృతి' అని గూడా అంటారు. భగవద్గీతలో 'భూమిరాపో ऽనలో వాయుః ఖం మనోబుద్ధిరేవచ, అహంకార ఇతీయంమే భిన్నా ప్రకృతిరష్టధాః' అని చెప్పబడింది. పంచభూతాలు, మనస్సు, బుద్ధి, అహంకారం – ఈ ఎనిమిదింటిని అష్ట ప్రకృతులంటారని ఈ శ్లోకానికి అర్థం. ఈ ఎనిమిది ప్రకృతులు ఎవరి నేపథ్యంలో వర్తించి, ఆ నేపథ్యానికి అధీనులై ఉంటాయో – ఆ నేపథ్యాన్ని (Back ground) 'పరాప్రకృతి' అంటారు. ఈ పరా ప్రకృతినే దేవీభాగవతంలో అమ్మవారుగా చెబుతారు.

భాగవతంలో కృష్ణుని ప్రధానమైన అష్టభార్యలు – అష్ట ప్రకృతులను సూచిస్తే 'రాధ' పరాప్రకృతిని సూచిస్తుంది. ఈ 'రాధాకృష్ణులు' గోలోకానికి చెందిన వారు. అంటే, అన్నిటికీ మూలం అయిన కారణ లోకంగా వున్నవారన్నమాట. గోలోకంలోని కృష్ణుని 'పరబ్రహ్మ' మనీ 'రాధ'ను 'పరాప్రకృతి' అని అన్వయించుకోవాలి.

ఈ మూల ప్రకృతిని ఆంగ్లంలో 'Primordial matter' అంటారు. చపాతీలు చెయ్యక పూర్వం ఉండే 'చపాతీ పిండి ముద్ద' లాంటిది ఈ మూల ప్రకృతి. ఈ ముద్దను వేరు వేరు వుండలుగా చేస్తే – వేరు వేరు చపాతీలు తయారవుతాయి. చపాతీల వుండలు వేరు వేరుగా చెయ్యనంత వరకు చపాతీల పిండి ముద్దలోని ఏ భాగమైనా ఏ చపాతీ అయినా కావచ్చును. వేరు చేసిన తరువాత ఏ చపాతీకి ఆ చపాతీయే ! దేని ప్రకృతి దానిదే !! మొట్టమొదటుగానున్న చపాతీల పిండి ముద్దగా ఉన్నలాంటి స్థితిలోని ప్రకృతిని 'మూలప్రకృతి' అంటారు. పురాణాల్లో 'అదితి' అనే మాట కూడా ఇదే అర్థాన్ని సూచిస్తుంది.

'అన్ని ప్రకృతులకు కారణమై, మూలమై, అన్నిటికీ అతీతంగా వుండే ప్రకృతి' – అని ఈ నామానికి అర్థం.

## 398. అవ్యక్తా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'అవ్యక్తాయైనమః' అని చెప్పాలి.

అవ్యక్తా = వ్యక్తము కానిది.

ఇంతకు ముందు చపాతీల పిండి ముద్దతో మూలప్రకృతిని పోల్చాము. చపాతీలుగా వ్యక్తము గాని స్థితిలో వున్న ఆ చపాతీల పిండి ముద్దను 'అవ్యక్తము' – అని అర్థం చేసుకున్నట్లే ఏ విధమైన మార్పులు పొందక, కారణ లోకంలోనే మూల ప్రకృతిగా వున్న అమ్మవారిని 'అవ్యక్తా' అనే నామంతోనే నిర్దేశించాలి (వ్యక్తమయితే మూలప్రకృతి అవదు).

''న చక్షుషా గృహ్యతేనాపి వాచానా న్యైర్దేవైః
తపసా కర్మణా వేత్యాది శ్రాంతి భిస్తథ నిర్ణయాత్''

కన్నులతో చూడలేని, వాక్కులతో వర్ణించలేని ఇతర ఇంద్రియాలతో తెలియబడని, తపస్సు చేత కూడా తెలియబడని 'పరబ్రహ్మ' ను 'అవ్యక్త' మంటారు. అమ్మవారు పరబ్రహ్మ స్వరూపిణి కాబట్టి 'అవ్యక్తము'.

1) వ్యక్తము కానిది.

2) తెలుసుకొనబడలేనది – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 399. వ్యక్తావ్యక్తస్వరూపిణీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'వ్యక్తావ్యక్తస్వరూపిణ్యైనమః' అని చెప్పాలి.

వ్యక్త = వ్యక్తమైన, అవ్యక్త = అవ్యక్తమైన అన్నిటి యొక్క, స్వరూపిణి = స్వరూపముగా నున్నది.

వ్యక్తమైన దాన్ని 'కార్యం' అని, వ్యక్తం కాకుండా ఉన్నదాన్ని 'కారణం' అనీ అంటారు. ఈ రెంటినీ – ''వ్యక్తం సర్వముమారూపం, అవ్యక్తంతు మహేశ్వరః'' అని వ్యవహరిస్తారు. అంటే వ్యక్తమైందల్లా అమ్మవారు, వ్యక్తం కానిదల్లా అయ్యవారు – అని ఈ శ్లోకపాదాలకు అర్థం.

కళ్ళకు కనబడే 'పంచదార' – దాని వ్యక్త స్వరూపం అవుతుంది. కాని, దాంట్లో గుప్తంగా వుండే $C_{12}$, $H_{22}$ $O_{11}$ అంటే, 12 కర్బన పరమాణువులు, 22 ఉదజని పరమాణువులు, 11 ఆమ్లజని పరమాణువులు కళ్ళకు కనబడవు కాబట్టి అవ్యక్త స్థితికి చెందినవవుతాయి.

'ఒకే పదార్థంలో, వ్యక్తకార్యంగాను, అవ్యక్త కారణంగాను ఉండునది' అని ఈ నామానికి అర్థం.

## 400. వ్యాపినీ

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'వ్యాపిన్యైనమః' అని చెప్పాలి.

వ్యాపినీ = వ్యాపనత్వలక్షణము కలది.

నీరు ప్రవహిస్తూ వ్యాపించే విధానం కంటే గాలిచోటులో వ్యాపించే విధానం సూక్ష్మమైనది. దీనికంటె - మనస్సు విషయములయందు వ్యాపించడం సూక్ష్మ తరమైనది. ఆకాశానికి గూడా ఇలాంటి వ్యాపన లక్షణం ఉంటుంది. ఇది సూక్ష్మతమమైనవి.

ఆకాశానికి ఉండే సూక్ష్మతమ వ్యాపన శీల లక్షణాన్ని అర్థం చేసుకోడం కష్టమే! అయినా తెలుసుకోడానికి ప్రయత్నం చేద్దాము.

చోటులో చోటుగా నిండి ఉన్న ద్రవ్యం అని ఒకటి ఉంది. 1) నిండిఉన్నది అని, 2) వ్యాపింపబడునట్టిది అనీ - ఈ చోటు ద్రవ్యం రెండు రకాలుగా ఉంటుంది. చోటులో నిండి ఉన్న దాన్ని 'మహత్' (అంటే - పరిమాణం 'Volume') అని చెప్పుకుంటే - నిండి ఉన్న చోటు నుండి సంకోచ వ్యాకోచాత్మక సాపేక్ష లక్షణంతో వ్యక్తమయే చోటును 'వ్యాపింపబడునట్టి చోటుగా' అర్థం చేసుకోవాలి. ఇలా వ్యక్తమయేవి చోటులో నుండి చిన్న చిన్న చోటులుగా వేరై వ్యక్తమైన అహంకారాలౌతాయి. (The solidification of souls into personalities separating from background space).

రెండు సూర్య కుటుంబాల మధ్య ఉండే చోటులో చోటు ద్రవ్యం అనేది గూడా మాయమవుతుంది. అంతా సూక్ష్మతమమైన చోటే అక్కడ ఉండేది. అంటే అక్కడకు ఏది వెళ్ళినా తన ద్రవ్యత్వాన్ని కోల్పోయి మాయమై పోవాల్సిందే ! ఇక్కడ ఉండే ఈ చోటు లక్షణాన్ని 'పరమధనాత్మకత'కు ఉండే ఋణాత్మక సాపేక్షత (Negative Relativity of Absolute Positivity) లక్షణం' అంటారు. ఇక్కడే లోకాలోక పర్వతాలు (సప్తకుల పర్వతాలు) వర్తిస్తాయి.

పదార్థంతో చేసిన ఒక వస్తువులో ఖాళీ ఉంటె - ఆ ఖాళీ చోటు ఆ పదార్థ వస్తువుకు చిల్లులాగా ఉంది' అని మనం సాధారణంగా అనుకుంటాము. అంటే, 'Space is slit into matter' అని అనుకుంటాము. కాని, సరిగ్గా దీనికి వ్యతిరేకంగా ఉండే భావనే సత్యం. అంటే - 'చోటు'కు పదార్థం చిల్లు' (Matter is slit to space) అని అనుకోడం సత్యమన్నమాట. ఎందుకంటే - చోటు - పరమసత్యం (Absolute truth) పదార్థం - సాపేక్ష సత్యం (Relative truth) కాబట్టి.

నేపథ్యంలో ఉన్న ఒక వెలుగును(Back ground light) ఒక వస్త్ర జల్లెడ గుండా చూస్తున్నపుడు ఏవో వెలుగు చుక్కలు కనబడతాయి. ఇవి జల్లెడకు వెలుగువల్ల ఏర్పడిన చిల్లులలాగా అనిపిస్తాయి. వాస్తవానికి ఇది సత్యం కాదు. వెనుక ఉన్న వెలుగుకు జల్లెడలోని బద్దలు అడ్డుగా ఉండటం వలన జల్లెడ యొక్క చిల్లులున్న ఆ భాగాల ద్వారా మాత్రమే వెలుగు బయటకు వ్యక్తమైంది. జల్లెడ– తన బద్దలు ఉన్న మేరకు అడ్డుకుని వెలుగు ఆ మేరకులేనట్లుగా అంటే – వెలుగుకు చిల్లులున్నట్లు చేస్తోంది. ఇదే వాస్తవానికి సత్యం. వెనక ఉన్న వెలుగు పరమ సత్యం, అడ్డుకునే జల్లెడ (పదార్థం) సాపేక్ష సత్యం అవడమే దీనికి కారణం. దీనిని బట్టి, మనం చూసే సూర్యుడు, ఇతర నక్షత్రాలు వెనుక నేపథ్యంగా ఉన్న వెలుగుకు తూములు లేదా చిల్లులు లాంటివేనని, ఆ నేపథ్యపు వెలుగే అమ్మవారనీ అర్థం చేసుకోవాలి. చోటులో ఉండే ఈ విచిత్రమైన వ్యాపన శీలత్వ లక్షణాన్ని సూచించే అమ్మవారి నామం వ్యాపినీ!

'విచిత్ర వ్యాపన శీల లక్షణం గలది' అని ఈ నామానికి అర్థం.

## 401. వివిధాకారా

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'వివిధాకారాయైనమః' అని చెప్పాలి.

వివిధ = వివిధములైన, ఆకార = ఆకారములతోనుండునది.

ఇంతకు ముందు నామం అయిన 'వ్యాపినీ' యొక్క లక్షణంతో వివిధ ఆకారాలతో, వివిధ రూపాలతో, స్థావరజంగమాత్మకమైన ప్రపంచంగా అమ్మవారు రూపొందుతుంది కాబట్టి – 'వివిధాకారా' అయింది. అన్ని ఆకారాలలో ఉండేది 'అయ్యవారే' అయినా – ఆకారాలన్నీ అమ్మవారే !

'వివిధములైన ఆకారములతో వ్యక్తమగునది' అని ఈ నామానికి అర్థం.

## 402. విద్యావిద్యాస్వరూపిణీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'విద్యావిద్యాస్వరూపిణ్యై నమః' అని చెప్పాలి.

విద్యా = విద్యకు సంబంధించిన భాగమును, అవిద్యా = అవిద్యకు సంబంధించిన భాగమును, స్వరూపిణీ = తన రూపముగా గలది.

"అమ్మవారు జ్ఞాన స్వరూపిణి కాబట్టి 'విద్యాస్వరూపిణీ' అంటే సబబుగా వుంటుంది గదా" అని అనిపించడం సముచితమే ! కాని 'వ్యాపనశీల' లక్షణం గలిగిన అమ్మవారు 'వివిధ ఆకారాల్లో' పంచభూతాత్మక మైన ప్రపంచంగా రూపొందుతున్నప్పుడు- అలా వ్యక్తమైన వాటి ఆకారాలు, రూపాలు, నామాలు ఇవన్నీ ఆవిడ అసలుతత్వానికి సంబంధించినవి కావు. వివిధ పదార్థాలతోను, వస్తువులతోను, జీవులతోను కలగాపులగంగా ఉండే ప్రపంచంలో తికమకపడకుండా ఉండాలంటే వేటి ఆకారాలు వాటికి, వేటి రూపాలు వాటికి, వేటి నామాలు వాటికి వుంటేనే వీలుగా ఉంటుంది. ఈ ఆకార, రూప, నామాలు – అవిద్యకు సంబంధించినవి. ఎందుకంటే – అవి మన సదుపాయం కోసం ఏర్పాటు చేసుకున్నవే గాని పుట్టుకతో లేనివి. ఇవన్నీ సాపేక్షకములే (Relative). అన్నిటిలోనూ ఉంటూ, అన్నిటికీ అతీతంగా వుండే భాగాన్ని 'విద్యా' అంటారు. అవిద్యచేత లోక వ్యవహారాలు అర్థం చేసుకోబడుతూ, విద్య చేత అసలు తత్త్వం తెలుసుకోబడుతుంది.

'విద్య' జంతు కక్ష్యనుండి విముక్తి కలిగించడానికి అవసరమయేది. 'అవిద్య' అంటే – భవబంధాల్లో ఇరుక్కునేట్లుగా చేసేది. భౌతిక జీవికి, సమాజ జీవికి – ఈ రెంటి అవసరం ఉంది. అందుకనే, అమ్మవారు ఈ రెంటి రూపంగా ఉంటుంది.

'భ్రాంతిర్విద్యాపరంచేతి శివరూపమిదత్రయం
అర్థేషుభిన్న రూపేషు విజ్ఞానం భ్రాంతిరుచ్యతే
ఆత్మకారేణ సంవిత్తిః బుధైర్విద్యేతికథ్యతే
వికల్పరహితం తత్వం పరమిత్యభిధీయతే'.

అని – లింగ పురాణంలో జ్ఞానం గురించి చెప్పబడుతుంది. 'భ్రాంతి, విద్య, పరము – అని మూడు విధాలుగా జ్ఞానము ఉంటుందని, వీటిలో సంసారంలో బంధించే జ్ఞానాన్ని 'భ్రాంతి' అని, సంసారాన్ని వదిలించే జ్ఞానాన్ని 'విద్యా' అని, స్వరూపజ్ఞానం లేదా ఆత్మ జ్ఞానాన్ని 'పరము' అనీ అంటారు. ఈ మూడు రకాల జ్ఞానం అమ్మవారి స్వరూపమే!

ఈ నామం 'పరావరయోగాన్ని' సూచిస్తుంది. కాలమ్ము, ప్రజ్ఞ లేదా ఆత్మల కలయికకు (Synthesis of time and consciosuness) సంబంధించినదే. ఈ పరావర యోగం. ఈ యోగంలో - యోగాభ్యాసం లేదా సాధన(Yoga practice) మొదటి మెట్టు. యోగ జీవనం అంటే, జీవితం యోగమవడం (Yoga Realised as life) రెండవ మెట్టు. ఈ యోగ ఫలితంగా - 1. మృత్యువును దాటడం 2. అమృతత్వాన్ని పొందడమనే రెండూ సాధింపబడతాయి.

'విద్యావిద్యలతో కూడిన జ్ఞానమును తన స్వరూపముగా కలిగినది'- అని ఈ నామానికి అర్థం.

## 403. మహాకామేశ నయనకుముదాహ్లాదకౌముదీ

పదహారు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మహా కామేశ నయున కుముదాహ్లాద కౌముద్యైనమః' అని చెప్పాలి.

మహాకామేశ = మహాకామేశ్వరుని, నయున = కన్నులనెడు, కుముద = కలువపువ్వులకు, ఆహ్లాద = ఆనంద వికాసమును కలింగించు, కౌముదీ = వెన్నెల వెల్లువ.

కలువపువ్వులు ఆనందంతో వికసించాలంటే వెన్నెల వాటిపై విరజిమ్మబడాలి. అమ్మవారి వదనం శరత్కాల పూర్ణిమా చంద్రుడే ! (పరిణత శరచ్చంద్రవదనా' - సౌందర్యలహరి - 7వశ్లోకం); (రాకేందువదనా - లలితాసహస్రనామం 314) మరి అటువంటి అమ్మవారు - తన వదన చంద్రునితో వెన్నెలలు విరజిమ్ముతూ మహేశ్వరుని కన్నుల కలువలకు మహదానందాన్ని కలుగజెయ్యదా ?

పంచభూతాలతో అవసరం లేకుండానే మహాకామేశునికి తన కళ్ళు తనలోంచే పుడతాయి. అవి తెరుచుకుంటూ, మూసుకుంటూ ఉన్నప్పుడల్లా ఆకాశమంతా పూర్ణగోళంగాను, శూన్య గోళంగాను తారుమారౌతూ ఉంటుంది. ఇది ఒక విశిష్టమైన స్పందన లక్షణం(Space pulsates). ఆకాశం ఇలా, 1) పూర్ణగోళంగా ఉన్నట్లు కనిపించి, శూన్యగోళంగా అనిపించే లక్షణం, 2) నిజంగా అసలు అక్కడ ఆకాశ గోళం ఉండే లక్షణం - ఈ రెండు లక్షణాలు కలిపి సత్యం ఔతుంది. (Truth and the impression

of your truth both put together is called truth) ఈ విషయమే తైత్తిరీయంలో 'సత్యం చానృతం చాపి సత్యమభవత్' అని చెప్పబడింది. ఈ రెండు లక్షణాలు కామేశునికి 'చంద్రుడు, సూర్యుడు' అనే ఆయన రెండు కళ్ళుగా చెప్పబడ్డాయి. ఆకాశ గోళం పూర్ణంగా కనిపించి, శూన్యంగా అనిపించే లక్షణం చంద్రుడికి సంబంధించినది. (పూర్ణిమ, అమావాస్యల లక్షణం). ఇక నిజంగా అక్కడ ఆకాశగోళం ఉన్న లక్షణం – సూర్యుడికి సంబంధించినది.

ఈ నామంలోని 'నయన' పదానికి – 'నడిపేది' అనే వ్యుత్పత్తిలో విశిష్టమైన అర్థాలున్నాయి. ('నడిపించేది' అంటే – 'మననుండి బయటకు', 'బయటనుండి మనకు' – ఈ రెండు మార్గాల ద్వారా గూడా అని గుర్తు పెట్టుకోవాలి) 1. అధోగతి పాలు కాకుండా నడిపించేది – 'నయనం' 2. అవతల ఉన్న దాన్ని మన వైపుకు తీసుకువచ్చేది – 'నయనం'. అసలు ఈ నయనం ఏమిటి ? సూర్యుణ్ణి చూడ్డానికి గాను – కొంత సూర్యరశ్మి ఒక 'సాధనంగా' మారితే – ఆ సాధనాన్ని 'నయనము' అనవచ్చును. (ఎందుకంటే, ఆ సూర్యుణ్ణి మన దగ్గరకు తీసుకురావడంలో – అంటే చూడగలిగేట్టు చెయ్యడంలో – ఉపయోగపడింది కాబట్టి.) దీనిని బట్టి 'నయనము' అంటే 'సూర్యరశ్మితో చేయబడిన ఒక సాధనం' అని అర్థమౌతోంది గదా! అందుకే వెలుగు లేకపోతే ఈ నయనం పని చెయ్యలేదు.

ఈ నామంలోని 'కుముద' పదానికి కూడా విశిష్టార్థం ఉంది. భౌతిక సృష్టివల్ల ముందుగా సంతోషంతో సుళ్ళు తిరుగుతూ ఉండేది భూమి. ఇలా సంతోషం సుళ్ళు తిరుగుతూ ఉండే లక్షణాన్ని 'కుముదము' అన్నారు. ('కు' అంటే – భూమికి వచ్చే, 'ముదము' – అంటే సంతోషము) ఇది అష్టదిగ్గజాల్లో ఒకటి. (Directional Force) దీన్నే విజ్ఞాన శాస్త్రంలో తనచుట్టూ తాను తిరగడం మూలంగా భూమికి వచ్చే అపకేంద్ర బలం (Centrifugal Force)అంటారు. దిక్ + గజము = దిగ్గజము, అంటే, 'దిశా బలం' (Directional Force) అని అర్థం. 'గజము' – అంటే 'గ' – మన వలన, 'జ' – పుట్టేది (కలిగేది). అంటే 'బలం' అని అర్థం.

పైన చెప్పిన నయన, కుముద – పదాల విశిష్ట అర్థాలను సమన్వయించుకుంటే – మహా కామేశనయన = కామేశ్వరుని చూపు ద్వారా, కుముద = భూమి ఆనందానికి

(భౌతిక సృష్టిని జరపడంలో) ఆహ్లాద కౌముదీ = ఆహ్లాదకరమైన వెన్నెలగా నున్నది. - అనే ఇంకొక అర్థం ఈ నామానికి వస్తుంది.

(1. కామేశ జ్ఞాత సౌభాగ్య మార్దవోరుద్వయాన్వితా, 2. కామేశ బద్ధ మాంగల్య... 3, కామేశ్వర ప్రాణనాడీ, 4. కామేశ్వర ప్రేమరత్న ...., 5. కామేశ్వర ముఖాలోక ..., 6. మహాకామేశ మహిషీ...., 7) ప్రస్తుత నామం - మహా కామేశ నయన...) - ఈ నామాలను జాగ్రత్తగా పరిశీలిస్తే - సృష్టిపరమైన విషయాలు, లేదా 'అమ్మవారి, - అయ్యవారి' దాంపత్య విషయాలు వచ్చినపుడు - అయ్యవారిని 'కామేశ' నామంతోనే వ్యాసుల వారు చెప్పారని గ్రహించవచ్చును. అయ్యవారి ఈ కామేశ నామం తాలూకు అస్త్రంతోనే - శూన్యకానగరంతోసహా భండాసురుడు నిశ్శేషంగా దహింపబడ్డాని - 'కామేశ్వరాస్త్ర నిర్దగ్ధ సభండాసుర శూన్యకా' అనే నామం తెలుపుతుంది. అంటే - 'కామేశు' డంటే, 'పరమేశ్వరుడు'(Supreme or ultimate or absolute state of Godhood) అని అర్థం. కామేశుని - 'బ్రహ్మ జ్ఞాని' గాను, కౌముదిని - 'జ్ఞానం' గానుసమన్వయ పరచుకుంటే ఇంకో అర్థం వస్తుంది.

1) మహాకామేశుని కన్నుల కలువలకు ఆహ్లాద వికాసమును కలిగించు వెన్నెల వెల్లువ.

2) కామేశుని చూపు ద్వారా భూమి ఆనందానికి కారణమైన ఆహ్లాద కరమైన వెన్నెల వెల్లువ.

3) కామేశుడను జిజ్ఞాసువునకు సంతోషమును కలుగచేయు జ్ఞాన స్రవంతి.

- అని ఈ నామానికి అర్థాలు చెప్పుకోవచ్చును.

## 404. భక్తహార్దతమోభేద భానుమద్భాను సంతతిః

పదహారు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'భక్తహార్దతమోభేద భానుమద్భాను సంతత్యైనమః' అని చెప్పాలి.

భక్త = భక్తుల, హార్ద = హృదయగతమైన, తమః = అంధకార అజ్ఞానమును, భేద = భేదించునట్టి, భానుమత్ = కాంతితో కూడిన, భానుసంతతిః = సూర్యకిరణ పుంజము.

తనను నమ్మిన వారి అజ్ఞానాంధకారమును పారద్రోలి, వారిని ప్రజ్ఞావంతుల్ని చేయడంలో అమ్మవారు – 'సూర్యుల వరుస' లేదా 'సూర్యుని అఖండ కిరణపుంజము' వంటిది. (అవిద్యానాం అంతస్తిమిరమిహిరద్వీప నగరీ...'' అని ఆది శంకరులు సౌందర్యలహరిలో అమ్మవారిని స్తుతించారు.)

చీకటి – కంటికి కనిపించదు. అటువంటి చీకటిని మనకంటికికనబడే సూర్యుడు పోగొట్టకలడు. వాస్తవానికి మనకు సూర్యుడంటే తెలియదు. సూర్యుడెలా ఉన్నట్టు కనబడుతున్నాడో తెలుస్తుంది – అంతే ! అలా మనకు ఉన్నట్టు కనబడే దాన్ని మనం సూర్యుడంటున్నాము కాని, అసలు సూర్యుణ్ణి కాదన్నమాట ! ప్రేమ విషయం కూడా అంతే ! ప్రేమను కలుగ జేసే వస్తువును చూసి ప్రేమ అంటున్నాము కాని అసలు ప్రేమను 'ప్రేమ' అనడంలేదు.

'We are calling the object of love as love
but not calling the original love as love'.

మనలో వుండే జ్ఞానమునకు సంబంధించిన వివిధమైన వెలుగు పొరలు క్రింది పటంలో చూపబడ్డాయి. ఆ పొరలు ఈక్రింద తెలిపిన వివిధ రకాల పేర్లతో పిలువబడతాయి.




1) కంటికి కనబడే వెలుగు (Physical Light)
2) రక్తజనిత శక్తి కక్ష్యకు సంబంధించిన వెలుగు (Vital Light)
3) మనో సంబంధమైన వెలుగు (Mental Light)

4) బుద్ధికి సంబంధించిన వెలుగు (Intellectual light)

5) హార్దమైన వెలుగు Light of Heart)

అమ్మవారు అనే భానుకిరణ పుంజము కేంద్రంలో ఉండే హార్దమైన వెలుగు పొర దాకా దూసుకుని వెళ్లి, అక్కడ పెద్ద వెలుగు నిచ్చే దీపాన్ని (Flood light) వెలిగిస్తుంది. దాంతో అన్ని పొరలు ప్రకాశ వంతమై, అజ్ఞానం పటాపంచలౌతుంది. బయటి పొరలు సర్దుబాటు చేస్తే లోపల చీకటిపోదు. లోపల సర్దుబాటు జరిగితే, బయట దానంతట అదే సర్దుబాటవుతుంది.

భక్త హార్దతమస్సులను భేదించడం సూర్యునికి సాధ్యం కాదు. అమ్మవారికే సాధ్యం. మనలోపల నుండి మనకు వెలుగునిచ్చే ప్రజ్ఞానోపదేష్ట అమ్మవారు.

1) ''భక్తుల హృదయంగతమైన అజ్ఞానాంధకారాన్ని పారద్రోలి వారిని ప్రజ్ఞానవంతుల్ని చేసే మహాకాంతివంతమైన మధ్యందిన మార్తాండ శ్రేణి వంటిది, లేదా- మార్తాండ అఖండ కిరణ పుంజము వంటిది''.

2) మనలోపల నుండి మనకు జ్ఞానకాంతిని ఉత్పత్తి చేసుకోగలిగే జ్ఞాన ప్రకాశోపదేశికురాలు - అని ఈ నామానికి అర్థాలు చెప్పుకోవచ్చును.

## 405. శివదూతీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'శివదూత్యైనమః' అని చెప్పాలి.

శివదూతీ = శివుని వద్దకు పంపిన దూతిక.

ఈ 'శివదూతీ' నామం మొదలు 'సూక్ష్మరూపిణీ' నామం దాకా ఉండే నామాల్లో ఉత్తమోత్తమమైన 'శివదూతీ' విద్య గురించి చెప్పబడుతుంది.

అమ్మవారు తన భక్తులందరినీ భవబంధ విముక్తులను చేసి, వారికి ముక్తిని సంప్రాప్తింప చేస్తుంది. సాధనలో తను అనుసరించిన మార్గాన్నే తన భక్తులను కూడా అనుసరింపచేయడం కోసం, ముందుగా 'శివభక్తి'ని వారిలో కలుగచేస్తుంది. ఆ శివభక్తితో భక్తులు ముందుగా శివుని సాన్నిధ్యాన్ని, తత్ఫలితంగా ముక్తిని పొందుతారు.

వెన్నెముకలోని ప్రధాన నాడులలో 'పింగళానాడి' (ఆరోహణాత్మక జీవ ప్రజ్ఞ)

స్థూలం నుండి సూక్ష్మానికి సూచించే మార్గాన్ననుసరించి ఉంటుంది. అంటే - ఇది 'సూర్యాత్మకం'. మూలాధారం వద్ద వుండే కుండలినీ శక్తి సహస్రారంలో ఉండే శివుని చేరే సాధన ఈ పింగళానాడి ద్వారానే జరుగుతుంది. అలాగే, భక్తునిలో శివ పరభక్తి ఈ స్థితిని చేకూరుస్తుంది. ఈ 'శివపరమైన భక్తి'నే 'శివదూతీ' నామంతో సంకేతించారు. ఈమె ద్వారానే శుభకరమైన మంచి విషయాలు భక్తులు తెలుసుకుని, ఆచరించి, చివరకు శివసాన్నిధ్యాన్ని పొంది, ముక్తులౌతారు.

''శుక్ల పక్ష సప్తమికి చెందిన నిత్యాదేవతా స్వరూపంగా వుండే అమ్మవారిని గూడా 'శివదూతీ' అంటారు.

1) శివపరభక్తిని సూచించు అమ్మవారి రూపము.

2) శుక్ల సప్తమికి చెందిన నిత్యాదేవతా స్వరూపము.

3. పింగళానాడీ సమన్వయ స్వరూపము - అని ఈ నామానికి అర్థాలు చెప్పుకోవచ్చును.

## 406. శివారాధ్యా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'శివారాధ్యాయైనమః' అని చెప్పాలి.

శివారాధ్యా = శివునిచే ఆరాధింపబడునది.

మంచిపనులేవో మంచిని శివదూతి ద్వారా భక్తులు తెలుసుకుంటే, శివారాధ్య - ఆ మంచి పనులు ఆచరింపబడి జరిగేలా చూస్తుంది. అంటే, మంచి తెలియడం - శివదూతి వల్ల, మంచి చెయ్యడం - శివారాధ్య వల్ల జరుగుతాయన్నమాట!

సంకల్పాలు - కల్పలోకంలో కార్యరూపం చెందితేనే భౌతిక కక్ష్యలో జరుగుతాయి. సంకల్ప లోకం సూక్ష్మమైంది. కల్పలోకం స్థూల మైంది. కాబట్టి, శివారాధ్య - సూక్ష్మం నుండి స్థూలం వైపుగా సూచించే మార్గాన్ని అనుసరించి ఉంటుందన్నమాట! అంటే - వెన్నెముకలోని 'ఇడానాడీ మార్గాన్ని అనుసరించి ఉంటుంది.

సహస్రారంలో వుండే శివుని సంకల్పం మూలాధారంలో ఉండే భౌతిక శక్తి వలన కార్యరూపం దాలుస్తుందన్నమాట! శివుడు కూడా అమ్మవారి అండ లేకపోతే తన సంకల్పాలను కార్యరూపంలోకి తేలేడు. అందుకని అమ్మవారు శివునికి ఆధారమై, ఆరాధ్యమౌతుంది.

1) సాధకునిలో శుభకరమైన పనులను చేయించు అమ్మవారి స్వరూపము.

2) ఇడానాడీ సమన్వయ స్వరూపము.

3) శివునిచే ఆరాధింపబడునది – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 407 శివమూర్తిః

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'శివమూర్త్యైనమః' అని చెప్పాలి.

శివ = శివుని యొక్క, మూర్తిః = స్వరూపము.

శివుని యొక్క రూపంగా ఉన్న అమ్మవారు శివమూర్తి ఔతుంది. మంచికి సంబంధించిన మంగళకర ఉపదేశాలు, సిద్ధాంతాలు, సూత్రాలు – ఇవి అన్నీసంకల్ప లోకంలో శివుని లాగా ఉంటే – కల్పలోకంలో ఆచరణాత్మకంగా, అనుష్ఠాన పూర్వకంగా జరగడానికి అవన్నీ ఒక రూపాన్ని పొందాలి. మంగళకరమైన ఆ అంశాలన్నీ అంగాంగీ భావ సంబంధంతో, సర్వాంగ సుందరంగా, ఒక మూర్తిగా రూపొందితే – ఆ రూపం 'శివమూర్తి' ఔతుంది.

1) సర్వమంగళత్వము మూర్తీభవించిన రూపము;

2) అవ్యక్త శివుని వ్యక్తరూపము – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 408. శివంకరీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'శివంకర్యైనమః' అని చెప్పాలి.

శివంకరీ = శుభములు చేకూర్చునది.

శివదూతి పింగళానాడిని, శివారాధ్య - ఇడానాడిని సూచిస్తే, శివంకరి - సుషుమ్నానాడిని సూచిస్తుంది. ప్రతి వ్యక్తిలోని సూక్ష్మ ధాతుసారము ఒక సూక్ష్మనాడి ద్వారా, ప్రసారమౌతుంది. ఆ నాడిని 'సుషుమ్న' అంటారు. ఇది వెన్నెముకలో ఇడా పింగళా నాడులకు మధ్య సన్నని దారపు పోగు (Fine Fibre) వంటి విద్యుత్కాంతి తేజస్సుగా "...... విద్యుల్లేఖేవ భాస్వరా" - మంత్రపుష్పం) రంజిల్లుతూ ఉంటుంది. దీని ప్రచోదన, ప్రేరణల వల్లనే సర్వశుభములు సిద్ధిస్తాయి. ఈ సుషుమ్నయే 'చిదగ్నికుండ సంభూత' అయిన దుర్గా అమ్మవారుగా నారాయణీయంలో 'తామగ్ని వర్ణాం తపసాజ్వలన్తీం....'' 'జాతవేదసే సునవామసోమమరాతీ....' అనే మంత్రాల్లో కీర్తింపబడుతుంది. ఇది 'శివదూతీ విద్య' కు ఫలశ్రుతిగా చెప్పబడిన నామంగా అనుకోవచ్చును.

శివదూతీ, శివారాధ్యా, శివంకరీ నామాలు వరుసగా స్థూల, సూక్ష్మ, కారణ లక్షణాలను సూచిస్తాయి.

1) సర్వ శుభములను చేకూర్చునది.

2) సుషుమ్నా నాడీ సమన్వయ స్వరూపిణి - అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 409. శివప్రియా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'శివప్రియాయైనమః' అని చెప్పాలి.

శివ = శివునికి, ప్రియా = ఇష్టమైనది లేదా శివుని ఇష్టము గాగలది.

శివుని యొక్క రూపమే అమ్మవారు అయినపుడు - అమ్మవారికి శివుడంటే ప్రీతి అన్నపుడు - అమ్మవారికి తన మీదనే తనకు ప్రీతి అని చెప్పినట్లవుతుంది.

అసలు ఈ ఇద్దరూ ఎన్నిరకాలుగా ఉంటారో చెప్పలేము. ఒకసారి చెరి సగంగా ఉంటారు. ఒకసారి ఒకరిలో ఒకరుంటారు. మరోసారి ఒకరుగా ఒకరుంటారు.

ఇంకోసారి ఇద్దరూ కలిసి పోయే ఉంటారు. ఇలా 'చీకటి – వెలుగులు' లాగాను, 'చెట్టు – విత్తనం' లాగాను ఎన్నో రకాలుగా కలిసిపోయినట్లుగాను, విడి విడిగా ఉన్నట్లుగాను ఉండగలరు. వాళ్లిద్దరి మధ్య ఉండే ప్రేమే వాళ్ళిద్దర్ని అలా ఉండేట్లుగా చేయిస్తుంది. ఇలాంటి దాంపత్యం మరొకరికి లేదు. ముందు ముందు గూడా ఎవరికీ రాదు. ఈ ఇద్దరూ ప్రతి జీవిలో 'ఆత్మను – దేహాన్ని', లేదా 'ప్రకృతి – పురుష' తత్త్వాలను లేదా 'ప్రజ్ఞ - పదార్థ (Consciousness & matter) తత్త్వాలను' సూచిస్తారు. అందుకే వీళ్ళని ఒకరి నుండి ఒకరిని విడదీయలేము.

'శివము' అంటే మంగళకరము అనే అర్థంలో – మంగళకరమైన, శుభప్రదమైన, కళ్యాణవంతమైనవి ఏవైనా అమ్మవారికి ఇష్టమే ! ఆవిడ కళ్యాణి కాబట్టి – ఆవిడకు కావల్సింది లోకకళ్యాణమే !

1) శివునికి ప్రీతికరమైనది లేదా శివునిపై ప్రీతి కలది.

2) మంగళకరమైన వాటియందు ప్రీతి కలిగినది – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 410. శివపరా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'శివపరాయైనమః' అని చెప్పాలి.

శివ = = శివుని, పరా = పరమావధిగా కలిగినది.

అమ్మవారికి ధ్యేయము, లక్ష్యము, పరమావధి – శివుడే ! ఆ పరబ్రహ్మయైన సదాశివుని యందే అమ్మవారికి అంత నిష్ఠ. ప్రకృతి అనే కార్యానికి పురుషుడు ఎలా కారణమో, అమ్మవారికి అయ్యవారు అలాంటివాడు. కాబట్టి, అమ్మవారికి పరమావధి శివుడేఔతాడు. శివపరులైన వారి వల్ల భగవద్దర్శనం జరుగుతుంది. జరగవలసిన పనులు జరుగుతాయి. హద్దులు, పరిమితులు, పరిధులు లేని వారే శివపరులు. భక్తితత్పరులే శివపరులౌతారు.

( శివమూర్తిః, శివప్రియా, శివపరా, ఈ మూడు నామాలను అర్థం చేసుకోడానికి ఈ క్రింది ఉదాహరణలు చెప్పుకోవచ్చును.

1) నీటికి ($H_2O$) సంబంధించిన పరమాణువులు మంచులాగా ఉన్న స్థితి - శివమూర్తి' నామార్థాన్ని

2) అవి నీళ్ళ రూపంలో ఉన్న స్థితి - 'శివప్రియా' నామార్థాన్ని.

3) అవి నీటి యావిరిగా ఉన్న స్థితి - 'శివపరా' నామార్థాన్నీ సూచిస్తాయి.

పంపుగొట్టాలలో నీరు పై మూడు స్థితులలో ఉన్నప్పుడు పంపు తిప్పితే మూడు రకాలుగా వ్యవహరిస్తుంది. ఎలా అంటే -

1) మంచుగా ఉన్నప్పుడు పంపు తిప్పితే అడ్డుకుంటుంది. ఈ స్థితి అయ్యవారు అమ్మవారి ఆకారాన్ని, రూపాన్ని పొంది ఉండటాన్ని సూచిస్తుంది. ఇది శివమూర్తి స్థితి.

2) గొట్టంలో నీరు నీళ్ళుగా ఉన్నప్పుడు పంపు తిప్పితే - నీరు వస్తుంది. ఈ స్థితి - ఇద్దరూ ఒకరిలో ఒకరు కరిగి పోయి వారి ప్రేమలోకంలో పరిమితమై వారు ఉండటాన్ని సూచిస్తుంది. ఇది 'శివప్రియా' స్థితి.

3) గొట్టంలో నీరు ఆవిరిగా ఉన్నప్పుడు పంపు తిప్పితే - గొట్టమంతా వ్యాపించి ఉండటమే కాకుండా, బయటకు వచ్చి గూడా అంతటా వ్యాపిస్తుంది. ఈ స్థితి - ఇద్దరికీ అవధులు, హద్దులు ఉండవని; అంతా శివపరమే, అంతా శివమయమే - అనే లక్షణాన్ని సూచిస్తుంది. ఇది - 'శివ పరా' స్థితి.)

'శివుని పరమావధిగా కలిగినది' అని ఈ నామానికి అర్థం.

## 411. శిష్టేష్టా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'శిష్టేష్టాయైనమః' అని చెప్పాలి.

శిష్ట = శిష్టజనులు, అనగా - సజ్జనుల యందు, ఇష్టా = ఇష్టము గలిగినది. 'శిష్టులు' అంటే - 'శేషించినవారు', అనగా - 'మిగిలినవారు' - అని అసలైన అర్థం. శిష్టులంటే - 'సదాచార సంపన్నులు', 'క్రమశిక్షణా శీలురు', 'ఉత్తమ ప్రవర్తన గలిగినవారు' అనే అర్థాలున్నాయి. అయితే, ఈ అర్థాలు 'శేషించినవారు' అనే అర్థం నుండే వచ్చాయి. ఎలాగంటే -

'విభూతి వస్తోందిట అంటేను, గాలిలోంచి శివలింగాలు తీస్తారుట అంటేను, 'బంగారు ఉంగరాలు' ఇస్తారుట, పట్టుచీర లిస్తారుట, రాగిని బంగారంగా మారుస్తారుట, పిల్లలకు ఉద్యోగాలిప్పిస్తారుట, ఉన్నత పదవులు తెప్పిస్తారుట' – ఇలా ఎన్నో రకాల వ్యామోహాలకు ఆకర్షితులై, కొందరు కొందరి దగ్గఱకు వెళ్తూ ఉంటారు. వీళ్ళందరూ వ్యామోహితులే ! దురాశాపరులే ! వ్యాపార దృష్టి కలిగిన వారే ! అట్లా పోగా వీటితో నిమిత్తం లేకుండా మిగిలిన వారు కొందరుంటారు. వాళ్ళే శేషించిన వాళ్ళు. లేదా 'శిష్టులు'. వీళ్ళకు పై వ్యామోహాలతో నిమిత్తం లేకుండా అసలైన జ్ఞానం మీద, బ్రహ్మ విద్యమీద, సేవ మీద ఆసక్తి ఉంటుంది. వీళ్ల ఈ ఆసక్తితోనే పెద్దవారి దగ్గఱకు వెళ్తారు. అందరినీ ఏదో విధంగా ఆకర్షించి, ఆ తర్వాత వారిని బాగువడుద్దామనే – పెద్దవారు ఇలాంటి మార్గాలు అనుసరిస్తారు. (షిరిడీసాయి బాబా గూడా ఇలా చేసిన వారే !) అందరూ ఇలా శిష్టులుగా మారాలని గురువులకుంటుంది.

1) 'శిష్టులు అంటే అమ్మవారికి ఇష్టం' అని ఒక అర్థం.

2) 'శిష్టుల చేత ఇష్టుల (యాగాదులు) రూపంతో ఆరాధింపబడునది' అని ఇంకో అర్థం.

3) జిజ్ఞాసువుల, శిష్టేష్టుల రూపంలో నుండునది' అని మరో అర్థం ఈ నామానికి చెప్పుకోవచ్చును.

## 412. శిష్టపూజితా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'శిష్టపూజితాయైనమః' అని చెప్పాలి.

శిష్ట = శిష్ట జనులచేత, పూజితా = పూజింపబడునది.

(పైన చెప్పిన శిష్ట జనుల చేత అమ్మవారు పూజింపబడుతుంది. ఒక్కొక్కప్పుడు అటువంటి శిష్టజనులకు ఉపకారం చేసి ఆదుకుంటే, వారు మనపై పూజ్య భావం కలిగి ఉండవచ్చు. ఆ పూజ్యభావాన్ని, వారి పూజల్ని – మనకి జమ కట్టుకోకూడదు. అమ్మవారిని మనలో దర్శించి, మన చేత అమ్మవారు వారికి మంచి చేసిందనే దృష్టితో ఆ ప్యూజ్య భావాన్ని వ్యక్తం చేసి పూజిస్తారని గుర్తుపెట్టుకోవాలి.)

శిష్ట జనుల చేత పూజింపబడునది – అని ఈ నామానికి అర్థం.

## 413. అప్రమేయా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'అప్రమేయాయైనమః' అని చెప్పాలి.

అప్రమేయా = ప్రమాణములు లేనిది. ప్రమాణములకు లొంగనిది. అమ్మవారు మన లెక్కలకు, ప్రశంసలకు, మన ప్రమాణాలకు, లొంగదు. హద్దులు, అవధులు, పరిమితులు ఉన్న వాటి పరిమాణాలను కొలవవచ్చును గాని వీటికి అతీతంగా 'సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ' అనే లక్షణాలున్న అమ్మవారిని కొలవగలమా! ఒక చట్రంలో బిగించగలమా? ఒక నిర్వచనంతో సూక్ష్మీకరించగలమా? ఇవేవీ ఎవరి దగ్గఱ కుదరవో ఆవిడ అమ్మవారు.

'కొలతలు లేనిది, కొలతలకు లొంగనిది' – అని ఈ నామానికి అర్థం.

## 414. స్వప్రకాశా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'స్వప్రకాశాయైనమః' అని చెప్పాలి.

స్వప్రకాశా = తనంతట తానే ప్రకాశించునది.

జ్ఞప్తికి రాని విషయం జ్ఞప్తికి రావడం, తెలియని విషయం తెలియడం – స్వప్రకాశా లక్షణాలు (Intution). ఇవి లోపల నుండి వాటంతట అవి బయటకు వచ్చేవి.

వైద్య శాస్త్రంలో – ఫిషర్స్ కలుసుకోడాన్ని 'జ్ఞాపకం రావడం' అంటారు. కాని, అది సరికాదు. 'జ్ఞాపకం వస్తే ఫిషర్స్ కలుసుకుంటాయి' అనడం సబబు. 'నిద్ర వస్తే కనురెప్పలు మూసుకుంటాయి' అని చెప్పడమే సబబు గాని, 'కనురెప్పలు మూసుకుంటే నిద్ర వస్తున్నట్లు లెక్క' అని చెప్పటం సబబు కాదు.

'గుఱ్ఱం బండిని లాగడం' అంటే – 'బండి గుఱ్ఱాన్ని నెట్టడమే!' అన్నట్లుంటుంది వైద్య శాస్త్రంలో చెప్పే విధంగా అర్థం చెప్పుకుంటే.

('మత్తః స్మృతిః జ్ఞానమపోహనంచ' - అన్న గీతా వాక్యాన్ని ఇక్కడ గుర్తు చేసుకోవాలి)

'అయితే అందరికీ ఒకేలా జ్ఞానం ప్రకాశించాలిగదా' అని అనిపించవచ్చు. లోపల జ్ఞానం విద్యుత్తు లాంటిది. ఆ విద్యుత్తుకు 'పాత విద్యుత్తు, - కొత్త విద్యుత్తు', 'సరిగా పని చేయని విద్యుత్తు, - పనిచేసే విద్యుత్తు' అనే 'మంచీ - చెడూ' లక్షణాలుండవు. ఆ దుర్లక్షణాలు విద్యుత్తు ప్రవహించే తీగల్లోను, వాటికి ఆచ్ఛాదనంగా ఉండే 'ఇన్సులేటర్స్'-లోను, బల్బులలోను, రేడియోలలోను - ఇతర విద్యుత్తు మీద పనిచేసే సాధనాలలోను ఉండవచ్చును. అలాగే, భౌతిక దేహానికి మంచీ చెడూ లక్షణాలుంటాయిగాని దాని ద్వారా వ్యక్తమయే జ్ఞానానికి ఉండవు.

జ్ఞాన స్వరూపిణి అయిన అమ్మవారి విషయంలో కూడా అంతే ! ఇంద్రియ మనోబుద్ధుల చేత ప్రకాశింప చేయబడలేనిది. ఆవిడ స్వయంజ్యోతిః స్వభావాన్ని గురించి ఈ క్రింది శ్లోకం చెబుతుంది.

'యద్భాసా భాస్యతే సూర్యో యద్భాసా భాస్యతే జగత్,
స్వాన్తస్థజ్యోతిరూపాసా స్వ ప్రకాశాతదుచ్యతే'.

''దేనివలన సూర్యుడు, జగత్తులు ప్రకాశవంత మౌతున్నాయో అట్టి అంతరంగ ఆత్మరూప జ్యోతిని స్వప్రకాశమని అంటారు'' - అని పై శ్లోకానికి అర్థం. ఇది మనలోని చిత్కళకు సంబంధించిన బుద్ధి, జ్ఞానంగా గ్రహించాలి.

'తనంతతాను ప్రకాశించునది' అని ఈ నామానికి అర్థం.

## 415. మనోవాచామగోచరా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మనోవాచామగోచరాయై నమః' అని చెప్పాలి.

మనః = మనస్సు చేత, వాచా = వాక్కుల చేత, అగోచర = గోచరము కానిది అనగా గ్రహింప వీలుకానిది.

సాధారణంగా దేన్ని గురించి అయినా తెలుసుకోవాలన్నా, చెప్పాలన్నా పంచజ్ఞానేంద్రియాల ద్వారా పని చేసే మనస్సు ఉండాలి. చెప్పడానికి వాక్కులుండాలి. కాని, ఈ రెంటి ద్వారా కూడా గోచరం కానిది అమ్మవారు. ('గోచరము' - అనే పదంలో కన్నుద్వారా దృశ్యాన్ని చూడటం, చెవి ద్వారా వాక్కును వినడం, నాలుక ద్వారా రుచిని గ్రహించడం, అనే విషయాలన్నిటి అర్థమూ ఉంటుంది.)

ఇంద్రియాలు, మనస్సులు, వాక్కులు ఇవన్నీ ఎవరి వలన సృష్టింపబడ్డాయో, ఎవరి కంటె తర్వాత ఉంటాయో ఆవిడ అమ్మవారైతే అటువంటి అమ్మవారు మనస్సుకు, వాక్కులకు ఎలా గోచరవౌతుంది ? దీన్నే తైత్తిరీయంలో 'యతోవాచోనివర్తంతే అప్రాప్యమనసాసహ' అన్నారు. మనస్సుతో సహా వాక్కులు గూడా ఎంతవరకు వెళ్ళి వెనక్కి తిరుగుతాయో, ఆ కక్ష్యలో ఉండే అమ్మవారు ఇంద్రియ మనో వాగ్గోచరం కాదు. సృష్టి క్రమంలో ముందు అవ్యక్తము, అటుపైన మహత్తత్త్వము, అటుపైన అహంకారము, మనస్సు ఏర్పడుతాయి కాబట్టి - మనస్సుకు తన మూలకారణమైన అమ్మవారు గోచరము కాదు. అలాగే, పరాస్థితిలో ఉండే అమ్మవారిని - ఆ పరా, పశ్యంతీ, మధ్యమాస్థితులు దాటిన తరువాత వచ్చే వైఖరీ వాక్కులు వర్ణించలేవు.

'మనస్సు చేత, వాక్కుల చేత గోచరము కానిది' అని ఈ నామానికి అర్థం.

## 416. చిచ్ఛక్తిః

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'చిచ్ఛక్త్యైనమః' అని చెప్పాలి.

చిత్ + శక్తిః = చిచ్ఛక్తిః = చైతన్యశక్తి.

'చిత్' అంటే - ప్రతి జీవిలోను ఉండు చైతన్యశక్తి. నిద్రకు - మెలకువకు తేడాను తెలిపేది; అర్థం కాని స్థితికి - అర్థమైన స్థితికి తేడాను తెలిపేది, శవానికి - ప్రాణికి తేడాను తెలిపేది ఏదైతే ఉన్నదో దానిని 'చిచ్ఛక్తి' అంటారు. ఈ 'చిచ్ఛక్తి' ఒక జీవికి మాత్రమే పరిమితము కాదు. అఖిలాండకోటి బ్రహ్మాండాలకు గూడా సంబంధించినది.

'పరమాణువునందు నుండి, పరమాత్మయందు దాకా పని చేసే చైతన్య శక్తి' - అని ఈ నామానికి అర్థం.

## 417. చేతనారూపా

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'చేతనారూపాయైనమః' అని చెప్పాలి.

చేతనా = చలించు తెలివియొక్క రూపము.

గతనామంలో చెప్పిన చిచ్ఛక్తి ఒక రూపం దాలిస్తే, ఆ రూపం చేతనా రూపం అవుతుంది. Personification of Activity - or Alertness or Thought propelled intention

'చేత' ను (Action) తన గమనము (Displacement)గా గలిగిన చేతనము (Dynamism అని ఈ నామానికి అర్థం.

## 418. జడశక్తిః

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'జడశక్త్యైనమః' అని చెప్పాలి.

జడశక్తిః = ఒక స్థితిలో ఉండి పోవునట్లు చేయు శక్తి.

'ఇతరమైన బాహ్య ప్రేరణలు, ప్రమేయాలు లేకుండా ఉన్నంత వరకు - ఒక స్థితిలో ఉన్నది అదే స్థితిలోను, గమనంలో ఉన్నది అదే రకమైన గమనంలోను ఉండే లక్షణాన్ని జడత్వం (Inertia) అంటారు. ఈ జడత్వ లక్షణానికి కారణమైన శక్తిని 'జడశక్తి' అంటారు. ఈ జడశక్తివల్లనే పుట్టినపుడు ప్రారంభమైన హృదయస్పందన మరణించేంతవరకు అదే విధంగా కొనసాగబడుతుంది. ఈ జడశక్తి వల్లనే ఒకసారి గుర్తు పెట్టుకున్న విషయం ఎన్ని రోజులైనా గుర్తుండి పోతుంది. మొట్టమొదట చిచ్ఛక్తి యొక్క ప్రేరణ లేకపోతే జడశక్తి తనంత తాను స్వతంత్రించి పని ప్రారంభించలేదు. ప్రపంచంలోని నిలకడలకు, (Stabilities), స్థిర నిశ్చలతలకు(Stable Equilibriums) ఈ జడశక్తే కారణం.

'ఒక స్థితిలోనే ఉండిపోవుటకు దోహదపడు శక్తి' అని ఈ నామానికి అర్థం.

## 419. జడాత్మికా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'జడాత్మికాయైనమః' అని చెప్పాలి.

జడ = జడశక్తి యొక్క, ఆత్మికా = స్వరూపము.

ఇంతకు ముందు చెప్పిన జడశక్తికి ఒక రూపాన్ని ఊహిస్తే ఆ రూపం గల అమ్మవారిని 'జడాత్మికా' అంటారు. ప్రకృతికి సంబంధించిన – అస్తి, భాతి, ప్రియ, నామ, రూప - లక్షణాల్లోని చివరి రెండూ అయిన – నామ, రూపాలు జడ రూపంలోనే ఉంటాయి కాబట్టి, అవి ప్రకృతికి సంబంధించిన జడత్వ లక్షణాలను సూచిస్తాయి. చిచ్ఛక్తికి సంబంధించిన – చేతనారూపం, ఈ జడశక్తికి సంబంధించిన – జడాత్మికా – ఈ రెంటి సమ్మేళనమే ఈ జగత్తు. ఈ రెంటిలో ఏ ఒకటి లేకపోయినా జగత్తు పరిపూర్ణ లక్షణాన్ని సంతరించుకోదు. అందుకని ఈ రెండు లక్షణాలు ఒక దాని కొకటి పరిపూరకాలు.

'జడశక్తి యొక్క స్వరూపము' అని ఈ నామానికి అర్థం.

## 420. గాయత్రీ

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'గాయత్ర్యైనమః' అని చెప్పాలి.

గాయత్రీ = గానము చేసిన వారిని రక్షించునది.

'న గాయత్ర్యా పరమ్ మంత్రం, నమాతుః పరదైవతమ్' అన్నారు. 'గాయత్రిని మించిన మంత్రం – తల్లిని మించిన దైవం లేరని' ఈ శ్లోకార్థం.

'మననాత్త్రాయతే ఇతి – మంత్రః' – అంటే మననము చేసిన కొలదీ రక్షించునది మంత్రము' అని అర్థము. 'గాయంతాం త్రాయతే ఇతి గాయత్రీ' అంటే గానము చేయు వారిని రక్షించునది 'గాయత్రీ' అని అర్థం. ఈ రెండు వ్యుత్పత్తి అర్థాలను బట్టి 'మంత్రము' అన్న పదానికి ఏది అర్థమో 'గాయత్రీ' అన్న పదానికి కూడా అదే అర్థం అని తెలుస్తోంది.

కాబట్టి గాయత్రి నూటికి నూరుపాళ్ళు 'మంత్రము' ఔతుంది. మానవులు వివేకంతో నిర్ణయం తీసుకునేది బుద్ధితోనే కాబట్టి, అటువంటి బుద్ధులను ప్రేరేపించే దేవత గాయత్రి. గాబట్టి, గాయత్రి అన్ని విధాలా మానవులకు అత్యంత అవసరమైన, అత్యంత ఆదరణీయమైన మంత్రం అవుతుంది. ఇటువంటి 'గాయత్రి' పదం గూడా అమ్మవారి నామంగా చెప్పబడిందంటే – అమ్మవారే గాయత్రి అని అర్థం గదా !

అమ్మవారి కళ్ళు – సూర్య, చంద్ర, అనలాత్మకమైనవి. వీటికి ప్రతీకలుగానే సావిత్రి, గాయత్రి, సరస్వతీ అనే ముగ్గురు దేవతలు చెప్పబడ్డారు. వీరిలో గాయత్రికి –చంద్రునికి సంబంధం వుంది. శ్రీవిద్య అంతా ఎక్కువగా చంద్ర సంబంధమైన విద్య కాబట్టి అమ్మవారు – గాయత్రీ ఒక్కరే అనుకోవాలి. ఇద్దరికీ అభేదాన్ని గ్రహించాలి. వేదమాతగాను, వేదత్రయ సారంగాను ధ్యానించే గాయత్రికి, 'వేద జననీ' అయిన అమ్మవారికీ – అభేదమే అని చెప్పడానికి వేరొక నిదర్శనం అక్కరలేదు. (ఈ గాయత్రిని గూర్చి ఇంకా ఇతర వివరాలు తెలుసుకోవాలంటే నేను వ్రాసిన 'గాయత్రి' పుస్తకం చదవండి) గాయత్రిని కంఠంతో ఉచ్చరిస్తుంటే, మనం – మనలో కాక, వివేక లోకంలో ఉంటాం. తత్ఫలితంగా పాత్రత, అర్హత, పవిత్రత పెరుగుతాయి.

'గానము చేయు వారిని రక్షించునది' అని ఈ నామానికి అర్థం.

## 421. వ్యాహృతిః

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'వ్యాహృత్యైనమః' అని చెప్పాలి.

వ్యాహృతిః = ఉచ్చరింపబడి వ్యాప్తి చెందునది.

'వ్యాహృతి' అంటే – ఉచ్చారణ. భగవంతుని నిశ్వాసలే వేదాలుగా వెలువడ్డాయి. ఉచ్చారణ నిశ్వాసతో జరిగేది కాబట్టి 'వ్యాహృతి' అంటే ఉచ్చారణ కాబట్టి – ఈ వ్యాహృతులు వేద స్వరూపాన్ని బోధించేవిగా అర్థం చేసుకోవాలి. గాయత్రీమంత్రానికి ముందు ప్రణవ పూర్వకంగా మూడు వ్యాహృతులు చెప్పబడతాయి. అవే – భూః, భువః సువః. ఈ మూడు వ్యాహృతులు ప్రతి వ్యక్తిలోని పాతాళ, మర్త్య, దేవలోకాలను; పదార్థ

(Matter), శక్తి(Force) ప్రజ్ఞా(Consciousness) లోకాలను సూచిస్తాయి. ఈ విధమైన విభాగం కాకుండా, సప్త వ్యాహృతులు సూచించు సప్తలోకాల విభజన గూడా వుంది. అవి - భూః, భువః, సువః, మహః, జనః, తపః, సత్యమ్. ఈ వ్యాహృతులు సూచించే లోకాలు, తత్త్వాలు క్రింద తెలుపబడ్డాయి.

1) భూలోకము లేక పృథివీతత్వము (Plane of Matter)

2) భువర్లోకము లేక అంతరిక్షము (Plane of Ether)

3) సువర్లోకము లేక ప్రజ్ఞాలోకము Plane of Consciousness)

4) మహర్లోకము లేక తేజోలోకము (Plane of light)

5) జనోలోకము లేక జనన లోకము (Plane of generation)

6) తపోలోకము (Plane of light, Electricity and consciousness)

7) సత్యలోకము (Plane of Radiating consciousness of true existence of all the six lower planes)

దివి, పృథివి, అంతరిక్షలోకాలలో ఈ ఏడు లోకాల దేవతలు వేరు వేరుగా పనిచేస్తారు. కాబట్టి, మొత్తం 3 X 7 = 21 స్థాయిలు. ఇవి, మూడు స్థాయిలలో ఏడేడు చొప్పున స్వరాలుగా వాక్కునందు వ్యక్తమవుతాయి - అంటే ఉచ్చరింపబడతాయి.

ఉచ్చారణ, వ్యాపక లక్షణ సామ్యాలవలన 'వ్యాహృతి' అమ్మవారి నామంగా చెప్పబడింది.

'ఉచ్చరింపబడి వ్యాప్తి చెందునది' - అని ఈ నామానికి అర్థం.

## 422. సంధ్యా

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సంధ్యాయైనమః' అని చెప్పాలి.

సం + ధ్యా - సంధ్యా అనగా - 'సమ్యక్ + ధ్యానము' అని 'సంధ్యా' పదం సూచిస్తుంది కాబట్టి చక్కగా ధ్యానము చేయుబడునది అని అర్థం వస్తుంది. సంధ్యాకాలం గురించి ఈక్రింది విధంగా చెప్పబడింది.

'అహోరాత్రస్యయస్సంధి సూర్య నక్షత్ర వర్జితః,
తత్ర సంధ్యాముపాసీత సాయం ప్రాత స్సమాహితః

సూర్యుడు, నక్షత్రాలు లేని 'రాత్రి – పగటి' సంధికాలాన్ని సాయం సంధ్యా కాలం అంటారు. అంటే – సూర్యుడు అస్తమించిన తరువాత, నక్షత్ర దర్శనం కాకముందు సాయం సంధ్యాకాలంగాను, నక్షత్రములు కనబడకపోయిన తరువాత, సూర్యుడు ఉదయించకముందు ప్రాతః సంధ్యాకాలంగాను గుర్తించారు.

వాస్తవానికి ఇలా చెప్పిన సంధ్యా కాలాలు ప్రతి రోజూ గుర్తించడం కష్టమౌతుంది. అందుకని ఛాందోగ్యంలో – వేరే విధంగా నిర్ణయించారు. దీని ప్రకారం సూర్యబింబం సగంకనబడునప్పటి నుండి నక్షత్రాలు కనబడేంతవరకు మధ్య గల కాలం సాయం సంధ్యా కాలంగాను; అలాగే, సూర్యోదయానికి మూడు ఘడియలు (72 ని.లు) కాలముండగా నక్షత్రాలు కనబడే కాలం నుండి సూర్యోదయమయే వరకు ప్రాతః సంధ్యాకాలం గాను నిర్ణయించారు. సూర్యునితో కూడి యుండిన సాయంసంధ్య, నక్షత్రాలతో కూడి యుండిన ప్రాతః సంధ్య, పగటికాలంలో 3/5 నుండి 4/5 వంతు దాకా ఉండే కాలంతో కూడిన మధ్యాహ్న సంధ్యాకాలాలను సంధ్యావందనానికి ఉత్తమ కాలాలుగా నిర్ణయించారు.

ఈ సంధ్యాకాలాల్లో అర్థమవని విషయాలు అర్థమవుతాయని, జటిల సమస్యలకు పరిష్కారం స్ఫురిస్తుందని కనబడని (invisible) కనబడే (visible) జ్ఞానదేవతలు కలిసి ఈ సంధ్యాకాలాలల్లో విధులగూర్చి నిర్ణయాలు తీసుకుంటారని పెద్దలు చెబుతారు. మళ్ళీ– ఈ మూడింటిలో ప్రాతః కాల, సాయంసంధ్యా ధ్యాన సమయాలు మరింత ఎక్కువ ప్రయోజనకరంగా వుంటాయేమోననిపిస్తుంది. (ఎందుకంటే – దేవతలు గూడా విధులు Duties మారే సమయాలు ఇవి కాబట్టి). (మాస్టరు సి.వి.వి. గారు కూడా ఈ ప్రాతః సంధ్యా, సాయం సంధ్యా సమయములకు సమన్వయముగా ఉదయం 6 గంటలకు, సాయంత్రం 6 గంటలకు 'ప్రేయరు' చేయమన్నారు.)

'సంధ్య' అంటే మధ్య ఉండేది – అనే అర్థం కూడా ఉంది. పంచకోశాలైన అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశాలు ఐదింటిలో మధ్యగా ఉండేది మనోమయ కోశం. 'అన్యోంతర ఆత్మామనోమయః', ... తస్యయజూరేవశిరః, ఋక్ దక్షిణః పక్షః, సామోత్తర పక్షః, ఆదేశఆత్మా, అధర్వాంగిరసః

పుచ్ఛం ప్రతిష్ఠా' – అని తైత్తిరీయం చెబుతుంది. ( దీని పూర్తి వివరణ తెలుసుకోవాలంటే – నేను వ్రాసిన తైత్తిరీయోపనిషత్తు చదవండి.)

మనోమయ కోశానికి శిరస్సు – యజుర్వేదం; దక్షిణ పార్శ్వం – ఋగ్వేదం; ఉత్తర పార్శ్వం – సామవేదం; ఆదేశాలు అంటే బ్రాహ్మణాలు (Commentaries) - ఆత్మ, అథర్వణ వేదం – ప్రతిష్ఠారూపమైన పుచ్ఛం' అని పై మంత్రానికి అర్థం. కాబట్టి, ఈ విధంగా అవయవాలు కలిగిన మనోమయ కోశమే 'సంధ్య' అనే వేదం యొక్క సూక్ష్మ రూపం. సంధ్య మనోమయ కోశానికిసంబంధించింది కాబట్టే మనస్సును ఆకాలంలో ధ్యానంలో ఉంచమని చెప్పారు. ఈ సంధ్య సాక్షాత్తూ అమ్మవారిని సూచిస్తుందని ప్రస్తుత నామం ద్వారా తెలుసుకోవాలి.

ఇడా, పింగళా, సుషుమ్నా నాడుల సంధి స్థానం భ్రూమధ్యంలో ఉంటుంది. ఈ స్థానమే పుణ్య కాశీ పట్టణాన్ని గూడా సూచిస్తుంది. అమ్మవారి కుడి కన్ను సూర్యుడు, ఎడమ కన్ను చంద్రుడు. మధ్యన ఉన్న కన్ను అగ్ని. ఇవి వరుసగా పగలు, రాత్రి, సంధ్యాకాలాలను సూచిస్తాయి. కాబట్టి, రెండు కన్నుల మధ్య భాగం అయిన భ్రూమధ్యస్థానాన్ని సంధ్యగా గుర్తించి, ధ్యానానికి అనువైన స్థానంగా అర్థం చేసుకోవాలి. ఇదే మనస్తత్వాన్ని సూచించే ఆజ్ఞా చక్రస్థానం. ఇన్ని రకాలుగా పవిత్రమైన ఈ 'సంధ్య' అమ్మవారికి బిరుదు నామంగా ఏర్పడింది.

'చక్కగా ధ్యానం చేయబడునది' అని ఈ నామానికి అర్థం.

## 423. ద్విజబృంద నిషేవితా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ద్విజబృందషేవితాయైనమః' అని చెప్పాలి.

ద్విజబృంద = ద్విజాల చేత, నిషేవితా = నిశ్శేషముగా సేవింపబడునది.

'జన్మనాజాయతే శూద్రః సంస్కారాత్ ద్విజఉచ్యతే,
వేదపాఠీ భవే ద్విప్రః బ్రహ్మజ్ఞానీచ బ్రాహ్మణః'

'పుట్టడంతోటి ప్రతి వ్యక్తీ శూద్రుడే ! (ఉపనయన) సంస్కారం వలన ద్విజుడౌతాడు. వేదాన్ని పఠిస్తే విప్రుడౌతాడు. బ్రహ్మజ్ఞానం చేత బ్రాహ్మణుడౌతాడు' అని పై శ్లోకానికి అర్థం. కాబట్టి, ఉపనయన సంస్కారం జరిగినా, వేదాలు వల్లించినా, బ్రహ్మజ్ఞానం లేకపోతే బ్రాహ్మణుడు కాడని ఈ శ్లోకం చెబుతోంది. బ్రహ్మజ్ఞానం కలగడానికి శ్రీ విద్యను, బ్రహ్మ విద్యను ఉపాసించాలి.

శ్రీ విద్యలో కుండలినీ యోగం, ఆ కుండలినీ యోగంలో = షట్చక్ర సహస్రార చక్రాల ప్రసక్తి వస్తుంది. మూలాధారం వద్ద – సహజ ప్రవృత్తులు(Instincts); స్వాధిష్ఠానం వద్ద – ప్రేరణ, ప్రకోపాలు(Impulses); మణిపూరం వద్ద – ఆవేశ, ఉద్వేగాలు ఉంటాయి. విశుద్ధి వద్ద – శుద్ధత్వము, విస్పష్టత(Purity and clarity); ఆజ్ఞా చక్రం వద్ద – వివేకము, విచక్షణ (Discrimination and distinction); సహస్రారము వద్ద – ఆనందము, అనుభవము (Bliss and Experience) లక్షణాలుంటాయి. అనాహతము వద్ద – ప్రేమ, దయ (Love, affection and Compassion) ఉంటాయి. సుషుమ్నా మార్గంలోని క్రింది మూడు చక్రాలు ఒక త్రిభుజాన్ని, పై మూడు చక్రాలు ఒక త్రిభుజాన్ని ఈక్రింది పటంలో చూపిన విధంగా సూచిస్తాయని గుర్తిస్తే – వాటి మధ్య ఆధార బిందువుగా మధ్యదైన అనాహత చక్రం ఉంటుంది.




క్రిందకు శీర్షం కల త్రిభుజాన్ని అధో త్రిభుజము గాను పైన శీర్షం గల త్రిభుజాన్ని ఊర్ధ్వ త్రిభుజంగాను చెప్పుకుంటే – అధో త్రిభుజ చక్రాలవద్ద ఉండే లక్షణాలు చక్కగా సంస్కరింపబడి, ఊర్ధ్వ త్రిభుజ చక్రాలు సూచించే సల్లక్షణాలు వస్తే అటువంటి వారికి సంస్కారం జరగినట్లు లెక్క. అంతేకాని జందెపు పోగు వెయ్యడంతోనే సంస్కారవంతులైనట్లు లెక్కగాదు. ఇటువంటి సంస్కారం జరిగినవారిని 'రెండవ జన్మ ఎత్తినవారు' అని అంటారు. అంటే, వారు 'ద్విజులు' అవుతారన్న మాట. మానవ జన్మకు

ఉన్నత లక్ష్యమైన 'బ్రాహ్మణత్వము' రావాలంటే 'బ్రహ్మజ్ఞానం పొందాలి గాబట్టి – ఆ బ్రహ్మజ్ఞానానికి, శ్రీ విద్యకు భేదం లేదు కాబట్టి, అటువంటి ద్విజులందరూ స్వాధ్యాయ ప్రవచన సంధ్యోపాసనాది సత్కర్మలతో యోగ మార్గములో అమ్మవారిని నిరంతరము సేవిస్తూ 'బ్రహ్మజ్ఞానం పొంది – బ్రాహ్మణత్వం' పొందుతారు.

'సంస్కారము జరిగి ద్విజత్వము పొందిన వారిచే నిశ్శేషముగా సేవింపబడునది' – అని ఈ నామానికి అర్థం.

'ద్విజ' పదానికి 'దంతము' అనే అర్థంలో ఈ నామానికి ''దంతములచే స్తుతింపబడి సేవింపబడునది'' అనీ, మన దంతసంఖ్య 32 – అనుష్టుప్ శ్లోకంలోని అక్షరాల సంఖ్యను సూచిస్తుందనుకుంటే – ''పూర్తిగా అనుష్టుప్ శ్లోకములతో స్తుతింపబడునది'' (శ్రీ లలితా సహస్రనామ స్తోత్రం అంతా అనుష్టుప్ శ్లోకాలలోనే ఉంటుంది.) అనీ, మరో రెండు అర్థాలు గూడా ఈ నామానికి చెల్లుతాయి.

## 424. తత్త్వాసనా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'తత్త్వాసనాయైనమః' అని చెప్పాలి.

తత్త్వ = 'తత్' సంబంధమైన భావమే, ఆసనా = ఆసనముగా గలది.

'తత్' అనే సంస్కృత పదానికి తెలుగులో 'అది' అని అర్థము. ఆంగ్లంలో ఈ సంస్కృత పదమే కొద్దిగా విరూపణ (Distort) చెంది 'That' అయింది.

ఈ 'తత్' అనే పదంలో 'త', 'త్' అనే రెండు అక్షరాలు ఉన్నాయి. వీటిలో మొదటిది 'అజంతము', రెండవది 'హలంతము'. ఇవి వరుసగా సూక్ష్మ లక్షణాన్ని, స్థూల లక్షణాన్ని సూచిస్తాయి.

స్థూల, సూక్ష్మాలు దేని నుండి వస్తాయో అది కారణం ఔతుంది. ఈ 'త', 'త్' – లు 'తత్' అనే పదం నుండి వచ్చాయి. కాబట్టి 'తత్' పదం – కారణమౌతుంది. 'తత్‌కు సంబంధించిన' అనే అర్థాన్ని సూచించే పదమే 'తత్త్వం'.

ఇంతకు ముందు నామాల్లో చెప్పిన 'సంధ్య' – సూక్ష్మ లక్షణాన్ని, 'వ్యాహృతి' – స్థూల లక్షణాన్ని సూచిస్తాయి. 'తత్త్వభావన' లేదా 'బహ్మభావన' – కారణాన్ని సూచిస్తుంది. బ్రహ్మ భావన మీద ఉండే వాళ్ళను 'తత్త్వాసనులు' అంటారు. అమ్మవారు తత్త్వభావనా నిమగ్నురాలు కాబట్టి– 'తత్త్వాసనా' అనే నామం అమ్మవారికి బిరుదు నామంగా చెల్లుతుంది.

ఈ నామానికి ఈ క్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1. బ్రహ్మ భావనను ఆసనముగా కలిగినది.

2. తత్త్వములు ఆసనముగా గలది.

3. తత్, త్వంలను అధిష్ఠించి యుండునది.

('తత్' అంటే - అది (ప్రథమపురుష), 'త్వం' అంటే - నువ్వు (మధ్యమపురుష) ఈ ప్రథమ, మధ్యమ పురుషలచే (III rd Person, IInd Person) సూచింపబడే ''నేను'' (ఉత్తమ పురుష) ను ఆసనముగా గలది అమ్మవారు అని అర్థం.)

## 425. తత్

ఏకాక్షర నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'తస్మైనమః' అని చెప్పాలి.

తత్ = ఆ పరమాత్మను సూచించు పదము.

'తస్మాత్ విరాడ జాయత' – అని పురుష సూక్తంలోను, 'తత్పురుషాయ విద్మహే ... తదేవాగ్నిస్తద్వాయుస్త ధ్సూర్యః ... అని తైత్తిరీయం లోని నారాయణ ప్రశ్నలోను, 'తత్సవితుర్వరేణ్యం....' అని గాయత్రీ మంత్రంలోను, 'ఓం తద్బ్రహ్మ, ఓం తద్వాయుః... ఓం తత్సత్యమ్ – అని మంత్రపుష్పంలోనూ చెప్పబడిన 'తత్' శబ్దం ఎవరిని ఉద్దేశించి చెప్పబడిందో అట్టి నిర్గుణ పరబ్రహ్మ యొక్క సగుణ రూపం కాబట్టి – జగజ్జనని అయిన అమ్మవారికి గూడా 'తత్' పదం బిరుదు నామం అవుతుంది.

'అమ్మవారి నిర్గుణ తత్త్వాన్ని సూచించు పదమే – ఈ నామము.

## 426. త్వమ్

ఏకాక్షర నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'తుభ్యన్నమః' అని చెప్పాలి.

త్వం = నీవు

ఎదురుగా ఉండే వ్యక్తిని 'నీవు' అని అంటాము. అలాగే, ఇంతకు ముందు 'తత్' పదంలో చెప్పబడిన నిర్గుణ పరబ్రహ్మతత్వం ఎదురుగా రూపుకట్టుకుని ఉంటే – ఆ మూర్తిని ఆరాధించుటలో, అర్చించుటలో సంబోధించుటకు ఉపయోగించు పదాన్ని సంస్కృతంలో 'త్వమ్' (నీవు) అంటారు.

'అమ్మవారి సగుణ తత్త్వాన్ని సంబోధించు పదమే – ఈ నామము.

## 427. అయీ

రెండక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'అయ్యైనమః' అని చెప్పాలి.

అయీ = 'ఓయీ'! అనునట్లు, 'అమ్మా!' అని అమ్మవారిని సంబోధించు పదము. అమ్మవారి నిర్గుణ, సగుణ తత్త్వాలను సూచించే పదాలు ఇంతకు పూర్వం ముందు రెండు నామాల్లోనూ చెప్పబడ్డాయి. ఈ నామంలో మరొక విధమైన సంబోధనాత్మక 'పదం' అమ్మవారికి నామంగా చెప్పబడుతోంది. మనకు కావలసిన వారు, తెలిసినవారు ఎదురుగా తారసపడితే – వారిని 'ఏమోయి' అని 'ఓయీ'! అనీ అంటాము. అలాగే – పూజనీయురాలైన అమ్మవారిని గూడా అత్యంతమైన భక్తి పూర్వక సాన్నిహిత్యంతో మనం 'ఓయమ్మా'! అని సంబోధించడానికి సూచించే సంస్కృత పదం 'అయీ'.

'అమ్మవారితో గల సన్నిహిత సంబంధాన్ని తెలుపుటలో సూచించు పదమే – ఈ నామము.

## 428. పంచకోశాంతరస్థితా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పంచకోశాంతర స్థితాయైనమః' అని చెప్పాలి.

పంచ = ఐదు, కోశ = కోశముల, అంతర = మధ్యన, స్థితా = ఉండునది.

శరీరానికి స్థూల, సూక్ష్మ, కారణ విభాగాలలాగే, పంచకోశాల విభజన గూడా ఉంది. వీటి పేర్లు అన్నమయ(Physcical), ప్రాణమయ(Vital), మనోమయ(Mental), విజ్ఞానమయ (Intellectual), ఆనందమయ (Bliss) కోశాలు.

జీవి అస్తిత్వానికి నిదర్శనమైన శరీరంలో ఉండే ఐదు కోశాలను అన్నమయ కోశంతో ప్రారంభిస్తే – ఒక కోశం కంటె దాని ప్రక్క కోశము సూక్ష్మమైనది. వీటిలో అన్నిటి కన్నా స్థూలమైనది అన్నమయ కోశం. అన్నిటి కన్నా సూక్ష్మమైనది ఆనందమయకోశం. అన్నమయ కోశం – స్థూలశరీరానికి; ప్రాణమయ, మనోమయ,

విజ్ఞానమయ కోశాలు - సూక్ష్మ శరీరానికి; ఆనందమయ కోశం - కారణ శరీరానికి సంబంధించినవిగా అర్థం చేసుకోవచ్చును. ఈ ఐదుకోశాలలో - ఏ కోశానికి, సంబంధించిన ఆనందాన్ని ఆ కోశంలో పొంది, చివరకు ఆనందాన్ని పరిపూర్ణంగా పొందడానికే జీవుడు ఈ ఐదు కోశాలను ఏర్పాటు చేసుకుంటాడు. ఈ ఐదు కోశాలలో మొదటి నాలుగు కోశాలకు సంబంధించిన ఆనందాలు చివరి దైన ఆనందమయకోశానికి సంబంధించిన ఆనందంలో చిల్లర భాగాలే అవుతాయి. అయినప్పటికీ, ఈ ఐదుకోశాలలోనూ గూడా సాక్షీ మాత్రంగా, చైతన్యరూపంలో అమ్మవారు ఉంటుంది. ఈ ఐదు కోశాలకు సంబంధించిన ఏ భాగంలో అయినా మార్పు వస్తే - తత్సంబంధమైన ఆరోగ్యం కాని, అనారోగ్యం గాని జీవికి సంప్రాప్తిస్తుంది. ఈ విధంగా ఐదు కోశాల్లోను చైతన్య శక్తిగా పనిచేస్తుంది కాబట్టి, అమ్మవారిని 'పంచకోశాంతర స్థితా' అన్నారు.

'ఐదు కోశముల లోను ఉండి పని చేయు చైతన్యశక్తి' అని ఈ నామానికి అర్థం.

## 429. నిస్సీమ మహిమా

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'నిస్సీమ మహిమ్నేనమః' అని చెప్పాలి.

నిస్సీమ = హద్దులు లేని, మహిమా = మహిమగలది.

ఏ విధంగా చూసినా అమ్మవారు మహిమాన్వితురాలు. ఆది మధ్యాంత రహితురాలు. పంచకృత్య పరాయణ. అనుగ్రహంలోను, ప్రేమలోను, జ్ఞానంలోను వైభవంలోను ఆవిడకు ఆవిడే సాటి ! మూగవారిని పలికించ కలదు. కుంటివారిని దూకించకలదు. జడబుద్ధిని జ్ఞానిగా చెయ్యకలదు. ఘోరవ్యాధిగ్రస్తుణ్ణి చల్లని తన కంటి చూపులతో కనికరించి సంపూర్ణ ఆరోగ్యవంతుని చెయ్యగలదు. అనుగ్రహించదలుచుకుంటే దగ్గఱ, దూరము అనే భేదము వుండదు. ఇలా ఎటువంటి అసాధ్యమైన, దుష్కర కార్యాలైనా సుసాధ్యంచేసి సాధించగల 'దుర్గ' ఆమె ! అందుకే ఆమె మహిమకు హద్దులు, అవధులు వుండవు.

'హద్దులు, అవధులు లేని మహిమకలది' ' అని ఈ నామానికి అర్థం.

## 430. నిత్యయౌవనా

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'నిత్యయౌవనాయైనమః' అని చెప్పాలి.

నిత్య = సర్వకాలములందును, యౌవనా = యవ్వన దశలోనుండునది.

మానవ శరీరాలకు ప్రధానంగా నాలుగు దశలుంటాయి. అవి – 1) బాల్యము, 2) కౌమారము 3) యవ్వనము 4) వార్ధక్యము. ఈ నాలుగు దశలు ఒక దాని తరువాత ఒకటి జీవిత కాలగమనంలో వస్తాయి. ఈ నాలుగు దశలే కాకుండా, మనుష్యులకు మధ్య మధ్యలో అది వ్యాధులతో చిక్కి పోవడం, మితిమీరిన తిండితో గాని, శరీర తత్వాన్ని బట్టి గాని, ఒళ్ళు రావడం, ఇంద్రియాలు సరిగా పనిచెయ్యక పోవడం, ఇలాంటి ఎన్నో దురవస్థలతో శరీరం ఒకే రకంగా ఉండదు. ఆకార రేఖలు, రూప లావణ్యాలు మారిపోతూ ఉంటాయి. ఇలాంటి ఇబ్బందులు కాని, దురవస్థలు కాని ఏమి లేకుండా – ఎప్పుడూ – అంటే, సర్వకాల సర్వావస్థ లయందు – పదహారు సంవత్సరాల యౌవన దశలోనే అమ్మవారు ఉంటుంది. ఆమె షోడశకళా ప్రపూర్ణయే కాదు, షోడశాబ్ద ప్రపూర్ణ గూడా! ఆవిడ కాలాతీతురాలు కాబట్టి కాల ప్రభావం అమ్మవారి మీద ఏ మాత్రం పనిచెయ్యదు.

'యౌవనం అనేది శరీరానికి సంబంధించినది కాదు. మనస్సుకు సంబంధించినది' అనే విధంగా తీసుకుంటే – మన మనఃస్థితిని బట్టి ఎంత వయస్సు వచ్చినా మనమూ యౌవనంలోనే ఉండవచ్చు.

ఈ నామం నుండి గాయత్రీ దేవి స్థూల రూప విశేషాలు చెప్పబడతాయి.

'సర్వకాలములందు ఒకే రకమైన యౌవన దశలో నుండునది' – అని ఈ నామానికి అర్థం.

## 431. మదశాలినీ

ఇదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మదశాలిన్యైనమః' అని చెప్పాలి.

మద = పరవశత్వముతో కూడిన, శాలినీ = శీలము కలది.

ఉపాయశాలి, బలశాలి, దృఢశాలి, – వంటి సమాసమే 'మదశాలి' అనే నామం కూడా ! అయితే, ఈ 'మదం' అనగానే ఆధికారికమైన గర్వం, ఒళ్ళు పొగరు, అనే అర్థాలు గుర్తుకు వస్తాయి. కాని, 'మదం' అంటే 'పరవశత్వం' అని అసలైన అర్థం. అమ్మవారు నిత్యానంద స్వరూపిణి. చీకూ చింతా లేదు. జరిగే దంతా ఆవిడకు ఆనందమే! కాబట్టి, ఎప్పుడూ బ్రహ్మానంద పారవశ్యంలో ఉంటుంది.

'ఆనంద పారవశ్యంలో నుండు స్వభావము గలది' అని ఈ నామానికి అర్థం.

## 432. మదఘూర్ణితరక్తాక్షీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మదఘూర్ణితరక్తాక్ష్యైనమః' అని చెప్పాలి.

మద = పరవశత్వము వలన, ఘూర్ణిత = తిరుగుటచే, రక్త = ఎఱ్ఱదనమును పొందిన, అక్షీ = కన్నులు గలది.

ఈ నామంలోని పదాల అర్థాలను చూడంగానే – అమ్మవారు మదంతో ఒళ్ళుతూలుతూ, కళ్ళుతిరుగుతూ, చింత నిప్పుల్లాంటి కళ్ళతో భయం గొలిపేలా ఉంటుందేమోననే అనుమానం రావచ్చును. నామంలోని పదాలన్నిటికీ నిఘంటువులోని అర్థాలను చూస్తే అలానే అర్థం వస్తుంది కాని, ఈ పదాలు సూచించే గుణాలను బట్టి ఈ నామానికి అర్థం చెప్పుకోవాలి.

'మదం' – అంటే ఒళ్ళు కొవ్వెక్కటం కాక 'ఆనంద పరవశత్వమని' – 'ఘూర్ణిత' – అంటే, ఆనంద పారవశ్యంతో చలించే దనీ, 'రక్తాక్షి' అంటే ఎఱ్ఱ తామర పూలవంటి కన్నులు కలది అనే – గుణ సంబంధమైన అర్థాలు చెప్పుకోవాలి. ఈ ఆనంద పారవశ్యం ఆమె నిత్యయౌవన ప్రాభవం వలన ఉండే ఉత్సాహ లక్షణమే !

'ఆనంద పారవశ్యంతో చలించే ఎఱ్ఱ తామరపూల వంటి కన్నులు కలది' – అని ఈ నామానికి అర్థం.

# 433. మదపాటల గండభూః

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మదపాటల గండభువే నమః' అని చెప్పాలి.

మద = ఆనంద పారవశ్యము వలన, పాటల = తెలుపు, ఎఱుపుల సమ్మిశ్ర వర్ణములో ప్రకాశించు, గండభూః = చెక్కిళ్ళు కలది.

అమ్మవారి నిత్యయౌవన లక్షణం ఎవరిలోనూ లేని విశిష్ట వైభవ లక్షణం. ఈ లక్షణం వలన అమ్మవారు నిత్యానంద పారవశ్యంతో ఉంటుంది. పరువములో ఉన్నవారు పరవశత్వంతో ఉంటే - కపోలాలు కందినట్లు ఎఱ్ఱబడతాయి. అయితే - ఆ ఎఱుపు పూర్తిగా రక్తవర్ణం కాదు! తెలుపుతో కూడిన ఎఱుపుదనం. అంటే, తెల్లతామర పువ్వు, ఎఱ్ఱ తామర పువ్వుల మిశ్రవర్ణం అన్నమాట! ఈ మిశ్రవర్ణాన్నే - 'పాటలవర్ణం' అంటారు. (చంద్రుడు ఉదయిస్తున్నపుడు ఆ చంద్రుని వర్ణం గూడా పాటల వర్ణమే! అందుకే చంద్రుడు అధిపతి అయిన కర్కాటక రాశికి సంబంధించిన వర్ణాన్ని 'పాటలవర్ణంగా' జ్యోతిశ్శాస్త్రంలో చెబుతారు). అమ్మవారి రెండు కపోలాలు పాటల వర్ణంతో ప్రభవిస్తూ ఉంటాయన్నమాట.

'ఆనంద పారవశ్యం వలన పాటల వర్ణప్రభతో విరాజిల్లు కపోలాలు గలది' అని ఈ నామానికి అర్థం.

ప్రేమ ఉన్నవారిలో పారవశ్యం ఉంటుంది. ఆ పారవశ్యం ఉన్న వారిలో రాగం (ఆపేక్ష) ఉంటుంది. ఆ రాగం కళ్ళలోను, కపోలాల లోను వ్యక్తమౌతుంది. ఈ లక్షణాలను బట్టే - అవతల వారిలో ప్రేమ ఉన్నదీ లేనిది తెలుసుకోవచ్చును. 'మదశాలినీ', 'మదఘూర్ణితరక్తాక్షి' 'మదపాటల గండభూః' ఈ నామాలు మూడు అమ్మవారి అతిశయించిన ఆపేక్షను తెలియజేస్తాయి.

# 434. చందనద్రవదిగ్ధాంగీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'చందనద్రవదిగ్ధాంగ్యైనమః' అని చెప్పాలి.

చందన - మంచి గంధపు రసముతో, దిగ్ధ = పూయబడిన, అంగీ = శరీరము గలది.

అత్తరు, పన్నీరుల కంటె కూడా మంచి గంధ రసం(Sandal wood oil) - రాసుకున్న వారి శరీరానికి చల్లగా హాయిని చేకూరుస్తుంది, ఎదుటి వారికి ఆహ్లాదకరమైన, శుద్ధ సత్త్వమైన పరిమళాన్ని వెదజల్లుతుంది.

ఈ శుద్ధ సత్త్వ పరిమళ లక్షణం బ్రహ్మ వర్చస్సును సూచిస్తుంది.

'శుద్ధ సత్త్వమైన, ఆహ్లాదకరమైన, మంచి గంధపు రసం పూయబడిన శరీరము కలది' అని ఈ నామానికి అర్థం.

## 435. చాంపేయకుసుమప్రియా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'చాంపేయ కుసుమ ప్రియాయైనమః' అని చెప్పాలి.

చాంపేయ = సంపెంగ, కుసుమ = పుష్పములందు, ప్రియా = ప్రీతి కలది.

'చాంపేయ కుసుమం' - అంటే సంపెంగపువ్వు. అన్ని పూల మీద వ్రాలి తన ఆధిపత్యాన్ని నిరూపించుకునే తుమ్మెద సంపెంగ పూవు మీద వ్రాలదు. ఇంద్రియాలు + మనస్సు కలిపి మొత్తం '6' సంఖ్యతో ఉండే కాళ్ళను కలిగిన షట్పది ( తుమ్మెద) వాలని - అంటే స్పృశించని లేదా ప్రభావానికి లోను కాని - పువ్వే సంపెంగ పువ్వు. ఈ పువ్వు అంటే అమ్మవారికి ఇష్టం. సాధకులు కూడా ఇలాగే ఈ ఐదు ఇంద్రియాలు, మనస్సు ప్రలోభాలకు లొంగిపోకూడదనే తన అభీష్టాన్ని సంపెంగ పువ్వుపై గల తన ఇష్టం ద్వారా తెలియం చేస్తోంది అమ్మవారం. (ప్రథమ భాగంలోని 'నవచంపక పుష్పాభనాసాదండవిరాజితా' నామ వివరణ కూడా మళ్లీ ఇక్కడ చదివితే బాగా అర్థం మౌతుంది.)

'సంపెంగ పువ్వును ఇష్టపడునది' అని ఈ నామానికి అర్థం.

## 436. కుశలా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కుశలాయైనమః' అని చెప్పాలి.

కుశలా = క్షేమము, కౌశల్యమును గలది.

'కుశలా' అంటే - క్షేమము అనే అర్థంలో - జనన మరణా తీతురాలు, ప్రళయకాలంలో మహేశ్వరుని మహాతాండవాన్ని చూచే ఏకైక సాక్షిణి. కాబట్టి, అమ్మవారు ఎప్పుడూ క్షేమంగానే ఉంటుంది.

'కుశలా' అంటే 'కౌశల్యము' - అనే అర్థంలో, అమ్మవారు గొప్ప కౌశల్యము కలది. లేకపోతే అంత చక్కగా ఒక్కర్తీ ఈ సమస్త విశ్వానికి సంబంధించిన సృష్టి, స్థితి, లయ, తిరోధాన, అనుగ్రహ కృత్యాలు నిర్వహించలేదు. విశ్వంలోని ఏ విషయం చూసినా ఆవిడ నైపుణ్యము ప్రస్ఫుటంగా కనబడుతుంది. కాబట్టి, అమ్మవారు 'కుశలా', (మనస్సు ప్రశాంతంగా ఉండటమే కుశలానికి, అంటే - క్షేమానికి మూలకారణం).

1) 'చక్కని కౌశల్యము కలది.' అని ఈ నామానికి అర్థం.

## 437. కోమలాకారా

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కోమలాకారాయైనమః' అని చెప్పాలి.

కోమల = సుకుమారమైన, లేదా మృదులమైన, ఆకారా = స్వరూపము గలది. 'కోమలమైన' అంటే 'సుకుమారమైన, 'నాజూకైన' అనే అర్థాలతో పాటు 'సూక్ష్మమైన' అనే అర్థం కూడా చెప్పవచ్చును. అందరిలోనూ ఉండే అమ్మవారు సూక్ష్మంగానే ఉంటుంది. తామరకాడలోని సన్నని పోగు (Fibre) లాగా సుషుమ్నా నాడిలో ఉండే కుండలినీ శక్తే మనలోని అమ్మవారి సూక్ష్మరూపం. ఆ సూక్ష్మత్వాన్ని, సుకుమరత్వాన్ని మంత్రపుష్పంలో 'విద్యుల్లేఖేవభాస్వరా' అన్నారు. అంటే, 'మెఱుపుతీగ సొగసుతో ప్రకాశించునది' అని అర్థం. ఆ మెఱుపు తీగె ఆకారం ఎంత సుకుమారంగా, వన్నెలు చిన్నెలు వెదజల్లుతూ ఉంటుందో చూచిన వాళ్ళకే తెలుస్తుంది!

'సుకుమారమైన స్వరూపము గలది' అని ఈ నామానికి అర్థం.

## 438. కురుకుల్లా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కురుకుల్లాయైనమః' అని చెప్పాలి.

'కురుకుల్లా' అనేది అసలు సంస్కృత పదం కాదు. ఏదో ఒక ప్రత్యేక సమయంలో వాడబడే ఒక రహస్య పదం. ఈ పదం యొక్క అర్థాన్ని తెలుసుకోడానికి ప్రయత్నించటం కంటె ధ్యానం చేసి అర్థాన్ని సిద్ధింప చేసుకోవడం ఉత్తమం.

సుషుమ్నా మార్గాన్ని ఈ నామం సూచించే రహస్యార్థంగా కొందరు చెబుతారు.

(వేదంలో 'కపాలములు' అని ఇలాంటివే ఉంటాయి. అథర్వణ వేదంలో 'జర్భరీ' పదం ఇలాంటిదే! కేవలం శబ్దం చేత మాత్రమే అర్థం చేసుకోవాలి ఇలాంటి పదాలను, అంటే, మనం అప్పుడప్పుడు ఉచ్చరించే - ఛ, ఊ, ఆ, చ్చ్, చ్చ్, ఫ్ఫ్ ! - లాంటి పదాలవంటిదిగా ఈ 'కురుకుల్లా' పదాన్ని గూడా అర్థం చేసుకోవాలి.)

## 439. కులేశ్వరీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కులేశ్వర్యైనమః' అని చెప్పాలి.

కుల = కులమార్గమునకు, ఈశ్వరీ = ఈశ్వరి.

'కుల' పదాన్నీ - 'కులము, సముదాయము' అనే పదాలకు సంబంధించినదిగా అర్థం తీసుకుంటే - ప్రపంచంలోని అన్ని రకాల జీవరాశుల సముదాయానికి ఈశ్వరి - అని (అర్థం.) అన్ని కులములకు మూలమైనది అని, అన్ని కులవృత్తులకు మూలమైన శక్తి స్వరూపిణి అనీ చెప్పుకోవాలి.

'కుల' అంటే కుల మార్గానికి సంబంధించినదిగా తీసుకుంటే - వెన్నెముకలోని కులమార్గానికి - అంటే, సుషుమ్నా నాడీ మార్గాన్ని నడిపించే శక్తి స్వరూపిణి అని అర్థం చెప్పుకోవాలి.

1) కుల మార్గమునకు ఈశ్వరి.

2) అన్ని రకాల జీవరాశుల ఉత్పత్తికి మూలమైనది.

3) అన్ని కుల వృత్తులకు మూలశక్తి స్వరూపిణి. - అని, ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 440. కులకుండాలయా

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కులకుండాలయాయైనమః' అని చెప్పాలి.

కులకుండ = కులకుండమును, ఆలయా = నిలయముగా గలది.

మూలాధారం నుండి సహస్రారం దాకా ఉండే సుషుమ్నా మార్గాన్ని కులమార్గమని, కులకుండమనీ అంటారు. ఈ మార్గం గుండానే పైకి క్రిందకూ నిరంతరం అమ్మవారు చరిస్తూ, నిలుస్తూ, ఆరోహిస్తూ, అవరోహిస్తూ ఉంటుంది. అమ్మవారు మనలో ఎక్కువగా వసించే స్థానం ఈ కులకుండం. అందుకని ఈ స్థానం అమ్మవారికి ఆలయమన్నారు.

మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూర చక్రాలకు సంబంధించిన ఒక కుండాన్ని ఊహిస్తే - దాన్ని 'కులకుండం' అని చెప్పే పద్ధతి కూడా ఉంది. ('స్వపిషికుల కుండేకుహరిణి - సౌందర్యలహరి).

'కులకుండమును తన నిలయము గాగలది' అని ఈ నామానికి అర్థం.

## 441. కౌలమార్గతత్పరసేవితా

పది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కౌల మార్గ తత్పరసేవితాయైనమః' అని చెప్పాలి.

కౌలమార్గ = కౌలమార్గమును, తత్పర = అనుసరించువారిచే, సేవితా = సేవింపబడునది.

వెన్నెముకలోని కులపథం ఒక్కటే అయినా దాన్ని అనుసరించే విధానంలో రెండు పద్ధతులున్నాయి. 1) కౌలాచరము 2) సమయాచారము. కౌలాచారంలో మూలాధారం వద్ద ఉండే కులకుండానికి ప్రాధాన్యం ఉంటుంది. ఈ కులకుండాన్నే అమ్మవారి ఆలయంగాను, అంటే – నిలయంగాను భావించి భౌతికమైన ఎన్నో విధములైన ఆరాధనా విధానాలతో ఈ కౌలాచారులు అమ్మవారిని కొలుస్తారు. ఈ ఆరాధనలో కొన్ని వామాచార పద్ధతులు కూడా కలుస్తాయి. అందువలన ఈ పద్ధతులలో ఆరాధన సమయాచారులకు నచ్చదు. ఈ పద్ధతిని సమయాచారులు వేద బాహ్యమైనదిగా చెబుతారు. అయినా – వంశపారం పర్యంగా వస్తున్న ఆచారమని చెప్పుకునే వారిచే – ఈ పద్ధతిలో అమ్మవారి ఆరాధన ఇంకా అక్కడక్కడ కొన సాగుతూనే ఉన్నది. ఆరాధనలో అనుసరించే పద్ధతులను పట్టించుకోకుండా, అమ్మవారిపైనగల వారి భక్తిని, వారి ధ్యేయాన్ని, లక్ష్యాన్నే పరిగణించి ఈ మార్గాన్ని విమర్శించుకుండా ఉండేవారు గూడా ఉన్నారు.

'కౌలమార్గమును అనుసరించు వారిచే సేవింపబడునది' అని ఈ నామానికి అర్థం.

## 442. కుమార గణనాథాంబా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కుమార గణనాథాంబాయైనమః' అని చెప్పాలి.

కుమార = కుమారస్వామికి, గణనాథా = గణపతికి, అంబా = తల్లి అయినది.

అమ్మవారికి ఇద్దరు పుత్రులు. 1. గణనాథుడు, 2. కుమారస్వామి. మూలాధారం వద్ద ఉండేది గణపతి. అక్షర గణాలకు అధిపతి. లోపల నుంచి వచ్చే నాదానికి గొంతులో అడ్డు తగిలితే కాని హల్లులు ఉచ్చరింపబడవు. అందుకని హల్లులను మంత్ర శాస్త్రంలో 'విఘ్నములు' అంటారు. ఈ హల్లులు అనే విఘ్నాలకు అధిపతి కనుక గణపతిని 'విఘ్నేశ్వరుడ'న్నారు.

అక్షరంలో రెండు భాగాలుంటాయి. 1. అచ్చుకు సంబంధించిన భాగం. 2. హల్లుకు సంబంధించిన భాగం. అచ్చు భాగం అక్షరానికి ప్రాణాన్ని, హల్లు భాగం దేహాన్ని సూచిస్తాయి. ఈ రెండూ భాగాలు వరుసగా 'అయ్యవారు' , 'అమ్మవారి' కి

సంబంధించినవి. అందుకని 'అచ్చులు' – 'శివ' సంబంధమైన దైతే, 'హల్లులు' – 'పార్వతి' కి సంబంధించినవి. పార్వతితో భౌతిక సంబంధం లేకుండా శివుని వీర్యంతో జన్మించినవాడే కుమారస్వామి. అందుకని కుమారస్వామిని ఎక్కువగా శివునికి సంబంధించిన పుత్రుడుగా చెప్పుకోవచ్చును. అలాగే, శివునితో భౌతిక సంబంధం లేకుండా, పార్వతి తన నలుగు పిండితో ఏర్పరచిన బాలుడే గణేశుడు. అందుకని గణపతిని – ఎక్కువగా పార్వతికి సంబంధించిన పుత్రుడుగా చెప్పుకోవచ్చును. అందుకే, ఈ ఇద్దరినీ – వరుసగా అక్షరంలో ఉండే అచ్చు, హల్లు భాగాలకు సంబంధించిన వారుగా సమన్వయ పరచుకోవాలి. ఈ ఇద్దరికీ సంబంధించిన యంత్రాలు ఈక్రింద ఇవ్వబడ్డాయి.




కుమారస్వామి యంత్రము




గణపతి యంత్రం

1) 'కుమారస్వామి, వినాయకులకు తల్లి'.

2) ''అక్షరంలోని అచ్చు భాగాన్ని సూచించే కుమారస్వామికి, హల్లుభాగాన్ని సూచించే గణపతికి తల్లి అయిన వాగ్దేవతాస్వరూపిణి'' – అని ఈ నామానికి అర్థాలు.

(నాచే వ్రాయబడిన 'అక్షర గణపతి – కుండలినీపతి' అనే పుస్తకం చదివితే ఈ ఇద్దరి గురించి మరి కొన్ని విషయాలు తెలుస్తాయి).

సంబంధించినవి. అందుకని 'అచ్చులు' - 'శివ' సంబంధమైన దైతే, 'హల్లులు' - 'పార్వతి' కి సంబంధించినవి. పార్వతితో భౌతిక సంబంధం లేకుండా శివుని వీర్యంతో జన్మించినవాడే కుమారస్వామి. అందుకని కుమారస్వామిని ఎక్కువగా శివునికి సంబంధించిన పుత్రుడుగా చెప్పుకోవచ్చును. అలాగే, శివునితో భౌతిక సంబంధం లేకుండా, పార్వతి తన నలుగు పిండితో ఏర్పరచిన బాలుడే గణేశుడు. అందుకని గణపతిని - ఎక్కువగా పార్వతికి సంబంధించిన పుత్రుడుగా చెప్పుకోవచ్చును. అందుకే, ఈ ఇద్దరినీ - వరుసగా అక్షరంలో ఉండే అచ్చు, హల్లు భాగాలకు సంబంధించిన వారుగా సమన్వయ పరచుకోవాలి. ఈ ఇద్దరికీ సంబంధించిన యంత్రాలు ఈక్రింద ఇవ్వబడ్డాయి.




కుమారస్వామి యంత్రము




గణపతి యంత్రం

1) 'కుమారస్వామి, వినాయకులకు తల్లి'.

2) ''అక్షరంలోని అచ్చు భాగాన్ని సూచించే కుమారస్వామికి, హల్లుభాగాన్ని సూచించే గణపతికి తల్లి అయిన వాగ్దేవతాస్వరూపిణి'' - అని ఈ నామానికి అర్థాలు.

(నాచే వ్రాయబడిన 'అక్షర గణపతి - కుండలినీపతి' అనే పుస్తకం చదివితే ఈ ఇద్దరి గురించి మరి కొన్ని విషయాలు తెలుస్తాయి).

ఇంతకు ముందు నామం 'తుష్టి' – మానసికంగా ఉండాల్సిన సంతృప్తిని గూర్చి సూచిస్తే, ఈ నామం శారీరకమైన సమృద్ధిని సూచిస్తుంది. ఈ రెంటి రూపంలో అమ్మవారు ప్రతి జీవిలోనూ ఉంటుంది. (యాదేవీ సర్వభూతేషు పుష్టిరూపేణ సంస్థితా).

మానసిక తృప్తి, శారీరక పుష్టి కలిగినవారు నిత్య సుఖ సంతోషాలతో ఉంటారు.

'ప్రతి జీవిలోని పుష్టి యొక్క స్వరూపము – అని ఈ నామానికి అర్థం.

## 445. మతిః

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మత్యైనమః' అని చెప్పాలి.

మతిః = బుద్ధి. సర్వజీవులలోను అమ్మవారు బుద్ధిరూపంలో ఉంటుంది. (యాదేవీ సర్వభూతేషు బుద్ధి రూపేణ సంస్థితా)

'మననము' అనే పదానికి Past Participle 'మతిః'. వస్తువులను గూర్చి తెలుసుకోడానికి పంచేంద్రియములతో కూడిన మనస్సు అవసరం అయితే, విషయాలను గుర్తుపెట్టుకోడానికి, వస్తువులను తయారు చెయ్యడానికి, క్రొత్తవాటిని సృష్టించడానికి, నిర్ణయాలు తీసుకోడానికి అవసరమయేది 'బుద్ధి'. దీన్నే 'మతి' అంటారు. వ్యక్తిలో బుద్ధిరూపంలో ఉండే అమ్మవారిని 'మతిః' అంటారు.

'(వ్యక్తులలోని) బుద్ధి యొక్క రూపము' – అని ఈ నామానికి అర్థం.

## 446. ధృతిః

రెండక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ధృత్యైనమః' అని చెప్పాలి.

ధృతిః = ధైర్యము

ప్రతి జీవిలోను అమ్మవారు ధైర్యమనే రూపంతో ఉంటుంది. (యాదేవీ సర్వభూతేషు ధృతిరూపేణ సస్థితా)

మనమీద మనకు ఏ విషయంలో అయినా నిజమైన నమ్మకాన్ని కలిగించ కలిగే కారణం బయట ఉండదు. అంటే, బయట పరిస్థితులు, బయట వ్యక్తులు కారణం కాదు.

మనలోనే వుండే ఒక గుణం దీనికి కారణమవుతుంది. ఈ గుణాన్నే 'ధైర్యము' 'స్థైర్యము అనే – పేర్లతో పిలుస్తారు. ఆంగ్లంలో దీనినే – 'Internal Source of Support & Confidence' అంటారు. ఈ ధైర్య, స్థైర్యాలు మనలను బలపరుస్తూ – విపత్కర పరిస్థితులలో నిలబడగలిగేట్లు చేస్తాయి.

(ప్రతి జీవిలోని) 'ధైర్య రూపంలో ఉండునది' అని ఈ నామానికి అర్థం.

## 447. శాంతిః

రెండక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'శాంత్యైనమః' అని చెప్పాలి.

శాంతిః = తొట్రుపాటు లేని నిలకడ తనము గలది.

జయాపజయాలు, సంయోగ వియోగాలు, సుఖదుఃఖాలు, కష్ట సుఖాలు, లాభనష్టాలు, కలిమిలేముల – ఇటువంటి ద్వంద్వాల స్పర్శ చేత ఉద్వేగము, దైన్యము వంటి ఏ విధమైన మార్పు గాని ఉండని స్థితి లోని 'అనుభూతి'ని 'శాంతి' అంటారు. ఈ శాంతినే 'శమము' అంటారు. దీనిని 'శం' అనే అక్షరంతో సూచిస్తారు. 'శర్మ' – అంటే ''శం'' కలిగినవాడు అని అర్థం. అంటే – 'శాంతి కలిగినవారు' లేదా 'నిత్యము శాంతముగా నుండువారు' అని అర్థం. 'బ్రాహ్మణుడు' అవాలంటే ఈ 'శం' ఒక కీలక లక్షణమై ఉండాలి. (అందుకే సంధ్యావందనంలో బ్రాహ్మణులు గోత్ర ప్రవరలు చెప్పుకునేటప్పుడు నామ ధేయం తర్వాత 'శర్మ' అని చెప్పుకోవాలంటారు.)

'అమ్మవారు సర్వజీవులలోను శాంతిరూపంలో ఉంటుంది' (యా దేవీ సర్వభూతేషు శాంతి రూపేణ సంస్థితా). ప్రశాంతంగా మనస్సు ఉన్నవారే సరియైన నిర్ణయాలు తీసుకోగలరు. ఉద్వేగ స్థితిలో ఉన్నవారు పొరపాట్లు చెయ్యడానికి అవకాశం ఉంటుంది.

'శాంతిని కోరేవారు ఈ నామాన్ని 'శాంత్యైనమః' అని జపించాలి.

'శాంతి స్వరూపిణి' – అని ఈ నామానికి అర్థం.

## 448. స్వస్తిమతీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'స్వస్తిమత్యైనమః' అని చెప్పాలి.

సు + అస్తి = స్వస్తి = మంచిగా లేదా ఉండవలసిన విధానములో ఉండు, మతీ = మనోలక్షణము గలది.

'స్వస్తి', 'స్వధా', 'నమః', 'స్వాహా' – ఇవి కొన్ని ప్రత్యేక సందర్భాలలో ఉపయోగించవలసిన పదాలు.

1) మానవులకు కావలసింది – 'సంక్షేమం', దీన్నే 'స్వస్తి' అంటారు. అందుకే – తైత్తిరీయంలో – 'స్వస్తిర్మానుషేభ్యః' అన్నారు. అందుకే – భారతీయులు, శ్రోతీయులు ముందుగా 'స్వస్తి' పదంతోనే శుభలేఖ వ్రాయడం ప్రారంభిస్తారు. (భారతీయులంటే వెలుగును, సంక్షేమాన్ని, జ్ఞానాన్ని కోరేవారని అర్థం.)

2) పితృదేవతలకు సంబంధించిన పదం 'స్వధా'.

స్వ + ధా = తన్నుతాను ధరించుకొనుట (Self Sustenance) అనే అర్థంలో – పిండోత్పత్తి, విత్తనం మొలకెత్తడం మొదలైన ప్రక్రియలన్నీ పితృదేవతల సంబంధమైనవే అవుతాయి. మానవులకు 'స్వస్తి' అయితే, పితృదేవతలకు 'స్వధా' చెప్పాలి. అందుకే తైత్తిరీయంలో 'స్వధాపితృభ్యో' అన్నారు.

3) దేవతలకు సంబంధించిన పదం 'నమః'. ''న – 'మమ' – ఇతి నమః'' అంటే – తమకోసం కాకుండా, పనులు చేసే వాళ్ళని దేవతలంటారు. వీళ్ళని ఉద్దేశించి అభివందనం చేస్తున్నప్పుడు 'నమః' అని చెప్పాలి. అందుకే తైత్తిరీయంలో 'నమోదేవేభ్యః' అన్నారు.

4) అగ్నిలో హోమ ద్రవ్యాన్ని సమర్పిస్తున్నప్పుడు అగ్ని దేవుని ఉద్దేశించి చెప్పే స్వాగత వచనం – 'స్వాహా'

'సు + ఆహా' = స్వాహా ... అంటే 'సరియైన' దారి అని అర్థం. తన దగ్గఱకు వస్తువువస్తే ఆ వస్తువు తానై పోతాడు అగ్ని. ఇలా ఎవ్వరూ అవలేరు. ఎవర్నీ ఎవ్వరూ ఇలా తమలో కలుపుకోలేరు. అది అగ్ని యొక్క విశిష్ట గుణం. అందుకే 'సరియైన మార్గదర్శి' అనే అర్థంలో అగ్నిని ఈ 'స్వాహా' పదంతో ఆవాహన చేస్తారు. పైగా, మిగిలిన అందరి దేవతలనుద్దేశించి సమర్పించే హోమద్రవ్యాలన్నిటినీ ఎవరివి వారికి అంద చేసే తపాలా బంట్రోతు (Spiritual Postman) ఈ అగ్ని.

'సంక్షేమస్థితిని మనోలక్షణముగా గలది' అని ఈ నామానికి అర్థం.

## 449. కాంతిః

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కాంత్యైనమః' అని చెప్పాలి.

కాంతిః = కోరదగినది.

ప్రపంచంలో కోరదగినది ఒకటే. అదే వెలుగు. అందుకే కాంతికి వెలుగు అనే అర్థం తర్వాత వచ్చింది. 'వెలుగు' అనే అర్థాన్ని అనుసరించి ఈ పదానికి 'తేజస్సు', 'ప్రకాశము' అనే అర్థాలు గూడా వచ్చాయి.

ప్రతి జీవిలోను కాంతి రూపంలో అమ్మవారు ఉంటుంది. ( యాదేవీ సర్వభూతేషు కాంతి రూపేణ సంస్థితా) ప్రతి జీవి యందలి జీవ కళనే 'తేజస్సు' లేదా 'కాంతి' అని గూడా అంటారు. ఈ కాంతి – జీవ లక్షణాన్ని గూడా సూచిస్తుంది. శవానికి ఈ కాంతి ఉండదు.

1) కోరదగినది 2) కాంతి స్వరూపిణి – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 450. నందినీ

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'నంద్యైనమః' అని చెప్పాలి.

నందినీ = ఆనందిని – అంటే ఆనందమును అనుభవించునది. ఈనామాన్ని సరియైన పద్ధతిలో వ్రాయాలంటే 'నన్దినీ' అని వ్రాయాలి. 'న' కారం క్రింద 'ద' కారం వచ్చిన సంయుక్తాక్షరం 'న్ద' – ఆనన్ద సూచకమౌతుంది.

సృష్టి యొక్క సమత్వ సమతౌల్యాలను, (poise and Harmony) సౌష్ఠవ సౌందర్యాలను (Symmetry and Beauty) చూచి ఆనందించే వాడు ఏ పనిలో అయినా ఆనందాన్ని చూసి, ఆ పనిని ఆనందంగా చెయ్యకలడు. ఈ ఆనందానికి కారణం ఉండదు, షరతు ఉండదు. (Unconditional satisfaction) అమ్మవారికి ఈ లక్షణం ఉంటుంది.

యోగమాయ అయిన దుర్గాదేవి నందుని పుత్రిక కాబట్టి 'నందినీ' అని పిలువబడుతుంది.

కామధేనువు యొక్క కూతురు గూడా 'నందినీ' అనే పేరుతోనే పిలువబడుతుంది. (దిలీప మహారాజు, సుదక్షిణా దేవీ ఈ నందినీ ధేనువును సేవించుకున్న ప్రతిఫలంగా పొందిన పుత్రుడే – రఘుమహారాజు.)

'ఆనందమును అనుభవించునది' – అని ఈ నామానికి అర్థం.

## 451. విఘ్ననాశినీ

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'విఘ్ననాశిన్యైనమః' అని చెప్పాలి.

విఘ్న = విఘ్నముల (భావన)ను, నాశినీ = నాశము చేయునది.

ఈ నామాన్ని – 'విఘ్నాలను తొలగించునది' అనే అర్థంలో ధ్యానం చేస్తే – ముందు విఘ్నాలు ఉంటేనే కదా – అవి తొలగించాల్సిన అవసరం వచ్చేది, అందుకని ఉపాసకుని కోర్కె తీరడం కోసం కొన్ని విఘ్నాలు కలిగి, అటుపైన అవి తొలగుతాయి.

సాధారణంగా "అందరూ ఏవి ఏవి విఘ్నాలను కుంటారో – ఆ విఘ్నభావాలను ముందుగా తొలగించి, కార్యకర్తను – త్రికరణ శుద్ధిగా కార్యోన్ముఖుణ్ణి, కార్యనిమగ్నుణ్ణి, చేసేది" – అనే విధంగా నామాన్ని అర్థంచేసుకోవాలి.

కొందరు పరిస్థితులు అనుకూలంగా లేవనో, ఇంకా సమయం రాలేదనో – వెంటనే చేయవలసిన పనులను కూడా వాయిదా వేస్తూ ఉంటారు. వీళ్ళకు ఏ మాత్రం అవరోధం గాని, అంతరాయం గాని వచ్చినా, దాన్ని విఘ్నం క్రింద జమ కట్టుకుని చెయ్యవలసిన పనిని గూడా ఆపేస్తారు, లేదా వాయిదా వేస్తారు. తెలివి కలవారికి 'పరిస్థితులు' – ఉపయోగించు కోవలసిన అవకాశాలుగా కనిపిస్తే, తెలివితక్కువ వారికి అవి అవరోధాల పరంపరగా అనిపిస్తాయి. (Circumstances are implements for the Wise and chain of handicaps of for the Fools). అని తెలుసుకోవాలి.

మనస్సు నిలకడ ఎంత తగ్గితే అన్ని అవరోధాలను చూడ్డం జరుగుతుంది. (The more we are illbalanced, the more we see obstacles in our routine).

ఏది ఫలవంతమవాలన్నా 'సిద్ధి', 'శ్రద్ధ' ఇవి రెండూ ముఖ్యం. సక్రమంగా నిర్వహింపబడుతున్న సృష్టిలో – ఆవర్తన, (Periodicity) క్రమబద్ధత (Regularity) లక్షణాలున్నాయి కాబట్టి – ఈ లక్షణాలున్న వారే వారి జీవితంలో గూడా సక్రమమైన, సల్లక్షణమైన సత్ఫలితాలను పొందుతారు.

'ఉన్నది అవకాశం' అని గ్రహించిన వారే అన్నిటినీ సాధించకలరు' అనే జ్ఞానోదయుము ఈ నామాన్ని జపించడం వల్ల వస్తుంది. అంతేకాని, విఘ్నాలు సృష్టించుకుని వాటి నాశం కోసం ఎదురు చూడ్డం ఉండదు. అందరికీ రోజుకు 24 గంటలే ! అయినా ఇదే కాలంలో ఎన్నో సాధించిన వారున్నారు. ఇదే కాలంలో ఏపని చెయ్యడానికైనా కాలం చాలడం లేదనీ, సమయం కుదరడం లేదనీ, ఏమీ చెయ్యని వారూ ఉంటారు.

'అన్నిటి కంటె పెద్ద విఘ్నం – 'అశ్రద్ధ' అని గ్రహించి, 'విఘ్ననాశినీ' నామంలో 'విఘ్నం' అనే పదానికి అసలైన ఈ అర్థాన్ని తెలుసుకుని, అశ్రద్ధను పోగొట్టు కున్నవారే సాధకులు. (మన అశ్రద్ధమీద ఎంత నమ్మకం లేకపోతే ''ఏపని ప్రారంభించినా 'ద్వితీయ విఘ్నం' రాకుండా చూసుకోండి'' అని మన పెద్దవాళ్ళు అంటారో ఆలోచించండి.)

1) విఘ్నాలు చూడకుండా పనిచేసే వాడికి – ఒక కార్యక్రమం ఉంటుంది, విఘ్నాలు చూసే వాడికి – తాను పని చెయ్యకపోవటానికి ఒక కారణం ఉంటుంది.

2) విఘ్నాలు చూడని వాడు – సమస్యలో పరిష్కారం చూస్తాడు, విఘ్నాలు చూసేవాడు – పరిష్కారానికి వంకలు పెడతాడు.

3) విఘ్నాలు చూడనివాడు – 'కష్టమైనా ఆపని చెయ్యవచ్చు' అంటాడు, విఘ్నాలు చూసేవాడు – 'ఆపని చెయ్యవచ్చుకాని చాలా కష్టం' అంటాడు.

'విఘ్నములు అనే భావనను (కూడా) రాకుండా చేయునది' అని ఈ నామానికి అర్థం.

## 452. తేజోవతీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'తేజోవత్యైనమః' అని చెప్పాలి.

తేజోవతీ = తేజస్సుకలది.

అన్ని ప్రకాశ వస్తువులలోను వెలుగును ప్రసరింప చేసే శక్తి అమ్మవారు. అమ్మవారు ప్రకాశించాలన్నా, ప్రకాశాన్ని ప్రసారం చెయ్యాలన్నా ఏ ఇతరుల సహాయంగాని, సహకారం గాని అవసరం లేదు.

జాగ్రత్, స్వప్న, సుషుప్తి అవస్థలన్నిటిలోను గూడా మనలో ప్రకాశించే తేజస్స్వరూపిణి అమ్మవారు.

"క్షితౌషట్పంచాశత్..." అన్న సౌందర్యలహరిలోని 14వ శ్లోకంలో ఆది శంకరులు – అమ్మవారి పాదయుగళం నుండి ప్రసారమయే కిరణాలు – ఎన్నెన్ని, ఏ ఏ చక్రాల వద్ద ఉంటాయో తెలియపరుస్తారు.

లలితా సహస్ర నామస్తోత్రంలో నామాలుండే మొత్తం 182 1/2 శ్లోకాలు, సంవత్సరంలో వెలుగు భాగానికి సంబంధించిన 182 1/2 రోజుల కాలానికి సరిపోయే పగటి భాగాలే ! ఈ కాల భాగమంతా అమ్మవారి వెలుగుకు సంబంధించినదే ! ఈ వెలుగుల అమ్మవారిని 'తేజోవతీ' అంటారు.

'ఎవరిలో ఏ సంబంధమైన ప్రతిభ ఉన్నా – వారిలో ఆ ప్రతిభను సూచించే అమ్మవారి పేరు 'తేజోవతీ' అనవచ్చును.

'తేజస్సు కలది', తేజస్స్వరూపిణీ – అని ఈ నామానికి అర్థాలు.

## 453. త్రినయనా

నాలుగు అక్షరాల నామం. ఈనామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'త్రినయనాయైనమః' అని చెప్పాలి.

త్రి = మూడు, నయనా = కన్నులు కలది.

అమ్మవారికి మూడు కళ్ళు ఉంటాయి. ఎడమ కన్ను చంద్ర సంబంధమైనది. కుడికన్ను సూర్య సంబంధమైనది. ఫాలనేత్రం అగ్ని సంబంధమైనది. ఈ మూడూ వరుసగా - ఇడా, పింగళా, సుషుమ్నా నాడులతో గూడా సమన్వయాన్ని కలిగి ఉంటాయి. అంతేకాదు -

చంద్రనేత్రం - రాత్రికి, పిండోత్పత్తికి, గర్భధారణకు, స్వీకరించే గుణానికి అస్తిత్వానికి, పోషణకు, వర్తమాన కాలానికి సంబంధించినది.

సూర్యనేత్రం - పగటికి, ఇచ్చే గుణానికి, రక్షణకు, భూతకాలానికి - సంబంధించినది.

అగ్నినేత్రం - సంధ్యాకాలానికి, వ్యాప్తిత్వానికి, భవిష్యత్కాలానికి, సమన్వయానికి - సంబంధించినది.

'ఈ మూడు నేత్రాలూ గూడా జ్ఞాన సంబంధమైనవే' అని సంధ్యావందనం లోని అంగన్యాసంలో 'జ్ఞానాత్మనే నేత్ర త్రయాయ వౌషట్' అని చెప్పబడుతుంది.

'సర్వేంద్రియాణాం నయనం ప్రధానం' అన్నారు. నయనాలు ప్రతి వ్యక్తిలోని చైతన్యానికి ప్రత్యక్ష నిదర్శనం. 'జీవికి - శవానికి' తేడా ఈ కళ్ళను చూచిన వెంటనే చెప్పవచ్చును.

అక్షర జ్ఞానం లేకపోయినా - ఈ అక్షిజ్ఞానంతో తన భావాలను వ్యక్తపరచవచ్చును. అందుకని - అమ్మవారి ఈ 'నామధ్యానం', 'నామజపం' చాలా శుభాలను చేకూరుస్తుంది.

'నయనం' అంటే 'తీసుకువెళ్ళేది' - అనే అర్థంలో ఈ నామాన్ని 'త్రిణయనాయైనమః' అని జపిస్తే - మనం అధోగతి పాలుకాకుండా మనలను అమ్మవారు నడిపిస్తుంది. భూత భవిష్యద్వర్తమాన సమగ్ర జ్ఞానంతో అన్నిటినీ చక్కగా పరిష్కరిస్తుంది.

1) మూడు కన్నులు గలది 2) త్రికాల జ్ఞాన నేత్రములు గలది - అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

# 454. లోలాక్షీ కామరూపిణీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'లోలాక్షీ కామరూపిణ్యైనమః' అని చెప్పాలి.

లోలాక్షీ = (చంచలమైన కన్నులుండు అందమైన) స్త్రీలకు గూడా, కామ = మోహము పుట్టు, రూపిణీ = రూపము గలది.

(ఈ నామాన్ని 'లోలాక్షీ', 'కామరూపిణీ' అనే విధంగా రెండు నామాలుగా చెప్పే పద్ధతిని అనుసరించే వారు గూడా ఉన్నారు. కాని, ముందు ముందు 796వ నామంగా 'కామరూపిణీ' అనే నామం మళ్ళీ వస్తుంది. ఇప్పుడు 'లోలాక్షీ', 'కామరూపిణీ' అని విడదీస్తే 'కామరూపిణీ' నామం పునరుక్తం కాబడుతుంది. అందుకని ప్రస్తుతం 'లోలాక్షీ కామరూపిణీ' అనే విధంగా ఒకే నామంగా చెప్పబడుతోంది.

''చంచలమైన కన్నులుండవచ్చును గాని, చంచలమైన మనస్సు ఉండకూడదు. అసలు 'చంచలం' అంటే 'కిరణ కాంతిలాగా – తళుక్కు, మిణుక్కుమంటూ కనబడే లక్షణం' అని అర్థం చెప్పుకోవచ్చు. వివాహ వయస్సుకు ముందు స్త్రీల కళ్ళకు ఉండే ఒక కళ ఇది. చంచలమైన కన్నులు చక్కని చుక్కలకు (స్త్రీలకు) మరింత అందాన్ని చేకూరుస్తాయి. అందుకే, కవులు 'చంచలాక్షి' అనే పద ప్రయోగంతో స్త్రీల కళ్లను వర్ణిస్తారు. ఈ చంచల లక్షణం ఉన్న కన్నులు దేనినో వెతుకుతున్నట్లుంటాయి. తనకు నచ్చే రూపం ఎక్కడన్నా ఉన్నదేమోనన్న అన్వేషణ (వెదుకులాట) ఆ చంచల నయనాలను చూస్తే తెలుస్తుంది. స్త్రీలు తాము అందమైన వారైనా – అమ్మవారి అందాన్ని చూసి ఆకర్షితులౌతారట! అలా ఆకర్షితులవటంలో ఎవరెవరికి ఏ ఏ విధంగా ఉంటే నచ్చుతుందో ఆ విధమైన రూపాలతో కనబడగల కామరూప లక్షణం అమ్మవారి రూపానికి ఉంటుందిట. అందుకని విశ్వంలోని స్త్రీలందరూ అమ్మవారి అందానికి అచ్చెరువందుతూ, ఆకర్షితులౌతారు. ఆవిధంగా స్త్రీలనే మోహింపచేయగలరూపం అమ్మవారిది.

పైన చెప్పిన అమ్మవారి లక్షణం శ్రీరామునికి గూడా ఉంటుంది. పురుషులనే మోహింపచేయ గల రూపంశ్రీరామునిది. (పుంసాం మోహన రూపాయ పుణ్య శ్లోకాయ

మంగళమ్) అంటే, ఈ లక్షణంలో శ్రీరాముడు, శ్రీలలిత ఒకే తత్త్వం గల వారన్నమాట! అలాగే – శ్రీకృష్ణుడు, శ్యామలాదేవి (అందుకే 'శ్రీకృష్ణశ్యామలాదేవీ - శ్రీరామోలలితాంబికా' అన్నారు).

'కామరూపిణీ' అనే సమాసానికి – 'ఏదృష్టితో చూస్తే ఆ దృష్టితో కనబడునది' (పెళ్లైన వారికి ప్రపంచం పచ్చని తోరణాలలాగానూ, ఆపదలో ఉన్నవారికి – అదే ప్రపంచం తగలబడి పోతున్నట్లుగాను ఉంటుంది కదా!) అనే అర్థం కూడా చెప్పుకోవచ్చును.

1) చంచలాక్షులను గూడా మోహింప చేయు మనోహర రూపము గలది'.

2) ఏ దృష్టితో చూచేవారికి ఆ దృష్టితో కనబడునది – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 455. మాలినీ

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మాలిన్యైనమః' అని చెప్పాలి.

మాలినీ = మాలికారూపము చెల్లునది. లేదా మాల గలది.

అమ్మవారు ప్రధానంగా 'వ్యక్తము'నకు సంబంధించినది. భౌతిక ప్రపంచముగాను, వాఙ్మయ ప్రపంచంగాను గూడా వ్యక్తమయేది అమ్మవారే ! భౌతిక ప్రపంచంలోని సమస్త జీవ, వస్తు, స్థావరములలో సారభూతముగా అమ్మవారే ఉంటుంది. అంటే, సూత్రప్రాయంగా అమ్మవారంటే – పాత్ర, గాత్ర ప్రాయంగా అవన్నీ ఉంటాయన్నమాట! అందుకే తమలో సూత్రప్రాయంగా (దారంగా) ఉన్న అమ్మవారితో ఈ విశ్వంలోని సమస్త వస్తు, వ్యక్తి, జీవజాలమంతా చూడటానికి ఒక 'విశిష్టమాలిక' లాగా కనిపిస్తుంది. ఆ విధంగా కనబడే విశ్వరూపిణి అయిన అమ్మవారిని 'మాలినీ' అన్నారు.

వాఙ్మయ ప్రపంచమంతా అక్షరాల సమాహారమే గదా! 'అ' కారాది 'క్ష' కారాంతం ఉండే అక్షరాలన్నీ ఈ హారంలో పువ్వుల లాంటి వనుకుంటే ఈ అక్షర సమాహార రూపంలో ఉండే అమ్మవారు 'మాలినీ' గా దర్శనమిస్తుంది.

'అ' కారం నుండి 'హ' కారం దాకానే అక్షరాలు అనుకుంటే 'క్ష' కారం మిగిలిపోతుంది. దీనిని 'సంఘాత అక్షరంగా' గాని, 'మేరువుకు సంకేతాక్షరంగా' గాని సమన్వయించి చెప్పుకున్నా అక్షరమాలికగా అమ్మవారిని సూచించి చెప్పడంలో ఔచిత్యం దెబ్బతినదు.

ఛందశ్శాస్త్రంలో 'మాలినీ' అనే పేరుతో ప్రత్యేక ఛందస్సు గల 'పద్యం' లేదా 'శ్లోకం' కూడా ఉన్నది. 'ఆ ఛందస్సు రూపంలో ఉన్న అమ్మవారు' అని గూడా చెప్పుకోవచ్చును.

1) అక్షర మాలికా రూపము గలది.

2) సమస్త వస్తు జీవ జాలములో సూత్రముగా నుండి మాలికవలె రూపము గలది.

3) 'మాలినీ' ఛందస్సుతో ఒక పద్యము లేదా శ్లోక నామముగా నున్నది.

## 456. హంసినీ

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'హంసిన్యైనమః' అని చెప్పాలి.

హంసినీ = హంసను (శ్వాసను) గలిగినది.

హంసినీ = ఆడహంసతో పోల్చతగినది.

'హంస' అనే పక్షి – శ్వాసకు సంకేతం. శ్వాసలోని ఉచ్ఛ్వాసం – 'సో' అక్షరాన్ని, నిశ్వాసం 'హం' అక్షరాన్ని సూచిస్తాయి. ఈ రెండూ నిరంతరం ఒక దాని తర్వాత ఒకటి జరుగుతాయి. వీటి త్వరితగతిని గమనిస్తే 'సోహం' – 'హంసో' ఔతుంది. అదే – 'హంస'.

'హంస' అనే పక్షి సాధారణంగా బయట కనబడదు. శ్వాసను యోగ విద్యలో 'హంస' తో సమన్వయిస్తారు. ఈ హంసను – క్షీరనీరాలను (పాలు – నీళ్ళు) వేరు చేయగల పక్షిగా చెబుతారు. పాలు – గుణాలను, శ్వాశ్వతత్వాన్ని; నీళ్ళు – దోషాలను, తాత్కాలిక తత్వాన్ని సూచిస్తాయని సమన్వయం పరచుకుంటే – ఈ హంసచే

సూచింపబడేవారికి ఏది గుణమో, శాశ్వతమో; ఏది దోషమో, తాత్కాలికమో తేల్చి చెప్పగల లక్షణం ఉంటుందన్నమాట ! అంటే – సాధన ద్వారా జీవితానుభవంలో ప్రపంచంలోని శాశ్వతమైన వాటిని; తాత్కాలికమైన వాటిని; దోషాలను, గుణాలను వేరు వేరుగా గుర్తించగలిగే స్థితికి ఎదిగిన వారిని 'హంస' లంటారు. పరివ్రాజకులకు ఈ శాశ్వత గుణాల గురించి, దోషాల గురించి తెలుస్తుంది. అందుకే, వాళ్ళను హంసలతో పోలుస్తారు. పరివ్రాజకులలో శ్రేష్ఠులైన వారిని పరమ హంసలతో పోల్చి, 'పరమ హంస పరివ్రాజక' అనే బిరుదులతో వారిని పిలుస్తారు. (శ్రీరామకృష్ణపరమహంస ఈ కోవకు చెందినవాడే!)

ఈ హంస మహన్యాసంలో –

''గమాగమస్థం గగనాది శూన్యం, చిద్రూప దీపం తిమిరాపహారం

పశ్యామితే సర్వజనాంతరస్థం, నమామి హంసం పరమాత్మ రూపం'' – అని చెప్పబడుతుంది.

అంటే – ఈ శ్లోకంలో సర్వాంతర్యామి అయిన పరమాత్మను హంసతో పోల్చారన్నమాట! అలాగే మహానారాయణంలో....

'హగ్ంస శ్శుచిష ద్వసు రంతరిక్షస
ద్ధోతా వేదిష దతిథి ర్దురోణసత్
నృష ద్వరస దృతసద్వ్యోమస దబ్జా
గోజా ఋతజా అద్రిజా ఋతం బృహత్' – అని చెప్పబడుతుంది. ఇక్కడ గూడా పరమాత్మను హంసతో పోల్చి చెప్పటం జరిగింది.

'హంసోనామ సదాశివః' అని మహన్యాసం చెబుతుంది. సాధనలో ఉత్తమస్థాయికి ఎదిగినవారిని, పరమాత్మను గూడా హంసతోనే పోలుస్తారని దీనిని బట్టి తెలుస్తోంది కాబట్టి, జగజ్జనని అయిన అమ్మవారు గూడా 'హంసినీ'.

సమాధిస్థితిలో నున్నప్పుడు మనస్సులో శ్వాస నిలుస్తుంది. ఆ స్థితిలో ఉన్న శ్వాసను మానస సరోవరంలో నిలిచిన హంసగా చెబుతారు. అప్పుడు సాధకుని మనస్సులో ఉన్న పరమేశ్వరిని 'హంసినీ' అంటారు.

'(మనస్సులో నిల్చిన) శ్వాసరూపము' – అని ఈ నామానికి అర్థం.

# 457. మాతా

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మాత్రేనమః' అని చెప్పాలి.

మాతా = తల్లి.

వ్యక్తమైన నామరూపాత్మక విశ్వమంతా ఎవరి గర్భంలోంచి సృజింపబడి, ఎవరి వలన సాకబడి, ప్రళయకాలంలో ఎవరిలోకి లీనమౌతుందో – అటువంటి జగజ్జనని అయిన అమ్మవారికి 'మాతా' అనేది బిరుదు నామంగా వ్యవహరిస్తారు.

దానానికి సంబంధించిన వాడు 'దాత' అయినట్లే – మానానికి సంబంధించిన – అంటే కొలతకు సంబధించిన వారిని 'మాత' అనాలి. అమ్మవారు జీవుల ఆయుర్దాయాన్ని శ్వాసలతో కొలుస్తుంది. కాబట్టి, విశ్వంలోని సమస్త జీవుల యొక్క వివిధ కరచరణాద్యవయవ, పంచజ్ఞానేంద్రియ, తన్మాత్రలు – మొదలైన లెక్కలెన్నో అమ్మవారి అభీష్టాన్ని అనుసరించి ఏర్పడ్డాయి. ఈ లెక్కలకు మూలకారణం అమ్మవారే అవుతుంది. అందుకని అమ్మవారు 'మాతా'

తల్లి, భార్య (భర్త) తల్లి, అన్నగారి భార్య, గురువుగారి భార్య, రాజు భార్య మొదలైన – తల్లిగా చూడవలసిన వారిలో ఉండే మాతృస్వరూపిణి గూడా అమ్మవారే !

బ్రాహ్మీమహేశ్వర్యాది అష్టమాతృస్వరూపిణి గాబట్టి అమ్మవారు 'మాతా'. సమస్త వాఙ్మయానికి మూలాధారాలైన మాతృకావర్ణాల స్వరూపిణి కాబట్టి అమ్మవారు 'మాతా'. (అష్టమాతల పేర్లు అనుబంధంలో తెలుపబడ్డాయి.)

1) దృశ్యమాన ప్రపంచమునకు తల్లి.

2) తల్లిగా చూడవలసిన వారిలో ఉన్న మాతృస్వరూపిణి.

3) అక్షరాలకు మూలమైన మాతృకావర్ణస్వరూపిణి. – అని ఈ నామాలకు అర్థం

## 458. మలయాచలవాసినీ

ఆరు అక్షరాల నామం. ఈనామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మలయాచలవాసిన్యైనమః' అని చెప్పాలి.

మలయాచల = మలయపర్వతమున, వాసినీ = వసించునది.

భారతదేశాన్ని మూడు ప్రాంతాలుగా విభజిస్తే - ఆ యా ప్రాంతాలలో ప్రముఖంగా ఆరాధింపబడే అమ్మవారి పేర్లు వేరు వేరుగా మూడు ఉన్నాయి.

1) దేశానికి ఉత్తరంగా కాశ్మీరు ప్రాంతంలో ఉన్న అమ్మవారిని 'శారదా' అంటారు .

2) దేశానికి మధ్యగా ఉండే వింధ్య పర్వత ప్రాంతంలో ఉండే అమ్మవారి పేరు 'వింధ్యవాసినీ'.

3) దేశానికి దక్షిణబాగం అయిన కేరళ రాష్ట్రానికి చెందిన మలబారు ప్రాంతంలో ఉండే అమ్మవారిని 'మలయవాసినీ' అంటారు. ఈ మూడింటినీ 'త్రిపురాలనీ,' ఈ ముగ్గురినీ 'శక్తిత్రయం' అనీ అంటారు.

ప్రస్తుత నామం అయిన 'మలయాచలవాసినీ' - దక్షిణ ప్రాంతానికి చెందిన అమ్మవారి పేరు. ఇక్కడే స్వచ్ఛమైన, శుద్ధసత్వమైన, ఆహ్లాదాన్ని కలిగించే మంచి వనాలుంటాయి. మనకు దక్షిణం వైపు నుండి చల్లని గాలుల ద్వారా సుఖస్పర్శను పొందింప చేసేవి ఈ మలయమారుతాలే !

'భారతదేశ దక్షిణ ప్రాంతంలో మలయపర్వత చందన వనవాసిని' అని ఈ నామానికి అర్థం

## 459. సుముఖీ

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సుముఖ్యైనమః' అని చెప్పాలి.

సు = మంగళకరమైన, ముఖీ = ముఖము (నోరు) కలది.

ఎవరు నోరు తెరిస్తే ఎదుటి వారికి జ్ఞానం, ఆనందం కలుగుతుందో వాళ్ళను 'సుముఖీ' అనే నామంతో పిలుస్తారు. సాధనలో ఈ స్థితికి వచ్చిన వారినే అలా పిలుస్తారు. ఈ స్థితి వచ్చిన వారి – మాటలు, ప్రసంగాలు, రచనలు – 'మధు, క్షీర, ద్రాక్షా, మధురిమ ధురీణాః, పణితయః' అన్నట్లుగా ఉంటుందని ఆది శంకరులు సౌందర్యలహరిలో అంటారు. ('తేనె, పాలు, ద్రాక్షల మాధుర్యాన్ని మించిన మాధుర్యం ఉంటుందని' అర్థం.)

మెదడులోని చైతన్యాన్ని శ్వాసతో కలిపితే – (అంటే – మనం మాట్లాడుతూ, మన మాటను మనమే వినడానికి ప్రయత్నించడం అన్నమాట) మన ముఖం – 'సుముఖం' అయి, మనం 'సుముఖీ' స్థితిని పొందడానికి సాధన జరుగుతుంది. ఉద్గీథవిద్య (గొంతెత్తి పాడటం)లో గూడా ఇదే సాధన జరుగుతుంది.

తన మాటలోను, ఎదుటి వారి మాటలోను, చివరకు అందరి మాటల్లోను 'నాదం' వినగల్గే వారిని 'సుముఖులు' అంటారు. ఈ 'సుముఖులే' ఆశీర్వచన మివ్వగలిగిన వారు. గంధర్వులలో ఒక జాతి వారిని 'సుముఖులు' అంటారు.

పింగళి సూరన్న వ్రాసిన కళాపూర్ణోదయంలో 'సుముఖాసత్తి' అనే పాత్ర ఈ సుముఖీ లక్షణాన్ని కలిగి ఉంటుంది.

('బ్రహ్మ, సరస్వతుల సంభాషణే ఈ సృష్టిగా వ్యక్తమౌతుంది' – అనే ఉపదేశమే కళాపూర్ణోదయ కావ్య కథ).

'మంగళకరమైన నోరు కలది' అని ఈ నామానికి అర్థం.

## 460. నళినీ

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'నళిన్యైనమః' అని చెప్పాలి.

నళినీ = నాళము గలిగినది.

నాళాన్ని కలిగి ఉండేది పద్మం కాబట్టి, అన్నిటిలో – ఈ పద్మ లక్షణం చెల్లినది

అమ్మవారని అర్థం. ముఖం – పద్మం, నేత్రాలు – పద్మపత్రాలు, హస్తాలు – తామరకాడలు, పాదాలు – అరవిందాలు. ఇలా భౌతికంగానే కాకుండా, గుణలక్షణాల్లో గూడా అమ్మవారికి – పద్మాలకు పోలిక ఉంటుంది. కాబట్టి, అమ్మవారు 'నళినీ'. చివరకు కుండలినీ మార్గం గూడా తామర కాడలోని పోగు (Fibre) లాగానే ఉంటుంది. దివ్యప్రవృత్తి కలిగిన స్త్రీలను 'నళినీ', అంటే – 'పద్మినీ' జాతి స్త్రీలంటారు.

1) నాళము కలది (అనగా పద్మము వంటిది అని అర్థం)

2) పద్మినీ జాతిస్త్రీలలోని దివ్య లక్షణ స్వరూపిణి. – అని ఈ నామానికి అర్థం.

## 461. సుభ్రూః

రెండక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు ''సుభ్రువే నమః'' అని చెప్పాలి.

సు = శుభప్రదమైన, భ్రూః = కనుబొమలు కలిగినది.

స్త్రీలకు కనుబొమలు రెండూ కలవకుండా ఉండటం శుభలక్షణం. ఈ లక్షణాన్ని ఉత్తమ అంగసాముద్రిక లక్షణంగా చెబుతారు.

భ్రూమధ్య ప్రాంతంలోనే 'ఆజ్ఞాచక్రం' ఉంటుంది. అందలి 'ఆజ్ఞాచక్రము నందు శుభముగా వర్తిల్లునది' – అని గూడా ఈ నామానికి అర్థం చెప్పవచ్చును.

'శుభప్రదమైన కనుబొమలు కలది' అని ఈ నామానికి అర్థం.

## 462. శోభనా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'శోభనాయైనమః' అని చెప్పాలి.

శోభనా = సౌందర్యశోభ కలిగినది.

'సౌందర్యము', 'పవిత్రత', 'స్వచ్ఛత', ఈ మూడు లక్షణాలు కలిస్తే 'శోభనత్వం' సిద్ధిస్తుంది. అమ్మవారి రూపం – సౌందర్యవంతం గాను, భావాలు – స్వచ్ఛంగాను,

సాన్నిధ్యం - పవిత్రంగానూ ఉంటుంది. అందువల్ల అమ్మవారు నిత్యము శోభాయమానంగానే ఉంటుంది.

'మంగళకర సౌందర్యశోభతో విరాజిల్లునది' - అని ఈ నామానికి అర్థం.

## 463. సురనాయికా

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సురనాయికాయైనమః' అని చెప్పాలి.

సుర = దేవతలకు, నాయికా = నాయకురాలు.

దేవలోకంలో ఉండే వారందరూ దేవతలే! నేపథ్యంలో(Back Ground) ఉండి, క్రింది లోకాల వారిని నడిపేవారు దేవతలు అయితే - ఆ దేవతలకు నేపథ్యంలో ఉండి, వారిని నడిపేది అమ్మవారు. దేవతలకు ఏ విధమైన కష్టమొచ్చినా వారందరికీ ముందు తాను ఉండి నడిపించి, అన్ని విధాలా ఆదుకుని, వారిని రక్షించి, పరిపాలిస్తుంది అమ్మవారు.

'సకల దేవతలకు ముందుండి నడిపించు నాయకురాలు' అని ఈ నామానికి అర్థం.

## 464. కాలకంఠీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కాలకంఠ్యైనమః' అని చెప్పాలి.

కాల = నల్లని, కంఠీ = కంఠము గలది.

కాల కూట విషాన్ని మ్రింగకుండా తన కంఠం వద్దనే దాన్ని ఉంచడం వలన శివుని కంఠం నల్లగా ఉంటుంది. శివునిలో సగభాగం అమ్మవారే కాబట్టి అమ్మవారి కంఠం కూడా నల్లగానే ఉండక తప్పదు. ఇది బాహ్యార్థం.

కాలాన్ని తన కంఠము నందు కలదు కాబట్టి, అమ్మవారు - 'కాలకంఠి' ఇది అంతరార్థం. 'గుటక' వేసినా 'చిటికె' వేసినా అవి రెండూ కాలాన్ని కొలిచేందుకు ఉపయోగపడేవే!

శ్వాస ప్రారంభం – జనన కాలాన్ని, శ్వాస పరిసమాప్తం – మరణ కాలాన్ని సూచిస్తాయి. ఈ రెంటి మధ్య ఉండే కాలమే ఆయుర్దాయం. అంటే – శ్వాస ఒక విధంగా ఆయుర్దాయ కాలాన్ని కొలుస్తుందన్న మాటే కదా! మరి ఆ శ్వాస కంఠంలోని శ్వాసనాళం ద్వారా జరుగుతుంది. అమ్మవారి ఉచ్ఛ్వాస, నిశ్వాసలు విశ్వానికి ఆయుర్దాయ కాలాన్ని నిర్ణయిస్తాయి. కాబట్టి, కాలాన్ని తన కంఠము నందు గలది – అని చెప్పుకోడం సమంజసమే అవుతుంది.

1) 'నల్లని కంఠము కలది'.

2) 'కాలమును తన కంఠమునందు కలది' – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 465. కాంతిమతీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కాంతిమత్యైనమః' అని చెప్పాలి.

కాంతిమతీ = ప్రకాశవంతమైన శరీరము కలది.

అమ్మవారు వెలుగుల ముద్ద అయినపుడు – ఆమె శరీరావయవాలన్నీ తేజోవంతంగానే ఉంటాయి కదా ! అయితే, ఈ కాంతి – మిరుమిట్లు గొలిపి దర్శించే వారికళ్లు చెడిపోయే కాంతి కాదు. ఆమె రమణీయమైన రూపానికి ఉండే కమనీయమైన కాంతి అది.

అమ్మవారి మతి నిత్యమూ స్వచ్ఛంగా, నిర్మలంగా, మంచి కుశలత్వముతో, ప్రజ్ఞానవంతంగా ఉంటుంది. అందుకని అమ్మవారి మతి కమనీయమైనది. కాంతి వంతమైనది.

1) ప్రకాశవంతమైన శరీరం కలది.

2) ప్రజ్ఞాన వంతమైన మతి కలది – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చు.

## 466. క్షోభిణీ

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారిని పూజించేటప్పుడు 'క్షోభిణ్యైనమః' అని చెప్పాలి.

క్షోభిణీ = క్షోభింప చేయునది అనగా మథించునది. ఈ నామం యొక్క అర్థాన్ని వినంగానే 'అమ్మవారు దేన్ని క్షోభింప చేస్తుంది ?' అని వెంటనే అనుమానం కలుగుతుంది. క్షోభింప చెయ్యాల్సిన అవసరం వస్తూ ఉంటుంది అమ్మవారికి. ఎప్పుడంటే –

ప్రళయంలో అంతా పరమ ప్రశాంతంగా ఉంటుంది. చైతన్యరహితమై, చడీ చప్పుడూ లేకుండా ఉంటుంది. అదంతా పరమేశ్వరుని చిత్తం. పరమేశ్వరుని తత్త్వం. ఎప్పుడూ అలానే ఉంటే ఏం బావుంటుంది ? అయ్యవారి కేమీ పట్టనంత మాత్రాన, అమ్మవారు కూడా ఏమీ పట్టించుకోకుండా ఊరుకుంటుందా ? ఆమె విశ్వసంసారం ఆవిడ చూసుకోవద్దూ ! పదిలంగా ఉన్న పరమేశ్వరుని చిత్తంలో నెమ్మదిగా ప్రవేశించి సృష్టికార్యానికి ఉన్ముఖుడుయ్యేట్లు ఆయన చిత్తాన్ని – 'కవ్వంతో పెరుగును చిలికినట్లు' – చిలుకుతుంది. దాన్నే 'మథించడం' అనీ, 'క్షోభింప చెయ్యటం' అనీ అంటారు. పెరుగులోంచి వెన్న వేరే వ్యక్తమైనట్లు పరమేశ్వరుని చిత్తంలో మత్తుగా సుషుప్తిలో ఉన్న సృష్టి వ్యక్తమౌతుంది. ఈ క్షోభింప చేసే శక్తినే 'ఇచ్ఛాశక్తి' అంటారు.

అర్థం కాని విషయాలను ఆలోచిస్తున్నపుడు, అనుభవం లేని సంఘటనలను ఎదుర్కొంటున్నపుడు – మన చిత్తాన్ని కూడా అమ్మవారు ఇలాగే మథించి, చివరకు సంతులన స్థితిలో మనస్సును, నిలబడునట్లు చేసి, పరిష్కార మార్గాన్ని సూచిస్తుంది. ఆ స్థితిలో ఉన్న మనలోని చిద్రూపిణిని 'క్షోభిణీ' అనవచ్చును.

1) పరమేశ్వరుని ప్రశాంత చిత్తాన్ని మథించి సృష్టికి ఉన్ముఖుణ్ణి చేయునది.

2) 'సమస్యలను ఎదుర్కొనబోయే మన చిత్తాన్ని మథించి నిలకడ స్థితికి రప్పించి, పరిష్కారాన్ని సూచించే చిద్రూపిణి ' అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 467. సూక్ష్మరూపిణీ

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సూక్ష్మరూపిణ్యైనమః' అని చెప్పాలి.

సూక్ష్మరూపిణీ = సూక్ష్మశక్తి స్వరూపిణి.

ఇంతకు ముందు నామంలో పరమేశ్వరుని ప్రశాంత చిత్తాన్ని ప్రకృష్టంగా మథించిందని చెప్పిన అమ్మవారు స్థూలమైంది కాదు, సూక్ష్మమైనదే !

పరమాణువుల్లోని కణాలు ఎంతో సూక్ష్మంగా ఉంటాయి. అయినా అంతటినీ అంతం చేయుకలిగిన పరమాణు శక్తిని, అన్నిటికీ వినియోగపడే అనువైన శక్తిని పుట్టించకలవు. అలాగే - సూక్ష్మాతి సూక్ష్మంగా ఉండే ఇచ్ఛాశక్తితో ఈశుణ్ణి మథించి సంకల్ప మాత్రకాలంలో సకల సృష్టినీ వ్యక్తం చేయ కలిగినది. అధికులలో అధికురాలు సూక్ష్మమైన వాటిలో సూక్ష్మమైనది ఈ అమ్మవారు అని 'మహానారాయణమ్' లో కూడా (అణోరణీయాన్ మహతోమహీయాన్' అని ఆత్మపరంగా చెప్పబడుతుంది.)

మనస్సును మథింప చెయ్యడానికి ఒక్క మాట చాలు. వేరే స్థూలమైన పరికరాలక్కరలేదు. ఇనుపముక్కను అయస్కాంతం చెయ్యడానికి ఒక స్పర్శ చాలు లేదా సూక్ష్మమైన ప్రేరణ చాలు. అలాగే, వివేకోదయం కలుగ చెయ్యడానికి శిష్యుని భ్రూమధ్యంలో గురువు స్పృశిస్తే చాలు. సకల జ్ఞానం వెల్లి విరుస్తుంది. స్థూలమైన శరీరాల్లో, సూక్ష్మమైన ఇంద్రియ మనోబుద్ధులకన్నా సూక్ష్మతరంగా ఉండే ఆత్మేశ్వరి అమ్మవారు.

1) సూక్ష్మమైన వాటిలో సూక్ష్మతరమైన రూపము గలది.

2) స్థూలమైన శరీరంలో సూక్ష్మతరంగా ఉండే ఆత్మేశ్వరి' అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

(స్థూలమైన తీగ చుట్టల లాంటిది 'యజ్ఞోపవీతం' అయితే, దానిలోని విద్యుత్తు లాంటిది 'గాయత్రి' - అందువల్ల వచ్చే ఫలితం లాంటిది 'జ్ఞానం' - అనే విధంగా అమ్మవారి ఈ నామాన్ని అర్థం చేసుకోవాలి.)

## 468. వజ్రేశ్వరీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'వజ్రేశ్వర్యైనమః' అని చెప్పాలి.

వజ్రేశ్వరీ = వజ్రేశ్వరీ నామంగల ఒక 'అతిరహస్యశక్తి'.

శ్రీ చక్రంలో భూపురం వద్ద నుండి లెక్కవేసినపుడు - శ్రీ చక్రంలోని కేంద్రం వద్ద గల బిందువు - నవమావరణం ఔతుంది. దీనికి ముందుండే అంటే ఎనిమిదవ ఆవరణ అయిన మొదటి త్రిభుజం యొక్క మూడు శీర్షాల వద్ద ముగ్గురు 'అతి రహస్య శక్తు' లుంటారు. వారే 1) కామేశ్వరి 2) వజ్రేశ్వరి 3) భగమాలినీ. ఈ అతిరహస్య శక్తులలోని రెండవ శక్తి పేరే 'వజ్రేశ్వరి'. ఈ వజ్రేశ్వరీ రూపంలో ఉండునది - అని ఒక అర్థం.

మనలో (పిండాండంలో) విశుద్ధి చక్రానికి అధిష్ఠాన దేవత ఈ వజ్రేశ్వరియే ! విశుద్ధి చక్రం(Centre near vocal cords) ద్వారానే సర్వవాఙ్మయం వ్యక్తమవాలి కాబట్టి, ఈ 'వజ్రేశ్వరి' కి 'వాక్కు' కు సంబంధం ఉంటుంది. అందుకే 'వాగ్వైవజ్రః' అంటారు. వాక్కుకు సంబంధించిన, 'వజ్రేశ్వరీ' దేవతకు సంబంధించిన - యంత్రం క్రింద తెలిపిన విధంగా ఉంటుంది.



ఈ యంత్రాన్ని ధ్యానం చేస్తే వాక్శక్తి స్ఫుటంగా ఉంటుంది. దీనికి సంబంధించిన మంత్ర బీజాక్షరాలు కూడా ఉన్నాయి. వజ్రేశ్వరికి సంబంధించిన బీజాక్షరం 'వ్రీం'. ఈ 'వ్రీం' కి ముందు ప్రణవ బీజం, తర్వాత కామకళాబీజం కలిపితే 'ఓం, క్లీం, వ్రీం' అవుతుంది. దీన్ని 'వజ్రమంత్రం' అంటారు. స్ఫుటంగా వాక్కు వ్యక్తమవాలంటే ఈ

వజ్రమంత్రాన్ని 'ఓం క్లీం జ్రీం వజ్రేశ్వర్యైనమః' అని జపించాలి. ఇంద్రుడు ఈ మంత్రాన్ని జపించి, తపస్సు చేసి వజ్రేశ్వరీ దేవతానుగ్రహంతో వజ్రాయుధాన్ని పొందాడని పురాణంలో చెబుతారు.

స్థూలమైన భౌతిక శరీరం కాకుండా, ప్రతి వ్యక్తికీ సూక్ష్మ శరీరం కూడా ఉంటుంది. దీన్ని సంస్కృతంలో 'వజ్ర శరీరం' గాను, ఆంగ్లంలో 'Astral Body' గాను చెబుతారు. ఈ వజ్ర శరీరాన్ని 'వజ్రాంగము' అని గూడా అంటారు. ఈ వజ్రాంగము స్థూల శరీరం కన్నా శక్తి వంతమైనది. దుష్కరమైన కార్యాలను వజ్రాంగంతో సాధించవచ్చు. అష్ట సిద్ధులన్నీ ఈ వజ్రాంగానికి సంబంధించినవే ! హనుమంతుణ్ణి 'భజరంగబలీ' అంటారు. ఈ పేరు ఎలా వచ్చిందో వ్యుత్పత్తి ఏమిటో అర్థం కాదు. బహుశః 'వజ్రాంగ' పదమే 'భజరంగ' అయి ఉండవచ్చును. (ఉత్తర హిందూస్థానంలో ముఖ్యంగా బెంగాలీలు 'వ' అక్షరానికి బదులు 'బ' పలుకుతారు. వాళ్ళ భాష పేరు 'వంగభాష' అయితే దాన్ని గూడా వారు 'బంగళా' లేదా 'బెంగాలీ' భాష అంటారు.) 'రవీంద్ర' బదులు 'రబీంద్ర', 'వంశీ' బదులు 'బంశీ', 'సవితా' బదులు 'సబితా' మొదలైన పదాలన్నీ దీనికి ఉదాహరణలే! అలాగే 'వజ్రాంగ' పదం 'బజ్రాంగ' గా విరూపణ చెంది, చివరకు అది 'భజరంగ అయి ఉండవచ్చును. (హనుమంతుడు ఈ వజ్రాంగ శరీరంతోనే అసాధ్యమైన పనులన్నీ సాధించాడు).

శ్రీమన్నగరంలో పన్నెండవ ప్రాకారం వజ్రమయ ప్రాకారమే ! 12, 11 ప్రాకారాల మధ్య ఆవరణమంతా వజ్రప్రాయమే !

ఈ నామానికి ఈ క్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1) శ్రీ చక్ర కేంద్ర బిందువుకు దగ్గఱగా ఉండే త్రిభుజావరణానికి సంబంధించిన మూడు దేవతలలో ఒక దేవతా రూపముగా ఉన్నది.

2) ప్రస్ఫుటమైన వాక్ఛక్తిని ఇచ్చు దేవత.

3) సూక్ష్మ శరీరిణి.

4) శ్రీమన్నగరంలోని 12వ ఆవరణమునకు సంబంధించిన దేవత.

5) శుక్ల షష్ఠికి సంబంధించిన నిత్యాదేవత.

6) పిండాండంలో విశుద్ధి చక్రాధిష్ఠాన దేవతా నామము.

## 469. వామదేవీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'వామదేవ్యైనమః' అని చెప్పాలి.

వామ = అందముగా నున్న, దేవీ = దేవత.

'వామ' అనే పదానికి 'అందమైన' అనే అర్థం చెప్పుకుంటే – 'అందాలరాశి అమ్మవారు' అని ఈ నామం సూచిస్తుంది. అందానికే అమ్మవారు కొలత అయితే, 'అసలైన అందం' అమ్మవారే అవుతుంది గదా ! అందుకని ఇంతకు మించిన అందం మరెవ్వరికీ ఉండదు, అందమైన వారు ఎవ్వరూ ఉండరు.

'వామ' అంటే, 'ఎడమవైపు' – అని అర్థం చెప్పకుంటే – అర్ధనారీశ్వరునిలో శివునికి ఎడమ వైపున ఉన్నదేవి' అని ఈ నామం సూచిస్తుంది.

'వామ' అంటే, 'వమనం' – అంటే 'వెడలగ్రక్కుట' అనే అర్థం చెప్పకుంటే – ప్రళయంలో సాక్షీభూతుడై ఉండే సదాశివునిలో కారణ బీజంగా నిక్షిప్తమై ఉన్న సృష్టిని భౌతికంగా వ్యక్తపరచుటలో దోహదపడునది' అని ఈ నామం సూచిస్తుంది.

'వామదేవి' ని అనాహత చక్రాధిష్ఠాన దేవతగా చెబుతారు.

1) అత్యంత సుందరమైన దేవి.

2) అర్ధనారీశ్వరునిలో ఎడమ భాగమైన దేవి.

3) సదాశివునిలో కారణ బీజంగా నిక్షిప్తమై ఉన్న సృష్టిని వ్యక్తపరచునది.

4) వామదేవుని భార్య, అనగా, శివుని భార్య – అని ఈ నామానికి అర్థాలు.

## 470. వయోవస్థావివర్జితా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'వయోవస్థావివర్జితాయైనమః' అని చెప్పాలి.

వయస్ + అవస్థా + వివర్జితా = వయస్సు యొక్క ప్రభావం గాని, అవస్థా ప్రభావం గాని లేనిది.

వయస్సును బట్టి శరీరంలో వచ్చే మార్పులను అనుసరించి – శైశవము, బాల్యము, కౌమారము, యవ్వనము మొదలైన దశలు జీవితంలో వస్తాయి. సాధారణంగా అందరి యందు ఈ దశలన్నిటిలోను శారీరికంగా రూప రేఖా లావణ్యాలు మారుతాయి. కాని, అమ్మవారికి ఈ వయః ప్రభావం వల్ల వచ్చే ఈ దశలు ఉండవు. ఎప్పుడూ ఒకే విధమైన చెక్కు చెదరని అందంతో, యౌవన సౌందర్యలావణ్యాలతో ఉంటుంది అమ్మవారు.

అలాగే, కాలసంబంధమైన దురవస్థలు కూడా అమ్మవారికి ఉండవు. జాగ్రత్, స్వప్న, సుషుప్త్యవస్థలు గూడా అమ్మవారికి ఉండవు. ఎందుకంటే – అమ్మవారు నిత్య చైతన్య స్వరూపురాలు. దారంతో అల్లిన తెరమీద గల బొమ్మల్లాంటివి ఈ అవస్థలు, దశలు అయితే – ఆ దారం వచ్చిన ప్రత్తి లాంటిది అమ్మవారు. అంటే – 'అమ్మవారి నేపథ్యంలో అవి ఉంటాయి గాని, అమ్మవారికి అవి ఉండవు' అని అర్థం.

ఈ నామానికి ఈ క్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1) ''వయస్సుకు సంబంధించిన మార్పులు, అవస్థలకు సంబంధించిన మార్పులు చేర్పులు, కూర్పులు లేనిది.

2) మణిపూర చక్రానికి అధిష్ఠానదేవతా నామము.

## 471. సిద్ధేశ్వరీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సిద్ధేశ్వర్యైనమః' అని చెప్పాలి.

సిద్ధ = సిద్ధులకు, ఈశ్వరీ = అధికారిణి

ఈ నామంలో చెప్పిన 'సిద్ధులు' అన్నపదం రెండు రకాల సిద్ధుల్ని సూచిస్తుంది. 1) ఉపాసనవలన సిద్ధులైనవారు 2) అసలు ప్రకృతి లోనే సహజంగా తమ ప్రవృత్తి చేతనే సిద్ధులుగా ఉన్నవారు.

ఒక ప్రత్యేకమైన ఉపాసనా పద్ధతిలో ఉపాసకునికి కొన్ని సిద్ధులు సిద్ధిస్తాయి. వాటి పేర్లు అమరకోశంలోని ఈక్రింది శ్లోకంలో తెలుపబడ్డాయి.

శ్లో. అణిమా, మహిమా, చైవ గరిమా, లఘిమా, తథా
ప్రాప్తిః, ప్రాకామ్య, మీశిత్వం, వశిత్వం, చాష్ట భూతయః

ఈ ఎనిమిదింటిని అష్టసిద్ధులంటారు. వీటిలో -

తన మామూలు రూపంకన్నా చాలా చిన్నగా, చివరకు అణువంతగూడా అవగలిగే సిద్ధిని – 'అణిమాసిద్ధి' అంటారు. తన మామూలు రూపం కన్నా చాలా పెద్దగా అవగల సిద్ధిని – 'మహిమాసిద్ధి' అంటారు. తన మామూలు బరువుకన్నా ఎక్కువ బరువుగా అవగల సిద్ధిని – 'గరిమాసిద్ధి' అంటారు. తన మామూలు బరువు కన్నా తక్కువ బరువుగా అవగల సిద్ధిని – 'లఘిమాసిద్ధి' అంటారు. దూరంగా ఉన్న విషయాలను గ్రహించగలగడం– 'ప్రాప్తిసిద్ధి' అంటారు తనుకోరుకున్న వాటిని రప్పించగలగడాన్ని 'ప్రాకామ్యసిద్ధి' – అంటారు. ఇతరుల ద్వారా తాను అనుకున్న పనిని సాధించ గలగడాన్ని– 'ఈశిత్వసిద్ధి' అంటారు. అందర్నీ తన వశంలో పెట్టుకోగలగడాన్ని 'వశిత్వ సిద్ధి' అంటారు.

పైన చెప్పిన సిద్ధులన్నీ ఉపాసన ద్వారా ఒక సమయంలో సాధింపబడేవే కాని, సహజంగా ప్రవృత్తి పరంగా ఉండేవి కావు. అణిమాది అష్టసిద్ధులు అమ్మవారి శ్రీ చక్రంలో అన్నిటి కన్నా బాహ్యంగా ఉండే భూపురం వద్దనే ఉంటాయిట! అందుకే ఈ సిద్ధులన్నిటికీ అమ్మవారు పైన ఉండే అధికారిణి, అంటే – ఈశ్వరి.

ఉపాసన ద్వారా పొందే సిద్ధుల గురించి కాకుండా సహజంగానే తమ ప్రవృత్తి ద్వారానే 'సిద్ధుల' ని పిలవబడే వారున్నారు. వాస్తవానికి ఈ నామంలో ఈ సిద్ధుల గురించే చెప్పుకోవాలి. ఇంతకు పూర్వం వచ్చిన నామంలో పైన చెప్పిన అష్ట సిద్ధుల ప్రసక్తి వచ్చింది గూడా!

భగవద్గీతలో ఈ సహజ సిద్ధుల గూర్చిన ప్రసక్తి వస్తుంది. విభూతి యోగంలో 'సిద్ధానాం కపిలోమునిః' అంటాడు గీతాచార్యుడు. 'సిద్ధులలో కపిలమహర్షిని నేను' అని దీనికి అర్థం. (సిద్ధులలో – అంటే పైన చెప్పిన అష్టసిద్ధులు సాధించినవారని అర్థం కాదు.)

గర్భంలో పడినప్పటి నుండి జీవునిలో పనిచేసే కొన్ని జీవశరీర నిర్మాణాత్మక శక్తులను సిద్ధులంటారు.

1) మనలోని సృజనాత్మకశక్తికి(creative consiousness) సంబంధించిన ఒక ప్రజ్ఞను 'విశ్వకర్మ' అనే పేరుతో సంకేతిస్తారు. పిల్లికడుపున పిల్లి, కుక్కకడుపున కుక్క, మనిషి కడుపున మనిషి పుట్టడానికి ఈ ప్రజ్ఞే కారణమవుతుంది.

2) మనలో ఉండే అవయవాల సంఖ్యకు, ఆ అవయవాలలో ఉండే ఇతర భాగాల సంఖ్యకు – అంటే ఎన్నికళ్ళు ఉండాలి, ఎన్ని పళ్ళు ఉండాలి, ఎన్ని వెన్నుపూసలుండాలి మొదలైన సంఖ్యలకు సంబంధించిన ప్రజ్ఞను (Number consciousness) 'కపిలుడు' అనే పేరుతో సంకేతిస్తారు. జీవునికి ఈ జ్ఞానం మూడవనెల పిండ స్థితిలోనే ఉంటుందట. అంటే – సంఖ్యల గురించిన జ్ఞానం మనిషికి తాను గర్భంలో మూడవ నెల పిండ దశలోనే తెలుస్తుందన్నమాట! అంతేగాని, జన్మించిన తరువాత పాఠశాల్లో నేర్చుకుంటేనే గాని తెలిసేది కాదన్నమాట! అందుకే ఈ సంఖ్యలకు సంబంధించిన విజ్ఞానమైన 'సాంఖ్యాన్ని 'కపిలుడు దేవహూతికి ఎఱింగించుట' అని భాగవతంలో 'మూడవ' స్కంధంలో ఉంటుంది. ఇలాగే, ఆ యా నెలలో పిండంలో జరిగే మార్పులకు సంబంధించిన కథలు ఆ యా స్కంధాల్లో చెప్పబడతాయి.

3) అలాగే ఆకారాలకు సంబంధించిన ప్రజ్ఞ ను(Shape consiousness) 'త్వష్ట' (Carpenter) అనే పేరుతో సంకేతిస్తారు. ('తస్యత్వష్టా విదధ ద్రూపమేతి – పురుష సూక్తం) అంటే మనలోని వివిధ అవయవాల ఆకారాలు, పరిమాణాలకు సంబంధించిన ప్రజ్ఞ అన్నమాట!

4) క్రమబద్ధమైన గీతలతో ఒక చిత్రాన్ని గీసి, ఒక వైపు పిచ్చి గీతలతో ఒక చిత్రాన్ని గీసి చూపిస్తే మొదటిది బావుంది రెండోది బావుండ లేదు – అని బాగోగులు చెప్పగలిగే ప్రజ్ఞను 'ఉశనసుడు' (శుక్రుడు) (Beauty consciousness) అంటారు.

పైన చెప్పిన వాళ్లందరూ పిండాండంలో జీవుడు ఉన్నప్పటి నుండి పనిచేసే ప్రజ్ఞలు లేదా సిద్ధులు. వీళ్ళ చేత ఇలాంటి పనులు చేయించేది అమ్మవారే కాబట్టి, అమ్మవారు 'సిద్ధేశ్వరి'. మనలో స్వాధిష్ఠాన చక్రానికి అధిష్ఠాన దేవతను 'సిద్ధేశ్వరి' అంటారు.

1) అణిమాది అష్టసిద్ధులకు పై అధికారిణి.

2) కపిల, త్వష్టాది సిద్ధులకు ప్రభ్వి

3) స్వాధిష్ఠాన చక్రానికి అధిష్ఠాన దేవతా నామము – అని ఈ నామానికి అర్థాలు.

# 472. సిద్ధవిద్యా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సిద్ధవిద్యాయైనమః' అని చెప్పాలి.

సిద్ధ విద్య అంతా సంఖ్యలకు సంబంధించినదిగా ఉంటుంది. 'ఖ్యా' అంటే - చెప్పుట, పోల్చి చెప్పుట, వ్యత్యాసమును చెప్పుట, మొదలైన అర్థాలున్నాయి. సం + ఖ్యా = సంఖ్యా అంటే – 'చక్కగా చెప్పుట' అని అర్థం. ఈ సంఖ్యా పదం నుండే 'సాంఖ్యము' వచ్చింది. సంఖ్యలు గణిత శాస్త్రానికి సంబంధించినవి. గణిత శాస్త్రాన్ని 'దివ్యమైన తర్క శాస్త్రము' (Mathematics is divine logic) అంటాడు పైథాగరస్ మహాశయుడు. ఇది 'అపౌరుషేయమైన తర్కం' (Logic impersonal). గ్రంథ కర్తృత్వం లేకుండా ఈ శాస్త్రాన్ని ఎవరైనా ఎవరికైనా అందివ్వవచ్చును. (This can be transmitted to any person but cannot be authorised by any one) అందుచేత ఇది అపౌరషేయము. దివ్యమైన తర్కం. పొరపాట్లు, సరిపోక పోవడాలు లేని సరియైన శాస్త్రం (Exact science). ఇలాంటి గ్రంథాలే వేదాలు. 'అక్కర్లేని విషయాలు లేకుండా చక్కగా అన్ని రకాల సమన్వయంతో వ్రాయబడిన ఏ గ్రంథమైనా, ఏ భాషలో వ్రాయబడినా' – అది వేదమే అవుతుంది.

(వాక్కు ద్వారా వచ్చే) విద్యను అరబ్ దేశస్థులు 'హీబ్రూ' భాషలో 'కబాలా'(Kabala) అంటారు. ఇటువంటి పుస్తకాల్లో 'దేవుని సందేశాలు' ఉంటాయి. వీటినే'Gods spell' అని అంటారు. ఇదే 'Gospel' అని తరువాత మారింది. 'బ్రూహి' అనే సంస్కృత పదానికి 'చెప్పడం' అని అర్థం. ఈ మాటను తారుమారు చేస్తే 'హీబ్రూ' అవుతుంది. అందుకే ఈ 'హీబ్రూ భాష' కుడి నుండి ఎడమ వైపుకు వ్రాయబడి ఉంటుంది. మన భారతీయ భాషలు ఎడమ నుండి కుడికి వ్రాయబడతాయి.

'ఉపాసన ద్వారా చిత్త శుద్ధిని ప్రసాదింప చేసి, శాశ్వత జ్ఞానాన్ని పొందింప చేసే విద్యను – 'సిద్ధ విద్యా' అంటారు.

సిద్ధ విద్య నిండా ఉండే విషయాలన్నీ వేరు వేరు వర్గాలుగా, వేరు వేరుసంఖ్యలతోను, రేఖా చిత్రాకృతులతోను చెప్పబడతాయి. ఈ విద్యారూపంలో ఉన్న

అమ్మవారి పేరు 'సిద్ధవిద్యా'. సిద్ధిని చేకూర్చే విద్యగాబట్టి దీనిని 'సిద్ధవిద్యా' అన్నారు. ఈ 'సిద్ధవిద్య'ను మూలాధార చక్రాధిష్ఠాన దేవతగా చెబుతారు.

1) 'సిద్ధిని ప్రసాదించు విద్యారూపిణి –

2) పిండాండంలో మూలాధార చక్రానికి అధిష్ఠాన దేవతా నామము.

(సిద్ధవిద్యలు పది ఉంటాయి. వాటి పేర్లు.అనుబంధంలో తెలుపబడ్డాయి.)

## 473. సిద్ధమాతా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు 'సిద్ధమాతాయైనమః' అని చెప్పాలి.

సిద్ధమాతా = సిద్ధులకు తల్లి, సిద్ధులను కొలుచునది.

ఈ సిద్ధమాత అనుగ్రహం వల్లనే మనలో అపౌరుషేయ వేద జ్ఞానానికి సంబంధించిన కేంద్రాలు ప్రచోదితవౌతాయి. ఎలాంటి పరిస్థితుల్లో, ఎలా మాట్లాడాలో అన్నీ తెలుస్తాయి. మానవ జన్మలో రావలసిన మార్పులన్నీ వస్తాయి. తోడు పెట్టిన పాలకుండలాగా ఉంటాయి మిగతా జన్మలన్నీ. తోడుకున్న పాలను మథించగా వెన్న వేరైన మజ్జిగ కుండలాగా ఉంటుంది – మానవజన్మ. ఈ మానవ జన్మలోనే సమస్త విజ్ఞానాన్ని హేతుబద్ధంగా తెలుసుకోడానికి అవకాశం ఉంటుంది. విజ్ఞాన సంబంధమైన కొలతలకు ఏ కొలబద్ధ (Scale) వాడారన్నది ముఖ్యం కాదు. దేంతో కొలచినా మనలో ఒక పద్ధతిలోంచి మనక్కావలసిన పద్ధతిలోకి మార్చుకోగలిగే పట్టిక(Conversion Table) ఉండటం ముఖ్యం. విషయాలు ఉండటం వేరు, నమ్మడం వేరు, తెలియడం వేరు. ఈ మూడింటిని ఇస్తుంది 'సిద్ధమాత'.

ఈ నామానికి ఈ క్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1) ''కొలతలకు, మానములను మార్చుకొనుటకు మనలో సిద్ధముగా ఉండి పని చేసే శక్తి''

2) ''సిద్ధులకు తల్లి''.

2) పిండాండంలో ఆజ్ఞా చక్రానికి అధిష్ఠాన దేవతా నామము.

# 474. యశస్వినీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'యశస్విన్యైనమః' అని చెప్పాలి.

యశస్వినీ = యశస్సంపన్నురాలు అనగా, కీర్తి మంతురాలు.

'యశస్' అంటే 'బట్టబయలవడం' అని అసలైన అర్థం. ఆ తర్వాత 'కీర్తి' అనే అర్థం వచ్చింది.

ఒకరి మంచితనం, గొప్పతనం బట్ట బయలై అన్ని చోట్లకు ఆ మంచితనం గొప్పతనం వ్యాపిస్తే దాన్ని 'యశస్సు' అంటారు.

అంతవరకూ రాత్రంతా చీకటిగా ఉంటే – తెల్లవారేటట్లు చేసి, రాత్రిలో ఉండే చీకటి రహస్యాన్ని బట్ట బయలు చేసేదికాబట్టి – అమ్మవారు 'యశస్వినీ'.

విశ్వవ్యాప్తంగా విస్తరింపచేయడంలో – గోప్యంగా, సూక్ష్మంగా ఉండే విశ్వేశ్వరుణ్ణి బట్ట బయలు చేసేది కాబట్టి, అమ్మవారు – 'యశస్వినీ'.

ఎక్కడకు ఎప్పుడు వెళ్ళినా ఆ పరమేశ్వరుని దయాదాక్షిణ్యాలు, శక్తిసామర్థ్యాలు, గుణగణాలు దర్శింపబడుతూ, కీర్తింపబడుతూనే ఉంటాయి. ఇదంతా ఆయన యశస్సే! విశ్వవ్యాప్తంగా ఉండే ఈ యశస్సును 'మహద్యశస్సు' అంటారు. అందుకే పరమేశ్వరుణ్ణి ఉద్దేశించి 'తస్యనామ మహద్యశః' అన్నారు. అంటే – 'ఆయన యశస్సే ఆయన నామం' అని అర్థం. ఆయన్ని గురించి మనం అనుకుంటూ ఉంటే ఆయన మన ద్వారా ఆయన్ని వింటూ ఉంటాడు. (He reveals Himself to Himself in the name of ourselves)

మనం అనేవి, వినేవి – అన్నీ ఆయన నామాలే!.

మనం చేసేవి, చేయించేవి – అన్నీ ఆయన పనులే.

మనం తినేవి, తినిపించేవి – అంతా ఆయన సంపదే.

మనం పుట్టి, ఉండి, పెరిగి, చివరకు లీనమైపోయేది ఆయన లోకే – ఇదీ ఆయన యశస్సు. అందుకే 'యశస్సు' ఆయన నామం. ఈ యశస్సుకు కారణం ఈ

సృష్టికార్యమే! ఈ సృష్టి కారిణి అమ్మవారేగా! ఇలా పరమేశ్వరుని యశస్సుకు కారణమైన అమ్మవారిని 'యశస్వినీ' అంటారు.

ఈ నామానికి ఈ క్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1) 'రాత్రిలో ఉండే చీకటి రహస్యాన్ని బట్ట బయలుచేసే వెలుగుల తల్లి'.

2) 'పరమేశ్వరుని యశస్సుకు కారణమైన సృష్టి స్వరూపిణి' -

3) పిండాండంలో సహస్రార చక్రానికి అధిష్ఠాన దేవతా నామము.

(ప్రథమ భాగంలో **200**ల నామములకు వివరణ ఇవ్వబడినది. ప్రస్తుతం ఈ ద్వితీయ భాగంలో **201**వ నామం నుండి **474**వ నామము వరకు వివరణ ఇవ్వబడినది. ఇటుపైన ఉండే అనుబంధంలో శ్రీ విద్యకు సంబంధించిన కొన్ని ముఖ్యమైన విషయాలు వివరింపబడ్డాయి. అవి కూడా చదివితే సంపూర్ణ అవగాహన కలుగుతుంది. ముందు రాబోయే మూడవ భాగంలో **475**వ నామం నుండి వివరణ ఇవ్వబడుతుంది.

- వివరణకర్త )

## అష్టలక్ష్ములు

1) ధనలక్ష్మి 2) ధాన్యలక్ష్మి 3) ధైర్యలక్ష్మి 4) సంతానలక్ష్మి 5) విద్యాలక్ష్మి 6) విజయలక్ష్మి 7) ఆదిలక్ష్మి 8) గజలక్ష్మి

## అధోలోకాలు

1) అతలము 2) వితలము 3) సుతలము 4) తలాతలము 5) రసాతలము 6) మహాతలము 7) పాతాళము

## అష్టభోగములు

1) గృహము 2) శయ్య 3) వస్త్రము 4) ఆభరణము 5) స్త్రీ 6) పుష్పము 7) గంధము 8) తాంబూలము

## అష్ట భైరవులు

1) అసితాంగ భైరవుడు 2) రురుభైరవుడు 3) చండ భైరవుడు 4) క్రోధ భైరవుడు 5) ఉన్మత్త భైరవుడు 6) కపాల భైరవుడు 7) భీషణ భైరవుడు 8) సంహార భైరవుడు

## చతుష్షష్ట్యుపచారములు

1) అర్ఘ్యము 2) పాద్యము 3) ఆచమనీయము 4) భూషావరోపణము 5) సుగంధతైలాభ్యంజనము 6) మజ్జనశాలా ప్రవేశనము 7) మణి పీఠోపవేశనము 8) దివ్యస్నానీయోద్వర్తనము 9) ఉష్ణోదక స్నానము 10) కనక కలశచ్యుత సకల తీర్థాభిషేచనము 11) ధౌత వస్త్రపరిమార్జనము 12) అరుణదుకూల పరిధానము 13) అరుణకుచోత్తరీయము 14) ఆలేపన మంట ప్రవేశనము 15) మణిపీఠోపవేశనము 16) చందనాగరుకుంకుమ సంకు మృగమద కర్పూర కస్తూరి గోరోచనాది దివ్యగంధేన సర్వాంగ లేపనము 17) కేశభరస్య కాలాగరుధూపం 18) మల్లికామాలతీ చంపకాశోక శతపత్రపూగ క్రముక మంజరీ పున్నాగ కల్హారముఖ్య సర్వర్తుకుసుమమాలా 19) భూషణ మంటప ప్రవేశం 20) మణిపీఠోపవేశనం 21) నవమణి మకుటం 22) చంద్ర శకలం 23) సీమంతే సిందూర తిలకం 24) తిలకరత్నం 25) కాలాంజనం 26) పాళీయుగళం 27) మణి కుండలయుగళం 28) నాసాభరణం 29) అధరయావకం

30) ఆర్యభూషణం 31) హేమచింతాకం 32) పతకం 33) మహాపతకం 34) ముక్తావళి 35) ఏకావళి 36) ఛన్నవీరం 37) కేయూర యుగళ చతుష్టయం 38) వలయావళి 39) ఊర్మికావళి 40) కాంచీదామ 41) కటిసూత్రం 42) సౌభాగ్యాభరణం 43) పాదకటకం 44) రత్ననూపురం 45) పాదాంగుళీయకం 46) ఏకకరేపాశం 47) ఇతరకరే అంకుశం 48) అన్యకరే పుండ్రేక్షు చాపం 49) అపరకరే పుష్పబాణాన్ 50) మహాకామేశ్వర్యాంక పర్యంకోపవేశనమ్ 51) అమృతచషకం 52) ఆచమనీయకం 53) కర్పూవీటిక 54) ఆనందోల్లాస విలాసహాసం 55) మంగళారార్తికం 56) నిఖిలలోకైక సూచక ముక్తాతపత్రం 57) చామరయుగళం 58) దర్పణం 59) తాళవృంతం 60) గంధం 61) పుష్పం 62) ధూపం 63) దీపం 64) నైవేద్య తాంబూల నీరాజన నమస్కారం.

## చతుష్షష్టి విద్యాకళలు

1) అన్వక్షకి 2) త్రయీ 3) వార్తా 4) దండనీతి 5) ఆకర్షణము 6) స్తంభనము 7) మారణము 8) విద్వేషణము 9) ఉచ్చాటనము 10) మోహనము - వేదములు 11) ఋగ్వేదము 12) యజుర్వేదము 13) సామవేదము 14) అధర్వణవేదము వేదాంగములు - 15) శిక్షా 16) వ్యాకరణము 17) ఛందము 18) నిరుక్తి 19) జ్యోతిషము 20) కల్పము - శాస్త్రములు - 21) మీమాంస 22) న్యాయశాస్త్రము 23) పురాణము 24) ధర్మశాస్త్రము 25) ఆయుర్వేదము 26) ధనుర్వేదము 27) నీతిశాస్త్రము 28) అర్థశాస్త్రము - పురాణములు - 29) బ్రాహ్మము 30) పాద్మము 31) వైష్ణవము 32) శైవము 33) భాగవతము 34) భవిష్యోత్తరము 35) నారదీయము 36) మార్కండేయము 37) ఆగ్నేయము 38) బ్రహ్మవైవర్తము 39) లైంగము 40) వారాహము 41) స్కాందము 42) గారుడము 43) వామనము 44) మాత్స్యము 45) కూర్మము 46) బ్రహ్మాండము - ఉపపురాణాలు - 47) సనత్కుమారము 48) నారసింహము 49) స్కాందము 50) శివధర్మము 51) దౌర్వాసము 52) నారదీయము 53) కాపిలము 54) మానవము 55) ఔశనము 56) బ్రహ్మాండము 57) వారుణము 58) కౌశికము 59) లైంగము, 60) సాంబము 61) సౌరము 62) పారాశరము 63. మారీచము 64) భార్గవము

# చతుష్షష్టి వృత్తికళలు

1) గీతము 2) వాద్యము 3) నృత్యము 4) నాట్యము 5) ఆలేఖ్యము 6) విశేషకము 7) పుష్ప తండుల బల్యాది 8) కుసుమాస్తరము 9) దంతవస్త్రాంగరాగము 10) మణికుట్టిమకర్మ 11) శయ్యావిధి 12) వారివాద్యము 13) చిత్రయోగములు 14) పుష్పలావికావిద్య 15) మాల్యగ్రథనము 16) నేపథ్యరచన 17) కర్ణపత్రభంగము 18) సుగంధరచన 19) భూషాయోగము 20) ఇంద్రజాలము 21) కౌచుమారయోగము 22) చిత్రశాకాపూపభక్ష్య క్రియ 23) హస్త లాఘవము 24) పానకాసవరాగాది నిర్మాణం 25) సూచీవాయ ప్రక్రియ 26) వీణాడమరువాద్యము 27) సూత్రక్రీడా 28) ప్రహేలికా 29) ప్రతిమాలా 30) దుర్వాచకయోగా 31) పుస్తకవాచకం 32) నాటికా ఖ్యాయిక 33) సమస్యాపూరణం 34) పట్టికావేత్రవాసము 35) తక్షకర్మ 36) తక్షణం 37) వాస్తువిద్య 38) రత్నరూప పరీక్ష 39) ధాతు వాదము 40) మణిరాగ జ్ఞానము 41) ఆకరవేదనము 42) వృక్షాయుర్వేదము 43) మేషకుక్కుట లావాది యుద్ధము 44) శారికాశుకాలాపనము 45) కేశ ప్రసాదనము 46) అక్షరోత్పాదనము 47) ముష్టికా కథనము 48) మ్లేచ్ఛతర్క వికల్పము 49) దేశభాషాది వేదనము 50) ప్రసూన శకట జ్ఞానము 51) నిమిత్త జ్ఞానము 52) యంత్రమాతృక 53) ధారణయంత్ర 54) సంవాచ్యము 55) మానసీకావ్యక్రియ 56) ఛందోదీ 57) నావకోశ ధీ 58) నానాక్రియాదికల్ప 59) చలఆశయుయోగ 60) వస్త్రసంగోపనం 61) ద్యూతము 62) బాలక్రీడ 63) ఆకర్షణ క్రీడ 64) వైతాళకీవిద్య

# శ్రీవిద్యా ఉపాసకులు

1) మనువు 2) చంద్రుడు 3) కుబేరుడు 4) అగస్త్యుడు 5) లోపాముద్ర 6) మన్మథుడు 7) అగ్ని 8) ఇంద్రుడు 9) సూర్యుడు 10) దుర్వాసుడు 11) స్కందుడు 12) శివుడు

# పంచ బ్రహ్మలు

1) బ్రహ్మ 2) విష్ణువు 3) రుద్రుడు 4) ఈశ్వరుడు 5) సదాశివుడు.

## పంచ కృత్యాలు

1) సృష్టి 2) స్థితి 3) లయ 4) తిరోధానము 5) అనుగ్రహము

## ఏకాదశ రుద్రులు

1) అజుడు 2) ఏకపాదుడు 3) అహిర్బుధ్న్యుడు 4) త్వష్ట 5) రుద్రుడు 6) హరుడు 7) శంభుడు 8) త్ర్యంబకుడు 9) అపరాజితుడు 10) ఈశానుడు 11) త్రిభువనుడు

## షడ్గుణాలు

1) పరిపూర్ణత 2) వీర్యము 3) కీర్తి 4) సంపద 5) జ్ఞానము 6) వైరాగ్యము. మహా నిర్వాణతంత్రంలో వీటిపేర్లు – 1) భూతదయ 2) దానము 3) వైరాగ్యము 4) సమబుద్ధి 5) నిర్మోహమాటము 6) ముముక్షుత – అని చెప్పబడ్డాయి.

## ద్వాదశాదిత్యులు

1) ఇంద్రుడు 2) ధాత 3) పర్జన్యుడు 4) త్వష్ట 5) పూషుడు 6) అర్యముడు 7) భగుడు 8) వివస్వంతుడు 9) విష్ణువు 10) అంశుమంతుడు 11) వరుణుడు 12) మిత్రుడు

## చతుర్దశ భువనాలు

1) అతలము 2) వితలము 3) సుతలము 4) తలాతలము 5) రసాతలము 6) మహాతలము 7) పాతాళము 8) భూలోకము 9) భువర్లోకము 10) సువర్లోకము 11) మహాలోకము 12) జనోలోకము 13) తపోలోకము 14) సత్యలోకము

## ప్రకృతి లక్షణాలు

1) నామము 2) రూపము 3) అస్తి 4) భాతి 5) ప్రియము

## షోడశ కామ కళలు

1) శ్రద్ధా 2) ప్రీతి 3) రతి 4) ధృతి 5) కీర్తి 6) మనోభవా 7) విమలా 8)

మోదినీ 9) ఘోరా 10) మదనోత్సాధికా 11) మదా 12) మోహినీ 13) దీపినీ 14) వశకరీ 15) రంజనీ 16) మదనా

## స్త్రీలయందు షోడశకళలు

పై వరుస క్రమములో 1) పాదములు 2) గుల్ఫములు 3) తొడలు 4) భగము 5) నాభి 6) కుచములు 7) హృదయము 8) కక్షలు 9) కంఠము 10) ఓష్ఠము 11) గండములు 12) నేత్రములు 13) శ్రుతులు 14) ఫాలము 15) శీర్షము 16వదైన 'మదనాకళ' సర్వశరీరమునందు ఉండును.

## అష్టాదశ శక్తి పీఠాలు

1) లంకాపురి యందు - శాంకరి 2) కాంచీపురమున - కామాక్షి 3) సింహళమున - హింగుళ 4) హలక్షేత్రమున - కాలరూపిణి 5) పీఠాపురమున - పురుహూతికా 6) మాహూరియందు - ఏకవీర 7) ప్రయాగ యందు - మాధవి 8) జాలంధరమున - మహాజ్వాల 9) గయ యందు - మాంగల్యగౌరి 10) హరిద్వారమున - మహామాయ 11) మిర్జాపురమున - వింధ్యవాసిని 12) ఉజ్జయిని యందు - మహాకాళి 13) శ్రీశైలమున - భ్రమరాంబ 14) కొల్హాపురమున - మహాలక్ష్మి 15) అలంపురియందు - జోగులాంబ 16) కామరూపమున - త్రిపురసుందరి 17) వారణాసియందు - అన్నపూర్ణ 18) కురుక్షేత్రమున - రేణుక.

## ద్వాదశ శివక్షేత్రాలు

1) కాశిలో - విశ్వేశ్వరుడు 2) హిమాలయమున - కేదారేశ్వరుడు 3) ఉజ్జయినిలో - మహాకాళేశ్వరుడు 4) దారుకావనమున - నాగేశ్వరుడు 5) సౌరాష్ట్రమున- సోమనాథేశ్వరుడు 6) గౌతమీతటమున - త్ర్యంబకేశ్వరుడు 7) ప్రజ్వలికలో - వైద్యనాథేశ్వరుడు 8) నర్మదా తీరమున - అమరేశ్వరుడు 9) శ్రీశైలంలో - మల్లికార్జునుడు 10) రామేశ్వరమున - రామలింగేశ్వరుడు 11) డాకిని యందు - భీమేశంకరేశ్వుడు 12) యల్లోరాయందు - మన్మథేశ్వరుడు. (ఘృష్ణేశ్వరుడు).

## ద్వాదశ విష్ణుక్షేత్రాలు

1) శ్రీకూర్మము 2) పద్మనాభము 3) సింహాచలము 4) రామ తీర్థము 5) ఉప్మాక 6) అంతర్వేది 7) మంగళగిరి 8) తిరుపతి 9) అహోబిలము 10) శ్రీరంగము 11) విష్ణుకంచి 12) భద్రాచలము

## నవవిధ భక్తులు

1) శ్రవణం 2) కీర్తనం 3) స్మరణం 4) పాదసేవనం 5) అర్చనం 6) వందనం 7) దాస్యం 8) సఖ్యం 9) ఆత్మనివేదనమ్

## భక్తులు

1) జ్ఞానులు 2) జిజ్ఞాసువులు 3) అర్థార్థులు 4) వ్యాధి పీడితులు

## పంచక్లేశాలు

1) అవిద్యాక్లేశము 2) అభినవ క్లేశము 3) అస్థిగత క్లేశము 4) రాగక్లేశము 5) ద్వేషక్లేశము

## ఏకాదశ ఆనందములు

1) మానవానందము 2) మానవ గంధర్వానందము 3) దేవగంధర్వానందము 4) చిరలోక లోకపితరుల ఆనందము 5) ఆజానజదేవానందము 6) కర్మదేవానందము 7) దేవానందము 8) ఇంద్రానందము 9) బృహస్పత్యానందము 10) ప్రజాపతి ఆనందము 11) బ్రహ్మానందము

## అవస్థలు

1) జాగ్రత్ 2) స్వప్న 3) సుషుప్తి 4) తుర్యా

## వాక్కు స్థితులు

1) పరా 2) పశ్యంతీ 3) మధ్యమా 4 వైఖరీ

## షడంగములు

1) హృదయము 2) శిరస్సు 3) శిఖ 4) కవచము 5) నేత్రము 6) అస్త్రము

## అష్టసిద్ధులు

1) అణిమా 2) మహిమా 3) గరిమా 4) లఘిమా 5) ప్రాప్తి 6) ప్రాకామ్యము 7) ఈశిత్వము 8) వశిత్వము

## అష్ట మాతలు

1) బ్రాహ్మి 2) మహేశ్వరీ 3) కౌమారీ 4) వైష్ణవీ 5) వారాహీ 6) ఇంద్రాణీ 7) చాముండీ 8) మహాలక్ష్మి

## సిద్ధవిద్యలు

1) కాళీతారా 2) మహావిద్యా 3) షోడశీ 4) భువనేశ్వరీ 5) భైరవా 6) ఛిన్నమస్తా 7) ధూమావతీ 8) బగళా 9) మాతంగీ 10) కమలా.

శ్రీః

శ్రీమాత్రేనమః

# శ్రీ లలితా సహస్ర నామావళి

(ఈ ద్వితీయ భాగములోనివి)

| నామసంఖ్య | నామము | పుటసంఖ్య |
|---|---|---|
| 201 | ఓం సద్గతి ప్రదాయై నమః | 1 |
| 202 | ఓం సర్వేశ్వర్యై నమః | 3 |
| 203 | ఓం సర్వమయ్యై నమః | 4 |
| 204 | ఓం సర్వమంత్రస్వరూపిణ్యై నమః | 5 |
| 205 | ఓం సర్వయంత్రాత్మికాయై నమః | 9 |
| 206 | ఓం సర్వతంత్ర రూపాయై నమః | 11 |
| 207 | ఓం మనోన్మన్యై నమః | 12 |
| 208 | ఓం మాహేశ్వర్యై నమః | 14 |
| 209 | ఓం మహాదేవ్యై నమః | 15 |
| 210 | ఓం మహాలక్ష్మ్యై నమః | 16 |
| 211 | ఓం మృడ ప్రియాయై నమః | 17 |
| 212 | ఓం మహారూపాయై నమః | 17 |
| 213 | ఓం మహాపూజ్యాయై నమః | 18 |
| 214 | ఓం మహాపాతాకనాశిన్యై నమః | 19 |
| 215 | ఓం మహామాయాయై నమః | 20 |
| 216 | ఓం మహాసత్త్వాయై నమః | 21 |
| 217 | ఓం మహాశక్త్యై నమః | 21 |
| 218 | ఓం మహారత్యై నమః | 22 |
| 219 | ఓం మహా భోగాయై నమః | 24 |

# అకారాది నామ సంఖ్యానుక్రమణిక

(ఈ ద్వితీయ భాగములోనివి)